అయిదవ వేదమనబడు

# శ్రీ మహాభారత సారోద్ధారము

( ఆది, సభా పర్వములు )

## ప్రథమ భాగము

(సంస్కృతమూలము, ఆంధ్ర తాత్పర్యసహిత సవిమర్శనము)


గ్రంథకర్త :

'పౌరాణిక విశారద, విమర్శకాగ్రేసర'

బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానీ పాకయాజీగారు





మారుతీ పబ్లికేషన్స్

ఏలూరు రోడ్ • విజయవాడ-2

వెల : రు. 21-00

# శ్రీ మహాభారత సారోద్ధారమున

## ఆది, సభా పర్వములయందుగల

## విషయసూచిక

సృష్ట్యాది శంతనుమహారాజు వరకును గలచంద్రవంశానుక్రమణిక

సభా పర్వము సమాప్తము

సాంగ సపరివార చిన్మయ శ్రీరామచంద్రార్పణమస్తు

# శ్రీ మహాభారతసారోద్ధారము

## ఉపోద్ఘాతము

ఈ గ్రంథమునకు ఇటీవల ఆధునిక భారతవిమర్శకులు పంచమవేదమును ఆర్ష విజ్ఞాన ప్రకాశమగు మహాభారతమును సాంప్రదాయవిరుద్ధముగ పాశ్చాత్య విజ్ఞానము కలవారును తదనుయాయులును బహిరంగ పరిశోధనమను పేరిట పరస్పర విరోధ భూయిష్టముగను సాధుదూషణ పాపభూయిష్ఠ యుతము గను తమ తమ స్వైరవృత్తిని పురస్కరించుకుని అనేక విమర్శ నలను కల్పి ప్రేరితులై వ్రాసిరి. వాటిలోన నీ క్రింద పేర్కొన బడిన గ్రంథములు ముఖ్యములు.

అవేవన 1) స్రఫేపండితునిచే హిందీలో వ్రాయబడి చర్ల నారాయణశాస్త్రి గారిచే నాంధ్రీకరింప బడిన మహా భారత మీమాంస 2) బకించంద్ర ఛటోపాధ్యాయునిచే వంగభాషలో వ్రాయబడిన బాలాంత్రపు సూర్యనారాయణ రావు గారిచే ఆంధ్రీకరింపబడిన శ్రీకృష్ణచరిత్రము. 3) కోట మర్తి చినరఘుపతిరావుగారి సుయోధన విజయము 4) పెం డ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారత చరిత్రము. ఇవే గాక ఇటువంటి ఇతర వ్యాఖ్యానములను ఖండించి శ్రీ శ్రీ శ్రీ అస్మద్గురువరేణ్యులగు బ్రహ్మశ్రీ పండితప్రవర మల్లాది రామ కృష్ణవిద్వచ్ఛయనులు గారును సాంప్రదాయ విమర్శకాగ్రేస రులును గ్రహించిరమ్మని ఆజ్ఞాపనము చేసుకొని నాచే (త)

యీమహాభారత సారోద్ధారమను గ్రంథము భగవత్ప్రేరణచే వ్రాయబడినది.

## మహాభారత విమర్శన విషయములు

అమెరికాఖండమందును కొందరు సంస్కృత మభ్యసించి యున్నారు. కాని వారు భారతీయు లనాదినుండియు నాగరికత కలవారనుట కసూయ పడుదురు. కావున వారు తమదేశీయ గ్రంథములను జూచి భారతము వ్రాయబడినదనుచున్నారు. అందు రామాయణము 'హోమరు' (గ్రీకు దేశకవి) కావ్యమున కనుకరణమని వ్రాసినారు. భగవద్గీత బైబులునకు ఛాయాగ్రంథమని మరియొక కవి చెప్పెను. అట్లే లిపిజ్యోతిషము మొదలైన వన్నియును హిందువులు తమతమ దేశములనుండియే గ్రహించిరని వ్రాయుటకు లజ్జపడుట లేదు.

భగ్నావశేషితములగు కొన్ని విగ్రహములను చూచి ఫర్గూసన్ దొరగారు ప్రాచీన హిందూస్త్రీలకు వస్త్రములు కట్టు నలవాటు లేదని సిద్ధాంతము చేసియున్నారు. 'భుయాద్' అను జాతి నాగరిక జాతి యట. వారిలో స్త్రీల కనేకులు భర్తలుందురట. అది ద్రౌపదికంట గట్టిరని వ్రాసిరి. గ్రీకుదేశము ననుసరించి భారతీయులు శిల్పములను నేర్చుకొనిరనియు భారతము ప్రాచీనమైనది కాదట. స్వతంత్రము కాదట. రోమకేతిహాసవేత్తలగు లివీప్రభృతులు యవనేతిహాసవేత్తలైన 'హెరో నూటర్' మొదలగువారు మహమ్మదీయ ఇతిహాసవేత్తలగు పెరిస్టా ఆంగ్లేయభాషలో మెకాలే, కార్లయిల్ మున్నగు వారును పరాసు లామర్టైన్, మిషాల్ మున్నగువారును,

గ్రీసులో తూకుడిడీజ్ మున్నగువారు వ్రాసిన ఇతిహాసగ్రంథము లన్నియు ఈభారతము ననుసరించియే యున్నవి. అవి ఇతిహాసములయినచో ఇది ఏల కాదో యని వారు చెప్పలేదు.

రోము, గ్రీసు, మొ॥ దేశములందును మన ప్రజలకు భారతాదులయందువలె వారి ఇతిహాసములందు వారికి విశ్వాసము లేదు, గౌరవము లేదు.

విఖ్యాతుడైన 'వ్యర్బర్' దొర కొంత కాలమునకు పూర్వమే జర్మనీదేశారణ్యములలో నివసించుచున్న బర్బరుల వంశమున పుట్టినవాడు. అట్టివానికి పురాతనమగు భారతీయ నాగరికత ఎట్లు తెలియును. కాని ఆతడు మహాభారతము ఏసు క్రీస్తుకు పూర్వము పుట్టలేదనివ్రాయుట ఆశ్చర్యకరము. క్రీస్తు 1వ శతాబ్దమున పుట్టి యుండవచ్చునని వ్రాసెను. దీనికాధారము మెగస్తనీస్ అనువాడు 3, 4 శతాబ్దములలో భారతవర్షమున చంద్రగుప్తుని రాజధాని యందుండెను. ఆదొర తను వ్రాసిన గ్రంథములో భారతమును గురించి వ్రాయ లేదట దానికిఆధారము ఇంతమాత్రమే.

ఆతనికంత పాండిత్యము లేకపోవచ్చును. లేదాదొరకక, పోవచ్చును. ఇప్పుడు భారతీయులు వ్రాయు జర్మనుచరిత్రలలో నెచ్చటను ఎర్బర్ దొరగారి పేరులేదు. కావ వారు లేరని గదా చెప్పవలయును. కావున వారు వ్రాసినచరిత్రలలో భారతమున పాండవులపేర్లే లేవనియు, కృష్ణుడు కవికల్పిత పాత్ర యనియు వ్రాసిన వ్రాతలన్నియు నిజముకావు.

యూరోపియనులలో క్లోల్బ్రూక్ దొరగారు భారత

యుద్ధము క్రీ॥ పూ॥ 4వ శతాబ్దమున నడచినదని వ్రాసినారు. ఆదేశమున అందరికిని అది వ్యాసప్రోక్తమువలె సర్వదా ప్రమాణమగును.

ప్రాచీనమగు పాణినీయ వ్యాకరణశాస్త్రమున 8-3-95 సూ॥ గవియుధిభ్యాం స్థిరః ఉదా॥ గవిష్ఠిరః, యుధిష్ఠిర, అనియు. 2-4-66 సూ॥ బహ్వచ ఇఞః ప్రాచ్య భరతేషు 4-1-176 స్త్రియా మవన్తి కురుభ్యశ్చ 4-3-98 వాసుదేవార్జునాభ్యాం వుఞ్ 4-1-103 సూ॥ ద్రోణపర్వత జీవన్తాన్యతరస్యామ్ ఉదా॥ ద్రోణాయనః అను శబ్దమేర్పడును. ఉన్న పేర్లకు వ్యుత్పత్తి వ్రాయబడుటచే భారతము ప్రాచీనమైనదే.

ద్వారక హస్తినాపురమునకు 700 క్రోశముల దూరమున నున్నది. శకుంతలను పెంచిన కణ్వుడు కాశ్యప గోత్రజుడు. ఘోరపుత్రుడను కణ్వుడు మరొకడు. అతడాంగీరస గోత్రజుడు.

భారతమున పర్వసంగ్రహాధ్యాయ ప్రకారము 84, 836 శ్లోకములే. కావున పర్వసంగ్రహాధ్యాయాంతమున ఈశ్లోకము కలదు. శ్లో॥ అష్టాదశైవ ముక్తాని పర్వాణ్యేతా న్యశేషతః। ఖిలేషు హరివంశం చ భవిష్యం చ ప్రకీర్తితం॥ దశశ్లోక॥ సహస్రాణి వింశచ్ఛ్లోకశతాని చ॥ ఖిలేషు హరివంశేషు సంఖ్యాతాని మహర్షిణా॥ కావున నీ 12,000 కలుపుకొన్నను 96 836 కావున ఇంకా లక్షకు 3. 164 తక్కువ గలవు. అవియే శేష ధర్మములు ఆశ్చర్యపర్వము మొ॥ నవి అని తెలియనగును.

సూచన:- హరివంశమున, హరివంశపర్వము భవిష్య

త్పర్వమే చెప్పబడియున్న ప్రస్తుతగ్రంథమున విష్ణుపర్వము చేర్చి 16,000 శ్లోకము లున్నవి.

ఇప్పుడు ప్రచారమునను్న భారతమున ఖిలమైన హరివంశాశ్చర్యపర్వమును కలుపుకొని లెక్కింప 1,07,390 గా నున్నది. మిగతా 7,390 ఎక్కుడివనగా జైమిని భారతమున అశ్వమేధపర్వమును వెర్బన్ దొరగారు చూచి మిగతా లుప్తమైనదని వ్రాసిరి.

విష్ణు పు॥ 5అం॥ 226 అ॥ 14. 15 శ్లో॥ మనుష్య ధర్మ శీలస్య లీలా సా జగతీపతేః, అస్త్రాణ్యనేకరూపాణి యదరాతిషు ముంచతి॥ మనసైవ జగత్సృష్టిం సంహారంచ కరోతి యః॥ తథాపి యో మనుష్యాణాం ధర్మ స్తదనువర్తతే॥ ఇత్యాది కలదు.

పురాణములు కాళిదాసుకు పూర్వమే గదా! కాళిదాసు 6 వ శతాబ్దము వాడని యూరోపియనులే స్థిర పరచినారు. అట్టివారు 9 వ శతాబ్దమునుండి 17 వ శతాబ్దములోగా నీ పురాణములు రచింపబడినవని ఎట్లు నిర్ణయించిరో తెలియదు.

## —: ఐతిహాసిక పౌర్వాపర్యము :—

1. మహాభారతమూలకథ 2. విష్ణుపురాణ 5 అంశం 3. హరివంశము 4. శ్రీమద్భాగవతము కలిపిన కృష్ణ కథ యగును.

## శ్రీకృష్ణకథ

యయాతి యను పేరును, ఊర్వశి, పురూరవు, ఆయువను వార్ల పేర్లను యయాతి జ్యేష్ఠ భార్యయగు దేవయాని పుత్రులగు యదు, తుర్వసుల పేర్లను, శర్మిష్ఠ పుత్రులగు ద్రుహ్యుడు, అనుడు, పూరుడను వారైదుగురి పేర్లలో యదు, తుర్వసు పూరువులను వారిపేర్లు ఋగ్వేద సం॥ 10మండ॥ 48, 49 సూక్తములలో వినబడు చున్నవి.

భారతమందును విష్ణుపురాణమునందును, బాల కృష్ణుడు వెన్నదొంగిలించి తినెనని లేదు. హరివంశమున మాత్రము ప్రసంగ వశమున చెప్పబడియున్నది దామోదర శబ్దమందు ఉదరమనగా ఉత్ యా గమనమునందును, యా గతౌ అనుటచే సద్ధను. ఎవడు దమముచే ఉచ్ఛ స్థానము బొందెచునో వాడు దామోదరుడు. దమాది సాధనేన ఉదరా = ఉత్కృష్టగతికి యాగతా ఇతి దామోదరః లేక దామన్ శబ్దమునకు గోవు కట్టుపలుపను అర్థమున్నది. వత్సాసుర, బకాసుర, అఘాసురుల వధల కథలు విష్ణుపురాణ, హరివంశ భారతములందు లేవు. వత్ – వత్సాసుర – ప్రకాశమాని అర్థము. బక్ = బకాసుర కౌటిల్యము. అఘ్ – అఘాసుర పాపమని అర్థము. కాళీయు మర్దనము భారతమున లేదు. విష్ణుపురాణ హరివంశములందు ఉన్నది. బృందావనమున గోవర్ధన మిప్పటికిని కలదు. కాని అది పురాతనము కాదు. అది అంతరించింది.

వ్రజగోపికల వృత్తాంతము భారతమున లేదు. కాని

సభాపర్వమున ద్రౌపది ఆపత్సమయమున గోపికాప్రియ (గోవింద ద్వారకా వాసిన్ కృష్ణ గోపీజనప్రియ) అని అన్నది. ఈగోపికల వృత్తాంతము విష్ణుపురాణమున పవిత్రముగను, హరివంశమున విలాసముగను, భాగవతమున శృంగారముగను, వర్ణింపబడినది. బ్రహ్మవైవర్తము శృంగార ప్రవాహము. రం ధాతువు నకు క్రీడార్థము. రతిప్రియా— క్రీడానురాగి కావున రతి — రతిప్రియ శబ్దములు నింద్యములు కావు.

హరివంశమున స తత్ర వయసా తుల్యై ర్వత్సపాలైః సహానఘః రేమే వై దివసం కృష్ణః పురా స్వర్గగతో యథా॥ తం క్రీడమానం గోపాలాః కృష్ణం భాండరవాసినః రమయంతి స్మ బహవో౽ న్యైః క్రీడనకై స్తదా॥ అన్యే స్మ పరిగాయంతి గోపా ముదిత మానసాః॥ గోపాలాః కృష్ణమేవాన్యే గాయన్తిస్మ రతి ప్రియాః॥ అని కలదు

రాసమనగా ఒకవిధమైన యాట. రాసక్రీడ స్త్రీలకు జ్ఞానమునం దధికారము లేదుగాన భక్తియగు నీ రాస క్రీడ కల్పించిరి. స్త్రీలు పురుషులు కలసి నృత్యముచేయుట ఐతోపియనులలో నింద్యము కాదు కదా!

వ్రజగోపికలను గూర్చి హరివంశము, విష్ణుపర్వము 20 అధ్యాయమున నీకథ కలదు. అచ్చట రాసక్రీడశబ్దమే లేదు కాని హల్లీసమను శబ్దము వాడబడియున్నది. ఇతి శ్రీ మహాభారతే ఖిలేషు హరివంశే విష్ణుపర్వణి హల్లీసక్రీడనే వింశోధ్యాయః అని కలదు. హేమచంద్రాభిధానమున హల్లీష

శబ్దమున కిట్లర్థము చెప్పబడియున్నది. మండలేన తు యన్నృత్యం స్త్రీణాం హల్లీషకం తు తత్॥ అనియు వాచస్పత్యమున తారానాథుడు స్త్రీణాం మండలాకారం నృత్యే యని చెప్పెను. హరివంశమున శ్లో॥ తాస్తు పంక్తీకృతాస్సర్వా రమయంతి మనోరమం అని రమశబ్దము క్రీడయందర్థముగానే చెప్పబడినది. విష్ణుపురాణ హరివంశములలో ఒకే విధ శ్లోకములున్నవి. ఇక భాగవతమున గోపికలు గోపికావస్త్రాపహరణమే కృష్ణుని యందు గోపికలకు ఏ భావము కలదో అది విస్పష్ట పరచబడినది. ఈకథ హరివంశ విష్ణుపురాణములందు లేదు. భారతమున లేదు. దీనికి వేదాంతమున భగవంతునకు సర్వార్పణము చేయుట యగును. వారు భగవంతుని పతిగా గోరిరి. గీత 'యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం' అని శ్రీకృష్ణుడు అంగీకరించెను. భాగవతము 10-29-10 శ్లో॥ తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః। జహుర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణబంధనాః॥ అని చెప్పబడినది.

భాగవతకారుడు రాసక్రీడవలన కృష్ణుని జితేంద్రియునిగా చెప్పెను. రాసలీలలు భాగవతమందు జగౌకలం అను శబ్దమునకు టీకాకారుడగు విశ్వనాథచక్రవర్తి కల శబ్దము నుండి కృష్ణమంత్రమునకు బీజప్రాయముగు 'క్లీం' శబ్దమును నిష్పన్నము చేసియున్నాడు, గోపికలు కృష్ణునితో సంభోగించిరనియే స్పష్టముగా తెలియుచున్నది. దాన వారికి గర్వము కలిగెను. కృష్ణుడంతర్ధానమై వారి మద మడచెను.

శ్రీరాధ ;— ఈమె పేరు రాసక్రీడ అగు అయిదు అధ్యాయములలో లేదు. వైష్ణవాచార్యుల గ్రంథ టిప్పణమున నచ్చటచ్చట కనుపడును గాని మూలమున లేదు. ఇట్లే భారత హరివంశ విష్ణుపురాణాదులందును రాధ పేరు లేదు. బ్రహ్మవైవర్తమున విస్తారముగ గలదు. ఈగ్రంథమున శ్రీకృష్ణుడు త్రిమూర్త్యతీతుడు గోలోకవాసి. ఇచ్చట ఆయన రాసేశ్వరి రాధ. కృష్ణానపాయిని అని కలదు.

రాధ యన శ్రీకృష్ణ జన్మఖండమున 23వ అ॥ శ్లో॥ 'రాశబ్దో దానవాచకః ధా నిర్వాణం చ తద్దాత్రీ తేన రాధా ప్రకీర్తితా' యని కలదు.

ఇప్పుడుత్తర దేశమున 1) కృష్ణయాత్ర 2) గోలోక ధామము 3) మానభంజనము అను గ్రంథములందు రాధకథ కలదు. వైష్ణవుడగు జయదేవకవి బంగాళా దేశమువాడే గావున అష్టపదిని వ్రాసెను. బ్రహ్మవైవర్తము బంగాళీయులకు మూలశాస్త్రము.

యోగదర్శనమున 4—33 చెప్పబడినరీతిని మనుష్యజాతి శ్రేయసీ సహా శ్రేయసీ త్యేవం పరిపృష్టే విభజ్య వచనీయః ప్రశ్నః పశూనధికృత్య శ్రేయసీ దేవానధికృత్య నేతితి. కావున యస్య నాస్తి వివేకస్తు కేవలం యో బహుశ్రుతః॥ నస జానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసం యథా। అను రీతిని సాంప్రదాయ బుద్ధియే ప్రమాణము గాని తదితరములగు నానాకల్పిత ప్రమాణములు కావుగదా ! వేదాః ప్రమాణం స్మృతయః ప్రమాణం ధర్మార్థయుక్తం వచనం ప్రమాణం యస్య ప్రమాణం

నభవేత్ ప్రమాణం కిం తస్య వాక్యస్య భవేత్ ప్రమాణం॥ అనికలదుగదా!

ఈభారతసారోద్ధారమున ఆదిపర్వము 17అధ్యాయములుగను, సభాపర్వము 7 అధ్యాయములుగను అరణ్యపర్వము 6 అధ్యాయములుగను, విరాటపర్వము 5 అధ్యాయములుగను, ఉద్యోగపర్వము 8 అధ్యాయములుగను, భీష్మపర్వము 7 అధ్యాయములుగను, ద్రోణపర్వము 6 అధ్యాయములుగను, కర్ణపర్వము 3 అధ్యాయములుగను, శల్యపర్వము 3 అధ్యాయములుగను. సౌప్తికపర్వము 1 అధ్యాయముగను, స్త్రీపర్వము 1 అధ్యాయముగను, శాంతిపర్వము 7 అధ్యాయములుగను, అనుశాసనిక పర్వము 5 అధ్యాయములుగను, అశ్వమేధపర్వము 2 అధ్యాయములుగను, ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు ఒక్కొక్కటి ఒక్క అధ్యాయముగను, మొత్తము 82 అధ్యాయములుగ అధ్యాయమునకు 60 శ్లోకముల వంతున 82×60=4,920 శ్లోకములవంతున రచింపబడినది. మరియును ఉత్తరభారతమను పేరిట 19వ భవిష్యత్పర్వము 16 అధ్యాయములుగను, అనగా 960శ్లోకములచే వ్రాయబడినది. మొత్తము 98 అధ్యాయములుగల ఈమహాభారత సారోద్ధార గ్రంథసంఖ్య 5,880 శ్లోకములు అని నిర్ణయింపబడినది. ఉపోద్ఘాతాక్షరశ్లోకసంఖ్య 120తో చేర్చగా నీభారతసారోద్ధారగ్రంథము ఆరువేల పరిమితి గ్రంథమని నిర్ణయము. భారతసంఖ్య 1,25,000 అనగా ఇంచుమించుగా 21 భాగమునకు తగ్గించి వ్రాయబడినది. త్రిస్సప్తపమితకృతాః అను శ్రుత్య

క్త్రముగా ఏకవింశతి తత్వసంఖ్యారూపమని గ్రహింపనగును.

ఈ భారతమున భారతసంగ్రహాముని 115 అధ్యాయముల గ్రంథము వ్రాయబడియున్నది. 'నియమం నిత్యపాఠార్థమ్ తథా భారతసంచయం వ్యాసేన గ్రథితం యచ్చ తత్సర్వమ్ బ్రూహి మే ప్రభో' అష్టాదశానాంపర్వాణాం యస్సారః కథ్యతాం త్వయా అని శౌనకు డడుగ సౌతి శ్లో॥ మహాత్మా భారతాత్సారం సముద్ధృత్య సముచ్చయమ్ జనమేజయస్య పృష్టస్య నాశనాయ మహామతిః॥ భారతం సారసంగ్రహం వ్యాసేన పరిభాషితం భారతస్య ప్రసంగేన శర్వస్య దర్శనేన చ విష్ణోః స్మరణమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే॥ యో గోశతం కనకశృంగమయం దదాతి విప్రాయ వేదవిదుషే చ బహుశ్రుతాయ పుణ్యాంచ భారతకథాం శృణుయాచ్చ నిత్యం తుల్యం ఫలం భవతి తస్య చ తస్య చైవ॥ దుర్లభా విప్రగోష్ఠీ చ గంగాస్నానం చ దుర్లభం దుర్లభా విష్ణుభక్తిశ్చ దుర్లభా భారతీకథా॥ ఇత్యాదిశ్లోకములలో గల భారతసారశ్లోకములు గూడ చేర్పబడినవి.

అంతమాత్రమే కాక 1వ అధ్యాయము భారతకథాసంగ్రహము. 2అ॥ పర్వానుక్రమణిక 3అ॥ ఉదంక చరిత్రము తక్షక చరిత్ర, పౌష్య చరిత్ర, 4అ॥ చ్యవనోపాఖ్యానము రురుని చరిత్రము, 5అ॥ భృగు చరిత్రము, 6అ॥ చ్యవనచరిత్రము, 7అ॥ అగ్నిస విశాపము, 8అ॥ రురుని చరిత్రము, 9అ॥ సర్పహత్య 10అ॥ సహస్రపాదముని ఉపదేశము 11అ॥ సూతప్రవచనము 12అ॥ కశ్యప కద్రూ, వినతల చరిత్రము గల 17 అధ్యాయములును వినబడినవి.

18అ॥ క్షీరసాగరమథనము, 19అ॥ ఉచ్చైశ్శ్రవోత్పత్తి, 20అ॥ అమృతానయన, వినతాదాస్య విముక్తిగల 35అ॥ 38అ॥ అధ్యాయముపరకును వదలబడినవి. 39అ॥ ఆస్తీకచరిత్ర పరీక్షిత్తుచరిత్ర, గల 58అధ్యాయముల వరకును వదలి 59అ॥ జనమేజయసర్పయాగమునకు వ్యాసాగమనము మొదలు ఈ మహాభారత సారోద్ధారమున గ్రథనము చేయడమైనది.

పురాణేతిహాసము లందవతారములన్నియును బ్రహ్మభావనిశ్చయాత్మకములై యున్న ఈగ్రంథమందలి శ్రీకృష్ణావతారమును భగవదంశావతారములగు వ్యాసపాండవాదులు నైనను ఆభావముచేతనే అని నిర్ణయింపబడినవి. అనగా పరబ్రహ్మమే ఆకార నామరూపవైభవాదులతో నావిర్భవించి నిర్దిష్టకార్యనిర్వహణానంతరము మరల బ్రహ్మయందే లీనమగునను నిర్ణయము. ఇది సర్వపురాణేతిహాస సమ్మతము.

కావుననే శ్రీమద్భాగవతమున సాక్షాద్భగవంతుడే పరమభాగవతుడైన నారదునితో శ్లో॥ మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద। సర్వభూతగుణైర్యుక్తం నైవం మాం జ్ఞాతు మర్హసి॥ యని చెప్పెను. ఇట్టి వచనములే పరశ్నతములు మనకు గోచరించును.

మరియును ఇతిహాసమనగా ఇతి, హ, ఆస ఇతి - ఈ ప్రకారముగా, హ = పూర్వమందు ఆస - ఉండెను అని అర్థము. పురాణేతిహాసములనుగూర్చి ఇతిహాస సముచ్చయగ్రంథమందీవిధముగా శ్లో॥ ప్రాయేణ పూర్వభాగార్థః ధర్మశాస్త్రేణ కథ్యతే ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే॥ అని

యను 'అర్థోయం బ్రహ్మసూత్రాణాం భారతార్థవినిర్ణయః' అనియును కలదు.

ఇతి హాస మనబడు శ్రీరామాయణ భారతములు పూర్వోత్తరభాగములవలె సపాదలక్షాత్మకమగు నొకే గ్రంథము.

ఇతిహాసమనగా వేదార్థ పతిపాదకమగు గ్రంథము కావు ననే వేదోపబృంహణగ్రంథమునకు బ్రాహ్మణమనియును(2) వేదార్థనిర్ణయగ్రంథమగు నిరుక్తమునకు ఇతిహాసమనియును మహర్షిప్రోక్తము లగుటచే స్మృతులనియును కావ్యలక్షణ లక్షితములగుటచే కావ్యములనియును పేరుగలదు.

ఇంతమాత్రమే గాక రెండును వ్యాసప్రోక్తములే. 24వ మహాయుగమునకు వాల్మీకి వ్యాసుడు. 28వ మహాయుగమున శ్రీకృష్ణద్వైపాయనుడు వ్యాసుడు అని పురాణములందు కలదు. కావున నీరెండును సంగ్రహరూపమున ఇదివరకే వ్రాయబడినవి. రామాయణసంగ్రహము సర్వులకు విదితమే.

మరియును పురాణేతిహాసప్రయోజన మేమన–వాటిని శ్రవణము గావించినవారికి శోక మోహములు పోగొట్టి జ్ఞానో త్పత్తిగావించి వారికి స్వస్వరూపప్రాప్తియను మోక్షమంద జేయుటయే యగును.

అర్థపంచక వివరణ గ్రంథమందు శ్లో॥ ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తిశ్చ ప్రత్యగాత్మనః ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ॥ వదంతి సకలా వేదా సేతిహాసాః పురాణకాః॥ అని చెప్పబడుటచేత సర్వపురాణే తిహాసములును కేవల ఉపనిషదర్థములే యని నిశ్చయింపబడెను

ఇక నీ శ్రీమద్భారతమను పంచమవేద గ్రంథ విషయమున శ్రీమద్భాగవతమున శ్లో॥ అర్థోయం బ్రహ్మ సూత్రాణాం భారతార్థవినిర్ణయః॥ అని శ్రీ వేదవ్యాసుడే యనుగ్రహించిరి, ఇంత మాత్రమే కాక నీభారతాఖ్యాన మందలి భీష్మశరీరసంస్కార సమయమున ఆకాశవాణి 'శతం భీష్మాః' అని ఘోషించుటచే అనాదులని నిర్ణయింప వల యును గాని కేవల కవికల్పితములు కావనియు తెలియు చున్నది. కావుననే భారతమునుగూర్చి శ్రీమదాది శంకర భగవత్పాదులవారు ఈక్రింది విధముగా సను గ్రహించిరి.

శ్లో॥ ప్రాతర్వైదికకర్మ తదను సద్వేదాంత సచ్చింతయా।
పశ్చాద్భారత మోక్షధర్మరసనా ద్వాశిష్టరామాయణాత్
సాయం భాగవతార్థ దివ్యకథయా రాత్రౌ నిదిధ్యాసనాత్
కాలో గచ్ఛతి సచ్ఛరీరభరణం ప్రారబ్ధ కర్మార్పితం ॥

అని, మరియును ప్రాతః ద్యూతప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసం గతః రాత్రౌ చోరప్రసంగేన కాలో గచ్ఛతి ధీమతాం॥ అని యును ఆభాణకవచనము. ప్రాతఃకాలమున భారతపారా యణము మధ్యాహ్నము రామాయణప్రసంగము రాత్రులందు శ్రీమద్భాగవతప్రసంగము చేత ధీమంతులు కాలక్షేపము చేయుదురు గదా.

ఉమా సంహితయందు సాక్షాత్ పరమేశ్వరుడు పార్వతీదేవితో యీవిధముగా చెప్పెను. 'ఇతిహాసావిమే ప్రోక్తౌ శ్రీరామాయణభారతే అత్యంత సాత్వికతమే శ్రోతవ్యే ముక్తికాంక్షిభిః॥ యదిహాస్తి తదన్యత్ర యన్నే

హాస్తి న కుత్రచిత్॥ భారతాద్రామ వృత్తాద్వా యస్య న స్యాత్ కృతార్థతా తం కృతార్థయితుం దేవి బ్రహ్మాపి సహి శక్నుయాత్॥ అని. కావున భారతః పంచమో వేదః అనియును 'వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాత్ రామాయ ణాత్మనా' అని ఉండుటవలన శ్రీరామాయణభారతములు కేవల వేదతుల్యములు. గావున ఇవి పారాయణ చేసిన వారలు ఇహపరసౌఖ్యము లందుదురని సిద్ధాంత మగుచున్నది. కావుననే శ్రీమహాభారత ఫలశ్రుతియందు ఈవిధముగా చెప్పబడినది.

శ్లో॥ ధన్యం యశస్య మాయుష్యం శత్రునాశన మేవచ।
పుత్రపౌత్రప్రదం పుంసాం సర్వైశ్వర్యసంప్రదాయకం॥
భారతం హి మహాపుణ్యం యః శృణోతి దినేదినే।
సర్వతీర్థాభిషేకస్య ఫల మాప్నోతి మానవః॥
భారతం భవనే యస్య తస్య హస్తగతో జయః।
భారతం సర్వశాస్త్రాణాం ఉత్తమం భరతర్షభ॥
ఏకశ్లోకమపి శ్రుత్వా అశ్వమేధఫలం లభేత్।

అని నిర్ణయింపబడినది.

ఈ భారతమునకు జయమని పేరు. జయశబ్దమునకు అక్షరసంఖ్యానిఘంటువు ప్రకారము 'జ' అనగా 8, 'య' అనగా 1. అంకానాం వామతో గతిః అని ఉండుటచే చివరనుండి చదివిన 18 అగును, అవియే 18 పర్వ ములు.

ఈ గ్రంథమందు భవిష్యోత్తర పర్వమనగా ప్రస్తు తము నడచుచున్న కలియుగాంతచరిత్రము కూడ శ్రీభారత

మందే కలదు. గాన ప్రస్తుత నడవడిక కూడ తెలుసుకొన వచ్చును.

పద్మపురాణమందును భారతప్రశంస ఈ విధమున కలదు. భారతం భానుమా నిందుః యది నస్యు రమీ త్రయః మహాఽజ్ఞానతమోంధస్య కాఽవస్థా జగతో భవేత్॥ అని.

కావుననే ఈగ్రంథకర్తచే 1) సూత్రభాష్య 2) ఉపనిషద్భాష్య 3) గీతాభాష్య సారోద్ధారములును 4) శ్రీమన్మహాభారత 5) శ్రీమద్భాగవత సారోద్ధారములును శ్రీరామచంద్రప్రేరణచే గ్రథనము గావింప బడినవి. అందు శ్రీమహాభారతసారోద్ధారము భవిష్యదుత్తర పర్వాయుతముగా ప్రస్తుతము ప్రకటించబడుచున్నది. ఇటులనే గ్రంథకర్తచే గ్రథనము గావింపబడిన శతాధికగ్రంథములును ప్రకటింప బడుగాక యని శ్రీ సీతారామచంద్రుని ప్రార్థించుచున్నాడను.

శ్లో॥ సాంఖ్యాది స్మృతియుక్తిభిః
న చలితో వేదాంత సిద్ధాంతగః
నిర్యాసైర్వివిధాంగమైః
న విదితో వ్యోమాది జన్మాప్యజః
ఉత్పత్త్యంతవివర్జితః చితివపుః వ్యాపీ చ కర్తాత్మకో
ఽలింగేన ప్రథితోపి నామతనుకృత్తం జానకీశంభజే।

ఇతిశం.

ఇట్లు విన్నవించు
శ్రీరామ సేవకుడు,
ములుకుట్ల నరసింహావధానీపాకయాజీ
చిత్రకూటాశ్రమనివాసీ.

3)

## ప్రార్థనాశ్లోకాః

నమోస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లార విందాయత పత్రనేత్ర
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥

భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా।
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకే కేశవే॥

పారాశర్యవచస్సరోజమమలం గీతార్థగంగోత్కటం
నానాఖ్యానక కేసరం హరికథాసంబోధనాబోధితం
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే॥

యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుత స్తున్వంతి దివ్యైస్తవైః
వేదై స్సాంగపదక్రమోపనిషదై ర్గాయంతి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదు స్సురాసురగణా దేవాయ తస్మై నమః॥

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం
యత్కృపా తమహం వందే పరమానంద మాధవం

సాంగ సపరివార చిన్మయ
శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః॥

# శ్రీ మహాభారతసారోద్ధారే
# ఆదిపర్వారంభః
## ప్రథమాధ్యాయః

*శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్॥ 1

జయతి పరాశరసూనుః
సత్యవతీహృదయనందనో వ్యాసః
యస్యాస్య కమలగళితం
వాఙ్మయ మమృతం జగ త్పిబతి॥ 2

---

* వ్యా॥ జయం — జయసంజ్ఞికం, భారతాఖ్యాన మిత్యర్థః. శ్లో॥ అష్టాదశ పురాణాని రామస్య చరితం తథా। కార్ష్ణం వేదః పంచమం చ యం మహాభారతం విదుః జయేతి నామ్నా త్వేతాంస్తు ప్రవదంతి మనీషిణః ఇతి భవిష్యత్పురాణ వచనాత్॥ తథైవ విష్ణుధర్మాశ్చ శాశ్వతాః జయేతి నామ తేషాం చ ప్రవదంతి మనీషిణః॥ చతుర్ణాం పురుషార్థానా మపి హేతో ర్జయే యతః। ఇతికోశాచ్చ జయ మిత్యత్ర శ్రీమహాభారత మిత్యర్థః॥

# శ్రీ మహాభారతసారోద్ధారము

## ఆదిపర్వము

### ప్రథమాధ్యాయము

* 1 నారాయణుని, జీవులలో ఉత్తముడైన నరుని, సరస్వతీదేవిని వ్యాసుని నమస్కరించి జయమని పేరుగల భారతేతిహాసమును పలుకవలసినది.

2 పరాశరమహర్షి యొక్క కుమారుడును సత్యవతీదేవియొక్క హృదయానందకరుడును ఏ వ్యాసుని యొక్క ముఖపద్మమునుండి జారిన వాఙ్మయ మనెడి అమృతమును సర్వప్రపంచము గ్రోలుచున్నదో అట్టి వేదవ్యాసమహర్షి సర్వోత్కర్షముగా ఉండుగాక.

---

* వ్యా॥ జయం అనగా జయమను పేరుగలభారతాఖ్యానమని అర్థము అష్టాదశపురాణములును రామచరిత్రమును సమస్తమైన పంచమ వేదమనెడి ప్రసిద్ధివడసిన మహాభారతమున్నూ జయమనెడి పేరుతో విద్వాంసులు చెప్పుచున్నారు. అదేవిధముగా విష్ణుధర్మములును సనాతనములైన శివధర్మములును జయమను పేరుగలవని విద్వాంసులువ్యవహరించుచున్నారు, అను భవిష్యత్పురాణవచనము వలననూ నాలుగువిధములైన ధర్మార్థకామమోక్షము లనెడి పురుషార్థములు ఈభారతముచే పుష్కలముగా వృద్ధిపొందుచున్నవి గాన ఇచ్చట జయమనగా మహాభారతమని యర్థము.

అభ్రశ్యామః పింగజటాబద్ధకలాపః
ప్రాంశు ర్దండీ కృష్ణమృగత్వ క్పరిధానః।
సర్వాన్ లోకాన్ పావయమానః కవిముఖ్యః
పారాశర్యః పర్వసు రూపం విష్ణ్వోతు॥ 3

నైమిశేఽనిమిశ క్షేత్రే ఋషయ శ్శౌనకాదయః।
సత్రం స్వర్గాయ లోకాయ సహస్రసమ మాసత॥ 4

*వా॥ రోమహర్షణపుత్ర ఉగ్రశ్రవా స్సౌతిః పౌరా
ణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతేః సహస్ర వార్షికే
సత్రే వర్తమానే॥ 5

---

*వ్యా॥రోమహర్షణపుత్రఇత్యత్ర కూర్మపురాణే॥ శ్లో॥
రోమాణి హర్షయాం చంక్రే శ్రోతౄణాం యస్య భాషితైః
కర్మణా ప్రథిత స్తేన రోమహర్షణ సంజ్ఞయేతి నిరుక్త
నామ్నో రోమహర్షణస్య పుత్ర ఇత్యర్థః॥

ఉగ్రశ్రవాః అధిగతోపనిషద్రహస్య ఇత్యర్థః. ఉగ్రే-
ఉగ్రం వీరం మహావిష్ణుం ఇత్యాదినృసింహతాపనీయోపనిష
చ్ఛ్రుతిపాదిత శ్రీమన్నారాయణ సంబంధి కథాసముదయే,
శ్రవః – శ్రవణం యస్య సః॥ ఉగ్రశ్రవాః॥

3. మేఘమువలే నల్లనివాడును. పచ్చని జడలుకట్టిన జుట్టు కలవాడును, పొడిగరియైన వాడును. కృష్ణాజినమును వస్త్రముగా ధరించినవాడును. సర్వలోకములను పవిత్రము చేయుచున్నవాడును, సత్వికవులలో ప్రధానుడును, పరాశరమహర్షి పుత్రుడగు శ్రీ వేదవ్యాసమహర్షి తనరూపమగు జ్ఞానమును పర్వములందు వివరించుగాక

4 దేవతా క్షేత్రమగు నైమిశారణ్యమున శౌనకాది మహర్షులు ఉత్తమమైన స్వర్గాదిలోకములను కోరినవారై వేయి సంవత్సరములు సత్రయాగమును నిర్వర్తించుచుండిరి. అప్పుడు

5 రోమహర్షణ మహర్షి యొక్క పుత్రుడును ఉగ్రశ్రవసుడును పురాణవేత్తలలో నధికుడునగు సౌతి నైమిశారణ్యమున కులపతియగు శౌనకునియొక్క సహస్రసంవత్సరములు చేయదగిన సత్రయాగము జరుగుచుండగా

---

వ్యా॥ రోమహర్షణునియొక్క పుత్రుడనుచోట కూర్మపురాణమునందు ఎవడు తనయొక్క ప్రవచనముచే శ్రోతలయొక్క రోమములను పులకాంకురములు చేసెనో అట్టి ప్రవచన సామర్థ్యముచే రోమహర్షణుడని ప్రసిద్ధనామము గల రోమహర్షణ మహర్షియొక్క పుత్రుడని అర్థము,

ఉగ్రశ్రవాః అన తెలియబడిన ఉపనిషద్రహస్యములు గలవాడని అర్థము. ఉగ్రే అనగా ఉగ్రం వీరం మహావిష్ణుం ఇత్యాది నృసింహ తాపనీయోపనిషత్తుచే ప్రతిపాదింపబడిన శ్రీమన్నారాయణునకు సంబంధించిన కథాసముదాయమునందు శ్రవః శ్రవణము గలవాడే ఉగ్రశ్రవాః యని అర్థము,

సౌతిః = సూతస్యాపత్యం, సౌతిః॥ పౌరాణికః। పురాణేషు కృతశ్రమః॥ అయమత్ర విశేషః అయం ఉగ్రశ్రవా స్సౌతిరేవ॥ శ్లో॥ బ్రాహ్మణ్యాం క్షత్రియాజ్జాత స్సూత ఇతి యాజ్ఞవల్క్యస్మృత్యుక్తో విలోమజో - న - జాతిసూతః॥ తథాత్వే తత్రాపి సూతశబ్ద ప్రయోగోపపత్తే స్సౌతిరిత్యపత్యార్థస్య తద్ధిత స్యానర్థక్యం స్యాత్॥ కింతర్హి॥ శ్లో॥ అగ్నికుండసముద్భూత సూతో నిర్మలమానస ఇతి రోమహర్షణాప్రతి శౌనకస్య పురాణాంతరే దర్శనా దగ్నిజో రోమహర్షణః తస్య పుత్రః। తస్య చ బ్రాహ్మణానుకల్పా బ్రహ్మాసనత్వం। బ్రహ్మాసనంచ వైశంపాయన శాంతిపర్వ -మూర్ఖ- దేవాది తుల్య స్సజాతీయ ఏవాస్తి న హీనః। అత ఏవ తద్వధా ద్బలరామేణ బ్రహ్మహత్యావ్రతం చీర్ణమితి స్మర్యతే॥

పౌరాణికపదం [illegible] అపితు పురాణార్థే తు బ్రాహ్మణపరం। [illegible] విష్ణుపురాణే ప్రథమాంశే 13 అధ్యాయే॥ శ్లో॥ సూతః సూతాత్ సముత్పన్నః సౌత్యేహాని మహామతే ఇతి॥ అగ్నిపురాణే [illegible] అధ్యాయే॥ శ్లో॥ బ్రాహ్మణః పౌష్కరే యజ్ఞే సుత్యాహే [illegible] వృషదాజ్యాత్సముత్పన్న సూతః పౌరాణికో ద్విజః॥ వక్తా

సౌతిః అనగా సూతుని యొక్క కుమారుడు. పౌరాణికః=పురాణ ములయందు విశేషపరిశ్రమ చేసినవాడు ఇచ్చట ఈవిశేషము కలదు.

ఈ ఉగ్రశ్రవుడను పేరుగల వాడు సౌతియే. బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునివలన పుట్టినవాడు సూతుడు అనెడి యాజ్ఞవల్క్యస్మృతిచే. చెప్పబడిన విలోమజ సంకరజాతిసూతుడు కాడు. అలాగేఅగుచో సౌతి యందును సూతశబ్ద ప్రయోగము కుదురుచుండగా సౌతియనెడి అపత్యా ర్థమును బోధించెడి తద్ధితప్రత్యయాంతరూపము ప్రయోగించుట విరర్ధ కము గదా। ఇక ఏమన అగ్నిగుండమునుండి పుట్టినవాడును విశాల మనస్సుకలవాడు సూతుడు అని రోమహర్షణమహర్షినిగూర్చి శౌనకుడు పురాణాంతరమునందు చెప్పుటచే రోమహర్షుడను పేరుగల సూతుడు అగ్నినుండి పుట్టిన పవిత్రుడు. సౌతి సూతని పుత్రుడు.

అందువలననే బ్రాహ్మణుసంకల్పముచే వానికి బ్రహ్మాసనము దక్కినది. బ్రహ్మాసనము వైశంపాయనుడు. శాంతవతుడు, మార్కం డేయుడు. మొ॥ గు వారును తజ్జాతీయులగు బ్రాహ్మణులు మాత్రమే పొందదగినది. ఇతరజాతీయుడు పొందగానిది, అందుచేతనే ఆసూతుని వధించుటచే బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్త్రవతము బలరామునిచే వాచరింప బడెనని చెప్పబడెను,

పౌరాణికపదము జాతిసూచకము కాదు, ఇకేమన పురాణములను చెప్పు బ్రాహ్మణపదమై యున్నది, అందువలననే విష్ణుపురాణమందు ప్రథమాంశమున పదమూడవ అధ్యాయమున సుత్యాహస్సునందు అగ్ని హోత్రమునుండి సూతుడు పుట్టెనని కలదు, అట్లే అగ్నిపురాణమున ఒకటవ అధ్యాయమునందునూ పౌష్కరుని యజ్ఞమునందుసుత్యాహస్సు జరుగుచుండగా పౌరాణికోత్తముడును బ్రాహ్మణుడును నగు సూతుడు

వేదాదిశాస్త్రాణాం త్రికాలామలధర్మాణి దితి వోక్తత్వాత్.

అపిచ॥ మహాభారత నీలకంఠీయ టీకాయాం సూతోత్పత్తిరుక్తా॥ వాయుపురాణే॥ శ్లో॥ వైన్యస్య తు పృధో ర్యజ్ఞే వర్తమానే మహాత్మనః। సుత్యాయా మభవత్సూతః ప్రథమం వర్ణవైకృతం। శిష్యహవిషా సంపృక్త మభిభూతం గురో ర్హవిః॥ అధరోత్తర చారేణ జజ్ఞే తద్వర్ణవైకృతమితి॥ అత్ర త్యాధరోత్తర వర్ణభావత్వా దేవ విలోమత్వం నతు జాత్యా విలోమత్వం। అతఏవ సూతం ప్రతి విలోమజ ఇతి తత్ర తత్ర ప్రతిపాదన మస్తి। తథాప్యత్ర చరునిక్షేపవైపరీత్య మేవేత్యభిప్రాయః॥

శ్రీమద్భాగవతే బలరామోక్తిః శ్లో॥ కస్మా దసావిమాన్విప్రా ఽధ్యాస్తే ప్రతిలోమజః॥ ఇత్యత్ర వంశధరీయ వ్యాఖ్యాయాం 'తస్య అగ్నికుండోద్భూతత్వేన జాతిసూతాఽభావేఽపి చరునిక్షేపవైపరీత్యాత్ ప్రతిలోమజ ఇత్యుక్తిః.

భవిష్యత్పురాణే మధ్యమపర్వణి 117 అధ్యాయే శ్లో॥ న శూద్రః కథయేత్ ధర్మాన్ తప అధ్యాపనే తథా నైహికత్వం పరత్వంచ నశుభం న పరాం గతిం। ఏవం శూద్ర ఖాద్ధమురాః ప్రగామ్య శబ్దసంస్కృతాః ఇతి॥

వృషదాజ్యమునుండి పుట్టెను. అతడు వేదాదిశాస్త్రములను పురాణేతిహాస
ములను చెప్పగలడు, త్రైకాలికములైన ధర్మముల నెరింగినవాడు అని
చెప్పుటచే జాతిసూతుడు గాడు.

మరియు మహాభారత నీలకంఠీయటీకయందు సూతోత్పత్తిక్రమ
మీవిధముగా చెప్పబడినది. అదేది యన వాయుపురాణ మందిట్లు కలదు
వేనుని కుమారుడును, మహాత్ముడగు పృధుచక్రవర్తి యొక్కయజ్ఞము
జరుగుచుండగా సుత్యాహస్సునందు సూతుడుదయించెను. బృహస్పతి
దేవతాకమైన హవిస్సు ఇంద్రదేవతాకమైన హవిస్సులలో మొదట
గురువైన బ్రాహ్మణుడగు బృహస్పతికి హోమముచేయవలసి యుండగా
అలాగాక శిష్యుడును క్షత్రియుడునగు ఇంద్రునకు హోమము చేయబడిన
తరువాత బృహస్పతికి హోమముచేయబడెను. ఇట్టి వర్ణవైపరీత్యము
చేతనే ఆతనికి విలోమజత్వము. జాతిసాంకర్యము లేదు. అందుచేతనే
అచ్చటచ్చట సూతునుద్దేశించి విలోమజుడని చెప్పబడుట కలదు.
అచ్చట చరునిక్షేపవైపరీత్యము వలననే యని అభిప్రాయము.

శ్రీమద్భాగవతమునందు శ్లో॥ కస్మాదసౌ విమాన్ అపఠ్యాత్తే?
ప్రతిలోమజః అనుచోట వంశీధరీయ వ్యాఖ్యయందు సూతుడు అగ్ని
గుండమునందు పుట్టుటచే జాతిచే సూతుడు కాకపోయి నప్పటికి చెయు
వుడు హోమము చేయుట యందలి వైపరీత్యముచే ప్రతిలోమజుడని
చెప్పబడినది.

భవిష్యత్పురాణమునందు మధ్యమపర్వము యందు 117వ అధ్యా
యమున ఇట్లు గలదు, శూద్రుడు ధర్మమును చెప్పగూడదు: అట్లే తప
స్సును అధ్యాపనమును చేయగూడదు అట్లే ఐహికధర్మములను మోక్ష
ధర్మములను చెప్పకూడదు ఈవిధముగా శూద్రునినుండి సంస్కృతశబ్ద
ములను ధర్మములను గ్రహించగూడదు అని

అన్యథా। శ్లో॥ విప్రో వక్తా సుధీః కార్యో విశుద్ధో మునివంశజః। ఇతిహాసపురాణానాం విప్రాన్యో ధర్మహాని కృత్॥ ఇతి సంహితోక్తి రసమంజసా స్యాత్॥ పునశ్చ॥ శ్లో॥ అస్య బ్రహాసనం దత్త మస్మాభి ర్యదునందన। ఇత్యుక్త శ్లోకే వంశధరీయవ్యాఖ్యా॥ అస్యసూతస్య॥ అగ్ని ర్వై బ్రాహ్మణ॥ ఇతి శ్రుతే స్తనుభూతత్వా దయం బ్రాహ్మణ ఏవ అతఏవ బ్రహ్మాసనం॥

బృహన్నారదీయే పూర్వభాగే 9అ॥ 76 శ్లో॥ అధ్యాపకశ్చ వేదానాం వేదార్థయుతిబోధకః శాస్త్రవక్తా ధర్మవక్తా నీతిశాస్త్రోపదేశకః మన్త్రోపదేశవ్యాఖ్యాకృ ద్వేద సందేహహృత్తథా। వ్రతోపదేశక శ్చైవ భయత్రాతాన్నదో హి చ। శ్వశురో మాతుల శ్చైవ జ్యేష్ఠభ్రాతా పితా తథా। ఉపనేతా నిషేక్తాచ సంస్కర్తా మిత్రసత్తమ। ఏతే హ్యా గురవః ప్రోక్తా పూజ్యా వంద్యాశ్చ సాదరం॥ అధ్యాపకాశ్చ వేదానాం మన్త్రవ్యాఖ్యాకృత స్తథా పితాచ ధర్మవక్తాచ విశేషగురవ స్మృతాః। ఏతేషామపి భూపాల శుశ్రూషస్వ ప్రవరం గురుం। సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞై ర్భాషితం ప్రవదామి తే॥ యః పురాణాని వదతి ధర్మయుక్తాని పండితః। సంసార పాశవిచ్ఛేద కారకః॥ సర్వవేదార్థసారాణి పురాణానీతి భాషతే। వదంతి మునయ శ్చైవ తద్వక్తా పరమోగురుః॥ య

సూతుడు శూద్రుడే యగుచో విద్యాంసుడను, పరిశుద్ధుడను, మునివంశమునందు బుట్టిన బ్రాహ్మణుడు ఇతిహాసపురాణములను చెప్పువాడుగ చేయవలసినది. ప్రవక్త బ్రాహ్మణేతరుడు ధర్మహాని కలిగించువాడగును.

అనెడి సంహితావచనము అసంబద్ధములగును కదా। మరియు అస్య బ్రహ్మాసనం దత్తమస్మాభిః యదునందన॥ అనెడి శ్లోకమునందు వంశధరీయ వ్యాఖ్యలో అస్య = ఈసూతునకు అగ్నిరేవ బ్రాహ్మణః అను శ్రుతిచే అగ్నినుండి పుట్టిన ఈసూతుడు బ్రాహ్మణుడే అందువలననే వేద, పురాణ ఇతిహాసములను చెప్పు బ్రాహ్మణునకు యోగ్యమగు బ్రహ్మాసనము ఈయబడినది అని కలదు.

బృహన్నారదీయము నందు పూర్వభాగమున 8వ అధ్యాయమున 76వ శ్లోకము నుండి ఇట్లు చెప్పబడినది వేదములను చెప్పువాడును వేదార్థము బోధించువాడును శాస్త్రమును బోధించువాడును ధర్మమును బోధించువాడును నీతిశాస్త్రము నుపదేశించువాడును మంత్రము నుపదేశించువాడును మంత్రమును వ్యాఖ్యానము చేయువాడును వేదము లందలి సందేహములను బోగొట్టువాడును, వ్రతముల నుపదేశించువాడును, పెద్దన్నగారును, తండ్రియు, ఉపనయనము చేయించినవాడును, కనిన వాడును, చౌలాదిసంస్కారము చేసినవాడును, మంచి మిత్రుడును; వీరలందరు గురువులుగా చెప్పబడిరి. వీరందరూ ఆదరముతో పూజించ దగినవారును, వందనీయులునూ, వీరిలో వేదాధ్యాపకుడు, మంత్రవ్యాఖ్యానము చేసినవాడును, తండ్రియు, విశేష గురువులుగా చెప్పబడిరి. వీరిలో కూడా ఓరాజా। శ్రేష్ఠమైన గురువును చెప్పెదను వినుము. సర్వ శాస్త్రార్థ తత్త్వములను ఎరిగినవారిచే చెప్పబడినది. నీకు చెప్పుచుంటిని, వినుము, ఏ పండితుడు ధర్మయుక్తములైన పురాణములను చెప్పుచున్నాడో, అతడు సంసార

సుఖాసీనా నభ్యగచ్ఛ న్మహర్షీ న్సంశితవ్రతాన్।
వినయావనతో భూత్వా కదాచి త్సూతనందనః॥ 6

తమాశ్రమ మనుప్రాప్తం నైమిశారణ్యవాసినః।

---

స్సంసారార్ణవం తరు ముద్యోక్తు కురుతే నరః। శృణుయా
త్స పురాణాని ఇతి శాస్త్ర విభాగకృత్ ప్రోక్త్వా నర్వ
ధర్మాంశ్చ పురాణేషు మహీపతే, పురాణాని మహాబుద్ధే
ఇహాముత్ర సుఖాయహి। యః శ్రోణోతి పురాణాని సతతం
భక్తిసంయుతః తస్య స్యాన్నిర్మలా బుద్ధి ర్భావో ధర్మ
పరాయణః। ధర్మార్థకామమోక్షాణాం యే ఫలాన్యభిలిప్సవః
శ్రుణుయుస్తే పురాణాని ప్రాహురిద్ధం పురావిదః। వేదేతి
హాసపురాణవక్త్ర బ్రాహ్మణయోగ్యాసనం దత్వం ఇత్యర్థః॥

శౌనకః॥ శౌనః = వివేకదృక్। శౌన ఏవ శౌనకః।
స్వార్థే కప్రత్యయః॥ వివేకదృష్టి రిత్యర్థః॥ కులపతిః॥ శ్లో॥ ఏక
దేశే సహస్రాణి యోన్న దానాదినా భరేత్। స్వై కులపతి
ర్జ్ఞేయః। ఇత్యుక్తలక్షణః॥ సత్రయాగః॥ యస్మిన్ క్రతౌ
యజమానా ఏవ ఋత్విజో భవంతి। స సత్రయాగః॥ తథా
చోక్తం॥ శ్లో॥ బహుభోజ్యం దీయతే యత తృప్యంతి ప్రాణినో
బహు। కర్తారో బహవో యత్ర తత్సత్ర మభిధీయతే॥
ఇతి॥

6 ఒకానొకప్పుడు సుఖాసీనులై యున్న అపిధారవంటి వ్రతము గల మహర్షులను గూర్చి భక్తితో వినమ్రుడైన సూతవికుమారుడగు సౌతి విచ్చేసెను.

7 తమ ఆశ్రమమును గూర్చి వచ్చిన సౌతిని నైమిశారణ్యవాసు లగు మహర్షులు మహాభారత సంబంధమగు చిత్రమైన వృత్తాంత

---

బంధము పోగొట్టు వాడు. ఓరాజా! పురాణములు సర్వవేదములకు సారభూతమైన వని మునులందరును చెప్పుచున్నారు. గాన అట్టి పురాణవక్త ఉత్తమోత్తమ గురువు. కావున ఈ సంసారమనెడి సముద్రమును దాట ప్రయత్నము కలవాడు తప్పక పురాణములను వినవలెనని శాస్త్రనిర్ణయము. పురాణములయందు సర్వధర్మములును ప్రతిపాదింపబడినవి.

పురాణములు ఇహలోకపరలోక సౌఖ్యములను కలిగించునవి. ఎవడు పురాణములను ఎల్లప్పుడూ భక్తియుక్తుడై వినునో వాని యొక్క బుద్ధి నిర్మలమైనదై ఎల్లప్పుడూ ధర్మమునందాసక్తి కలది యగును. ధర్మార్థ కామమోక్షములయొక్క ఫలములను పొంద కోరువారు తప్పక పురాణములను వినవలయును. అని పెద్దలనుడిరి.

శౌనకుడనగా శౌనః = వివేకదృష్టి శౌనఏవ శౌనకః వివేకదృష్టియే శౌనకుడని చెప్పబడెను స్వార్థమునందు కప్రత్యయము వచ్చినది ఎవడు ఒక ప్రదేశమునందు పదివేలమంది శిష్యులను అన్న విద్యాదిదానములచే భరించునో వాడు కులపతి యని చెప్పబడును. ఏ యజ్ఞమునందు యజమానులే ఋత్విక్కులగుదురో అది సత్రయాగ మన బడును ఏక్రతువునందు అనేకమందికి దానము చేయబడునో ఎచ్చట అనేకప్రాణులు తృప్తినొందుదురో, ఎచ్చట అనేకమందియజమానులుగా ఉందురో అది సత్రయాగమని చెప్పబడును.

చిత్రాః శ్రోతుం కథా స్తత్ర పరివవ్రు స్తపస్వినః॥ 7

శౌనక ఉవాచ॥

ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా।
సురై ర్బ్రహ్మర్షిభిశ్చైవ శ్రుత్వా యదభిపూజితం॥ 8

1 *మహాభారత మాఖ్యానం వేద వేదాంగనిర్ణయం।
♦సంహితాం శ్రోతుమిచ్ఛామో ధర్మ్యాం పాపభయాపహాం॥ 9

---

* వ్యా। పురాణం - పురాతన స్యాపర్య-స్య పురాణం తద్వేదు ర్బుధాః। ఇతి.

శ్రీ భవిష్యత్పురాణే మధ్యమపర్వణి 1 భాగే 8వ అధ్యాయే పురాణ శ్రవణ ఫల ముక్తం। తథాహి॥ శ్లో॥ యాంత తే కథయా మ్యేష పురాణ శ్రవణే విధిం ఇతిహాస పురాణాని శ్రుత్వా భక్త్యా ద్విజోత్తమః ముచ్యతే సర్వపాపేభ్యో బ్రహ్మహత్యాశతం చ యత్ సాయం ప్రాత స్తథా రాత్రౌ శుచి ర్భూత్వా శృణోతి యః తస్య విష్ణు స్తథా బ్రహ్మా తుష్యతే శంకర స్తథా। ప్రభాతే పి భగవాన్ బ్రహ్మా తుష్యతే హరిః మహాదేవ స్తథా రాత్రౌ శృణ్వతాం పఠతాం నృణాం।

అపిచ॥ సూతసంహితాయాం॥ శ్లో॥ పురాణసంహితాం సూత బ్రూహి త్రైకాలికీం కథాం। సందేహో నాత్ర కర్తవ్యో యత స్త్వం గోచరోఽఖిలః। అతీంద్రియా నంస

ములను వినదలంచినవారై వానిని చెప్పవలసినదిగా కోరిరి.

శౌనకుడు అడుగుచున్నాడు.

• 8-9 సౌతే! పరమఋషియైన ద్వైపాయనునిచే చెప్పబడినదియు ఏది బ్రహ్మాదిదేవతలచేతను పూజింపబడినదో యందు వేద వేదార్థ నిర్ణయము చేయబడినదియో ఏది మిక్కిలి ధర్మప్రదమైనదో సర్వ పాప ములను పోగొట్టునదియో అట్టి • మహాభారతమను పేరుగల సంహితను వినగోరుచున్నాము.

---

• వ్యా॥ పురాతనమైన వృత్తాంతమును తెలుపునది పురాణమని పండితులనుదువుచున్నారు.

భవిష్యత్పురాణమునందు మధ్యమ పర్వమునందు ఒకటవ భాగ మున 8వ అధ్యాయమందు పురాణశ్రవణవిధి ఈవిధముగా చెప్పబడినది ఓయీ! నీకు పురాణ శ్రవణమునందు విధానమును చెప్పుచున్నాను. బ్రాహ్మణుడు భక్తితో ఇతిహాసపురాణములను విని నూరుబ్రహ్మహత్య లతో సమానమగుసర్వపాపములనుండియు, విముక్తిపొందుచున్నాడు. ఎవడు శుచియై సాయంకాలమందును, దివసమునను రాత్రియందును పురాణ ములను వినునో వానిని గూర్చి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సంతో షించుచున్నారు. ప్రాతఃకాలశ్రవణముచే బ్రహ్మయు. మాధ్యాహ్నిక శ్రవణముచే హరియు, రాత్రిశ్రవణమున శంకరుడును తృప్తినొందు చున్నారు.

మరియు సూతసంహితయందు ఇట్లు గలదు. ఓసూతా! పురాణ సంహితయనునది త్రికాలవృత్తాంతమును చెప్పును ఏలనన తత్కర్త యగు వ్యాసమహర్షి త్రికాలవృత్తాంతము నెఱింగిన వాడుకదా ఈవిషయ మున సందేహము కూడదు మహర్షులు ఆర్షమైన నేత్రములచే మనకు తెలియబడని అతీంద్రియ విషయములను చూడగల్గుచున్నారు. వారి

వేద్యాన్ పశ్యంత్యార్షేణ చక్షుషా। యే భావాః వచనం తేషాం నానుమానేన బాధ్యతే॥ ఇత్యుక్తత్వా త్త్రైకాలిక విషయబోధక మిత్యర్థః॥ అతఏవ నాడీ గ్రంథేష్వధునాతన దశావిశేషః। నామగోత్ర వివరణ రూపేణ పరిదృశ్యతే॥

* మహాభారత మిత్యత్ర॥ శ్లో॥ ఏకత శ్చతురో వేదా భారతం చైక దేశతః। పురా కిల సురైస్సర్వై స్సమేత్య తులాయాం ధృతః। చతుర్భ్య స్సహరస్యేభ్యో వేదేభ్యో హ్యధికం యధా। తదా ప్రభృతి లోకేస్మి న్మహాభారత ముచ్యతే॥ నిరుక్తమస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే॥

బీజాక్షర నిఘంటుః। భా - సూర్యః ర- అగ్నిః। తం - చంద్రః సూర్యాగ్ని చంద్ర సంయోగా దేవ చరాచరాత్మ సృష్టి రత్యర్థః॥

♦ సంహితాః భారతస్య మూలభూతా స్సంహితాః మంత్ర బ్రాహ్మణరూపా వేదాః॥ తై స్సుమంతు ప్రభృతిభిః ప్రకాశితాః। ఇదమస్య మూల మిదమస్య మూలమితి స్పష్టీకృతా॥ స్తైన ప్రత్యేకసంహితా మూల మేతత్॥ అత ఏవ సంహితాస్తే పృథక్పృథక్త్వేన భారతస్య ప్రకాశితా ఇత్యుక్తం మహాభారతే॥

1 ఆది ప 2 అ.

వచనములు అనుమానప్రమాణముచే బాధింపబడవు. అనిచెప్పబడుటచే పురాణములు త్రైకాలికవిషయ బోధకములని ఎరుంగునది. అందుచేతనే నాడీగ్రంథముల యందు ఇప్పటివారి నామగోత్రములు దశావిశేషములు మొదలగు విశేషములన్నియు వివరముగా చూడబడుచున్నవి.

॰ మహాభారతమనుచోట వ్యాఖ్యానము॥ పూర్వము దేవతలందరూ కలసి త్రాసున ఒకప్రక్కన నాలుగు వేదములను, మరియొకప్రక్కన భారతగ్రంథమును ఉంచి తూచిరట. రహస్యములతో కూడిన నాలుగు వేదములకంటెనూ, ఈభారతగ్రంథము పెచ్చు తూగుటచే అప్పటి నుండియు లోకమున మహాభారతమని చెప్పబడుచున్నది. బీజాక్షరనిఘంటువు, భా=సూర్యుడు, రా=అగ్ని తం=చంద్రుడు, సూర్య, అగ్ని, చంద్రులయొక్క సంయోగమువలననే సమస్తచరాచర ప్రపంచము యొక్క సృష్టి జరుగుచున్నదని తాత్పర్యము.

మరియు భరతవంశీయులయొక్క గొప్పదగుజన్మాదివృత్తాంతమంతయు నుండుటచే మహాభారతమని చెప్పబడుచున్నదిఅట్టిమహాభారతమును ఎవరు తెలిసికొందురో వారు సర్వపాప విముక్తులగుదురు.

॰ సంహితా॥ వ్యా॥ భారతమునకు మూల భూతమైన మంత్ర బ్రాహ్మణ రూపములైన సంహితలు ఆసుమంతుడు మొదలుగాగల వారిచే ప్రకాశింపజేయబడినవి. అనగాఈభారతభాగమునకు మూలము ఈ సంహితారూపమైన వేదభాగము దీనికి ఇది మూలము అనివారిచే వ్యాఖ్యానము చేయబడినది. ఆకారణమున ఈమహాభారతము ప్రత్యేకము వేద మూలకము కావుననే ఆసుమంతాదులచే వేరువేరుగా భారతమునకు మూలభూతమైన సంహితలు ప్రకాశింపచేయ బడినవని మహాభారతము నందు చెప్పబడినది.

సౌతిః॥

ఆద్యం పురుష మీశానం పురుహూతం పురుష్టుతం।
ఋత మేకాక్షరం బ్రహ్మ వ్యక్తావ్యక్తం సనాతనం॥ 10

అసచ్చ సదసచ్చైవ యద్విశ్వం సదసత్పరం।
నమస్కృత్య హృషీకేశం చరాచరగురుం హరిం॥ 11

ప్రవక్ష్యామి మతం కృత్స్నం వ్యాసస్యామిత తేజసః। 12

♦ ఇతిహాస మిమం చక్రే పుణ్యం సత్యవతీసుతః।
అయంసాక్షాన్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః
వ్యస్త వేదతయా వ్యాస ఇతి లోకే శ్రుతో మునిః॥ 13

---

♦ ఇతిహాస మితి॥ కావ్యమీమాంసావివృత్త్యాం॥ శ్లో॥ ధర్మార్థకామమోక్షాణా ముపదేశసమన్వితం। పూర్వవృత్త కథాయుక్త మితిహాసం ప్రచక్షతే॥ ఇతి॥ యదాహుః వర క్రియా పురాకల్ప ఇతిహాసగతి ద్వివిధా। స్యాదేకనాయకా పూర్వా ద్వితీయా బహునాయకా॥ ఇతి తత్ర శ్రీరామాయణం శ్రీమహాభారతం చోదాహరణేతి జ్ఞేయం॥

10 సౌతి చెప్పుచున్నారు ఆద్యుడును పురుషశబ్దవాచ్యుడును, సమస్త చరాచర జగత్తునకు ప్రభువైనవాడును, యజ్ఞాదులయందు అనేక మందిచే ఆహ్వానింపబడు వాడును, అనేకమంది యజ్ఞముల యందు అనేకమంది సామగులచే స్తోత్రము చేయబడు వాడును, సత్యస్వరూపుడును, ఒక్కడైనవాడును, సనాతనుడు నగు విష్ణువును నమస్కరించుచున్నాను.

11 అసద్రూపునివలె నున్నట్టియు సదసత్తులకంటే భిన్నమైనట్టియు, విశ్వరూపుడును సదసద్ రూపముల కంటే పరుడును పరావర ములను సృష్టించినవాడను, పురాణుడును, నాశరహితుడును పరాత్పరుడునగు ఆభగవంతుని స్తుతింతును.

12 ఈచరాచరసృష్టికంతయు గురువును ఇంద్రియములకు ప్రభువగు హరికి నమస్కరించి గొప్ప తేజశ్శాలియగు వ్యాసమహర్షియొక్క సమగ్రమగు అభిప్రాయమును నీకు చెప్పగలను.

• 13 ఈపుణ్యమైన ఇతిహాసమును సత్యవతీపుత్రుడగు వ్యాసమహర్షి రచించెను. ఆయన సర్వజ్ఞుడు మహాయోగి సాక్షాదీశ్వరుడే, వేద ములను విభజించుటచే ఆముని వ్యాసుడని లోకమునందు ప్రసిద్ధి గాంచెను.

---

• ఇతిహాసమితి వ్యా॥ కావ్యమీమాంసా వివృతియందు ధర్మార్థ కామమోక్షముల యొక్క ఉపదేశములతో కూడుకొని యున్నదియు, పూర్వము జరిగిన కథావృత్తాంతము గలదానిని ఇతిహాసమని చెప్పు చున్నారు. మరియు ఇతిహాసము రెండురకములు, 1) పరక్రియ 2) పురా కల్పము అని. అందు ఒకేనాయకుడు గల్గినది పరక్రియ యనియు, అనేకమంది నాయకులు గలది పురాకల్పమనియు చెప్పబడుచున్నది.

♦ లేఖకో భారతస్యాస్య గణనాథోఽభవత్స్వయం
షష్టిం శతసహస్రాణి చకారాన్యాం స సంహితాం॥ 14

---

అపిచ॥ భవిష్యత్పురాణే బ్రాహ్మపర్వే ప్రథమాధ్యాయే శ్లో॥ చతుర్ణామపి వర్ణానాం పావనాయ మహాత్మనామ్। యథాస్వాదు చ పత్థ్యంచ దద్యాత్స్వం భిషగౌషధం తథా రమ్యం చ శాస్త్రంచ భారతం కృతవాన్మునిః। ధర్మార్థకామమోక్షాణాం భారతాత్సిద్ధిరేవహి॥ ఇతి॥

♦వ్యా:- నను ప్రాచీనయుగే భారతవర్షే లేఖారూపాక్షరాభావాత్ కథమత్ర గణపతిః భారతం విలిఖితవానిత్యుక్తిః సంగచ్ఛతేతి చేదుచ్యతే॥ 24సంఖ్యాక మహాయుగాంతర్గత రామాయణే॥ సుందరకాండే॥ శ్లో॥వానరోహం మహాభాగే దూతో రామస్య ధీమతః। రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగులీయకం॥ ఇతి॥ స్కాందే ధర్మారణ్యఖండే. 34 అధ్యాయే॥ తథైవ పాద్మే రామాశ్వమేధే 110 అధ్యాయే చ॥ శ్లో॥ బబంధ భాస్వరం పత్రం తప్తహాటకనిర్మితం। తత్రాఽలిఖద్దాశరథేః ప్రతాపబలమూర్జితం॥ ఇతి॥

14 ఈ మహాభారతమునకు విఘ్నేశ్వరుడే స్వయముగా లేఖకు డాయెను. ఆవేదవ్యాసమహర్షి 10 లక్షల గ్రంథప్రమాణముగల మరియొక సంహితాగ్రంథమును రచించెను.

---

పరక్రియకు రామాయణమును పురాకల్పమను దానికి మహాభారతమును ఉదాహరణములని ఎరుంగునది,

మరియు భవిష్యత్పురాణమున బ్రహ్మపర్వములో ప్రథమాధ్యాయ మున ఇట్లు గలదు. వ్యాసమహాముని బ్రాహ్మణాది నాలుగువర్ణముల వారును, తరించుటకొరకు మహాత్ములగు ధర్మరాజాదుల యొక్క చరి త్రను వైద్యుడు రుచికరమైనట్టియు హితకరమైన ఔషధము నొసంగు నట్లు మనోహరమును శాసించినదియు నగు నీమహాభారతమును నిర్మిం చెను. ధర్మార్థకామమోక్షము లనెడిచతుర్విధ పురుషార్థములును భారతము నుండియే సిద్ధించుచున్నవి. అని

• వ్యా॥ ఓయీ! ప్రాచీనయుగమునందు భారతదేశమున లేఖారూప మైన అక్షరములు లేకపోవుటచే ఇచ్చట గణపతి భారతమును వ్రాసెను, అని చెప్పుట ఎట్లు సంగతమగును అని పూర్వపక్షము రాగా సమా ధానము చెప్పబడుచున్నది 24వ మహాయుగమున జరిగిన రామాయణ మున సుందరకాండయందు ఓతల్లీ! నేను వానరుడను రామదూతను రామనామముతో కూడిన ఈ ఉంగరమును చూడుము అని గలదు. స్కాందపురాణమున ధర్మారణ్యకాండలో 34వ అధ్యాయమునందునూ అట్లే పద్మపురాణమున రామాశ్వమేధమునందు 110వ అధ్యాయమున బంగారముతో చేయబడిన ప్రకాశించు నొక పత్రము గుఱ్ఱమునకు కట్ట బడెను. ఆపత్రమున శ్రీరామచంద్రుని గొప్పతనము ప్రతాపము, బలము వ్రాయబడెను. అని కలదు.

త్రింశచ్ఛతసహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితం।
పిత్ర్యే పంచదశ ప్రోక్తం గంధర్వేషు చతుర్దశ॥ 15

ఏకం శతసహస్రం తు మానుషేషు ప్రతిష్ఠితం 16

నారదో శ్రావయద్దేవా నసితో దేవలః పితౄన్।
గంధర్వ యక్షరక్షాంసి శ్రావయామాస వై శుకః॥ 17

పారిక్షితం మానుషంస్తు వైశంపాయన ఉక్తవాన్॥
సర్పసత్రే మహాయాగే చాస్తీకేన భ్యాగతే నృపం।
యాచమానే క్రతుత్యాగం తతోస్మిన్ మహాద్వహే॥ 18

భగవానాగత స్సత్రం వ్యాసః పారిక్షితస్య వై।
వివేశ సహిత శ్శిష్యై ర్వేదవేదాంగ పారగైః 19

---

అస్మిన్ భారతేపి ద్రోణపర్వణి 43 అధ్యాయే॥ శ్లో॥ రథమార్గప్రమాణం తు కౌంతేయో నిశితై శ్శరైః। చకార తత్ర పంథానం యయౌ యేన జనార్దనః। తేతు నామవతాః పీతాః కాలజ్వాలనసన్నిభాః। ఇతిచ దృశ్యమానత్వాత్ లేఖనం పూర్వకాలే ప్యస్త్యేవ.

15 అందులో 30 లక్షల గ్రంథము దేవలోకమునం దుంచబడెను. 15 లక్షల గ్రంథము పితృలోకము నందును, 14లక్షల గ్రంథము గంధర్వుల యందును ఉంచబడినది.

16 ఒక లక్షప్రమాణము గల గ్రంథము మాత్రము మనుష్యలోకము నందు ఉంచబడినది.

17 దేవతలకు నారదుడు వినిపించెను. దేవలుడు పితృదేవతలకు విని పించెను. గంధర్వులకును యక్ష రక్షస్సులకును శుకుడు వినిపిం చెను.

18 పరీక్షన్మహారాజుపుత్రుడైన జనమేజయుని గూర్చి వైశంపాయన మహర్షి మానుషలోకమందలి భారతమును చెప్పినవాడాయెను. అదెప్పుడన జనమేజయుని సర్పయాగమందు ఆస్తీకుడు వచ్చి క్రతువును విరమించవలెనని కోరగా ఆలాగేనని కురుశ్రేష్ఠు డైన జనమేజయుడు అంగీకరించిన తరువాత

19 భగవంతుడైన వేదవ్యాసమహర్షి వేదవేదాంగ పారగులైన శిష్యు లతో కూడినవాడై జనమేజయుని సర్పసత్రయాగమును గూర్చి వచ్చెను.

---

ఈభారతమందును ద్రోణపర్వములో 43వ అధ్యాయమున అర్జు నుడు వాడియైన బాణములచే రథమార్గము యొక్క ప్రమాణమును రచిం చెను, ఆమార్గము ననుసరించియే శ్రీకృష్ణుడుగూడ వెళ్ళెను. ఆబాణ ములు స్వనామాంకితములును పచ్చటివియు ప్రళయకాలమునందలి అగ్ని హోత్రునితో సమానమైనవిగా ఉండెను," అని యుండుటచే పూర్వకాల మందును వ్రాత ఉన్నదియే.

తతస్తు సహిత స్సర్వై స్సదస్యై ర్జనమేజయః।
ఇదం పశ్చాన్మునిశ్రేష్ఠం పర్యపృచ్ఛ త్కృతాంజలిః॥ 20

పితామహానాం సర్వేషాం దైవేనావిష్టచేతసాం।
కార్త్స్న్యేన నేతన్మమాచక్ష్వ యథావృత్తం ద్విజోత్తమ॥ 21

తస్య తద్వచనం శ్రుత్వా కృష్ణద్వైపాయన స్తదా।
శశాస శిష్య మాసీనం వైశంపాయన మంతికే॥ 22

తదస్మై సర్వమాచక్ష్వ యన్మత్త శ్శ్రుతవానసి 23

గురోర్వచన మాజ్ఞాయ సతు విప్రర్షభ స్తదా।
ఆచచక్షే తత స్సర్వ మితిహాసం పురాతనం॥ 24

వైశంపాయనః।

ఇదం శతసహస్రంహి శ్లోకానాం పుణ్యకర్మణాం।
సత్యవత్యాత్మజేనేహ వ్యాఖ్యాత మమితౌజసా॥ 25

---

వ్యా॥ వ్యాసస్య పూర్వజన్మవిషయే మహాభారతే. శాంతి 350అ॥ జనమేజయవాక్యం॥ జనమేజయః శ్లో॥ కిమతః పూర్వజం జన్మ వ్యాసస్యామితతేజసః వైశంపాయనః॥ శ్లో॥ పురా బ్రహ్మ జగత్స్రష్టా భోశబ్దే నానునాదయన్।

20 అప్పుడు జనమేజయుడు అక్కడి సమస్త సభ్యులతో కూడి దోసిలి యొగ్గి ఈవిధముగా ప్రశ్నించెను.

21 ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! పురాకృతకర్మచే ఆవరింపబడిన నాపితా మహులయొక్క వృత్తాంతమును జరిగినది జరిగినట్లు నాకుచెప్ప కోరెదను.

22 ఆజనమేజయుని వాక్యమును విని కృష్ణద్వైపాయనుడు తన సమీప మందున్న వైశంపాయనుని ఆదేశించెను.

23 ఈవిధముగా ప్రార్థించుచున్న వీనికి నానుండి నీవు విన్న భారత వృత్తాంతము నంతయు చెప్పుమని ఆదేశించెను.

24 ఇట్టి గురువచనమును శిరసావహించి విప్రశ్రేష్ఠుడగు ఆవైశం పాయనుడు పురాతనమైన భారతేతిహాసము నంతను జనమే జయునికి చెప్పెను.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

* 25 ఈగ్రంథము పుణ్యకర్ములయిన కౌరవ, పాండవుల యొక్క చరి త్రతో గూడినట్టిది. ఇది లక్షగ్రంథాత్మకమైనది గొప్ప తేజ శ్శాలియు సత్యవతీపుత్రుడును నగు వ్యాసుని చేతనే ఈలోకము నందు ప్రచురింపజేయబడినది.

---

* వ్యా॥ వ్యాసుని పూర్వజన్మవిషయమున మహాభారతమందలి శాంతి 350వ అధ్యాయమున జనమేజయుని వాక్యమిట్లు కలదు. జనమే జయుడు అడుగుచున్నాడు మిక్కిలి తేజశ్శాలియగు వ్యాసుని పూర్వజన్మ మేమి? వైశంపాయనుడిట్లు చెప్పెను. పూర్వకాలమున జగత్స్రష్ట

త్రిభి ర్వర్షై ర్లబ్ధకామః కృష్ణద్వైపాయనో మునిః।
తపోనియమ మాస్థాయ కృతమేత న్మహర్షిణా॥ 26

భూతస్థానాని సర్వాణి రహస్యం త్రివిధం చ యత్।
లోకయాత్రా విధానం చ సర్వం దదృష్టవా నృషిః॥ 27

---

సరస్వతీ ముచ్చచార తత స్సారస్వతోఽభవత్। అపాంతర తమా నామ సుతో వాక్సంభవః ప్రభుః। భూతభవ్యభవిష్యజ్ఞః సత్యవాదీ దృఢవ్రతః। తము వాచ నతం మూర్ధ్నా దేవానా మాది రవ్యయః। వేదాఖ్యానే శ్రుతిః కార్యా త్వయా మతిమతాం వర॥

పున ర్ద్వాపస్వాతే ప్రాప్తే కురవో నామ భారతాః। భవిష్యంతి మహాత్మానో రాజానః ప్రథితా భువి। తేషాం త్వత్తః ప్రసూతానాం కులభేదో భవిష్యతి। వసిష్ఠజో మహాయోగీ భవిష్యతి పరాశరః। తన్నిమిత్తీకృత్య సంజాతః ప్రకరిష్యసి భారతం। ఏవం సాంస్వతమృషి మపాంతరమం విధిః। ఉక్త స్తస్య ప్రసాదేన దేవస్య హరిమేధసః। అపాంతర తమో నామ జాతపూర్వం స ఏవహి। కృష్ణద్వైపాయనో విష్ణురాతః కాళ్యాం పరాశరాత్।

26. మూడు సంవత్సరములు వ్యాసుడు తపోనియమమును పొంది ఈ వృత్తాంతమున రహస్యమైనదియు, ప్రకాశమైనదియు, మనోగతమైనదియు, సర్వము తెలుసుకొని మహర్షిచే ఈ గ్రంథము రచించబడినది.

27. జీవుల భూతభవిష్యస్థానములను మూడు విధములైన రహస్యములను లోకవృత్తాంతము నంతను ఋషియగు వ్యాసుడు చూచినవాడాయెను.

---

యగు బ్రహ్మదేవుడు వేదము నుచ్చరించుచు "భో" అనుశబ్దముధ్వనింపచేసెను. అప్పుడు అపాంతరతమా అనుపేరుగల వాక్నుండిపుట్టిన కుమారుడు ఉద్భవించెను. అతడు భూతభవిష్యద్ వర్తమానముల నెరింగినవాడును, సత్యవాక్కు గలవాడును, దృఢమైనవ్రతము గలవాడును ఆయెను. తనకు నమస్కరించుచున్న అట్టి కుమారుని గూర్చి బ్రహ్మదేవుడిట్లు నుడివెను. ఓబుద్ధిమంతుడా! వేదములను చెప్పుట నీవల్ల శ్రవణము చేయదగి యున్నది.

మరియు వైవస్వతమన్వంతరము రాగా కురువంశీయులగు భారత రాజులు పుట్టగలరు వారు గొప్పవారును, లోకమునందు ప్రసిద్ధినొందినవారును కాగలరు నీనుండిబుట్టిన వారలకు విరోధము సంభవించును. వసిష్ట మహర్షినుండి పరాశరుడను మహర్షియు సంభవింపగలడు వానిని నిమిత్తముగా చేసుకొని పుట్టి నీవు భారతమును రచింపగలవు. ఈవిధముగా సరస్వతీకుమారుడైన అపాంతరతమ ఋషినిగూర్చి బ్రహ్మదేవుడు చెప్పెను. ఆవిధముగా బ్రహ్మ అనుగ్రహముచే అపాంతరతమ ఋషియే హరియంశచే మరల వ్యాసుడుగా అవతరించెను. ఈవిధముగా విష్ణువే సత్యవతీదేవియందు కృష్ణద్వైపాయనుడుగా పరాశరమహర్షివలన ఉద్భవించిన వాడాయెను.

స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతి గోచరా।
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భవేదిహ॥ 28

అభక్తానా మనర్హాణాం సచ్ఛాస్త్రం శ్రూయతేపి వా।
అన్యథా ప్రతిభ త్యేవ విషాక్తానాం యథా పయః॥ 29

ఇతి భారత మాఖ్యానం కృపయా మునినా కృతం॥ 30

1 అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీ సుతః।
భారతాఖ్యాన మకరో ద్వేదార్థై రుపబృంహితం।
లక్షైకేన తత్రోక్తం ద్వాపరాంతే మహాత్మనా। 31

2 లక్షంతు చతురో వేదా లక్షం భారతమేవ చ
3 ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ।
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్॥ 32

పురాణాని చతుర్లక్షా ణ్యేతాని ధరణీతలే।
తథా మహాభారతం చ లక్షసంఖ్యా ప్రకీర్తితం॥ 33

---

1) ఆది ప 60 అ, 2) ఆది ప 62 అ. 3) భాగ 1 స్కం 3 అధ్యా॥

28. స్త్రీలకును. శూద్రులకును, పతితులగు ద్విజులకును శ్రుతివినరానిది శ్రేయోదాయకమైన కర్మను ఎరుగనట్టి వీరలకు ఈభారతమూల మున శ్రేయస్సు కలుగుగాక యని మహర్షిచే రచింపబడినది,

29, భక్తులు కానివారలకును, అనర్హులకును యోగ్యమగు శాస్త్రము విని పించ కూడదు అట్లు వినిపించిన అది వారలకు విషాక్రాంతులకు పాలువలే మరియొకవిధముగా భాసించునేగాని దానినుండి వారు సత్ప్రయోజనమును పొందజాలరు,

30, ఈవిధముగా నాలోచించి పరమకృపాళువైన వ్యాసునిచే ఈ భార తేతిహాసము రచింపబడినది,

31, సత్యవతీసుతుడగు వ్యాసుడు అష్టాదశపురాణములను రచించెను· ద్వాపరాంతమున వానిచేతనే వేదార్థములతో ఉపబృంహితమగు ఈ మహాభారతగ్రంధము లక్షగ్రంథ ప్రమాణముగ చెప్పబడినది.

32. నాలుగువేదములున్నూ, లక్షగంధప్రమాణము కలవి, ఈ మహా, భారతమునూ లక్షగ్రంథప్రమాణము కలదియే. ధర్మవిషయమునను, అర్ధవిషయమునను, కామవిషయమునను, మోక్ష విషయమునను ఇచ్చట ఉన్నదియే ఇతర గ్రంథములందు కలదు, ఇచ్చట లేనివిష యము మరెచ్చటనూ లేదు.

33. ఈభూలోకమందలి పురాణములన్నియు నాలుగులక్షల గ్రంథప్రమా ణము కలవి. అట్లే ఈలోకమందలి ఈమహాభారతమునూ లక్ష గ్రంథప్రమాణసంఖ్య కలదిగా చెప్పబడినది.

♦ రాజోపరిచరో నామ ధర్మనిత్యో మహీపతిః।
సంపూజితో మఘవతా వసుశ్చేదీశ్వరో నృపః॥ 34

* చకార పత్నీం కన్యాం తు తథా తాం గిరికాం నృప।

---

♦ వ్యా॥ మహాభారతే శాంతిపర్వణి 338 ఆధ్యాయే శ్లో॥ భీష్మ॥ దేవానాంచ ఋషీణాం చ పశ్వాలంభే మతం శ్రుణు అజేన యష్టవ్యమితి ప్రాహుర్దేవా ద్విజోత్తమాన్ సచ ఛాగో హ్యజో జ్ఞేయో నాన్యః పశురితి స్థితిః। ఋషయ ఊచుః। బీజై ర్యజ్ఞేషు యష్టవ్యమితి వై వైదికీ శ్రుతిః। అజ సంజ్ఞాని బీజాని ఛాగం నో హన్తుమర్హథ। దేవానాంహి మతం జ్ఞాత్వా వసునా పక్షసంశ్రయాత్।

ఛాగేనాజేన యష్టవ్య మేవముక్తం వచస్తదా। ఋషిశాపాచ్చ వై జాతః రాజోపరిచరస్తదా। తస్య చేంద్రో దదా యానం తేనోపరిచరో హ్యభూత్॥

* వ్యా॥ రాజోపరిచరో నామ గతోసౌ మృగయాం వనం। తస్య భార్యా సుశీలాన్వై గృహే జాతా రజస్వలా। నిజదాసీ తయా రాజ్ఞే ప్రేషితా వల్లభం ప్రతి॥ శ్యైనరుపా చ సా జాతా గతా సా వల్లభం ప్రతి॥

• 34. పూర్వము ఉపరిచరవసువు అను పేరుగల రాజు గలడు అత డెల్లప్పుడూ ధర్మనిష్ఠుడు దేవేంద్రునిచే పూజింపబడినవాడు. ఆతడు చేదిదేశమునకు ప్రభువు.

• 35 ఆరాజు గిరిక యను పేరుగల కన్యను వివాహమాడెను. ఒకానొక

• వ్యా॥ మహాభారతమున శాంతిపర్వమునందు 338 అధ్యాయమున ఇల్లు గాధు, భీష్ముడు చెప్పుచున్నాడు. యజ్ఞమున పశ్వాలంభన విషయమున దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, అభిప్రాయములను వినుడు, దేవతలు మేకను హోమము చేయవలసినదని బ్రాహ్మణులను గూర్చి చెప్పిరి, అజమనగా ఛాగమే [ అనగా మేకయే ] మరియొక పశువు గాదు. అని వారి సిద్ధాంతము. ఋషులీవిధముగా జెప్పిరి ధాన్యములచే యజ్ఞములయందు హోమము చేయదగినది. అను వేద శ్రుతి కలదు. అందువలన అజా అను పేరుగల బీజములే హోమము చేయదగినవి. ఛాగమును చంపుట తగదు.

ఈవిధముగా ఉభయుల అభిప్రాయములనూ విని వసువనువాడు దేవతలమతమును ఆశ్రయించి పక్షపాతముచే మేకయే హోమము చేయదగినదని సిద్ధాంతీకరించెను. అందుచే ఋషిశాపమున ఉపరిచరవసువు అనుపేరుతో భూలోకమున పుట్టెను వానికి ఇంద్రుడు ఒక విమానము నొసంగెను. దానిచే వారాజు ఆకాశమున సంచరించుటచే ఉపరిచరవసువను నామము కలవాడాయెను.

• వ్యా॥ ఉపరిచరవసువను రాజు వేటాడుటకై వనమునకు వెళ్ళను పతివ్రత యగు నాతని భార్య గృహమునందున్నదై రజస్వల యాయెను ఆమె ఈవిషయమును రాజునకు చెప్పుటకై తనదాసిని ఆమహారాజు వద్దకు పంపెను. ఆదాసియు దేగరూపమును ధరించి అతని వద్దకు వచ్చెను.

చచార మృగయాం కామీ గిరికామేవ సంస్మరన్ 35

తస్య రేతః ప్రచస్కంద చరతో గహనే వనే।
స్వీయశ్యేనేన తద్రాజా భార్యాయై ప్రేషిత స్తదా। 36

తమపశ్య దధాయాంతం శ్యేనం శ్యేన స్తథాపరః।
యుధ్యతో రపత ద్రేత స్తచ్చాపి యమునాంభసి॥ 37

తత్రాద్రికేతి విఖ్యాతా బ్రహ్మశాపా ద్వరాప్సరా।
మీనభావ మనుప్రాప్తా జగ్రాహామిషశంకయా॥ 38

కదాచిదపి మత్సీం తాం బబంధు ర్మత్స్యజీవినః।
గర్భిణీ మద్రికాం కాంత్యా దాశాః ప్రభు మథార్పయత్। 39

మాసేచ దశమే ప్రాప్తే తదా భరతసత్తమ।
*ఉజ్జహ్రా రుదరాత్తస్యాః స్త్రీపుమాంసం చ మానుషం॥ 40

---

*వ్యా॥ స్కాందే, బ్రహ్మోత్తర ఖండే 19 అధ్యా। శ్లో॥ ఈశ్వరస్య వశే మాయా తస్య కో వేత్తి చేష్టితం। మునే ర్విభండకస్యాపి శుక్రం పీత్వా సహాంభసా। హరిణీ గర్భిణీ భూత్వా ఋష్యశృంగ మసూయత। తథైవ మహిషీ గర్భా జ్ఞాతశ్చ మహిషాసురః॥

ప్పుడు ఆభార్యనే స్మరించుచు కాముకుడైన యాతడు వేటాడ వెళ్ళెను.

36. రమణీయమైన వనమునందు విహరించుచున్న ఆమహారాజునకు రేతస్ఖలన మాయెను. ఆరేతస్సును ఒక దొప్పలో ఉంచి డేగతో తనభార్యనుగూర్చి పంపెను.

37. ఆదొప్పను గ్రహించి ఆకాశమున వచ్చుచున్న ఈడేగను మరి యొక డేగ మాంసమను భ్రాంతిచే ఎదుర్కొనెను ఈవిధముగా అవిరెండు పోరాడుకొనుచుండగా ఆరేతస్సు యమునానది ఉదకము నందు పడిపోయెను.

38. ఆ యమునోదకమున అద్రిక యను అప్సరస్త్రీ బ్రహ్మశాపము వలన చేపగా ఉండి మాంసమను భ్రాంతితో ఆరేతస్సును మింగెను.

39. ఒకానొకప్పుడు జాలరులు కొంతమంది దానిని పట్టుకొనిరి ఆజాల రులు గర్భవతియైన ఆ యద్రికను తమ ప్రభువగు ఉపరిచరవసు రాజున కప్పగించిరి.

• 40. పదవమాసము రాగా ఆచేప గర్భమునుండి మనుష్యాకారముగల ఒక పురుషుదును, ఒక స్త్రీను నుద్భవించిరి.

---

• వ్యా॥ స్కాంద పురాణమున బ్రహ్మోత్తర ఖండమున 10వ అధ్యాయమున ఇట్లుకలదు. మాయయనునది ఈశ్వరుని వశము నందున్నది. ఈశ్వరుని చేష్టను ఎవడెరుగ గలడు విభండక మహర్షియొక్క రేతస్సును నీటితోతాగి లేడి గర్భమును ధరించినదై ఋష్యశృంగుని కనెను. అట్లే మహిషాసురుడు గేదెకడుపు నుండి పుట్టెను.

సాప్సరా శాపనిర్ముక్తా స్వర్లోకం ప్రజగామహ।
తయోః పుమాంసం జగ్రాహ రాజోపరిచర స్తథా।
స మత్స్యో నామ రాజాసీ ద్ధార్మిక స్సత్యసంగరః॥ 41

*సా కన్యా దుహితా తస్యా మత్స్యా మత్స్యసుగంధినీ।
రాజ్ఞా దత్తా చ దాశాయ కన్యేయం తే భవత్వితి॥ 42

---

*వ్యా॥ సను॥ శ్లో॥ అస్మాకం మానసీం కన్యా మస్మచ్ఛా పేన వాసవీం। ఇతి। భా. ఆది ప. 64 అధ్యాయస్థపితౄణాం వచనేన పునః॥ శ్లో॥ అపత్యం చైతదార్యస్య యో యుష్మాకం సమో గుణైః॥ ఇతి॥ భా॥ ఆది॥ 100 అధ్యాయస్థ భీష్మంప్రతి దాశరాజవచనేన చ (మత్స్యగంధి) సత్యవతి పితౄణాం మానసీ కన్యా। శాపవశా ద్వసురాజవీర్యజా। వాసవీతి సిధ్యతి॥ తత్ర కథం॥ శంతనో ర్దాశకన్యాయాం జజ్ఞే చిత్రాంగద స్సుతః॥ ఇతి॥ వ్యాసః కైవర్తకన్యాయాం॥ ఇతి వాక్యార్థ సిద్ధి రితిచే చ్ఛృణు॥

జానకీశబ్దవత్। కైవర్తైః పాలితాకిల। అతో దాశ కన్యేతి ప్రసిద్ధిః లోకే ఇతి జ్ఞేయం॥

శ్లో॥ బుద్ధిర్యథావిధా యస్య స తథా మన్యతే జగ దితి పద్మపురాణవచనాత్। లోకే తావత్ కేచన పండిత మ్మన్యా వాల్మీకి వ్యాసయోః నిషాదత్వపారశవత్వచండాల

41. అద్రిక యను అప్సరసయు శాపవిముక్తురాగా స్వర్గలోకమున కేగెను. వారిరువురిలో పురుషుని ఉపరిచరవసువు కుమారునిగ గ్రహించెను. అతడే మత్స్యరాజను పేరుగల వాడాయెను. అతడు మిక్కిలి ధార్మికుడును వీరుడును, ఆయెను.

• 42. చేపనుండి బుట్టిన మత్స్యగంధముగల ఆకన్యకయు ఉపరిచర వసువుచే దాశరాజునకు కుమార్తెగా నీయబడెను.

---

•వ్యా॥ భారతము ఆదిపర్వ 61వఅధ్యాయమున పితృదేవతలవచన మిట్లు కలదు ఈసత్యవతి మాయొక్క మనస్సుచే సృష్టింపబడిన కన్యక మాశాపముచేతనే వసురాజ కన్యకగా అవతరించినది, అని కలదు. మరియు భార ఆది 100 అ దాశరాజు వచనం ఈమె ఉపరిచర వసువుయొక్క కుమార్తె మీతో గుణములతో సమానమైనది. అని చెప్పు టచే సత్యవతి పితృదేవతల మానస కన్య శాపమువలన వసురాజ వీర్యముచే బుట్టుటచె వాసవియనియు సిద్ధించుచుండగా శంతనమహారాజు వలన దాశకన్యయందు చిత్రాంగదుడు పుట్టెను. వల్లెకన్యయందు పరా శరుని వలన వ్యాసుడు జనించెను. అనునదెట్లు సిద్ధించునని శంకరాగా సమాధానము చెప్పబడు చున్నది.

సీతాదేవి భూమినుండి పుట్టినదైనను జనకునిచే పాలింపబడుటచే జానకియని వ్యవహరింపబడుచున్నది గదా! అట్లే సత్యవతియు వసు రాజపుత్రియైనను పల్లెవాడగు దాశరాజుచే పాలింపబడుటచే దాశకన్య యనియు, పల్లెపడుచు అనియు వ్యవహరింప బడుచున్నది.

ఎవని బుద్ధి ఎటువంటిదో వానికి జగత్తంతయు నట్లే తోచును అనెడి పురాణవచనము ననుసరించి లోకమునందు కొందరు పండితం మన్యులు వాల్మీకి నిషాదుడనియు వ్యాసుడు చండాలుడనియు కల్పించి

త్వాదీన్ ప్రకల్ప్య జల్పితుం న బిభ్యతి॥

తథాహి॥ శ్లో॥ వ్యాసాదీన్ కవిపుంగవాన్ సనుచితైర్వాక్యైస్సలీలం హసన్నుచ్చైర్జల్పన్నిమీల్యలోచనయుగం శ్లోకాన్ సగర్వం పఠన్। కావ్యం ధిక్కురు యత్పరైఃవిరచితం స్వార్థస్య సార్థం బుధైః యద్వ్యర్థార్థ కుసే శ్రుతేన రహితః పాండిత్యమాప్తుం బలాదితి। మహాజనగృహీతశ్లోకం సార్థకం కుర్వంతి.

తదేవోక్తం భారతే, ఆది॥ ప 74 అధ్యాయే॥ శ్లో॥ అన్యాన్ పరివదన్ సాధుర్యథాహి పరితప్యతే। తథా పరివదన్నన్యాన్ తుష్టోభవతి దుర్జనః। అభివాద్య యథా వృద్ధాన్ సంతో గచ్ఛంతి నిర్వృతిం ఏవం సజ్జన మాకృశ్య మూర్ఖో భవత నిర్వృత ఇతి॥

అతఏవ॥ నైవ స్థాణోరపరాధః యదేన మంధో నపశ్యతీతి పురుషాపరాధా త్సంభవతీ త్యాభణకవచనం॥ వాల్మీకినిషాదత్వనిరాకరణార్థ మల మిదం బ్రహ్మణైవ వక్తృ వాక్యం॥ శ్లో॥ అథాబ్రవీ న్మహాతేజా బ్రహ్మా లోకపితా మహః। వల్మీక ప్రభవో యస్మా త్తస్మా ద్వాల్మీకి రిత్యసౌ॥ ఇతి॥

వేదవ్యాస నిషాదత్వ పారవశ్యత్వ చండాలత్వ నిర్ణాయక ప్రతివాదినా మాధార శ్లోకః ఇదమేవ॥ శ్లో॥ నిషాద కన్యాద్రకన్యాయాం యః పారశవ ఉచ్యతే॥ఇతి॥

పలుకుటకు భయపడరు. ఈవిషయమే ఇట్లు చెప్పబడినది లోకములో నీవు విద్యారహితుడవై పాండిత్యగౌరవమును బలాత్కారముగ పొంద గోరుచో వ్యాసాది కవిపుంగవులను విలాసముగ ఎగతాళి చేయుము నేత్రములను మూసికొని ముందువెనుక లాలోచించక సగర్వముగ నోటికి వచ్చిన శ్లోకములను గట్టిగా పలుకుము ఇతరులచే రచింపబడిన కావ్యములను ధిక్కరించుము పండితులతో విరోధించుము అనెడి ఒకానొక పండితశ్లోకమును సార్థకము చేయుచున్నారు.

ఈవిషయమే భారతమున ఆదిపర్వమున 74వ అధ్యాయమున ఇట్లు చెప్పబడినది. "సాధువగువాడు ఇతరులను నిందించిఎట్లుపరితాపము నొందునో అట్లే దుర్జనుడు ఇతరులను నిందించుచు సంతుష్టుడగుచున్నాడు అట్లే సత్పురుషులుపెద్దలనునమస్కరించి ఎట్లు సంతోషము పొందుచున్నారో అట్లే మూర్ఖుడగువాడు సత్పురుషులను నిందించి సంతుష్టు డగుచున్నాడు. అని

అందువలననే గ్రుడ్డివాడు చూడక రాతిని తన్నెనన అది దాని అపరాధమా? అట్లే వారి మహిమల మనమెరుంగక వారిని నిందించుట మనకు లోటుగాని వారికే మాత్రమును లోపములేదు. వాల్మీకికి నిషాదత్వము లేదనుటకు ఈ క్రింద వ్రాయబోవు బ్రహ్మవైవర్తపురాణవచనము చాలును బ్రహ్మదేవుడు ఇట్లు పలికెను. ఈతడు వల్మీక [పుట్ట] మునుండి పుట్టిన వాడగుటచే వాల్మీకి యని ప్రసిద్ధినొందగలడు అని

వేదవ్యాసుడు నిషాదుడనియు, పారశవుడనియు, చండాలుడనియు చెప్పు ప్రతివాదులకు ఈశ్లోకమే ఆధారమైనది శూద్రకన్య యందు బ్రాహ్మణుని వలన బుట్టినవాడు నిషాదుడు పారశవుడు అని చెప్పెడి మనువచనమే. అచ్చట మను అభిప్రాయ మేమన వివాహితయైన దాశ

సాతు సత్యవతీ నామ మత్స్యఘాత్యభిసంశ్రయాత్।
శుశ్రూషార్థం పితుర్నావం వాహయంతీం జలే స్థితాం॥ 43

తీర్థయాత్రాం పరిక్రామ న్నపశ్యద్వై పరాశరః॥
సచాస్యై భగవా న్ప్రీతో ద్వరాన్ కన్యాత్వ మాదితః
తస్యా యోజనగంధీతి గంధో నామాపరం స్మృతం॥ 44

---

తత్ర మనువచనార్థస్తు వివాహిత శూద్రదాశకన్యాసు వ్యభిచార వశాజ్జాతానాం విషయః॥ శాస్త్రవచన ముపయుజ్యతే॥

వ్యా॥ పరాశరాద్వ్యాసం ప్రసూయ సత్యవతీ కథంకన్యకాసీదితి ప్రశ్నే। తత్సమాధీయతే కాశికావ్యాఖ్యా పదమంజరీ వాక్యాదేవ॥ తథాహి॥ ౨. నిదేశతామాహరిత్యాస్యాశ్చ పుంయోగేపి స కన్యాత్వం జహాతి॥ యథా సత్యవతీ యథా కుంతీ॥ శాస్త్రోదాహరణాని [illegible]॥

పునశ్చ మనుస్మృతౌ॥ శ్లో॥ ధర్మవ్యతిక్రమో దృష్టో మహతాం సాహసం తథా। తదన్వీక్ష్య ప్రయుంజాన స్సీదత్యవరో ఽబలాత్॥ 'తేజోమయాని పూర్వేషాం శరీరాణీంద్రియాణి చ దోషైస్తే నోపలిప్యంతే పద్మపత్రమివాంభసా॥

40. సత్యవతి యనుపేరుగల మత్స్యగంధి యగు ఆకన్యక తండ్రికి శుశ్రూష చేయుచు నదియందు నావను నడుపుచుండెను.

* 41. తీర్థయాత్రాటనము చేయుచు అచ్చటికి వచ్చిన పరాశరమహర్షి ఆమెను గాంచెను. భగవంతుడగు ఆ మహర్షి ఆమెకు కన్యాత్వము యోజనగంధిత్వము మొదలుగాగల అనేకవరముల నొసగెను. అప్పటినుండియే ఆ సత్యవతికి యోజనగంధి యను మరియొక పేరు గూడా సంభవించినది.

---

కన్యయందును శూద్రకన్యయందును వ్యభిచారమువలన పుట్టినవారి విషయమై ఆవాక్యము ప్రవర్తించును. ఆవాక్యమున కిచ్చట ఉపయోగము లేదు.

* వ్యా॥ పరాశరునివలన వ్యాసుని కని మరల సత్యవతి ఎట్లు కన్యయాయెను? అని ప్రశ్న రాగా అచ్చట సమాధానము చెప్పబడుచున్నది. కాశికాగ్రంథ వ్యాఖ్యయగు పదమంజరి యందలి వాక్యమున ఇట్లు కలదు. మునీశ్వరుల యొక్కయు, దేవతల యొక్కయు మాహాత్మ్యము వలన పురుషసంయోగమును పొందియు కన్యాత్వమునకు హాని కలుగదు. ఇందులకు దృష్టాంతములు సత్యవతి, కుంతి, అందుననే కన్య యందు బుట్టినవారు కానీనుడని వ్యాసునకును, కర్ణునకును పేర్లు గలిగినవి. అవి

మరియు మనుస్మృతియందు గొప్పవారల విషయమున నచ్చట చ్చట ధర్మము నతిక్రమించుటయు, సాహసకృత్యము కనపడుచున్నది. దానిని చూచి మరియొక సామాన్యుడు మాహాత్మ్యము లేనివాడగుటచే అట్లు ప్రవర్తించినచో నశించును. పూర్వుల యొక్క శరీరములును, ఇంద్రియములును తేజోమయమైనవి. అందుచే వారిని దోషములు నీరు తామరాకునువలె అంటజాలవు. అని చెప్పబడి యున్నది.

ఆపస్తంబసూత్రం॥ దృష్టో ధర్మవ్యతిక్రమ స్సాహసం పూర్వేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే। తదన్వీక్ష్య ప్రయుంజాన స్సీదంత్యవరః॥ ఇతి॥

భోధాయనః॥ శ్లో॥ అనుష్ఠితం తు యద్దేవై ర్మునిభి ర్యదనుష్ఠితం। నానుష్ఠేయం మనుష్యై స్తదుక్తం కర్మ సమాచరేత్ ॥

మహాభారతానుశాసనిక ప 53 అ॥ శ్లో॥ తపోజ్ఞాన సమాయుక్తాః కృతత్రేతాయుగే నరాః ద్వాపరే చ కలౌ నృణాం శక్తిహాసి ర్వినిర్మితా। సంకల్పేన కృతాః పుత్రాః ఋషిభిర్వై పురాతనైః నశక్యం తేఽధునా కర్తుం శక్తి హీనై ర్నరై రితి॥ 'కిమప్యత్రాభిజాయంతే యోగిన స్సర్వ యోనిషు॥ ప్రత్యక్షితాత్మనాథానాం నైషాచింత్యం కులాదికం॥ ఈశం త్యాత్మన ఇత్యేతే గతిశ్చైషాం న సజ్జతే। బ్రహ్మభూయాంస ఇత్యేవ ఋషయ శ్శ్రుతిచోదితాః॥ నిందార్యా నచైతే రాజేంద్ర ప్రమాణం హి ప్రమాణినాం లోకానుమన్యతే చైతా ప్రమాణం హ్యత్ర వై తపః॥ ఏవం మహాత్మభిస్తాత తపోజ్ఞానసమన్వితైః ప్రవర్తితాని కార్యాణి ప్రమాణాన్యేవ సత్తమ॥ తస్మాత్ర చింతా

ఆపస్తంబసూత్రమునందును, పూర్వుల చరిత్రలలో నచ్చటచ్చట ధర్మము నతిక్రమించుటయు సాహసమును కన్పట్టుచున్నవి. వారి తేజో విశేషముచే వారికి పాపము లేదు. అది జూచి అట్లాచరించిన ఇతరుడు నశించుచున్నాడు. అని కలదు.

బోధాయనమహర్షి " దేవతలచేత ఏది చేయబడినదో, మునులచే ఎద్ది ఆచరింపబడినదో అట్టి సాహసకృత్యము మనుష్యులచే నాచరింప తగనిది, వారిచే బోధింపబడిన ధర్మాదికర్మలను మాత్రమే మన మాచరింప వలయును. అని చెప్పెను. భారతమున ఆనుశాసనికపర్వ " 53 వ అధ్యాయమున ఇట్లు చెప్పబడినది. కృత, త్రేతాయుగములందు మనుష్యలు తపస్సుతోను, జ్ఞానముతోను కూడియున్నవారలు ద్వాపరయుగమునందును కలియుగమునందును మనుష్యులకు సామర్థ్యహాని చేయబడినది. పురాతనులగు ఋషులచే సంకల్పమాత్రముచేతనే పుత్రులు పుట్టింపబడిరి. ఇప్పుడు తగ్గిపోయిన శక్తిగల నరులచే ఆ విధముగా చేయ శక్తి లేదు గదా ! ఈ కాలమున ఎచ్చటను యోగిపుంగవులగువారు పుట్టుటలేదు గదా ! పూర్వకాలమున గల మహర్షులు ప్రత్యక్షము చేసుకొనబడిన ఆత్మస్వరూపము గలవారగుటచే వారి కుల, జన్మాదులను గూర్చి విచారించ పనిలేదు. వారలు ఆత్మజ్ఞానులగుటచే వారి కర్మచే వారికి లేపము లేదు. స్వర్గాదిలోకహానియు వారికి కలుగజాలదు. ఏలనన వేదమునందు ప్రతిపాదింపబడిన ఋషులందరు బ్రహ్మజ్ఞానులే గదా ! వారలు రాజశ్రేష్ఠా ! ఎన్నటికిని నిందించ తగినవారు కారు. వారలు ప్రమాణభూతమైన శృత్యాదులకును ప్రమాణభూతులు కదా ! వారలు లోకమును అనుగ్రహించు చున్నారు. వారియొక్క తపశ్శక్తియే అందులకు ప్రమాణమైనది. ఈ విధముగా తపోజ్ఞానవిష్ఠులగు మహాత్ములచే ప్రవర్తింప జేయబడిన కార్యములే మనకు పరమప్రమాణములు.

అనగా మహాత్ములు యొక్క జన్మవిషయములు [illegible]

కర్తవ్యా మహర్షీణాం సముద్భవే॥ యథా సర్వగతో హ్యగ్ని స్తథా తేజో మహాత్మనాం॥ ఇతి॥

2) కానీనః కర్ణ ఇతిచ॥ తథాచ వ్యాకరణం। కన్యాయాః కనీన చ॥ఇతి॥

అత్రతు కన్యాయాం జాతః కానీన ఏవ తదపి వర ప్రదానరూపేణ ప్రాప్తం నదూష్యం భవతి। సాధారణతయో త్పన్నశిశూనా మేతల్లక్షణా భావాత్।

నను॥ వేదవ్యాసో బ్రాహ్మణశ్చేత్ సితవర్ణో భవి తవ్యః। తద్విపరీతతయా వ్యాసో నీలవర్ణవత్వా చ్ఛూద్రః। నిషాదః, కిం పునః హేమాద్రివచనాత్ షోడశవిధచండా లానాం మధ్యే ఏక ఇత్యత్ర కిం సమాధీయత ఇతి చేత్, ఉచ్యతే॥

శ్లో॥ బ్రాహ్మణానాం సితో వర్ణః శూద్రాణా మసిత స్తదా। ఇత్యుక్త శ్లోకస్య నీలకంఠీయ వ్యాఖ్యా॥ వర్ణాః సాత్వికం, రాజసం, తామసం, మిశ్రంచేతి, స్వచ్ఛత్వాదిసా

చింత చేయదగదు. ఏ విధముగా అగ్ని సర్వగతుడై యుండునో మహాత్ముల తేజస్సు గూడ సర్వగతమై యుండును. ఆ ప్రతాములగు వారి కామ క్రోధాదులు లోకానుగ్రహమునకే గదా. అని చెప్పబడి యున్నది.

అట్లే కన్యయగు కుంతియందుద్భవించిన కర్ణుడును కానీనశబ్దముచే చెప్పబడుచున్నాడు వ్యాకరణ శాస్త్రమందును "కన్యాయాః కనీనచ" అని సూత్రము కలదు. దాని అర్థమేమన ఎవతె పూర్వమందును పుత్రుడు కలిగినతరువాతను కన్యయే యగునో ఆమె యందుద్భవించినవాడు కానీనుడని చెప్పబడును.

ఇచ్చట వ్యాసుడు కన్యయందు బుట్టినవాడు గాన కానీనుడే యగును. అదియు వరప్రదానరూపముగా ప్రాప్తించినది గాన నిందించదగినది కాదు. సాధారణముగా పుట్టిన పిల్లలయందు ఇట్టి స్వభావము (కన్యాత్వమును చెడగొట్టకుండుట) లేదుగదా !

ఓయీ ! వేదవ్యాసుడు బ్రాహ్మణుడగుచో తెల్లటి వర్ణముగలవాడై యుండవలసినది. దానికి విరుద్ధముగ నాతడు నీలవర్ణము గలవాడగుటచే శూద్రుడుగాని, నిషాదుడుగాని, లేక హేమాద్రివచనము ననుసరించి 16 విధములగు చండాలురలో ఒకడు కావలయును. అనెడి పూర్వపక్షము రాగా ఏమి సమాధానము చెప్పెదవు ? అనుచో సమాధానము చెప్పబడుచున్నది,

బ్రాహ్మణులకు తెలుపు వర్ణము, శూద్రులకు నలుపు వర్ణము అను శ్లోకమునకు నీలకంఠీయవ్యాఖ్య ఇట్లు కలదు. వర్ణమనగా నిచ్చట రంగు అను అర్థము కాదు. మరేమన సాత్వికము, రాజసము, తామసము మిశ్రమము అనెడి గుణములును వాటివలన కలుగు వృత్తులును ఇచ్చట వర్ణశబ్దముచే చెప్పబడుచున్నవి. బ్రాహ్మణునకు సితో వర్ణః అనగా తెల్లని

పరాశరేణ సంయుక్తా సద్యోగర్భం జుషావ సా।
జజ్ఞేచ యమునా ద్వీపే పారాశర్య స్స వీర్యవాన్॥ 45

1. జాతమాత్రశ్చ య స్సద్య ఇష్ట్వా దేహ మవీవృధత్
వేదాంశ్చాధి జగే సాంగాన్ సేతిహాసాన్ మహాయశాః 46

2. స మాతర మనుజ్ఞాప్య తప స్యేవ మనో దధా।
స్మృతోఽహం దర్శయిష్యామి కృత్యేష్వితి చ సోఽబ్రవీత్ 47

ఏవం ద్వైపాయనో జజ్ఞే సత్యవత్యాం పరాశరాత్
న్యస్తో ద్వీపేన యద్బాల స్తస్మా ద్వైపాయన స్స్మృతః 48

బ్రాహ్మణో బ్రాహ్మణానాం చ తథాఽనుగ్రహకాంక్షయా
వివ్యాస వేదాన్ యస్మాత్స తస్మా ద్వ్యాస ఇతి స్మృతః॥ 49

1) జాతో పరాశరా ద్యోగీ వాసవ్యాం కలయా హరేః। 50

---

మాంస్యాత్ గుణవృత్తం వర్ణశబ్దే నోచ్యతే॥ సితః స్వచ్ఛః సత్త్వగుణ ఇత్యాద దర్శనా దదోష ఇతి॥

1) ఆది 60అ॥ 2. ఆది 63అ॥

45. పరాశరునితో కూడిన ఆ సత్యవతియు వెంటనే గర్భమును ధరించి అప్పటి కప్పుడే తేజశ్శాలియునగు వ్యాసుని కనెను.

46. పుట్టిన వెంటనే నాతడు తన ఇచ్ఛానుసారము తన దేహమును పెంచెను. అంగములతో కూడినట్టియు, ఇతిహాసములతో కూడి నట్టియు సర్వవేదములను గానము చేసెను.

47. ఆతడు తల్లి అనుజ్ఞను పొంది తపస్సు చేయుటయందే మనో నిశ్చయము కలవాడయ్యెను. అవసరములగు కృత్యములయందు నీవు స్మరించినచో నీకు దర్శన మొసంగెదనని ఆతడు తల్లితో చెప్పెను.

48. ఈ విధముగా సత్యవతియందు పరాశరమహర్షి వలన ద్వైపాయను డుద్భవించెను. ఎందుచే ద్వీపమునందు ఉండబడెనో ఆకారణమున నాతడు ద్వైపాయనుడని చెప్పబడెను.

49. బ్రాహ్మణుడగు నాతడు బ్రాహ్మణులను అనుగ్రహించ కోరికతో వేదములను విభజించిన కారణమున వేదవ్యాసుడనియు చెప్పబడు చున్నాడు.

50. మహాయోగియగు నాతడు సాక్షాత్ శ్రీహరియొక్క అంశచే వసు రాజ పుత్రికయగు సత్యవతీ దేవియందు పరాశరమహర్షి వలన పుట్టిన వాడాయెను.

---

రంగు యని అర్థము గాక స్వచ్ఛమైన సత్వగుణమని చెప్పబడుటచే అట్టి సత్వగుణము బ్రాహ్మణుడగు వ్యాసునియందుండుటచే ఏ విరోధము లేదు కదా !

1 వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్।
సుమంతుం జైమినిం పైలం శుకంచైవ స్వమాత్మజం॥
ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవచ॥ 51

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే, ఆదిపర్వణి
ప్రథమోధ్యాయః సమాప్తః

# అథ ద్వితీయోధ్యాయః

*1. ఆదౌ సభారణ్యవిరాట ఉద్యమే
భీష్మే గురౌ సూర్యజ శల్య సాప్తికే।
స్త్రీ శాంతి దానాశ్వమఘాశ్రమస్థితో।
మౌసల్య యానమ్యగమే ఖిలేషు చ॥ 1

*వ్యా॥ఖిల మిత్యత్రనీల = వ్యాఖ్యా, భారతే ఆదిపర్వణి 2అధ్యాయే శ్లో॥ సమాసో భారతస్యాయమితి 85 శ్లోకాదారభ్య నీలకంఠీయవ్యాఖ్యాన శ్లోకాః॥

హరివంశః పురాణం ప్రాకృతవృత్తం పర్వ ఖిలసంజ్ఞితం। శాఖాంతరస్థం యదపేక్షావశాత్ పఠ్యతే తత్ ఖిలమితి వైదికీ సంజ్ఞా। యథా। బహ్వృచానాం శ్రీసూక్త మేధాసూక్తాదీనాం సంహితాకాలే పాఠో దృశ్యతే॥

1)భాగవతే 1స్కం॥4అ॥ 2. భారతనీలకంఠీయవ్యాఖ్యా

61. ప్రభువును, శ్రేష్ఠుడును, వరదుడును, నగు నా ద్వైపాయన మహర్షి సుమంతుని, జైమినిని, పైలుని, తన కుమారుడగు శుకుని వైశంపాయనుని మహాభారతముతో కూడిన ౫ వేదములను అధ్యాపనము చేయించెను.

ఇది మహాభారతసారోద్ధారమున ఆదిపర్వమున
ప్రథమాధ్యాయము
సమాప్తము

# ౨ వ అధ్యాయము

1. ఆది, సభా, అరణ్య విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య సౌప్తిక, స్త్రీ, శాంతి, దాన, అశ్వమేధ, ఆశ్రమవాస, యాన, ప్రస్థాన. ఖిలములనెడి పర్వములు ఇందు గలవు.

---

వ్యా॥ ఖిలమును గూర్చి నీలకంఠీయవ్యాఖ్యానము॥ భారతమున ఆది పర్వ రెండవ అధ్యాయమున శ్లో॥ సమాసో భారత స్యాయమితి ౩౧వ శ్లోకము నారంభించి నీలకంఠీయ వ్యాఖ్యానమందు ఈశ్లోకములు గలవు. ఖిలమనగా ప్రాచీనమందు జరిగిన పురాణము హరివంశము మొదలుగా గలవి. ఖిలమను శబ్దముచే చెప్పబడును. పూర్వమునందు జరిగిన దైన వ్యటికిని, శాఖాంతరమందున్నది, అవసరమును బట్టి ఇచ్చట పఠింప బడుచో దానికి ఖిలమని వైదిక సంజ్ఞ కలదు. ఏవిధమున శాఖాంతర మందున్న శ్రీసూక్త మేధాసూక్తములు ఋక్సంహితాకాలమున ఋగ్వే దులచే పఠింపబడుచున్నవి. గాన వాటికి ఖిలగ్రంథమని పేరు. అట్లే

అత ఏవానుక్రమణికపర్వణి హరివంశ స్తతః పర్వ పురాణం ఖిలసంజ్ఞికం॥ శ్లో॥ విష్ణుపర్వ శిశోశ్చర్యా విష్ణోః కంసవధ స్తథా। భవిష్యం పర్వ చాప్యుక్తం ఖిలే ష్వేవా ద్భుతం మహాత్॥ శ్లో॥ ఏతత్పర్వశతం పూర్ణం వ్యాసేనోక్తం మహాత్మనా। ఇత్యుక్తం॥

నను భారతే పర్వశతమపి వ్యాసేనోక్తంచే త్పర్వ సంగ్రహాదిషు॥ శ్లో॥ వేదా నధ్యాపయామాస మహాభారత పంచమాన్। ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవ చేత్యాదౌ స్వమాహాత్మ్యమపి వ్యాసేనోక్తమితి పఠ్యతే। తత్తు మహర్షీణా మసంగతమితి చేదుచ్యతే॥

త దీ వార్ష శైలీతి సిద్ధం॥ తథాహి॥ పరాశరస్మృతౌ॥ శ్లో॥ తస్మి న్నృషిసభామధ్యే శక్తిపుత్రం పరాశర మితి॥ పరాశరేణోక్తం దృశ్యతే॥ తత్ర మాధవీయవ్యాఖ్యానే॥ పరాశర ఏవ భావిశిష్య బుద్ధి సమాధానాయ స్వకీయ వృత్తాంత విజ్ఞాపకా నీదృశశ్లోకాని నిర్మమ ఇతి ద్రష్టవ్యం॥ ఇతి॥

మనుస్మృతౌ॥ మనుః॥ శ్లో॥ మను మేకాగ్రమాసీన మభిగమ్య మహర్షయః॥ ఇతి॥ యాజ్ఞవల్క్యస్మృతౌ॥ యాజ్ఞవల్క్యః॥ శ్లో॥ యోగీశ్వరం యాజ్ఞవల్క్యం సంపూజ్య మున

విష్ణుపురాణ, వాయుపురాణములయందు చెప్పబడిన హరివంశవృత్తాంతము ఇచ్చట నుటంకింప బడుటచే ఇచ్చట గల హరివంశ భవిష్యత్ వృత్తాంతములకు ఖిలమని పేరువచ్చినది.

అందువలననే అనుక్రమణిక పర్వయందు హరివంశపర్వభవిష్యత్పురాణపర్వ ఖిలసంజ్ఞకలిగినవిగా చెప్పబడినవి. అదెట్లన హరివంశ పర్వ విష్ణువుయొక్క బాల్యక్రీడలు కంసవధ భవిష్యపర్వ ఖిలగ్రంథమునందు అద్భుతముగా విశేషముగా కలదు. ఈనూరు పర్వములు సంపూర్ణముగా వ్యాసునిచే చెప్పబడినది. ఓయీ! నూరుపర్వములు వ్యాసునిచేతనే చెప్పబడినచో పర్వసంగ్రహాదులయందు ప్రభువును శ్రేష్ఠుడును వరదుడునగు వ్యాసుడు భారతముతో కూడిన అయిదు వేదములను వైశంపాయనాదులకు అధ్యాపనము చేయించెను, ఇత్యాది శ్లోకములయందు తన గొప్పదనము కూడ వ్యాసునిచేతనే చెప్పబడిదని సిద్ధించుచున్నది, అట్లు తమ గొప్పతనము చెప్పుకొనుట మహర్షులకు తగదు, అనిప్రశ్నరాగా సమాధానము చెప్పబడుచున్నది.

ఋషులైలి అట్లే యుండును అదెట్లన పరాశరస్మృతి యందు ఆఋషులయొక్క సభామధ్యములోనున్న శక్తిపుత్రుడగు పరాశరుని ఋషు లిట్లడిగిరి అని పరాశరునిచేతనే చెప్పబడినట్లు కనబడుచున్నది. అచ్చట మాధవాచార్యుల వ్యాఖ్యానమున పరాశరుడే రాబోవు శిష్యుల బుద్ధికి సమాధనము కలుగుటకు తన వృత్తాంతము తెలిపిన చేయు ఇట్టిశ్లోకములను తానే [పరాశరుడే] రచించెనని తెలుసుకొనదగినది అని—

ఇట్లే మనుస్మృతియందు మనువిట్లు చెప్పుచున్నారు ఏకాగ్రమనస్కుడై కూర్చునియున్న మనువును మహర్షులు సమీపించిరి, అని. ఇట్లే యాజ్ఞవల్క్య స్మృతి యందు యాజ్ఞవల్క్యునిచే చెప్పబడినది యోగి

పర్వాణి ష్ఠ18 త్వంశ9 నృప10 వార్ధి4 టా
11 ధీస మైక3 క1 కేటా4, త్రి3 ధీః5 వార్ధిం।
4దుఃద్వి2,త్రి3భూ1భూ1భూ1
గ్రామా 3 శ్చైతి శతం 100 క్రమాత్॥ 2

1 భారతాదౌ కథాసారసంగ్రహం శృణు తాదరాత్॥ 3

*కుడ్యేన ద్వ్యాపన దూర్భతాన్న వ్యాన్నో యస్సేవతే గురుం।

యోఽబ్రువర్ణ॥ ఇతి॥ ఏవమేవ అత్రి విష్ణు యమాది స్మృతిషు దృశ్యతే॥

వాల్మీకిరామాయణే, వాల్మీకిః॥శ్లో॥తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ త్యుక్తం। శ్రీరామేణాఽపి॥ రామో ద్విర్నాభిభాషతే ఇత్యుక్తం! మనుస్మృతౌ కుల్లూకభట్టీయే। ప్రాయేణాచార్యాణా మియం శైలీ యదాత్మాభిప్రాయమపి పరోపదేశమివ వర్ణయంతి. అత ఏవ॥ కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వాత్॥ ఇతి జైమినేరేవ సూత్రం అతఏవ తమపర్యపి బాదరాయణః సంభవాత్। ఇతి బాదరాయణస్యైవ శారీరకం సూత్రం॥

తథా చ మహాభారతాదౌ వ్యాసవృత్తాంతశ్లోకానాం వ్యాసేనైవ నిర్మితత్వేన సర్వసంప్రతిపత్తేః॥ఇతిశం॥

*వ్యాన్నః-వి- అన్నః - విగతాన్న ఇత్యర్థః॥

1భారఆది ప 64 అ॥

2. అవాంతరపర్వముల విషయము ఇందు చెప్పుచున్నారు: ధృ – 18 త్యంక9, నృవ16, వార్ధి4, టే11, ధి5, మై8, క1, కేటే4, త్రి3, ధీః5, వార్ధిం4, దు1, ద్వి2, త్రి3, భూ1, భూ1, భూ1, గమా3 శ్రేతి ఈవిధముగా ఆదిపర్వము మొదలుగాగల 18 పర్వములయందును క్రమముగా మొత్తము నూరు అవాంతర పర్వములు గలవు.

3. భారతాది యందు భారతకథాసార సంగ్రహమును ఆదరముతో వినుడు.

॥ 4. ఎవడు గోవవలె వృషభమువలె ఐనవాడై ఆహారమును వర్జించిన శ్వరుడగు యాజ్ఞవల్క్యుని పూజించి మునులు అడిగిరి. అవికలదు. ఇట్లే అత్రి, విష్ణు యమాది స్మృతులయందును కనబడుచున్నది.

వాల్మీకి రామాయణమునందును తపోవంతుడును మునిశ్రేష్ఠుడును నగు వాల్మీకి నారదుని అడిగెను. అవి తానే చెప్పుకొనెను. శ్రీరాముడు గూడ రాముడు రెండుమాటలు మాటాడడు అని చెప్పెను మహస్నస తికి వ్యాఖ్యానమగు కుల్లూకభట్టీయమున ఈవిధముగా సమాధానము చెప్ప బడినది. తరచుగా ఆచార్యులు తమఅభిప్రాయమునుకూడపరులఉపదేశము వలె వర్ణించుచున్నారు. ఇదియే వారిశైలి. అందుచేతనే కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వాత్ అనునది జైమినిరచించిన సూత్రమే. అట్లే తదు పర్యపి బాదరాయణ స్సంభవాత్ అనునది బాదరాయణుడు రచించిన బ్రహ్మసూత్రము.

కావున భారతాదియందు వ్యాసవృత్తాంతమును చెప్పెడి శ్లోకము లన్నియు వ్యాసునిచేతనే నిర్మింపబడినవి. ఇందుకు ఎట్టివిరోధము లేదు. సర్వము సుసంపన్నమే.

॥ వ్యా॥ వ్యన్నః:- వి = విగతమైన = విడిచి పెట్టిన, అన్నః ఆహారము గలవాడై అని అర్థము,

తం విద్యా దేవతా శ్చానుగృహ్ణంతీ త్యాహా పౌష్యకృత్॥ 4

ఖలో న ప్రార్థనా త్సాధ్యః సచ ద్వైవేన తాడితః।
అభ్యేతి మృదుతాం పశ్చా దత్తంకే తక్షకో యథా। 5

శాస్త్రోల్లంఘనతో వహ్నేః పులోమా నాపవాపతుః।
శాపమృత్యూ ఇతి పునః పౌలోమే తుర్య ఈరితం॥ 6

లోకాన్మంత్రా న్మహేంద్రాచ్చ బ్రాహ్మణే వీర్య మద్భుతం।
తక్షకో యేన ఖే తస్థా విత్యాస్తీకేఽనువర్ణితం॥ 7

అన్యాయ్యమపి మాత్రోక్తం సద్యో యో నాను తిష్ఠతి।
తం భస్మీకుర్వతే విప్రా వేదా శ్చాహిగణం యథా॥ 8

మిథ్యావాదేన యే దాసీకృతా స్సత్సంతతి స్స్వకాం।
సంతతిం నాశయత్యేవ గరుత్మానివ పన్నగాన్॥ 9

ఆయుర్హాని ర్మహాన్ శోకః హింసాయాం చాతిసంభ్రమః।
రురోరివ భవంత్యేవ దారాసక్తస్య దుర్మతేః॥ 10

ప్రజయా పైతృక మృణం ఛేత్తుం దారాన్ కరోతి చేత్।

వాడై గురువును సేవించునో వానిని విద్యలు, దేవతలును అను గ్రహింతురని పౌష్యపర్వయందు చెప్పబడినది.

5, దుర్మార్గుడు ప్రార్థనచే లొంగడు. వాడు దైవముచే కొట్టబడుచో తరువాత ఉదంకుని విషయమున తక్షకునివలె మృదుస్వభావము కలవాడగును. అను నీతి ఉదంకోపాఖ్యానముచే చెప్పబడినది.

6, శాస్త్రమును ఉల్లంఘించుటచే అగ్నివలన పులోమ యనువాడు శాపమును, మృత్యువును పొందెను. గాన శాస్త్రముల్లంఘించ దగినది కాదని నాల్గవదియగు పౌలోమపర్వయందు నీతి చెప్పబడియున్నది,

7, లోకము కంటెను, మంత్రము కంటెను, దేవేంద్రుని కంటెను బ్రాహ్మణునియందు అద్భుతమైన సామర్థ్యము కలదు, తక్షకుడు ఆస్తీకుడను బ్రాహ్మణవాక్యముచే హోమముగాక ఆకాశమున నిలిచె కదా అనెడు నీతి ఆస్తీకపర్వయందు వర్ణింపబడియున్నది,

8, అన్యాయమైనదైనను తల్లి వాక్యమును ఎవడు చేయడో వానిని సర్పగణమును వలె విప్రులు, వేదములు నాశనము చేయుచున్నవి,

9, మిథ్యావాదముచే ఎవరు దాసిగా చేయబడిరో వారియొక్క సంతతి యజమానుని యొక్క సంతతిని గరుత్మంతుడు సర్పముల వలె తప్పక నశింపజేయును,

10, రురు చక్రవర్తివలె స్త్రీయందు దయాసక్తిగల దుర్మతియగువాడు ఆయుష్యమును గొప్పశోకమును హింసచే గొప్ప తొట్రుపాటును పొందగలడు,

11, సంతానముచే పితౄణమును పోగొట్టుకొనుటకు భార్యను స్వీకరిం

తదా జరత్కారురివ కార్యాంతే ప్రవ్రజేద్గృహాత్॥ 11

తత్త్వామృతం శాస్త్రసింధోః స్సమం లబ్ధం సురాసురైః।
ఆస్వాదితం విష్ణుభక్తైస్సురైర్నాన్యైః స్త్రియాజితైః 12

సౌతిః॥

జనమేజయస్తు తచ్ఛ్రుత్వా వైశంపాయనమబ్రవీత్। 13

యదర్థమిహ సంభూతా లోకఖ్యాతా మహారథాః।
భువి తస్మై మహాభాగ సమ్యగాఖ్యాతుమర్హసి॥ 14

వైశంపాయనః

రహస్యం ఖల్విదం రాజన్ దేవానామితి నశ్శ్రుతమ్।
తత్తు తే కథయిష్యామి నమస్కృత్వా స్వయంభువే। 15

త్రిస్సప్తకృత్వః పృథివీం కృత్వా నిఃక్షత్రియాం పురా।
జామదగ్న్యస్తపస్తేపే మహేంద్రే పర్వతోత్తమే॥ 16

తదా నిఃక్షత్రియే లోకే భార్గవేణ కృతే సతి।
బ్రాహ్మణాన్ క్షత్రియా రాజన్ సుతార్థిన్యోఽభిచక్రముః 17

చుచో జరత్కారుని వలె సంతానము గలిగిన వెంటనే వైరాగ్యమును పొంది గృహమునుండి వెళ్ళిపోవలయును.

12. దేవదానవులచే శాస్త్రమనెడి సముద్రమునుండి తత్వమనెడి అమృతము ఏకకాలమునందే పొందబడినది కాని విష్ణుభక్తులగు దేవతలచే అది త్రాగబడినది, స్త్రీచే జయింపబడిన దానవులకు అది లభ్యము కాలేదు గదా।

సౌతి చెప్పుచున్నాడు.

13. జనమేజయుడు అది విని వైశంపాయనునితో నిట్లు పలికెను.

14. హే మహాత్మా! దేవతలతో సమానములగు మహారథులు ఈ భూలోకమున ఎందులకు పుట్టిరి? ఈ విషయమును నాకు బాగుగా చెప్పగోరుచున్నాను.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు,

15. ఓ రాజా! ఇది దేవతల యొక్క రహస్యమని మేము వింటిమి. బ్రహ్మకు నమస్కరించి ఆ రహస్యమును నీకు చెప్పగలను.

16. పూర్వయుగమున పరశురాముడు 21 మార్లు భూమండలమునంతయు నిక్షత్రియముగ చేసి మహేంద్రపర్వతమునందు తపస్సు చేసెను.

17. అప్పుడు పరశురామునిచే క్షత్రియులు లేనిదిగా లోకము చేయబడగా క్షత్రియస్త్రీలు సంతానమును గోరుచున్నవారలై బ్రాహ్మణులను పొందిరి.

జాతం వృద్ధం చ ధర్మేణ స దీర్ఘేణాయుషాన్వితం।
చత్వారోఽపి తతో వర్ణా బభూవు ర్బ్రాహ్మణోత్తరాః 18

ఏవం కృతే యుగే సమ్య గ్వర్తమానే తదా నృప.
త్రేతాంతం సమనుప్రాప్తే హ్యాధర్మస్య వివర్ధనే॥ 19

ఆదిత్యై ర్హి తదా దైత్యా బహుశో నిర్జితా యుధి।
అసురా జజ్ఞిరే క్షేత్రే రాజ్ఞాం తమనుజేశ్వరాః॥ 20

గోష్వశ్వేషు చ రాజేంద్ర ఖరోష్ట్రమహిషేషు చ।
క్రవ్యాత్సు చైవ భూతేషు గజేషు చ మృగేషు చ।
వీర్యవంతోఽవలిప్తా స్తే నానారూపధరా మహీం॥ 21

విప్రచిత్తి రితి ఖ్యాతో య ఆసీద్దానవర్షభః।
జరాసంధ ఇతి ఖ్యాతః స ఆసీన్మనుజర్షభః॥ 22

దితేః పుత్రస్తు యో రాజన్ హిరణ్యకశిపుస్తదా।
స జజ్ఞే మానుషే లోకే శిశుపాలో నరర్షభః॥ 23

సంహ్లాద ఇతి విఖ్యాతః ప్రహ్లాదస్యానుజ స్తు యః।
స శల్య ఇతి విఖ్యాతో జజ్ఞే బాహ్లీకపుంగవః॥ 24

18. ఆ విధముగా పుట్టిన సంతతి మంచి వర్చస్సు గలదియు, దీర్ఘాయుర్దాయము గలదియు నయ్యెను. బ్రాహ్మణుడు మొదలుగాగల నాల్గు వర్ణములవారును ఉద్భవించిరి.

19. ఈ విధముగా కృతయుగమున ధర్మము చక్కగా నడచినది. త్రేతాయుగాంతము రాగా అధర్మము వృద్ధినొంద జొచ్చినది.

20, దేవతలచే రాక్షసులు అనేకవిధములుగా యుద్ధమున జయింపబడిరి. అట్లు జయింపబడిన రాక్షసులు భూలోకమున రాజులుగా నుద్భవించిరి,

21, ఇట్లు ఒక క్షత్రియులయందేగాక గోవులయందు, అశ్వములయందు ఖరములందు, ఉష్ట్రములందు గేదెలయందు, క్రవ్యాదులయందు ఏనుగులయందు, ఇట్లే సమస్తభూతములయందును ఆదేవతలచే వంచింపబడిన రాక్షసులు నానారూపములతో ఈభూలోకమున నుద్భవించిరి.

22, విప్రచిత్తియను పేరుగల దానవశ్రేష్ఠుడు ఈభూలోకమున జరాసంధుడను పేరుతో ప్రసిద్ధిచెందెను.

23, దితియొక్క పుత్రుడగు హిరణ్యకశిపుపే ఈలోకమున శిశుపాలుడను రాజుగా నవతరించెను.

21, ప్రహ్లాదుని సోదరుడగు సంహ్లాదుడు అను ప్రసిద్ధుడగు రాక్షసుడు బాహ్లీకదేశప్రభువగు శల్యుడుగా పుట్టెను.

అజక స్త్వవరో రాజన్ య ఆసీ ద్వృషపర్వణః।
స సాల్వ ఇతి విఖ్యాతః పృథివ్యా మభవన్నృపః 25

కాలనేమిరితి ఖ్యాతో దానవానాం మహాబలః
స కంస ఇతి విఖ్యాత ఉగ్రసేనసుతో బలీ॥ 26

శకునిర్నామ యస్త్వాసీ ద్రాజా లోకే మహారథః।
ద్వాపరం విద్ధి తం రాజన్ సంభూతమరిమర్దనం॥ 27

స గంధర్వపతి ర్జజ్ఞే కురువంశవివర్ధనః।
ధృతరాష్ట్ర ఇతి ఖ్యాతః కృష్ణద్వైపాయనాత్మజః॥ 28

ప్రష్టోదశిష్యో నగ్నచి త్సుబల శ్చాభవత్తతః।
తస్య ప్రజా ధర్మహంత్రీ జజ్ఞే దేవప్రకోపనాత్॥ 29

గాంధారరాజపుత్రోఽభూ చ్ఛకునిః సౌబలస్తదా।
* దుర్యోధనస్య జననీ జజ్ఞాతేఽర్థవిశారదా॥ 30

కలేరంశస్తు సంజజ్ఞే భువి దుర్యోధనో నృపః।
పౌలస్త్యా భ్రాతర శ్చాస్య జజ్ఞిరే మనుజేష్విహ॥ 31
శతం దుశ్శాసనాదీనాం సర్వేషాం క్రూరకర్మణాం।
భ్రాహ్మణాన్ క్షత్రియా న్వైశ్యాన్ శూద్రాంశ్చ
బాధ్యపీడయన్ 32

*ఏకకంఠేన వ్యాఖ్యాతే। గాంధార్యా ధర్మహంత్ర్యాః పుత్రద్వారేణైవ। ఆది 67 అ॥

25. వృషపర్వుని పుత్రుడగు రాక్షసుడు ఈలోకమున ప్రసిద్ధి నొందిన సాల్వుడను రాజాయెను.

26. కాలనేమి యని ప్రసిద్ధినొందిన గొప్ప బలశాలియగు దానవుడే ఉగ్రసేనుని కుమారుడగు కంసుడుగా ప్రసిద్ధి నొందెను.

27. మయుడను రాక్షసుడు శకునిగా జన్మించెను. ద్వాపరుడను రాక్షసుడు అరిమర్దనుడను పేరుగల రాజుగా పుట్టెను.

28. గంధర్వపతి యను పేరుగలవాడు కురువంశము నభివృద్ధి పరచిన ధృతరాష్ట్రుడుగా వ్యాసుని వల్ల జన్మించెను.

29. బ్రహ్మదేవుని శిష్యుడగు నగ్న చిత్తి యను వాడు సౌబలుడను రాజుగా పుట్టెను. అతని యొక్క ప్రజలు దేవశాపమువలన ధర్మమును పాడుచేయు వారుగా అయిరి.

30. గాంధార రాజపుత్రుడగు శకునియు, (సౌబలుడు) దుర్యోధనుని తల్లియగు గాంధారియు వీరందరును ధర్మద్రోహు లయిరి.

31. దుర్యోధనుడు కలియొక్క అంశచే ఈ భూలోకమున అవతరించెను. మిగతా రాక్షసులందరు ఆ దుర్యోధనుని సోదరులుగ పుట్టిరి.

32. ఈ నూర్గురు దుశ్శాసనాది సోదరులు క్రూరులై బ్రాహ్మణాది నాల్గు వర్ణములవారిని పీడించిరి.

---

వ్యా॥ గాంధారి ధర్మమును పాడుచేయునది ఆమెననుబట్టిపుత్రుల ద్వారా యని గ్రహింపవలయును.

తతో మహీ మహీపాలభారార్తా భయపీడితా।
దేవర్షి బ్రహ్మణా సార్ధం వైకుంఠం ప్రజగామవై॥ 33

విజ్ఞాయ సర్వం దేవేశో యద్భవ్యం తదువాచవా ॥ 34

తతో బ్రహ్మర్షివంశేషు పార్థివర్షి కులేషు చ।
జజ్ఞిరే రాజశార్దూల యథా కామం దివౌకసః 35

విధేః స్తనం వినిర్భిద్య జాతో ధర్మ స్సనాతనః।
తస్మాదష్టౌ తు సంజాతా వసవో హి ధ్రువాదయః 36

1 తతో భీష్మ శ్శాంతనవో గంగాయాం మహితద్యుతిః।
* వసువీర్యా త్సమభవ న్మహావీరో మహాయశాః। 37

వైశ్యాపుత్రో యుయుత్సుశ్చ ధార్తరాష్ట్ర శ్శతాధికః।

---

* వ్యా॥ వసూనాం నామ నిర్వచనం। శ్రుతౌ=
అగ్నిశ్చ పృథివీచ వాయు రంతరిక్షంచ ఆదిత్యశ్చ ద్యౌశ్చ
చంద్రమా నక్షత్రాణి చైతే వసవః॥ ఇతి॥ పురాణేషు ॥ శ్లో ॥
ధ్రువ స్సధా పూషా సోమ ఆపో వైశ్వానరోఽనిలః। ప్రత్యూ
షశ్చ ప్రభావశ్చ వసవోష్టౌ ప్రకీర్తితాః ఇతి ॥

1 ఆది 63 అ

33. అప్పుడు భూదేవి రాజుల బరువుచే పీడింప బడినదై భయము గొని దేవర్షుల తోడను, బ్రహ్మతోను, గూడి వైకుంతము నకు వెళ్ళెను.

34. దేవ దేవుడగు శ్రీమహావిష్ణువు అంతయు తెలుసుకొని తగు నట్లుగా ఇట్లు పలికెను.

35. అంతట దేవతలు వారి ఇష్టము ననుసరించి బ్రహ్మఋషి వంశ ములయందును పుట్టిరి.

36. బ్రహ్మదేవుని స్తనమును భేదించి ధర్మదేవత శంతనుడుగా జన్మించెను. వాని నుండియే ధృవాది అష్టవసువులును ఈలోక మున పుట్టిరి.

• 37. ఆటు తరువాత గంగాదేవియందు మిక్కిలి పరాక్రమముగల భీష్ముడు వసువు యొక్క సామర్ధ్యమువలన గొప్పపరాక్రమము గల వాడుగను, గొప్పకీర్తి గల వాడునగు భీష్ముడుగ శంతను మహారాజువలన పుట్టెను,

38. ధృతరాష్ట్రునకు దుర్యోధనాది నూర్గురు పుత్రులకంటె మరి యొకడు యుయుత్సువు అనుపేరుగల వాడు వైశ్య స్త్రీయందు

• వ్యా॥ అష్టవసువుల యొక్క పేర్లు శ్రుతియందు ఇట్లు చెప్ప బడినవి. అగ్ని. పృధివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు స్వర్గము, చంద్రుడు నక్షత్రములని. పురాణముల యందు మాత్రము ధృవుడు పూషుడు, సోముడు ఆపుడు, వైశ్వానరుడు, ప్రత్యూషుడు, ప్రభావుడు అని అష్టవసువులు చెప్పబడిరి.

ఏతదేకశతం రాజన్ కన్యా చైకా చ దుశ్శలా। 38

దుశ్శలాం సమయే రాజన్ సింధురాజాయ కౌరవః।
జయద్రథాయ ప్రదదౌ సౌబలానుమతే తదా ॥ 39

వసిష్ఠస్య చ శాపేన నియోగాద్వాసవస్య చ।
జజ్ఞిరే వసవస్త్వష్టౌ గంగాయాం శంతనోః సుతాః॥ 40

తేషా మవరజో భీష్మః కురూణా మభయంకరః।
మతిమా న్వేదవిద్వాగ్మీ శత్రుపక్షక్షయంకరః।
యో యుధ్యత మహాతేజా భార్గవేణ మహాత్మనా ॥ 41

శూలే ప్రోతః పురాణర్షి రచోర శ్చోరశంకయా।
అణిమాండవ్య ఇత్యేవం విఖ్యాత స్స మహాయశాః।
తేన శాపేన ధర్మోఽపి శూద్రయోనా వజాయత।
విద్వాన్ విదురరూపేణ ధార్మికను రకిల్బిషీ॥ 42-43

సంజయో మునికల్పస్తు జజ్ఞే సూతో గవల్గణాత్॥ 44

వసుదేవాత్తు దేవక్యాం ప్రాదుర్భూతో మహాయశాః।
అనాదినిధనో దేవ స్సకర్తా జగతః ప్రభుః॥ 45

పుట్టెను. ఈ నూట ఒక్కరే గాక దుశ్శల అను పేరు గల నొక కుమార్తెయు కలిగినది.

39. ఆదుశ్శలను వివాహసమయమునందు శకుని యొక్క అనుమతి ననుసరించి సింధురాజగు జయద్రధునకు భార్యగా నొసంగెను.

40. వసిష్ఠుని శాపముచేతను, దేవేంద్రుని ఆజ్ఞప్రకారము అష్టవసువులును, గంగాదేవియందు శంతనుని కుమారులుగ బుట్టిరి.

41. వారిలో (ఆ వసువులలో) ఆఖరివాడు భీష్ముడుగా నవతరించెను. ఆయన గొప్ప బుద్ధిమంతుడు విద్వాంసుడును వక్తయు శత్రువులను జయించువాడును, ధర్మవేత్తయు కురువంశ రాజుల నందరను రక్షించు వాడాయెను. ఆయన మహా తేజశ్శాలియై గురువగు పరశురామునితో గూడ ధర్మార్ధము యుద్ధము చేసెను.

42, 43. పూర్వము అణిమాండవ్యుడను గొప్ప తేజశ్శాలియగు ఋషి దొంగతనము చేయక పోయినను చోరుడను అనుమానముచే కొరత వేయబడెను. ఆతని శాపముచే యమధర్మరాజు శూద్రస్త్రీ యందు మహాధర్మాత్ముడును, దోషము లేనివాడగు విదురుడుగ జనించెను.

44. సూతకులమున గవల్గణుడను వానివలన మునితుల్యుడగు సంజయుడు పుట్టెను.

45. వసుదేవునివలన దేవకీదేవియందు ఆద్యంతములు లేనివాడును, దేవ దేవుడును, జగత్కర్తయు, జగత్ప్రభువునగు శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగా నవతరించెను.

అవ్యక్త మక్షరం బ్రహ్మ ప్రధానం త్రిగుణాత్మకం।
ఆత్మాన మవ్యయం చైవ ప్రకృతిం ప్రభవం ప్రభుం।
అనంత మచలం దేవం హంసం నారాయణం ప్రభుం।
కైవల్యంనిర్గుణం విశ్వమనాది మజమవ్యయం।
పురుష స్స్వభూః కర్తా సర్వభూతపితామహః ॥
♦ ధర్మసంవర్ధనార్థాయ ప్రజజ్ఞేంధకవృష్ణిషు॥ 46-48

1 శేషస్యాంశశ్చ నాగస్య బలదేవో మహాబలః ॥ 49

శ్రియస్తు భాగ స్సంజజ్ఞే రత్యర్థం పృథివీతలే
భీష్మకస్య కులే సాధ్వీ రుక్మిణీ నామ నామతః ॥ 50

గణ స్త్వప్సరసాం యోవై మయా రాజన్ ప్రకీర్తితః
తాని షోడశ దేవానాం సహస్రాణి నరాధిప
బభూవు ర్మానుషేలోకే వాసుదేవపరిగ్రహాః ॥ 51

2 అస్త్రజ్ఞా తు మహావీర్యా సర్వశాస్త్రవిశారదా

---

వ్యా॥ పరమార్థప్రపాఖ్య భగవద్గీతా వ్యాఖ్యానే శ్రీకృష్ణావతారవిశేషాణి సర్వాణి వేదే ప్రసిద్ధానీతి ప్రతిజ్ఞాయ శ్రు॥ జజ్ఞాన ఏవేతి ద్వేవిరూపేతి బుద్ధ్వయం చ నిరూప్య తయోః చతుర్వేదస్వామికృత భాష్య మప్యుదాహృతం॥

1) ఆది॥ 67 అ॥ 2) ఆది॥ 63 అ॥

46, 47, 48, అవ్యక్తుడును, అక్షరస్వరూపుడును త్రిగుణాత్మకమైన ప్రధానుడును, పరబ్రహ్మము ఆ శ్రీకృష్ణుడు. నాశరహితమైన ఆత్మస్వరూపుడు, జగత్సృష్టికి మూలభూతమైనవాడు. అనంతుడు, అచలుడు, దేవదేవుడు, విశ్వస్వరూపుడు, నిర్గుణుడు, కేవలుడు, అజుడు, అవ్యయుడు, విభువు. కర్త సర్వభూతములకు పితామహుడు నగు శ్రీ మహావిష్ణువే ధర్మసంస్థాపనార్థము వృష్ణికులమునందు శ్రీకృష్ణుడుగా నవతరించెను.

49. ఆదిశేషువు యొక్క అంశతో మహాబల సంపన్నుడగు బలరామస్వామివారు ఉదయించిరి.

50. భీష్మకమహారాజు యొక్క వంశమున మహాపతివ్రత యగు రుక్మిణి యను పేరుతో లక్ష్మియొక్క అంశయే శ్రీకృష్ణునికి భార్యగా నుండుటకై ఈ భూలోకమున అవతరించెను.

51. అప్సరసల సముదాయమే శ్రీకృష్ణుని భార్యలగు 16 వేల కన్యకలుగ నవతరించిరి.

52. అప్రద్యుమ్నుడు, మహాపరాక్రమవంతుడును, సర్వశాస్త్ర పండితు

---

వ్యా॥ పరమార్థప్రపా అను పేరుగల భగవద్గీత వ్యాఖ్యానమునందు శ్రీకృష్ణావతార విశేషములున్నియు. వేదములందు చెప్పబడినవని ప్రతిజ్ఞ చేసి, కృ॥ జ్ఞాన ఏవేతి — ద్వే వియూపే అనెడి రెండు ఋక్కుల యొక్క అర్థమును నిరూపించి ఆ రెండు ఋక్కులకు చతుర్వేద స్వామిచే రచింపబడిన భాష్యమును ఉదహరింపబడినది.

సాత్యకిః కృతవర్మా చ నారాయణ మనువ్రతౌ ॥ 52

భరద్వాజస్య చ స్కన్నం ద్రోణ్యాం శుక్ర మవర్ధత
మహర్షే రుగ్రతపస స్తస్మా ద్ద్రోణో వ్యజాయత ॥ 53

బృహస్పతే ర్బృహత్కీర్తే ర్దేవర్షే ర్విద్ధి భారత
అంశాద్ద్రోణం సముత్పన్నం భారద్వాజ మయోనిజం ॥ 54

గౌతమా న్మిథునం జజ్ఞే శరస్తంబా చ్ఛరద్వతః
అశ్వత్థామ్నశ్చ జననీ కృపశ్చైవ మహాబలః ॥ 55

యస్తురాజన్ కృపోనామ బ్రహ్మర్షి రభవత్ క్షితౌ
రుద్రాణాం తు గణాన్ విద్ధి సంభూత మతిపౌరుషం ॥ 56

మహాదేవాంతకాభ్యాం చ క్రమా త్క్రోధాచ్చ భారత
ఏకత్వ ముపపన్నానాం జజ్ఞేశూరః పరంతపః
అశ్వత్థామా మహావీర్యః శత్రుపక్ష క్షయావహః ॥ 57–58

1 మృగయాం చరతో రాజ్ఞ శ్శంతనోస్తు యదృచ్ఛయా
జ్ఞాత్వా ద్విజస్య చాపత్యే ధనుర్వేదాంగతస్యహ ॥ 59

స తదాదాయ మిథునం మమ పుత్రావితి బ్రువన్
తత స్సంవర్ధయామాస సంస్కారై శ్చాప్యయోజయత్ ॥ 60

అను నగు సాత్యకి, కృత వర్మలు నారాయణుని అనుసరించి ఈలోకమున జన్మించిరి.

53, భరద్వాజుని యొక్క స్ఖలిత మైన రేతస్సు కుండ యందుంచబడి వృద్ధిని పొందింప బడెను, అతడే ద్రోణాచార్యులుగా అవత రించిరి

54, దేవర్షియగు బృహస్పతి యొక్క అంశతో భరద్వాజుని వలన అయోనిజుడగు ద్రోణాచార్యుడు పుట్టెను.

55, గౌతమ గోత్రమునందు బుట్టిన శరద్వతుడను మహర్షి వలన రెల్లుపొదనుండి ఇద్దరు పుట్టిరి, అందులో నొకతె అశ్వత్థామ తల్లియగు కృపి యను మరొకరు మహాబలశాలియగు కృపుడును

56, ఈకృపుడు భూలోకమున బ్రహ్మర్షి యాయెను, రుద్రుల యొక్క గణమంతయు కలసి ఈ రూపమున అవతరించి నది. అందుచే అతడు గొప్పపరాక్రమవంతుడాయెను.

57, 58. మహాశివుడును, యముడును పీవస్ధరి యొక్క అంశతో మహా పరాక్రమశాలియు, శూరుడునునగు అశ్వత్థామ అవతరించెను. అతడు శత్రుపక్షములను నశింపజేయు వాడు.

59 ఒకానొకప్పుడు శంతను మహారాజు వేటకుపోయి దైవయోగమున రెల్లు దుబ్బునందు ఇద్దరు బ్రాహ్మణ శిశువులను చూచెను.

60, వారలను తీసుకొని ఇంటికివచ్చి పీరు నాపుత్రులని పలుకుచు వారలకుబ్రాహ్మణ సంస్కారములను చేయించెను వృద్ధి పొందిం చెను.

గోష్ఠితో గౌతమ స్తత్ర తపసా సమవిందత
సోఽచిరేణైవ కాలేన పరమాచార్యతాం గతః ॥ 61

సప్తపూరుషపర్యంతం తేషా మాచార్య హేతవే
దదౌ రాజ్యం తస్య రాజా శంతను ర్మనుజాధిపః ॥ 62

ద్రోణః పితృనియోగేన చోపయేమే కృపీం ముదా
అశ్వత్థామా తతో జజ్ఞే ద్రోణాదేవ మహారథః ॥ 63

శిఖండీ ద్రుపదా జ్జజ్ఞే కన్యాపుత్రత్వ మాగతా
యాం యక్షః పురుషం చక్రే స్థూణః ప్రియచికీర్షయా
యా కాశిరాజజా భీష్మం జేతు మ్మాతాగ తాహిం సా ॥ 64-65

తథైవ ధృష్టద్యుమ్నోఽపి సాక్షాదగ్నిసముద్యుతిః
వైతానే కర్మణి తతే పావకాత్సముజాయత ॥ 66

వీరో ద్రోణవినాశాయ ధను రాదాయ వీర్యవాన్
తత్రైవ వేద్యాః కృష్ణాఽపి జజ్ఞే తేజస్వినీ శుభా ॥ 67

61. వీరి తండ్రియగు గౌతముడు తపః ప్రభావముచే వీర లిట్లు రక్షింపబడిరని తెలుసుకొనెను. అరక్షింపబడిన కృపుడే కొంత కాలమునకు కృపాచార్యుడు అను పేరుతో కురువంశమున కాచార్యుడాయెను. రెండవదియగు కృపి ద్రోణాచార్యుని భార్య యయ్యెను.

62. ఏడు పురుషాంతరములవరకు కురువంశరాజులకు కృపాచార్యుడు ఆచార్యుడుగా నుండుటచే ఆతనికి శంతనుడు రాజ్యము నిచ్చెను.

63. ద్రోణుడు తండ్రియొక్క ఆజ్ఞను అనుసరించి కృపియను కన్య కను సంతోషముతో వివాహమాడెను. ఆమెయందే ద్రోణుని వలన మహారధియగు నశ్వత్థామ జనించెను.

64, 65 మొదట కన్యగానుండి తరువాత పురుషత్వమును పొందిన శిఖండియు ద్రుపదునివలన బుట్టెను. ఆమెను, ఒకానొక యక్షుడు స్థూణుడనువాని యొక్క ప్రియమునకు చేయగోరి పురుషునిగా మార్చెను. ఆమెయే పూర్వజన్మ యందు కాశీరాజ కుమార్తెయగు అంబ. ఆమె భీష్ముని జయించుటకు ఇచ్చటికి వచ్చి యుండెను.

66. అట్లే అగ్నితో సమానమగు ధృష్టద్యుమ్నుడు కూడ యజ్ఞ కర్మయందు అగ్నిహోత్రుని నుండి పుట్టెను.

67. పరాక్రమశాలియగు ఆధృష్టద్యుమ్నుడు ధనుర్బాణములను గ్రహించియే ద్రోణవినాశము కొరకు అగ్నినుండి ఉద్భవించెను.

* విభ్రాజమానవపుషా బిభ్రతీ రూప ముత్తమం ॥ 68

---

* వ్యా॥ నను శుక్లశోణితసమ్మేళనం వినా అయోనిజత్వేన కథం జన్మ సంభవతీతి ప్రశ్నే సమాధాన ముచ్యతే.

తథాహి వైశేషిక దర్శనసూత్రం 174. తత్ర శరీరం ద్వివిధం యోనిజ మయోనిజం చేతి. భాష్యం తత్రాఽయోనిజం నామానపేక్ష్య శుక్రశోణితం దేవర్షీణాం శరీర ధర్మవిశేషసహితేభ్యోఽణుభ్యో జాయతే, సూత్రోఽప సంస్కారః అయోనిజంచ దేవానా మృషీణాం ప్రాయతేహి। బ్రహ్మణో మానసాః స్వాద్వయ ఇతి ॥ అతః పరంతు మైత్రేయ ప్రజా మైథునసంభవా ఇతి విష్ణుపురాణే ఉక్తత్వాత్

కారణసంతరేణ కథం కార్యమితి చేత్ యోనే శ్శరీరత్వావచ్ఛేదే నాఽకారణత్వాత్ ఉష్మజ-కృమి-మశకాది శరీరే వ్యభిచారాత్ ॥

68. ఆ వేదినుండియే ప్రకాశించుచున్న దేహకాంతితో గొప్ప సౌందర్యమును ధరించిన ద్రౌపదియు జనించినది. ఆమె మంచి శుభలక్షణములు గలదియై తేజస్సుతో విరాజిల్లుచుండెను.

వ్యా॥ ఓయీ! శుక్లశోణితముల యొక్క సమ్మేళనము లేకుండగ అయోనిజముగ (అనగా యోని సంబంధము లేక) జన్మ ఎట్లు సంభవించును. అను ప్రశ్నరాగా సమాధానము చెప్పబడుచున్నది.

"అయోనిజముగ పుట్టుట తగినదే. వైశేషిక దర్శనమున 174వ సూత్ర భాష్యమున ఇట్లు కలదు. శరీరము రెండు రకములు. 1. యోనిజమైన శరీరము 2. అయోనిజమైన శరీరము అని. అందులో అయోనిజమగు శరీరము శుక్రశోణితసంబంధమును కోరక దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, శరీరధర్మము గల అణువులనుండి పుట్టుచున్నది. దేవతల యొక్కయు, ఋషుల యొక్కయు, దేహములు అయోనిజములనియు వాటికి సంస్కారములు వ్యర్థములనియు, శృతియందు చెప్పబడినదికదా! బ్రహ్మనుండి మన్వాది మహర్షులు మానసముగ బుట్టిరని ప్రసిద్ధమే కదా! మన్వాదుల తరువాతి సృష్టియంతయు స్త్రీ పురుష సంబంధ మూలమున బుట్టిన దని విష్ణుపురాణమునందు చెప్పబడినది.

పుట్టుకకు స్త్రీ, పురుష సంబంధము కారణము. కారణము లేకుండగా కార్యము పుట్టదు. గాన అయోనిజత్వము సంభవింపదు. అను ప్రశ్నరాగా సమాధానము చెప్పబడుచున్నది. ప్రతి శరీరమునకు శుక్రశోణిత సంబంధము కారణము కాదు. ఉబ్బునుండి పుట్టు క్రిములు దోమలు నల్లుల యందు శుక్రశోణితసంబంధములేకయే పుట్టుటసంభ

స్త్వన్యయోనిజాః సూ. 179 అన్యచ్చ వేదాంత దర్శనే ప్యేవం ప్రతిపాదిత మస్తి। దర్శనాచ్చ బ్రహ్మ సూత్రం 3-1-20 భాష్యం। అపిచ చతుర్విధే భూతగ్రామే జరాయు జాండజస్వేదజో ద్భిజలక్షణే స్వేదజోద్భిజయో రంతరేణైవ గ్రామ్యధర్మ ముత్పత్తిదర్శనా దాహుతిసంఖ్యా ఽనాదరో భవతి॥ ఏవ మన్యత్రాపి భవిష్యతీతి॥

పంచమ్యా మాహుతౌ చాపః పురుషవచసో భవంతి ఇత్యేత చ్ఛ్రుత్యర్థప్రతిపాదనసందర్భే బ్రహ్మసూత్రే చ తద్భాష్యే చైవ ముపపాదితేతి ॥ న తృతీయోపలబ్ధేః సూ॥ 3—1—18 భాష్యం

తత్ర యేషాం ఆరోహావరోహౌ సంభవత స్తేషాం పంచమ్యామాహుతౌ దేహ ఉద్భవిష్యతి। అన్యేషాం తు వినైవాహుతిసంఖ్యయా భూతాంతరోపసృష్టాభి రద్భి ర్దేహ ఆరభ్యతే.

వించు చున్నది గాన నీవు చెప్పిన నియమమునకు వ్యభిచారము సంభవించుటచే నియమము కుదరదు.

మరియు "స్త్ర్యయోనిజాః" అనెడి 179 వ వేదాంత దర్శన సూత్రమునందు ఈవిధముగా చెప్పబడి యున్నది. మరియు 3-1-20 "దర్శనాచ్చ" అనెడి బ్రహ్మసూత్ర భాష్యమున ఇట్లు గలదు.

'నాలుగు విధములైన భూత సముదాయమునందు (జరాయుజ అండజ, స్వేదజ, ఉద్భిజములనెడి) స్వేదజములును, ఉద్భిజములును, స్త్రీ పురుష సంబంధము లేకయే పుట్టుట కనబడుచున్నది. గాన పుట్టుకకు పంచాహుతి సంఖ్యానియమము అంత ఆదరించదగినది కాదు. ఇటులనే మిగతా సందర్భములయందును, పంచాహుతి నియమము లేక సృష్టికలుగునవి తెలియ తగినది. అవి చెప్పబడి యున్నది. ఐదవ ఆహుతి యందు ఉదకములు పురుష వాక్కుగల వపుతవి. అను అర్థముగల "పంచమ్యా మాహుతౌ చాపః పురుషవచసో భవన్తి" అను శ్రుత్యర్థమును చెప్పుసందర్భమున బ్రహ్మసూత్రము దాని భాష్యము ఇట్లు చెప్పినవి. అట్లే "న తృతీయోపలబ్ధేః సు॥ 3-1-18 సూత్రభాష్యమున్ను ఇట్లు గలదు. ఈ సృష్టి క్రమ విష యమున ఏ జీవులకు స్వర్గాది లోకములకు వెళ్ళుట మరల భూలోక మునం దవతరించుట సంభవించు చున్నవో వారలకు మాత్రమే 5 వ ఆహుతి యందు దేహము ఉద్భవించు చున్నది. ఆహుతు లనగా ద్యు, పర్జన్య, పృధివీ, పురుష, యోషిత్తులు. అనగా ఈ జీవుడు స్వకృత పుణ్యపాపపరిపాకవిశేషమున స్వర్గ, నరకాది లోకములు ప్రవేశించి ఆ ప్రారబ్ధము పూర్తికాగా, భూలోకమునకు అవతరించుటలో మొదట ఆకాశము అందుండి మేఘమును, మేఘము నుండి వర్షద్వారమున భూమిని, భూమి నుండి అన్నముద్వారా పురు

స్మర్యతేఽపి చ లోకే (బ్ర. సూ 3 - 1 - 19 భాష్యం
అపి చ ద్రోణధృష్టద్యుమ్నప్రభృతీనాం - సీతా ద్రౌపదీ
ప్రభృతీనాం చాయోనిజత్వం। తత్ర ద్రోణాదీనాం యోషి
ద్విషయైకాహుతి ర్నాస్తి। ధృష్టద్యుమ్నాదీనాం తు యోషి
త్పురుషవిషయే ద్వే అప్యాహుతీ న స్తః। యథా చ తత్రా
హుతిసంఖ్యాఽనాదరో భవతి॥

ఏవ మన్యత్రాఽపి భవిష్యతి। బలా కాప్యంతరేణైవ
రేతస్సేకం గర్భం ధత్త ఇతి రూఢిః॥

నీలకంఠీయవ్యాఖ్యానే ప్యేవమస్తి ॥ శ్లో ॥ అగ్నిన్
పంచక్రమాత్ప్రాప్య మావ్యమేతి మనుష్యతాం। అగ్నయ

మవి, పురమవి నుండి శుక్రకముద్వారా స్త్రీని ప్రవేసించి అచ్చటనుండి అభివృద్ధి నొంది, అభివ్యక్త రూపముతో ఆవిర్భవించును. ఇదియే పంచాహుతి క్రమము. అనేకమంది జీవులు వారివారి ప్రారబ్ధము ననుసరించి మధ్యయందే తిరుగుచు అభివ్యక్త రూపమును పొందకయే సుడిగుండములో పడిన పురుగువలె దరిచేరక పోవచ్చును. ఇదంతయు జీవుల కర్మానుసారమున భగవదధీనమైన విషయము. అందు జీవుని ప్రయోజకత్వము ఏమియు లేదు. పునర్జన్మను పొందుటలో ఎంత కాల విలంబనము, శ్రమము గలదో తెలుసుకొని జన్మించిన జీవి తరణోపాయము నాశ్రయించి ముక్తి నొందవలసిన గలుగు అనర్థమును బోధించుటకే ఇది వేదాంత శాస్త్రమున చెప్పబడి యున్నది. ఆరోహ అవరోహములు ఉన్నవారికి ఈ పంచాహుతి నియమము తప్పదు. ఆరోహ అవరోహములు లేని ఇతరులకు ఆహుతి సంఖ్యానియమము లేకయే మరియొక భూతముతో సంబంధించిన ఉదకముంచేతనే దేహము ఆరంభింప బడుచున్నది.

"స్మర్యతేపి చ॥ లోకే" బ్ర॥ సూ 3-1-19 యొక్క శంకర భాష్యమున ఇట్లు చెప్పబడినది. "ద్రోణుడు, ధృష్టద్యుమ్నుడు. సీతాదేవి; ద్రౌపది, మొ॥వారు అయోనిజులని పురాణములయందు ప్రసిద్ధమే కదా। వారిలో ద్రోణాదుల విషయమున ద్యు పర్జన్య పృధివీ. పురుష. రూప నాలుగు అహుతులు మాత్రమే కలవు. స్త్రీరూపమైన ఐదవ అహుతిలేదు.

ధృష్టద్యుమ్నాదులకు పురుష; స్త్రీరూపమైన రెండాహుతులు లేవు, మగతా మూడు ఆహుతులు కలవు. కావున సృష్టికి అంతకును అయిదాహుతులను ఉండవలెననెడి నియమములేదు. పంచాహుతు లనెడి మాట అధికముగా సృష్టి అట్లు జరుగునని చెప్ప

స్త్వగ్నిరర్కః తస్మాత్ పురుషో యోషి దిత్యపి॥ అగ్నౌ
ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యా జ్జాయతే
వృష్టి ర్వృష్టేరన్నం తతః ప్రజాః। స్త్రియో వహ్నిశ్చతు
ష్కోత్థో యోషిదగ్నేరభావతః క్షిప్తమాత్రం హవిర్వహాన్న
మిథునత్వ ముపాగతం। ఏతాగ్నిజాతతః పుత్రౌ ద్రుపదస్య
సురాధకౌ॥

అపి చ—స్కాందే। బ్రహ్మోత్తరఖండే 19 అధ్యాయే
శ్లో॥ ఈశ్వరస్య వశే మాయా తస్యా కో వేద చేష్టితం।
యూపకేతో శ్చ రాజర్షే శ్శుక్రం నిపతితం జలే। సశుక్రం
తజ్జలం పీత్వా వేశ్యా గర్భందధౌ కిల। మునేర్విభండకస్యాపి

బడినదే గాని పంచాహుతి లేక సృష్టి జరుగదు, అను తాత్పర్యము కలది కాదు.

ద్రోణాదులవలెనే లోకములో స్త్రీపురుష సంబంధము లేక సృష్టి జరుగును, చాతకపక్షులు పురుష సంబంధము లేకనే వర్షించు చున్న మేఘమునుండి ఆ వర్షధారలచేతనే గర్భమును ధరించు చున్నవి. చేపలు పురుష సంబంధము లేకనే తీక్షణమగు మగ చేపయొక్క వీక్షణముచేతనే గర్భమును ధరించుచున్నవి.

ఇట్లే లోకమునందు అనేక విధములగు సృష్టులు ప్రసిద్ధమై యున్నవి. నీలకంఠీయ వ్యాఖ్యానమునందును ఇట్లుగలదు, హోమ ద్రవ్యము అయిదు అగ్నులను క్రమముగా పొంది మానుష్యరూప మును పొందుచున్నది. ఆ అయిదు అగ్ను లేమన 1. అగ్ని 2, సూర్యుడు. 3. భూమి, 4. పురుషుడు 5 స్త్రీ. ఇట్లే అగ్నియందు మంత్ర పూతముగ బాగుగ వేల్చబడిన ఘృత పురోడాశాది రూప హవిస్సు సూర్యుని పొందుచున్నది. వర్షమువలన అన్నము, అన్నము నుండి ప్రజలును కలుగు చున్నారు, ద్రోణుడు వాల్గప అగ్నినుండియే పుట్టెను. అయిదవ అగ్నియగు స్త్రీ అచ్చటలేదుగదా! ద్రౌపది ధృష్ట ద్యుమ్నులు మొదటి అగ్నియగు అగ్నినుండియే ద్రుపద పుత్రులుగ బుట్టిరి, అగ్నియందు హవిస్సును హోమముచేసిన మాత్రముననే ఆ అగ్నికుండము నుండియే స్త్రీ, పురుష రూపములను ధరించి ఇద్దరును ఉద్భవించిరి గదా!

మరియు స్కాందపురాణమున బ్రహ్మోత్తరఖండ 19 వ అధ్యాయమున, ఇట్లు కలదు, అఘటన ఘటనాపటీయసి యగు మాయ ఈశ్వ రుని వశమైయున్నది. వాని చేష్టలను ఎవడెరుగ గలడు. పూర్వము యూపకేతువను రాజచంద్రుని యొక్క శుక్రము నీటిలో బడినది,

ఏవ మహోన్యసంఘుర్షా త్పునర్ధర్మః సముద్ధృతః 69

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
ద్వితీయోఽధ్యాయః

## తృతీయోఽధ్యాయః

సృష్ట్యాదిపాండవానాం హి వంశం వక్ష్యామి భారత।
కశ్యపో బ్రహ్మణః పుత్రః తస్మా జ్జజ్ఞే రవిస్స్వయం॥ 1

---

శుక్రం పీత్వా సహాంభసా। హరిణీ గర్భిణీ భూత్వా ఋష్య
శృంగ మసూయత। సురాష్ట్రస్య తథారాజ్ఞః కరం స్పృష్ట్వా
మృగాంగనా। తత్క్షణా ద్గర్భిణీ భూత్వా మునిం ప్రాసూత
తాపసం॥ తథైవ మహిషీ గర్భా జ్జాతశ్చ మహిషాసురః।
సాంబస్య జఠరా జ్జాతం ముసలం మునిశాపతః। యువనా
శ్వస్య గర్భోఽభూ న్మునీనాం మంత్రగౌరవాత్ ॥ ఇత్యాది॥

69. ఈ విధముగా వేరు వేరు దేవతాంశములతో పుట్టిన ధర్మరాజాదులకును రాక్షసాంశలతో పుట్టిన దుర్యోధనాదులకును, తదను యాయులకు విరోధము సంభవించి రాక్షసాంశగలవారు నశించుటచే దేవాంశసంభూతులగు ధర్మరాజాదులచే ధర్మము ఉద్ధరించబడినది.

ఇది మహాభారతసారోద్ధారమున ఆదిపర్వముయందు
ద్వి తీ యా ధ్యా య ము
స మా ప్త ము

## ౩వ అ ధ్యా య ము

1. ఓ జనమేజయా! సృష్ట్యాదినుండియు గల పాండవుల వంశమును చెప్పుచున్నాను, వినుము, బ్రహ్మయొక్క పుత్రుడు కశ్యపుడు, ఆ కశ్యపుని నుండి సూర్యుడు స్వయముగా పుట్టెను.

---

ఆశుక్రముతో గూడినజలమును త్రాగి నొక వేశ్యాస్త్రీ గర్భమును ధరించెనట. అట్లే విభండక మహర్షియొక్క శుక్రముతో కూడిన ఉదకమును త్రాగి ఒక ఆడలేడి గర్భమును ధరించినదై ఋష్యశృంగునికనెను.

సురాష్ట్రుడను రాజుయొక్క చేతిని స్పృశించి ఒకానొక ఆడలేడి ఆక్షణముననే గర్భవతియై నొక తాపసోత్తముని కనెను. ఒక గేదెయొక్క గర్భమునుండి మహిషాసురుడు పుట్టెను.ముని శాపమువలన శ్రీకృష్ణపుత్రుడగు సాంబుని గర్భమునుండి ఇనుపరోకలి పుట్టెను. యువనాశ్వునికి గర్భము మునీశ్వరులయొక్క మంత్రప్రభావము వలన కలిగెను. ఇత్యాది ఎన్నియో విదర్శనములు గలవు.

వైవస్వతో శ్రాద్ధదేవ స్తస్మా జ్జాత ఇళ స్స్వయం ।
స్త్రీపుంరూపం సమాసాద్య స్త్రీత్వేచంద్రా త్స్వయంత్విళా 2

బుధం సంజనయామాస తస్య పుత్రః పురూరవః।
చక్రవర్తీవంశకర్తా తస్మా దాయుః ప్రతాపవాన్ ॥ 3

నహుష స్తస్య పుత్రస్తు యయాతి స్తస్య నందనః।
తస్మా జ్జాతౌ దేవయాన్యాం రాజ్ఞౌతు యదుతుర్వసౌ॥ 4

శర్మిష్ఠాయాం సమ్రై జజ్ఞే సుతం ద్రుహ్యాయణం తతః।
పూరుం తు వంశకర్తారం తత్పుత్రో జనమేజయః॥ 5

తస్మా త్పరంపరాప్రాప్తో దుష్యంతో వంశవర్ధనః ॥
పౌరవాణాం వంశకరో దుష్యంతో నామ వీర్యవాన్॥ 6

---

వ్యా॥ శర్మిష్ఠాయాః పితా వృషపర్వరాక్షసః। పురాణేషు దేవానాం మానవానా మపి రాక్షసై స్సహ సంబంధబాంధవ్యాన్యపి సన్తి యథా జరాసంధః ఘటోత్కచః బాణాసురః ఇత్యాదయః। మయాదీనాం రాక్షసానాం దేవానాంచ సంబంధాః బహవో దృశ్యంతే ఇతిశం ॥

2. సూర్యుని నుండి శ్రాద్ధదేవుడను వాడును, వానినుండి ఇళుడను వాడును, పుట్టిరి. ఆ ఇళుడు కొంతకాలము స్త్రీరూపమును కొంత కాలము పురుషరూపమును శాపవశమున బొందెను.

3. స్త్రీరూపమునందున్న ఇళా అను నామె బుధుడను పేరుగల కుమారుని చంద్రునివలన గనెను. ఆ బుధుని కుమారుడు పురూరవ చక్రవర్తి అయ్యెను. ఆతని పేరుమీదనే ఆ వంశమునకు పురువంశమను పేరు వచ్చెను. ఆ పురూరవుని కుమారుడు ప్రతాపవంతుడైన ఆయువను వాడు.

4. ఆయువు కుమారుడు నహుషుడు, ఆతని పుత్రుడు యయాతి. ఆ యయాతికి దేవయానియందు యదువనియు, తుర్వసుడనియు, ఇద్దరు రాజులు కలిగిరి.

*5. ఆ యయాతి శర్మిష్ఠ యందు ద్రుహ్యుడను అను కుమారుని కనెను. తరువాత వంశకర్తయగు పూరువను వానిని కనెను, వాని యొక్క కుమారుడు జనమేజయుడు.

6. ఆ జనమేజయుని నుండి క్రమముగా దుష్యంతమహారాజు ఆ వంశమున బుట్టెను. ఆ దుష్యంతుడు గొప్ప పరాక్రమవంతుడును, పౌరవ వంశమును స్థాపించిన వాడును ఆయెను.

---

*వ్యా॥ శర్మిష్ఠ యొక్క తండ్రి వృషపర్వుడు అను రాక్షసుడు. పురాణములయందు దేవతలకును, మనుష్యులకును, రాక్షసులతో గూడ సంబంధ బాంధవ్యములు గలవు. జరాసంధుడు, ఘటోత్కచుడు, బాణాసురుడు అట్టివారలే. మనువాది రాక్షసులకును దేవతలకును అనేక సంబంధములు పురాణములందు చెప్పబడినవి.

7. సమస్త భూమండలము యొక్క నాల్గవభాగము ను ఆ దుష్యంత మహారాజు అనుభవించెను. శత్రువులను జయించు ఆ దుష్యంతుని యొక్క అనుభవములో మ్లేచ్ఛదేశము గూడ నుండెను.

8. విశ్వామిత్రునిచే మేనక యందు శకుంతల యనెడి ప్రసిద్ధినొందిన కన్యక జనించెను. ఆమె కణ్వునిచే పోషింపబడెను.

9. ఆదుష్యంతుడు గాంధర్వ విధిగా ఆమెను వివాహమాడి ఆమె యందు వంశవర్ధనుడగు భరతుడను కుమారుని గనెను.

10. ఆ భరతుడు శకుంతలా గర్భమునందు మూడు సంవత్సరములు సుఖముగా నుండినవాడై తరువాత జనించెను. మహాత్ముడగు భరతుడు యావద్భారత వర్షమునకు ప్రభువై పాలించెను.

11. ఆ భరతుడు చక్రవర్తి యు, సార్వభౌముడు నాయెను. ఆభరతుని నుండియే ఈ దేశమునకు భారతదేశ మనియు, ఆ కులము నకు భరతకులమనియు, పేర్లు వచ్చినవి.

12. ఆ భరత చక్రవర్తి బ్రహ్మదేవునినుండి లెక్కించవగా 29 వ పురుషుడు. ఆ భరతునికి సుమనసుడు అనువాడును. ఆ సుమన సునకు సుహోత్రుడును బుట్టిరి.

---

వ్యా॥ ఆదిపర్వ నాల్గవ అధ్యాయమునను. బృహజ్జాతకము నందును, ఇట్లు కలదు. సూర్యుడు ఉచ్చ మునందుండగా చంద్రుడు సప్తమ స్థానమున నుండగా, ఏ శిశువునకు, గర్భాధానము కలిగినదో. (విశేషజన్మ) అతడు మూడు సంవత్సరములకు జనించును. అనిచెప్ప బడినది. అందువలన అతడు మూడు సంవత్సరములు గర్భమునం దుండెను.

హస్తీతి హాస్తిన పురం నిర్మమే హస్తినః స్వయం 13

తుహినకిరణ వంశస్థాలముక్తాఫలానాం ॥
విపులభుజ విరాజద్వీరలక్ష్మీ విభూషాణాం
హసితసురపుర శ్రీరస్తి సా హస్తినాఖ్యా
రిపుజన దురవాపా రాజధానీ కురూణాం ॥ 14

తతస్మా ద్వికుంఠనో జాత స్త్వజామీఢస్తు తత్సుతః
తస్య సంవరణో జాత స్తత్పుత్రః కురురాట్ స్వయం ॥ 15

వంశకర్తాఽభవ త్తస్మా త్పరీక్షి న్ననుజాయత
తస్మాద్భీమ స్తతో జాతః ప్రతిశ్రవస నామకః ॥ 16

రాజా ప్రతాపకో నామ తస్మాజ్జాతః ప్రభు ర్మహాన్
పుత్రార్థం స తప స్తేపే గంగాం త్రిపథగాం శివాం ॥ 17

---

కే వ్యా॥ బ్రహ్మ పు 11 అధ్యాయే పా॥ సంవరణస్య పుత్రః కురుః స ఏవ ప్రయాగక్షేత్రా ద్దక్షిణస్థలప్రదేశ కురుక్షేత్రనిర్మాతే త్యస్మి ॥

13. ఆ సుహోత్రుని యొక్క కుమారుడు హస్తియను వాడు, అతడే హస్తిన పురమను పేరుగల పట్టణమును స్వయముగా నిర్మించెను.

14. చంద్రవంశమనెడి వంశమున పుట్టిన పెద్ద ముత్యముల వంటి రాజుల యొక్క విస్తారములైన భుజములనుండి పుట్టిన వీరలక్ష్మి శోభచే ప్రకాశించుచున్న హస్తినాపురమనెడి పట్టణము కలదు. అది దేవతల పురము యొక్క శోభను పరిహసించుచున్నదై శత్రువులకు అభేద్యమై కురువంశరాజులందరకు రాజధానిగ విరాజిల్లెను.

15. ఆహస్తి మహారాజునుండి వికుంఠనుడనువాడు పుట్టెను. ఆవికుంఠనుని కుమారుడు అజామీఢుడు వానియొక్క కుమారుడు సంవరణుడు. ఆసంవరణుని కుమారుడే సాక్షాత్ కురురాజు.

16. ఆవంశకర్తయగు కురువునుండి పరీక్షిత్తను రాజు పుట్టెను. వాని నుండి భీముడు పుట్టెను ఆభీమునినుండి ప్రతిశ్రవుడు అనుపేరు కలవాడును పుట్టిరి.

17 వానిపుత్రుడు ప్రతాపకుడు. అతడుసంతానముకొరకు ముల్లోకములను పవిత్రము చేయుచున్నట్టియు మంగళప్రదురాలగు గంగను గూర్చి తపస్సు చేసెను.

---

• వ్యా॥ బ్రహ్మపురాణము 11 వ అధ్యాయమున సంవరణుని కుమారుడు కురువని యు. అతడే ప్రయాగక్షేత్రము కంటె గూడ అధిక ఫలము నిచ్చునటువంటి కురుక్షేత్రమును నిర్మించెనని యున్నది.

సాచ మాం త్వం గృహాణేతి దక్షిణోరుం సమారుహాత్
స్నుషార్థం ప్రతిగృహ్ణామీత్యుక్త్వా రాజ్యం చకార సః ॥ 18

తతః పుత్రాస్తు సంజాతా ।తయో వంశవివర్ధనాః
దేవాపి శ్శాంతను శ్చైవ బాహ్లీకశ్చ మహారథః ॥ 19

రాజ్యం సంత్యజ్య దేవాపి స్తపః కర్తుం వనం గతః ॥ 20

మాతామహ కులే దత్తః బాహ్లీకః పూర్వమేవహి
తేషాం గోత్రం చ రాజ్యం చ స్వీకృత్యాత్రైవ సంస్థితః ॥ 21

కౌరవాణాం హి రాజాసీ చ్ఛంతను స్సాగరాంశజః ॥ 22

యం యం కరాభ్యాం స్పృశతి జీర్ణం స సుఖమశ్నుతే
పున ర్యువా చ భవతి తస్మాత్తం శంతనుం విదుః ॥ 23

తం భర్తారం సమాసాద్య గంగా ఛందానువర్తినం
శప్తాన్ వసూ న్సప్తపుత్రాన్ గంగాంభసి నిపాతితా ॥ 24

18 ఆగంగాదేవియు ప్రత్యక్షమై నన్ను నీవు స్వీకరించుమని పలుకుచు అతనియొక్క కుడితొడయం దాసీనురాలయ్యెను. ఆప్రతాపకుడు నీవు భార్యకు యోగ్యమైన ఎడమతొడను వదలి కుడితొడయందు గూర్చుంటివి గాన నిన్ను కోడలనుగా గ్రహించగలనని పలికి రాజ్యమును పరిపాలించెను.

19. తరువాత కొంతకాలమునకు వంశవివర్ధకులగు 1. దేవాపి 2 శంతనుడు 3. మహారథుడగు బాహ్లీకుడు అను ముగ్గురు పుత్రులు కలిగిరి.

20. అందులో పెద్దవాడగు దేవాపి రాజ్యమును వదలి తపస్సు చేసికొనుటకు వనమునకు వెళ్ళెను.

21 అంతకు పూర్వమే బాహ్లీకుడు మాతామహకులమునకు దత్తతగా నొసంగబడెను. అతడు వారియొక్క గోత్రమును, రాజ్యమును స్వీకరించి అచ్చటనే ఉండిపోయెను,

22. సముద్రుని అంశచే పుట్టిన శంతనుడను వాడు కౌరవ వంశమున కంతకును రాజాయెను.

23. ముసలివాడును, జీర్ణించిపోయినవాడును నగు ఎవనినైనను తన హస్తములచే తాకినచో అతడు సుఖమును పొందును. మరల యువకుడగును. ఈవిధముగా సుఖమును కలుగజేయు వాడుగుటచే నాతనికి శంతనుడను పేరు సార్ధకమయ్యెను.

24. గంగాదేవి ఆమె కోరికను అనుసరించు షరతుతో ఈ శంతనుని భర్తగా పొంది వశిష్టునిచే శపింపబడిన ఏడుగురు వసువులను పుత్రులుగా కని వారిని పుట్టిన వెంటనే గంగలో పడవైచెను.

తే పున స్స్వర్గ మాయాతాః కనిష్టమపి తద్విధం
అష్టమం తు వసుం భీష్మం శంతనుర్న దదౌ తదా ॥ 25

గంగా ప్రతిజ్ఞాం సంశ్రుత్వా నదీ భూత్వా స్వపుత్రకం
ద్వాత్రింశ ద్వర్ష పర్యంతం బ్రహ్మచర్యే నియమ్య వై
వసిష్ఠేన చ రామేణ వేద్యాం విద్యాం ప్రదాపితా ॥ 26

స శంతను స్సృగం ఫత్వా గంగా మనుసర న్నదీం
భాగీరథీ మల్పజలాం శంతను ర్దృష్టవా న్నృపః 27

తతో నిమిత్త మన్విచ్ఛన్ దదర్శ స మహామనాః
కుమారం రూపసంపన్నం బృహత్కాంతం చారుదర్శనం ॥ 28

కృతాస్త్రం గంగాం సమావృత్య శరైస్తీక్ష్ణై రవస్థితం
శంకమానం సుతం భీష్మం గంగా ప్రత్యర్పయ త్సుతం ॥ 29

గుణవంతం మహాత్మానం యూవరాజ్యే భ్యషేచయత్ ॥30

25. ఈవిధముగా మరణించిన ఆయేడుగురును శాపవిమోచనమై స్వస్వరూపములను ధరించి స్వర్గలోకమును పొందిరి. కనిష్ఠుడుగా పుట్టిన ఎనిమిదవవసువగు భీష్ముని గంగలో పడవైచుటకు శంతనుడు అంగీకరించ లేదు.

26. గంగయు నీప్రతిజ్ఞను నీవు భంగమొనర్చితివని పలికి మరల నిజ స్వరూపమగు నదీరూపమును పొంది తన కుమారుడగు భీష్ముని పెంచి పోషించి ముప్పదిరెండు సంవత్సరముల పర్యంతము బ్రహ్మచర్యవ్రతము చేయించి వసిష్ఠునిచేతను, పరశురామునిచేతను నేర్వదగిన వేదశాస్త్రాదివిద్యలను, అస్త్రశస్త్రాదివిద్యలను నేర్పించినది.

27. ఒకానొకప్పుడు శంతను మహారాజు మృగములను వేటాడి గంగా నది ననుసరించి వెళ్ళుచు గంగానదిని స్వల్పమైన జలముగలదానినిగ చూచెను.

28. అంతట గంగలో నీరెండిపోవుటకు కారణమును అన్వేషింప కొంత దూరము వెళ్ళినవాడై అచ్చట నొక ఆజానుబాహువు, సుందరుడును విశాలమగు నేత్రములుగల నొక యువకుని చూచెను.

29. అతడు తన తీక్ష్ణమైన బాణములచే గంగానదిప్రవాహమును ఆనకట్ట వలె అడ్డగించి యున్న కుమారుని చూచి తనకుమారుడే యని సందేహపడెను. ఇంతలో గంగాదేవి ప్రత్యక్షమై శంతనుమహారాజు గారికి నీకుమారుడీతడే యని సమర్పించినది.

30. ఆశంతనుడు గుణవంతుడును మహాత్ముడును పరాక్రమశాలియు నగుభీష్ముని ఇంటికి గొనివచ్చి యువరాజుగా పట్టాభిషేకము చేసెను

పౌరవాన్ శంతనోః పుత్రః పితరం చ మహాయశాః
రాష్ట్రం చ రంజయామాస వృత్తేన భరతర్షభః ॥ 31

శంతను ర్మృగయాం గత్వా దాసకన్యాం నిరీక్ష్య సః
రూపమాధుర్యగంధైస్తాం కామయామాస శంతనుః ॥ 32

సాపి కన్యా నృపం దృష్ట్వా ప్రోవాచ మృదులస్వనం।
పితురాజ్ఞాం తు పురస్కృత్య కరిష్యామీతి తం నృపం॥ 33

ప్రతిగమ్యాస్తినపురం మోహోపహత చేతసః
మనస్తాపేన కామేన భీత్యా కార్శ్య ముపాగతః ॥ 34

తం జ్ఞాత్వా పితరం భీష్మో సవృద్ధైః క్షత్రియై ర్వృద్ధైః
అభిగమ్య వనం దాశం కన్యాం వవ్రే పితు స్స్వయం ॥ 35

దాశఉవాచ

♦ అపత్యంచైత దార్యస్య యో యుష్మాకం సమో గుణైః

---

♦వ్యా॥ వేదవ్యాసం సత్యరూపం ప్రసూతా తేన కారణాత్ దేవాస్సత్యవతీ త్యుక్తా తస్మాత్సత్యవతీచ సా ఇతి స్కాందే ప్రతిపాదితం॥

31. శంతనుని పుత్రుడును గొప్పకీర్తిగల వాతడు పౌరవుఁను రాష్ట్రి మును తండ్రివితనచరిత్రచే (నడవడిచే) మిక్కిలి రంజింపచేసెను.

32. శంతనుడు మరియొకప్పుడు వేటకువెళ్ళి దాశరాజపుత్రియగు సత్యవతిని గాంచి ఆమెయొక్క గొప్ప సౌందర్యము చేతను యోజన పర్యంతము వ్యాపించుచున్న ఆమెయొక్క శరీరసౌగంధ్యముచేతను ఆమెను మోహించెను.

33. ఆ సత్యవతియను కన్యకయు రాజును చూచి, మృదుమధుర స్వరముతో నిట్లు పలికినది. ఓరాజా! నేను తండ్రి ఆజ్ఞను పురస్కరించుకొని సంచరించుదానను. అని.

34. శంతనుమహారాజు హస్తినాపురమునకు తిరిగి వచ్చి మోహముతో ఆవరింపబడిన మనస్సు కలవాడై విచారముచేతను, కామము చేతను, భీతిచేతను, నానాటికి కృశించిపోయెను.

35. ఆవిషయమును భీష్ముడు తెలుసుకొని వృద్ధులగు క్షత్రియుల తోడను, పండితులతోను, దాశరాజునుపొంది తన తండ్రి కొరకు తానే స్వయముగా కన్య నీయవలసినదని దాశరాజును కోరెను.

దాశరాజు చెప్పుచున్నాడు:-

36. ఈమె పూజ్యుడగు ఉపరిచర వసువుయొక్క కూతురు, మీకు

వ్యా॥ సత్యరూపుడగు వేదవ్యాసుని ఈమె కనినందు వలన దేవతలు సత్యవతి అని చెప్పిరి. అందుచే నామె సత్యవతి యను ప్రసిద్ధ నామము కలది ఆయెను. అని స్కాందపురాణమునందు చెప్పబడి యున్నది.

యస్య శుల్కా త్సత్యవతీ సంభూతా వరవర్ణినీ ॥ 36

అర్థం స్సత్యవతీం వోఢుం ధర్మజ్ఞ స్స నరాధిపః
అసితో హ్యపి దేవర్షిః ప్రత్యాఖ్యాతః పురా మయా
బలవత్సపత్నతా మత్ర దోషం పశ్యామి కేవలం ॥ 37

భీష్మ ఉవాచ ॥
యోఽస్యాం జనిష్యతే పుత్ర స్స నో రాజా భవిష్యతి।
తత్పుత్రస్తు తతో రాజా గమిష్యేతాన్స సైనికాన్ ॥ 38

ఇత్యుక్తే పునరేవాథ తం దాశః ప్రత్యభాషత॥
నాన్యథా తన్మహాబాహో సంశయోఽస్తి న కశ్చన।
తవాపత్యం భవేద్యస్తు తత్ర న స్సంశయో మహాన్ ॥ 39

భీష్మ ఉవాచ,
అపత్యహేతోరపిచ కరిష్యేఽద్య వినిశ్చయం।
అద్య ప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి॥ 40

యుక్తమైనది. క్షత్రియుడగు ఉపరిచర వసువుయొక్క వీర్యము వలన బుట్టుటచే సల్లక్షణములు గల ఈ సత్యవతి క్షత్రియు నిచే పరిణయమాడ దగినదే

37. ధర్మజ్ఞుడగు ఆశంతను మహారాజు ఈ సత్యవతిని వివాహ మాడ దగినవాడే. పూర్వము ఈమెను వివాహమాడగోరిన ఆసితుడను దేవర్షియు, నాచే నిరాకరింపబడెను. శంతనుని విషయమున బలవంతుడగు సవితి పుత్రుడుండుట కంటే వేరు అర్థాంతరము ఏమియులేదు.

భీష్ముడు చెప్పుచున్నాడు.

38. ఈమె యందు పుట్టిన పుత్రుడే మాకందరకు రాజు కాగలడు. ఆ తరువాత ఆతని పుత్రుడే రాజై సమస్త దేశమును పరిపాలించ గలడు. వారందరినినేనురక్షింతును.

39. ఈ విధముగా పలుకబడిన దాశరాజు ఆ భీష్మునితో మరల నిట్లనెను ఓ మహానుభావా! నీవిషయమున మాకెట్టి సందేహ మును లేదు. కాని నీ పుత్రుడు నీవలె రాజ్యమును త్యాగముచేసి ఈమె సంతతికి రాజ్యము నొసంగునా యను విషయమునమాత్రము గొప్ప సందేహము గలదు.

భీష్ముడు చెప్పుచున్నాడు.

40. ఓ దాశరాజా! నా సంతాన విషయమున గూడ ఒక నిశ్చయము ను చేయుచున్నాను. నేటి నుండి నేను బ్రహ్మచర్య వ్రతమును పూను చున్నాను. అట్లగుచో సంతానమే కలుగదు. కాన వారి విషయ మున నీకెట్టి సందేహము కలుగు నవకాశము లేదుగదా!

అపుత్రస్యాఽపి మే లోకా భవిష్యంత్యక్షయా దివి ।
తతోఽంతరిక్షే ప్సరసో దేవాస్సర్షిగణా స్తదా ।
అభ్యవర్షంత కుసుమై ర్భీష్మోఽయమితి చాబ్రువన్ ॥ 41

తచ్ఛ్రుత్వా దాశరాజోఽథ దదౌ కన్యా మలంకృతాం ॥ 42

1 తతో వివాహే నిర్వృత్తే స రాజా శంతను ర్నృపః ।
శ్రుత్వాతు దుష్కరం కర్మ కృతం భీష్మేణ శంతనుః
స్వచ్ఛందమరణం తుష్టో దదౌ తస్మై మహాత్మనే॥ 43

భీష్మ సత్యేన సంప్రాప్తాం తాం భార్యాం శంతనుర్నృపః ।
సత్యవత్యభిధాం చక్రే పుత్రవృత్తస్య ఖ్యాపనే ॥ 44

సత్యవత్యాం తు పుత్రౌ ద్వౌ జనయామాస శంతనుః ।
వీరం చిత్రాంగదం నామ ద్వితీయం చిత్రవీర్యకం॥ 45

అప్రాప్తవతి తస్మింస్తు యౌవనం పురుషర్షభే ।
స రాజా శంతను ర్ధీమాన్ కాలధర్మ ముపేయివాన్ ॥ 46

స్వర్గతే శంతనౌ భీష్మః చిత్రాంగద మరిందమం ।
స్థాపయామాస రాజ్యే వై సత్యవత్యా మతే స్థితః ॥ 47

1 ఆది 101 అ

41. అపుత్రకుడనైనను నాకు స్వర్గమున అక్షయలోకములు సంభవింపగలవు అప్పుడు ఆకాశమునందున్న అప్సర, దేవ, ఋషి సంఘములు పుష్పవర్షములను కురిపించిరి అంత భీషణమైన ప్రతిజ్ఞ నొనరించుటచే ఈతడు భీష్ముడని ప్రసిద్ధి కలవాడగునని పలికిరి.

42. అది విని దాశరాజు సంతోషించినవాడై అలంకరింపబడిన ఆకన్యను శంతనున కిచ్చి వివాహము చేసెను.

43. వివాహము జరుగగా శంతనుమహారాజు భీష్మునిచే నాచరింపబడిన దుష్కరమగు ప్రతిజ్ఞను విని సంతోషించినవాడై మహాత్ముడగు భీష్మునకు స్వచ్ఛందమరణమను వరమును ప్రసాదించెను.

44. భీష్మునియొక్క సత్యమైన ప్రతిజ్ఞచే పొందబడిన ఆభార్యకు శంతనుడు తన పుత్రునియొక్క సత్యప్రతిజ్ఞను లోకమున ప్రఖ్యాపనము చేయుటకు గాను ఆమెకు సత్యవతి యను పేరు పెట్టెను.

45. శంతను మహారాజు ఆ సత్యవతియందు వీరుడగు చిత్రాంగదుడు విచిత్ర వీర్యుడు అను ఇరువురు కుమారులను గనెను.

46. చిత్రాంగదుడు యువకుడుగాక పూర్వమే ధీమంతుడగు శంతను మహారాజు కాలధర్మము నొందెను.

47 ఈవిధముగా శంతనుమహారాజు స్వర్గతుడు కాగా సత్యవతి యొక్క అనుమతితో పరాక్రమశాలియగు చిత్రాంగదుని భీష్ముడు రాజ్యమునందు అభిషేకము చేసెను.

సతు చిత్రాంగద శ్శూరాన్సర్వాం శ్చిక్షేప పార్థివాన్ ।
గంధర్వరాజో బలవాం స్తుల్యనామా భ్యయాత్తదా॥ 48

నద్యాస్తీరే సరస్వత్యా స్సమాస్తి్రస్రోఽభవ ద్రణః ॥
నిర్వికల్పక యోగస్థే భీష్మే చారణ్యగోచరే ॥ 49

వరయోగా త్స గంధర్వో మహాశూరం కురూద్వహం।
స హత్వాతు నరశ్రేష్ఠం చిత్రాంగద మరిందమం। 50

అంతం కృత్వా తు గంధర్వో దివమాచక్రమే తతః॥
భీష్మ శ్శాంతనవో రాజా ప్రేతకార్యా ణ్యకారయత్ ॥ 51

విచిత్రవీర్యం భీష్మోఽపి బాల మప్రాప్తయావనం ।
కురురాజ్యే మహాబాహురభ్యషించ దనంతరం॥ 52

సంప్రాప్తయావనం దృష్ట్వా భ్రాతరం ధీమతాం వరం।
భీష్మో విచిత్రవీర్యస్య వివాహా యాకరోన్మతిం ॥ 53

జగామానుమతే మాతుః పురీం వారాణసీం ప్రభుః ।
కాశీరాజస్య కన్యానాం దృష్ట్వా తత్ర స్వయంవరే ।
నానాదేశాధిపాన్ శూరాన్ నృపాన్ ప్రాహాత్ర సంస్థితాన్।

భీష్మ ఉవాచ

త్వం వినా భార్గవం రామం గణయే న నరాధిపాన్।

48. ఆ చిత్రాంగదుడు తన పరాక్రమముచే రాజులందరిని జయించెను. ఒకానొకప్పుడు బలవంతుడగు చిత్రాంగదుడను గంధర్వ రాజు ఇతనిపై దండెత్తి వచ్చెను.

49. సరస్వతీ నదీతీరమున మూడు సంవత్సరములు ఘోరసంగ్రామము వీరుభయులకు జరిగెను. అప్పుడు భీష్ముడు అరణ్యమునందున్న వాడై నిర్వికల్పసమాధి యందుండుటచే నీ విషయము నెరుగ జాలక పోయెను.

50. వరప్రభావము వలన ఆ గంధర్వరాజు మహాశూరుడును కురుశ్రేష్ఠుడునగు చిత్రాంగదుని సంహరించెను.

51. ఈ విధముగా ఆ గంధర్వుడు వానిని సంహరించి స్వర్గలోకమునకు వెళ్ళిపోయెను. తరువాత భీష్ముడావిషయము నెరింగి చిత్రాంగదునికి ప్రేతకృత్యముల నన్నింటిని యథావిధిగా చేయించెను.

52. తరువాత భీష్ముడు బాలుడును యువకుడు కానటువంటి విచిత్ర వీర్యుని కురురాజ్యమునందభిషేకించెను.

53. తరువాత కొంతకాలమునకు సోదరుడగు విచిత్రవీర్యుడు యువకుడు కాగా భీష్ముడు ఆతనికి వివాహము చేయ నిశ్చయించెను.

54, 55. భీష్ముడు తల్లి యొక్క అనుమతితో కాశీపట్టణమునకేగి అచ్చట కాశీరాజు కుమార్తెలను చూచి, వారల స్వయంవరమునందు నానా దేశములనుండి వచ్చిన మహులగు రాజులను గూర్చి ఇట్లు పలికెను.

భీష్ముడు చెప్పుచున్నాడు.

56. ఆ భార్గవరాముని కన్న నేనెక్కువగు రాజుల నెవ్వరిని యుద్ధమున

స్థితోఽహం పృథివీపాలా యుద్ధాయ కృతనిశ్చయః 56

ఏవముక్త్వా మహీపాలాన్ కాశీరాజస్య చాజ్ఞయా।
అధోముఖా న్నిరీక్ష్యైవ నానాదేశాధిపాన్ తదా॥ 57

సర్వాః కన్యా స్స కౌరవ్యో రథ మారోప్య చ స్వయం।
ఆమంత్ర్య చ స తాన్ ప్రాయాన్నాగ్రే హాస్తిపురం ప్రతి॥ 58

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
తృతీయోఽధ్యాయః
సమాప్తః

## చతుర్థోధ్యాయః

తత స్సుమభవ ద్యుద్ధం తేషాం తస్య చ భారత।
ఏకస్య చ బహూనాం చ తుములం రోమహర్షణం। 1

తాన్విజిత్యాశు తు రణే సర్వాశస్త్రభృతాం వరః।
గమ్యమానే సాల్వరాజః అంబాసక్తో మహారథః।
స్త్రీకామ స్తిష్ఠ తిష్ఠేతి భీష్మ మాహ స పార్థివః। 2-3

అస్త్రైరస్త్రాణి సంవార్య సాల్వరాజస్య కౌరవః।
జిత్వా విసర్జయామాస సజీవం నృపసత్తమం। 4

లెక్కబెట్టను. ఓ రాజులారా! యుద్ధమునకు సన్నద్ధుడనై నే నున్నాను. సమర్థులగుచో మీరు ముందుకు రావచ్చును.

57. ఈ విధముగా పలుకగా తలలు వంచుకొని ఉన్న వివిధదేశరాజులనుచూచి కాశీరాజు యొక్కయు అనుమతిని పొంది ఆ కన్యకలను తీసుకొనెను.

58. ఈ విధముగా ఆ కన్యకలను స్వీకరించి తన రథమున నెక్కించుకొని అచ్చటనున్న రాజుల యొక్కయు, కాశీరాజు యొక్క అనుమతి పొంది హస్తినాపురమును గూర్చి శీఘ్రముగా తిరిగి వచ్చెను

ఇది శ్రీ మహాభారత సారోద్ధారమున ఆది పర్వయందు
మూడవ అధ్యాయము
సమాప్తము

# 4 వ అ ధ్యా య ము

1. తరువాత ఒక్కడగు భీష్మునకును అనేకమంది యగు నానాదేశ రాజులకును భయంకరమగు ఘోరసంగ్రామము జరిగినది.

2, 3. సర్వశస్త్రాస్త్ర ధురంధరుడగు భీష్ముడు స్వల్పకాలములో వారలనందరను జయించి వచ్చుచుండగా అంబయందాసక్తిగల మహారథుడగు సాల్వరాజు స్త్రీ కాముకుడై ఓ భీష్మా! నిలువు, నిలువుమనియు, నాతో యుద్ధము చేయుమనియు పలికెను.

4. భీష్ముడు ఆ సాల్వరాజుయొక్క అస్త్రములనన్నింటిని వారించి వానిని జయించి నృపసత్తముడగు నాతనిని సజీవముగా విడిచి పెట్టెను.

స్నుషా ఇవ స ధర్మాత్మా భగినీరివ చానుజాః।
యథా దుహితరశ్చైవ పరిగృహ్య కురూ న్యయౌ॥ 5

వివాహం కారయిష్యంతం భీష్మం కాశీపతేః సుతా।
జ్యేష్ఠా తాసా మిదం వాక్య మబ్రవీ ద్ధసతీ తదా॥ 6

మయా సౌభపతిః పూర్వం మనసా హి వృతః పతిః।
తేన చాస్మి వృతా పూర్వమేవ కామశ్చమే పితుః॥ 7

ఏవముక్త స్తయా భీష్మః అంబం తాం విప్రసంసది।
అనుజజ్ఞే తదా జ్యేష్ఠాం స్త్రీభిః కాశీపతే స్సుతాం॥ 8

సాపి సౌభపతిం గత్వా తేన చాపి బహిష్కృతా।
పునః పితర మాసాద్య సర్వం తస్య న్యవేదయత్॥ 9

సోఽపి దుఃఖా త్స్వదుహితాం జామదగ్న్యస్య సన్నిధిం।
ప్రాపయిత్వా తు భోస్వామిన్ కన్యా మేనాం సముద్ధర
గాంగేయం ప్రాపయస్వేతి శరణం ప్రాప్తవాన్ మునిం॥ 10

అచ్ఛిష్య ఏవ భీష్మోఽపి త్యక్త్వా రామ స్తయా సహ।
ప్రాప్య హస్తిపురం భీష్మ మాహ చైనా మపి స్వయం।
భ్రాత్రే దాతవ్య మిత్యుక్తే న స జగ్రాహ తద్వచః॥ 11-12

5. ఆ కాశీరాజు కూతులను ధర్మాత్ముడగు భీష్ముడు కోడండ్రను వలె, తోబుట్టువులను వలె, కుమార్తెను వలె విష్కల్మషమైన భావముతో గ్రహించి కురుదేశమునకు వెళ్ళిపోయెను.

6. వారలకు విచిత్రవీర్యునితో వివాహము చేయుచుండగా కాశీరాజు కూతుళ్ళలో పెద్దదియగు అంబ చిరునవ్వు నవ్వుతూ భీష్మునితో విట్లు పలికినది.

7. ఓయీ। నాచే ఆ సాల్వభూపతి పూర్వము మనఃపూర్వకముగా వరింపబడిన భర్త. వానిచే గూడ పూర్వమే నేను వరింపబడితిని. ఇదియే నా తండ్రిగారికిని ఇష్టమైనది.

8. ఈ విధముగా విప్రసభయందు అంబచే చెప్పబడినవాడై కాశీరాజ పుత్రిక యగు నామెను అంగీకరించి కొంతమంది స్త్రీలతో ఆమెను సగౌరవముగా సాల్వరాజు కడకు పంపెను.

9. అంబ సాల్వరాజును పొంది వానిచే నిరాకరింపబడినదై మరల తండ్రి వద్దకు వచ్చి జరిగిన సర్వ వృత్తాంతమును వానికి నివేదించెను.

10. అతడు దుఃఖము కలవాడై అంబను తీసుకొని పరశురాముని సన్నిధి కేగి ఓ మహానుభావా। నా యీ కన్యకను ఉద్ధరించుము. మరల భీష్ముని పొందించుము. అని వానిని శరణువేడెను.

11. పరశురాముడు భీష్ముడు నా శిష్యుడే యని పలికి అంబను వెంట పెట్టుకొని హస్తినాపురమునకు వచ్చి నీ సోదరునితో ఈమెకు వివాహము చేయుమని స్వయముగా పలికెను ఆ వాక్యమును భీష్ముడు అంగీకరించలేదు.

తతః ప్రవృత్తే యుద్ధే తు మోహనాస్త్రేణ భార్గవః।
జితోఽస్త్రమితి తాం కన్యాం పితరం ప్రాపితః పునః॥ 13

సాఽపి భీష్మం హనిష్యామీత్యుక్త్వా తప్త్వా శివాద్వరం।
ప్రాప్య పాంచాలరాజస్య పుత్రికాభూత్తతశ్చ సా॥ 14

పురుషత్వ మవాప్యాథ శిఖండీతి జనైః శ్రుతః। 15

అంబికాంబాలికే భార్యే ప్రాదాద్భీష్మోఽనుజస్య చ।
తాభ్యాం స సమాః సప్త విహరన్ పృథివీపతిః।
విచిత్రవీర్య స్తరుణో యక్ష్మణా సమగృహ్యత చ।
జగామాస్త మివాదిత్యః కౌరవ్యో యమసాదనం॥ 16–17

తత స్సత్యవతీ దీనా గాంగేయం వాక్యమబ్రవీత్। 18

* ఇమే మహిష్యౌ భ్రాతుస్తే కాశిరాజసుతే శుభే।
తయో రుత్పాదయాపత్యం సంతానాయ కులస్య నః 19

---

*వ్యా॥ అస్మిన్విషయే భారతేఽపి విధవావివాహప్రస్తావఃకృతఇతి కేషాంచిన్మతం॥ తత్తుచ్ఛం ॥శ్లో॥ న వివాహవిధా వుక్తం విధవావేదనం పునః॥ ఇత్యుక్త మనువచనస్య వ్యాఖ్యా॥ సచ

18, అంతట వారిద్దరకు గొప్ప యుద్ధము జరుగగా సమ్మోహనాస్త్రముచే ఓడింపబడినవాడై చేయునది ఏమియును లేక ఆ అంబను మరల తండ్రికి చేర్చెను.

14, ఆ అంబికయు భీష్ముని చంప సంకల్పించి శివుని గూర్చి గొప్ప తప మొనరించి శివుని వలన వరమును పొంది మరుజన్మమున పాంచాలరాజపుత్రికగా పుట్టెను.

15, ఆమెయే మరల పురుషత్వమును పొంది శిఖండియను పేరుతో లోకమున ప్రసిద్ధి చెందెను.

16, 17, భీష్ముడు అంబికా అంబాలికలను తన సోదరుడగు విచిత్రవీర్యునకు భార్యలనుగా ఒసగెను. వారిద్దరితో యువకుడగు ఆ విచిత్రవీర్యుడు ఏడు సంవత్సరములు విశేషముగ విహరించుటచే క్షయవ్యాధిగ్రస్తుడయ్యెను. ఆ వ్యాధితో నాతడు అస్తమించిన సూర్యునివలె యమలోకమును పొందెను.

18, అంతట సత్యవతి చాల దీనురాలై గాంగేయునితో నిట్లు పలికెను.

19, ఓ భీష్మా! సుఖలక్షణసంపన్నురాండ్రగు కాశీరాజపుత్రికలగు నీ సోదరుని భార్యలగు ఈ ఇద్దరు రాజపుత్రికలయందు మన కులాభివృద్ధి కొరకై సంతానమును గనుము.

---

వ్యా॥ ఈ విషయమున భారతమునందును విధవా వివాహ ప్రస్తావన చేయబడినదని కొందరి అభిప్రాయము. అది యుక్తమైనది గాదు. వివాహ విధియందు విధవకు మరల ఎచ్చటను వివాహము చెప్పబడి యుండలేదు. అను మనువచనమునకు వ్యాఖ్యానమున వివాహవిశా

వివాహాదవిధాయక శాస్త్రేఽన్యేన పురుషేణ పునర్వివాహః ఉక్త ఇత్యుక్తత్వాత్ ॥

కిం త్విదం శాస్త్రోక్తం ఆపత్కాలే నియోగవిధిః। తదపి నాంగీకృతం భీష్మేణ॥ ఏతన్నియోగస్య మనువచనం – శ్లో॥ దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యక్ నియుక్తయా। ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే। విధవాయాం నియోగార్థే నివృత్తేతు యథావిధి। గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరం। విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి। ఏకముత్పాదయేత్పుత్ర మిత్యాద్యుక్త్వా తతః॥శ్లో॥ నైవార్హః పైతృకం రిక్థం పతితోత్పాదితో హి సః॥ తం కామజ మరిక్థీయం వృథోత్పన్నం ప్రచక్షతే ఇత్యుక్తం। మహాభారతేతు ఏతద్ఘట్ట పర్యాలోచనయా, స్త్రీపునర్వివాహా నిందాకృతేతి నిశ్చీయతే।

యక శాస్త్రమునందు విధవకు మరియొక పురుషునితో పునర్వివాహము ఎచ్చటను చెప్పబడలేదు. అని చెప్పుటచే వివాహప్రసక్తి ఇచ్చట చెప్ప బడలేదు.

మరేమన శాస్త్రోక్తమైన ఆపద్ధర్మముగా చెప్పబడిన నియోగ విధియే ఇచ్చట సత్యవతిచే కోరబడినది. అదియు భీష్మునిచే నిరాకరింప బడినది. ఈ నియోగవిధికి ఆధారమగు మనువచనము చెప్పబడుచున్నది. మరిదినుండి గాని సపిండుని నుండి గాని సంతానార్థియగు స్త్రీ పెద్దల అనుమతితో వంశనాశము సంభవించిన సందర్భమున సంతానమును బడయవచ్చును. ఈ విధముగా నియోగింపబడిన విధవ సక్రమముగా ఆ విధి జరిగిన తరువాత అతనియందు గురువునందు వలె సంచరింప వలెను. ఆతడును ఈమెయందు సోదరియందువలె మెలగవలెను. విధవ యందు నియోగింపబడినవాడు రాత్రియందు నేతితో శరీరమునంతయు పూసుకొని వాక్ నియమము గలవాడై స్తనగ్రహణ చుంబనాలింగన కాముక వ్యాపారములను వర్జించి విత్తనములను వెదబెట్టు వ్యవ వ్యవసాయదారునివలె నిష్కాముకుడై ప్రవర్తింపవలెను. అదియు ఒక్క పుత్రునే కనవలయును. అని చెప్పి అటు తర్వాత ఈ నియోగవిధి యందు పురుషునకు కామప్రవృత్తి కలిగినచో అతడు పతితుడగును. వాని వలన బుట్టిన వాడును పతితుడై తండ్రియొక్క దాయ భాగమునకు అనర్హుడగును. అట్లయినగా పతితుడగు పుత్రుడు తండ్రికి చెందనివాడయి తండ్రికి ఊర్ధ్వగతులను కల్గింపలేని వాడగుటచే వ్యర్థుడగునని చెప్పబడినది.

మహాభారతమందలి ఈ ఘట్టమును చక్కగా పరిశీలించినచో స్త్రీ పునర్వివాహము ప్రస్తావింపబడినది, గాని అంగీకరింప బడలేదు.

మన్నియోగా న్మహాబాహో ధర్మం కర్తు మిహార్హసి।
రాజ్యే చైవాభిషించస్వ భారతా ననుశాధి చ॥ 20

భీష్మ ఉవాచ ॥

త్యజేచ్చ పృథివీ గంధ మాపశ్చ రస మాత్మనః।
న త్వహం సత్య ముత్స్రష్టుం వ్యవసేయం కథంచన॥ 21

సత్యవత్యువాచ॥

జానామి తే స్థితిం సత్యే పరాం సత్యపరాక్రమ।
ఆపద్ధర్మం త్వ మావేక్ష్య వహ పైతామహీం ధురం॥ 22

భీష్మ ఉవాచ ॥

భార్గవాస్త్రేణ పూర్వం హి దగ్ధం రాజకులం తదా
ఉత్పాదితా న్యపత్యాని బ్రాహ్మణై ర్వేదపారగైః॥ 23

* పాణిగ్రాహశ్చ తనయ ఇతి వేదేషు నిశ్చితం
తథాంఛతమనాజ్ఞాతా రాజపుత్రామహాబలాః ॥ 24

---

* వ్యా॥ భారతే ఆదిపర్వాంతర్గత సంభవ పర్వణి 100 అధ్యాయే భీష్మః - పూర్వం దీర్ఘతమ శ్చాంధో విద్వా;

20. ఓ మహానుభావా! నా నియోగముచే నీవీ ధర్మమును ఆచరించ దగి యున్నావు. దేశమరాచకముగ నుండకూడదు. గావున నీవు రాజ్యాభిషేకము పొంది ఈ భారతీయులను పరిపాలింపుము.

భీష్ముడు చెప్పుచున్నాడు.

21. తల్లీ! భూమి తన గుణమగు గంధమును, ఉదకము తనగుణమగు రసమును వదలి పెట్టుగాక. కాని నేను నా సత్య ప్రతిజ్ఞను ఎట్టిగాను విడిచి పెట్టను.

సత్యవతి చెప్పుచున్నది.

22. ఓయీ! నీ ధర్మాభినివేశమును నే నెఱుగుదును. అయినను, ఆపద్ధర్మమును విచారించి పితృ పితామహప్రాప్తమగు రాజ్యభారమును వహించుము.

భీష్ముడు చెప్పుచున్నాడు.

23. పూర్వము రాజకులమంతయు భార్గవాస్త్రముచే నాశము గావింపబడినది. అప్పుడు వేదవేత్తలగు బ్రాహ్మణులచే, క్షత్రియ స్త్రీల యందు నియోగవిధి ననుసరించి సంతానము కనబడినది.

24. ఈ విధముగా బుట్టిన పుత్రుడు ఆస్త్రీని వివాహమాడిన వానికే పుత్రుడగునని వేదములయందు నిశ్చయింపబడి యున్నది. ఆవిధముగా అంధతమసను ఋషివలన మహాబలులగు రాజ పుత్రులు పుట్టిరి.

---

వ్యా॥ భారతమున ఆదిపర్వాంతర్గతమగు సంభవ పర్వయందు 104 వ అధ్యాయమున భీష్ముడు ఇట్లు చెప్పుచున్నాడు.

ధనవిశేషతః। వివాహ్య ద్విజకన్యాకాయాం జనయామాస పుత్రకాన్। తం మ తృప్తా స్వార్నద్యాం చోదుపేన విసర్జితః। ఔతథ్యపుత్రంజీవేన శప్తం దీర్ఘతమం మునిం। అపశ్య న్మజ్జనగతం ఉదుపేనాంభసి స్థితం।జగ్రాహ చైనం ధర్మాత్మా బలి స్సత్యపరాక్రమః ॥

తమువాచా ఽర్చయిత్వాతు యయాతి కులసంభవః మమ ధర్మార్థకుశలా న్సుతా నుత్పాదయ ప్రభో॥ ఏవముక్త స్స తేజస్వీ తం తథేత్యుక్తవా నృషిః తస్మై రాజా చ స్వాం భార్యాం సుధేష్ణాం ప్రాహిణో త్తదా॥ అంధం వృద్ధం చ తం మత్వా న సా దేవీ జగామహ। స్వాం తు ధాత్రేయికాం తస్మై వృద్ధాయ ప్రాహిణో త్తదా॥ తస్యాం కాక్షీవదాదీ న్స శూద్రయోనా వృషి స్తదా॥ జనయామాస ధర్మాత్మా పుత్రా నేకాదశైవ తు ॥

తమువాచ ఋషిం రాజా మమేమ ఇతి చాబ్రవీత్। నేత్యువాచ మహర్షి స్తం మమేమ ఇతి చాబ్రవీత్। అంధం వృద్ధం చ మాం దృష్ట్వా సుధేష్ణా మహిషీ తవ అవమన్య దదౌ మూఢా శూద్రాం ధాత్రేయికాం మమ।

తతః ప్రసాదయామాస పున స్తమృషిస త్తమం। బలి స్సుధేష్ణాం స్వాం భార్యాం తస్మై స ప్రాహిణోత్పునః॥ తాం సుదీర్ఘతమాఽంగేషు స్పృష్ట్వా దేవీ మథాఽబ్రవీత్। భవిష్యంతి కుమారా స్తే తేజసాదిత్యవర్చసః॥ అంగో వంగః

పూర్వము దీర్ఘతముఁడను మిక్కిలి విద్యావంతుడును అంధుడును ధనవంతుడు నగు ఋషి కలడు. అతడు చండికయను బ్రాహ్మణ కన్యకను వివాహమాడి పుత్రులను గనెను.

అతని భార్యయు, పుత్రులును, ధనలోభముచే గంగానదియందు ఒక తెప్పకు కట్టి ఆతనిని పారవేసిరి, ఈవిధముగా తెప్పతో మునకలిడుచు జీవించుచున్న వాతనిని బలియను చక్రవర్తి చూచి వానిని దరిచేర్చి బ్రతికించెను. యయాతికుల సంభవుడగు ఆబలిచక్రవర్తి ఆ ఋషిని పూజించి నాకుసంతానము లేదుగాన నాభార్యయందు యోగ్యమగు సంతానమును కనుమని ప్రార్థించెను. ఈ విధముగ ప్రార్థింపబడిన ఋషి అంగీకరింపగా రాజు తనపట్టపు రాణియగు సుధేష్ణను వానివద్దకు పంపెను. ఆమెయు ఈతడు వృద్ధుడు అంధుడు అనితలచి వానిని పొందక తనదాసిని వానివద్దకు పంపెను. ఆదాసీ స్త్రీయందు కాక్షీవంతుడు మొ॥ పదకొండు మంది పుత్రులను ధర్మాత్ముడగు నాతడు పుట్టించెను.

ఆ పుత్రులను గాంచి రాజు వీరలు నాకుమారులని ఋషినిగూర్చి పలికెను. ఆఋషియు వీరలు నీపుత్రులు గారు, వీరలు నాపుత్రులే యగుదురని పలికెను. మీభార్యయగు సుధేష్ణ నన్ను చూచి వృద్ధుడు, అంధుడు అని ఈసడింపుతో మూఢురాలై నన్నె శూద్ర స్త్రీయగు నొక దాసీని నావద్దకు బంపినది ఆమెయందు బుట్టుటచే వీరలు నీసంతానము కాజాలరు,

మరల ఆబలిరాజు వానిని ప్రార్థించి తన భార్యయగు సుధేష్ణను మరల నాతని వద్దకు పంపెను. అతడు ఆమె యొక్క ఆజాను బాహు శరీరమును నిమిరి చూచి, ఆమెతో నిట్లు పలికెను. ఓదేవీ! నీకు అంగ, వంగ, కళింగ, సుంహ, పుండ్ర, మొ॥ పేర్లుగల తేజస్వులగు పుత్రులు కలుగగలరు. వారిచే పరిపాలింపబడుటచే వారిపేర్లు గల

తత్తే ధర్మం ప్రవక్ష్యామి క్షాత్రం రాజ్ఞి సనాతనం ।
శ్రుత్వా సంప్రతిపద్యస్వ ప్రాజ్ఞైశ్చ స పురోహితైః ॥
బ్రాహ్మణో గుణవాన్ కశ్చి ద్ధర్మేణోపనిమంత్ర్యతాం। 25

సత్యవత్యువాచః-
పారాశర్యో మహాయోగీ స బభూవ మహాన్ ఋషిః ।
కన్యాపుత్రో మమ పురా ద్వైపాయన ఇతి శ్రుతః ॥ 26

---

కళింగశ్చ సుంహః పుండ్రాశ్చ సంజ్ఞి కాః । తేషాం దేశాః సమాఖ్యాతాః స్వనామ కథితా భువి ॥

ఏవం బలేః పురా వంశః ప్రఖ్యాతో వై మహర్షిజః
అంగా వంగాశ్చ రాజాన షట్పంచాశ త్తథేతరాః ॥

ఏవ మన్యే మహేష్వాసా బ్రాహ్మణైః క్షత్రియా భువి । జాతా పరమధర్మజ్ఞా వీర్యవంతో మహాబలాః ॥

తథైవ శ్రీమద్భాగవతే 9 స్కంధే 23 అధ్యాయే 5-6 శ్లోకాః ॥ అంగ వంగ కళింగాద్యాః సుంహ పుండ్రాంధ్ర సంజ్ఞికాః జజ్ఞిరే దీర్ఘ తమసా ద్బలేః క్షేత్రే మహీక్షితః । చక్రు స్స్వనామ్నా విషయాన్ షడిమా న్ప్రాచ్యకాంశ్చ తే ॥ ఇతి ॥

25. ఓ తల్లీ! అందువలన సనాతనమైన క్షత్రధర్మమును నీకు చెప్పుచున్నాను. అదివివి నీవు ప్రాజ్ఞులగు పురోహితులతో విచారించి యుక్తమగునట్లాచరింపుము. గుణవంతుడగు నొక బ్రాహ్మణోత్తముడు వియోగ ధర్మము ననుసరించి, నియమింపబడుగాక!

సత్యవతి చెప్పుచున్నది.

26. నాకు కన్యాపుత్రుడుగ పరాశరునివలన మహర్షి పుంగవుడును, ద్వైపాయనుడను ప్రసిద్ధినొందిన వ్యాసుడు పుత్రుడుగా పూర్వము జన్మించియుండెను.

---

అంగ, వంగ, కళింగాది దేశములును ఈ భూమండలమున ప్రసిద్ధినొందగలవు.

ఈవిధముగా బలియొక్క వంశమంతయు మహర్షి అనుగ్రహముచే బుట్టినదై లోకమునందు ప్రసిద్ధి గాంచినది. వారిపేర్లను బట్టి అంగ, వంగాది, 56 దేశములును, ఈ భరతఖండమున ప్రసిద్ధి నొందినవి.

ఈ విధముగనే బ్రాహ్మణులచే అనేకమగు క్షత్రియవంశములు వృద్ధినొందినవి. అట్లుబుట్టిన వారందరును పరమ ధర్మాత్ములును, గొప్పబలము కలవారును, పరాక్రమవంతులును: అయి వృద్ధి నొందిరి.

శ్రీమద్భాగవతమున 9 వ స్కంధము 23 వ అధ్యాయము 5, 6 శ్లోకములయందు ఇట్లుగలదు. అంగ, వంగ, కళింగ, సుంహ, పుండ్ర ఆంధ్ర అను పేరుగల అరుగురు పుత్రులు దీర్ఘతమఃమునిచే బలిరాజు భార్యయందు పుట్టిరి. వారారుగురును వారిపేర్లతో విరాజిల్లుచున్న ఈ ఆరుదేశములను భారతదేశ తూర్పుసముద్రతీరమున ఏర్పాటు చేసిరి. అవి కలదు.

తం స్మరిష్యే మహాబాహో యది భీష్మ త్వమిచ్ఛసి ।
మహర్షేః కీర్తనే తస్య భీష్మః ప్రాంజలి రబ్రవీత్ ॥ 27

ఉక్తం భవత్యా యచ్ఛ్రేయ స్తన్మహ్యం రోచతే భృశం। 28

వైశంపాయన ఉవాచ:-

♦ కృష్ణద్వైపాయనం కాళీ చింతయామాస వై మునిం ।
స వేదాన్ విబ్రువన్ ధీమాన్ మాతుర్విజ్ఞాయ చింతితం ।
ప్రాదుర్బభూవావిదితః క్షణేన కురునందన ॥ 29

తస్మై పూజాం తతః కృత్వా సుతాయ విధిపూర్వకం ।
పరిష్వజ్య చ బాహుభ్యాం ప్రస్రవై రభిషించత ॥ 30

వ్యాస ఉవాచ ॥

శాధి మాం ధర్మతత్త్వజ్ఞే కరవాణి ప్రియం తవ । 31

సత్యవత్యువాచ ॥

ఆనృశంస్యాచ్చ యద్భ్రూయా తచ్ఛ్రుత్వా కర్తుమర్హసి । 32

---

♦ వ్యా॥ కాళీతి సత్యవత్యా ఏవ అపరనామాస్తీతి భారతే ఆది ప॥ 60 అధ్యాయే॥ జనయామాస యం కాళీ శక్తేః పుత్రా త్పరాశరాత్ । కన్యైవ యమునాద్వీపే పాండవానాం పితామహం ॥ ఇతి వచనాత్ ॥

27. ఓభీష్మా! నీకు సమ్మతమగుచో ఆ వ్యాసుని స్మరించెదను వ్యాసుని విషయము చెప్పిన తోడనే దోసి లొగ్గి భీష్ముడు అంగీకరించెను.

28. తల్లీ! నీవు చెప్పిన పద్ధతి నాకును, మిక్కిలి ఇష్టమైనది.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

29. కాళియను నామాంతరముగల సత్యవతీ దేవి తన పుత్రుడగు కృష్ణద్వైపాయనుని స్మరించెను. బుద్ధిమంతుడగు ఆ వ్యాసుడును తల్లి ఆలోచనను తెలుసుకొని వేదములను పఠించుచున్నవాడై పేరు లెవ్వరికిని, తెలియబడనివాడై క్షణకాలములో తల్లియెదుట ప్రత్యక్షమాయెను.

30. ఆ సత్యవతీదేవి, కుమారుడగు వ్యాసుని యథావిధిగా పూజించి వానిని ఆలింగనము చేసుకొని ఆనందాశ్రువులతో వానిని తడిపివైచెను.

31. ధర్మతత్త్వజ్ఞురాలవగు ఓతల్లీ! నీకు ఏ ప్రియమును నేను చేయవలసియున్నది. సన్నాజ్ఞాపింపుము.

సత్యవతి చెప్పుచున్నది.

32. ఓ కుమారా! చనువువలన నేచెప్పబోవునది విని ఆపనిని నీవు చేయదగియున్నావు.

---

*వ్యా॥ కాళి యనునది సత్యవతికే మరియొక పేరు గలదని భారతము ఆదిపర్వ 60 వ అధ్యాయమున కలదు. అచ్చట శక్తిపుత్రుడగు పరాశరునినుండి కన్యయైన కాళి యమునాద్వీపమున పాండవులకు పితామహుడగు వ్యాసుని కనెనని చెప్పబడియున్నది.

యవీయస స్తవ భ్రాతు ర్భార్యే సురసుతోపమే ।
తయోరుత్పాదయాపత్యం సమర్థోహ్యసి పుత్రక ॥ 33

వ్యాస ఉవాచ ॥
వేత్థ ధర్మం సత్యవతి పరంచాపరమేవ చ ।
భ్రాతుః పుత్రాన్ ప్రదాస్యామి మిత్రావరుణయోః స్సమాన్ ।

వ్రతం చరేతాం తౌ దేవ్యౌ నిర్దిష్ట మిహ యన్మయా ।
సంవత్సరం యథా న్యాయ్యం తత శ్శుద్ధే భవిష్యతః ॥ 35

సత్యవత్యువాచ ॥
సద్యో యథా ప్రపద్యేత దేవ్యౌ గర్భం తథా కురు ।
అరాజకేషు రాష్ట్రేషు ప్రజాऽనాథా వినశ్యతి ॥ 36

వ్యాస ఉవాచ ॥
* యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతు రకాలికః ।
యది మే సహతే గంధం రూపం వేషం తథా వపుః ॥ 37

---

*వ్యా॥ అత్ర కేచిత్ వ్యాసశరీర మసహ్యావాసనా యుతమితి మత్స్యగంధీపుత్రత్వాదితి ప్రలపంతి॥ తన్మందం ॥ యోజనగంధ్యనంతర మేవ వ్యాసావిర్భావవర్ణనాత్ । తేషాం

33 నీ కనిష్ఠ సోదరునకు దేవతాస్త్రీలతో సమానమగు ఇద్దరుభార్యలు కలరు. ఓ పుత్రా! నీవు వారియందు సంతానమును కనుము, ఇందుకు నీవు సమర్థుడవై యున్నావు.

వ్యాసుడు చెప్పుచున్నాడు.

34. ఓతల్లీ! నీవు ఇహపరధర్మములను చక్కగా ఎరిగిన దానవు. సోదరునకు మిత్రావరుణులతో సమానులగు పుత్రులను అను గ్రహించగలను.

35. ఆరాణులిద్దరును నేను చెప్పిన వ్రతమును సంవత్సరకాలము యథావిధిగా చేయదగియున్నది. తరువాత వారు పవిత్రులు కా గలరు.

సత్యవతి చెప్పుచున్నది.

36. రాజులేని రాష్ట్రముల యందు ప్రజలు ప్రభువు లేని వారై నశింతురు. కావున వెంటనే వారలు గర్భమును పొందునట్లు చేయుము.

వ్యాసుడు చెప్పుచున్నాడు.

37. నాచే సోదరునకు అకాలికముగ పుత్రుడు అనుగ్రహింపబడ వలయుననుచో ఆరాణులు నాశరీరగంధమును, రూపమును, వేష మును, శరీరమును, సహించవలయును.

---

 వ్యా:- ఇచ్చట వ్యాసుడు మత్స్యగంధియొక్క పుత్రుడగుటచే వానియొక్క శరీరము అసహ్యమైన వాసనతో కూడియున్నదని కొందరు పలుకుచున్నారు. అదియుక్తముగాదు. సత్యవతి యోజనగంధి ఐన తరు వాతనేవ్యాసుడుపుట్టెనని చెప్పబడి యున్నది కదా! ఇటువంటి కువిమర్శ

విషయే ఆభాణకవాక్య మేతత్ ॥ బుద్ధిర్యథా విథా యస్య స తథా మన్యతే జగత్ ॥ ఇతి ॥

భారతే - అయం నారాయణో యోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః ॥ ఇత్యుక్తః ॥ యోగివిషయే తావత్ మార్కండేయ పురాణే - అలౌల్య మారోగ్య మనిష్ఠురత్వం గంధశ్శుభో మూత్ర పురీష మల్పం। కాంతిః ప్రసాదస్స్వర సౌమ్యతా చ యోగ ప్రవృత్తేః ప్రథమం హి చిహ్నం ॥ ఇతి ప్రతిపాదితం ॥

భారతేఽపి - తస్య కృష్ణస్య కపిలా జటా దీప్తే చ లోచనే ఇత్యాద్యుక్తత్వాచ్చ । బ్రహ్మసూత్రేష్వపి - విరోధః కర్మణీతి చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్ ॥ 1-3-27 భాష్యం ॥

స్మృతిరపి ॥ శ్లో ॥ ఆత్మనో వై శరీరాణి బహూని భరతర్షభ । యోగీ కుర్యాద్బలం ప్రాప్య తైశ్చ సర్వైః మహీం చరేత్ ॥ ప్రాప్నుయా ద్విషయాన్ కైశ్చిత్ కైశ్చి దుగ్రం తపశ్చరేత్ । సంక్షిపేచ్చ పునస్తాని సూర్యో రశ్మి గణానివ ॥

దేవతాధికరణే ॥ సూ ॥ భావం తు బాదరాయణోఽస్తిహి ॥ తత్ర భాష్యం—అస్తిహ్యైశ్వర్యయోగా ద్దేవతానాం జ్యోతిరాద్యాత్మభి శ్చావస్థాతుం యథేష్టం చ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యం ॥ శ్రూయతే చ మేధాతిథిం హ కాణ్వాయనం ఇంద్రో మేషో భూత్వాఽఽజహార ॥ ఇతి ॥

కుల విషయములో పెద్దల వాక్యమిట్లుగలదు. ఎవనిబుద్ధి ఎట్లుండునో అట్లే వాడు ఇతరజగత్తునంతను భావించును. అని

భారతమునందును ఈవ్యాసుడు సాక్షాత్తు మహాయోగి,సర్వజ్ఞుడు. అని చెప్పబడి యున్నాడు. యోగుల విషయమున మార్కండేయ పురాణమునందు మంచిఆరోగ్యము, కఠినిదుగాలేకపోవుట,మంచి గంధము స్వల్పమైన మూత్రపురీషములు శరీరమునకు విలక్షణమైన కాంతినైగనిగ్యముకంఠస్వరము మృదువుగానుండుట ఇవన్నియు యోగ సాధనకు మొట్టమొదటి గుర్తులని చెప్పబడినది. భారతమునందుము ఆ వ్యాసుడు వచ్చుటిజతలును, ప్రకాశించుచున్నటువంటి నేత్రములును. కలవాడుగా చెప్పబడియున్నది. "విరోధః కర్మణేతిచే న్నానేక ప్రతిపత్తేః దర్శనాత్" 1-3-27 అని బ్రహ్మసూత్రమునందును, దాని భాష్యమునందును, ఈయోగముకర్మకు విరుద్ధముకాదాయను ప్రశ్నరాగా అట్లుకాదు, ఏలనన యోగాభ్యాసముచే అనేక సిద్ధులు కలుగునని చెప్పుటచే కర్మతో విరోధము లేదని ప్రతిపాదింపబడినది.

స్మృతియు యోగి తనయోగబలమును పొంది తనయొక్క అనేక శరీరములను పొందగలడు ఆశరీరములతో ఈ భూమినంతను సంచరించ గలడు. కొన్ని శరీరములతో దేశములందు సంచరించగలడు. మరికొన్ని శరీరములతో ఉగ్రమైన తపస్సుచేయగలడు, మరల వాటి నన్నిటిని సూర్యుడు తన కిరణములవలెనే తనలో అంతర్ధానమును పొందించ గలడు. అనిచెప్పుచున్నది.

సూత్రభాష్యమున దేవతాధికరణమునందు "భావన్తు బాదరాయణోఽస్తి హి" అను సూత్రభాష్యమున గొప్ప యోగప్రభావము వలన దేవతలకు జ్యోతిరాది రూపములతో నుండుటకును, వారి యిష్టము వచ్చినట్లు ఆయా శరీరమును గ్రహించుటకును సామర్థ్యము గలదు, ఇంద్రుడు మేషరూపమును పొంది కణ్వవంశమునందు పుట్టిన మేధాతిథి

అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతాం ।
సమాగమన మాకాంక్షే దితి సోంతర్హితో మునిః ॥ 38

1 శ్వశ్రూ తద్వచనం శ్రుత్వా శయానా శయనే శుభే ।
తతోంబికాయాం ప్రథమం నియుక్త స్సత్యవాగ్బృషిః ॥
దీప్యమానేషు దీపేషు శయనం ప్రవివేశ హ ॥ 39

తస్య కృష్ణస్య కపిలాం జటాం దీప్తే చ లోచనే ।
బభ్రూణి చైవ శ్మశ్రూణి దృష్ట్వా దేవీ న్యమీలయత్ ॥ 40

తతో నిష్క్రాంత మాగమ్య మాతా పుత్రమువాచ హ ।
అప్యస్యాం గుణవాన్ పుత్ర రాజపుత్రో భవిష్యతి ॥ 41

---

స్మృతిరపి ఆదిత్యః పురుషో భూత్వా కుంతీ ముపజగామ హ ॥ ఇతి చ ॥

తస్మాత్ వ్యాసశరీరే విద్యమానం గంధం యోగజం ఇతరమానవ అసాధారణం స్త్రీణాం హఠాదాపతితం చేత్ గంధాతిశయా దసహ్యాః పుణ్యగంధ ఏ వేతి న మత్స్యదుర్గంధ ఇతి మంతవ్యః ॥

1 ఆది 106 అ ॥

38. ఇప్పుడె కౌసల్య (అంబిక) విశిష్టమగు గర్భమును పొందుగాక నాకలయికను కోరుచున్నదియై నారాకను నిరీక్షించుగాక. అని వ్యాసుడు అంతర్ధానమును పొందెను.

39. అత్తగారినుండి అంబికయు, నావాక్యమును విని శయనాగారమున శయనించి ఉండి మునిని నిరీక్షించు చుండెను. అంతట అంబిక యందు నియోగింపబడిన వ్యాసుడు దీపములన్నియు, ప్రకాశించు చుండగా శయనాగారమును ప్రవేశించెను.

40. ఆ అంబిక వానియొక్క పచ్చనిజటలను, ప్రకాశించుచున్న నేత్ర ములను, దీర్ఘములైన కనుబొమ్మలను, గడ్డములను, చూచి, నేత్ర ములనుమూసికొనెను.

41. తరువాత శయనాగారమునుండి బయటకు వచ్చిన పుత్రుని "ఈమె యందు గుణవంతుడగు పుత్రుడు కలుగునా ? యని సత్యవతి ప్రశ్నించెను.

---

యను వానిని హరించెనని స్మృతియందు చెప్పబడుచున్నది కదా। అట్లే భారత స్మృతియు సూర్యుడు స్వస్వరూపముతో ఆకాశమున నుండియే పురుషరూపమును ధరించి కుంతిని పొందెనని చెప్పుచున్నది కావ దేవతలకును, యోగులకును, అసాధ్యమగునది ఏమియును లేదు.

కాన వ్యాసుని శరీరమందలి గంధము యోగమహిమవలన బుట్టినదియు, ఇతర మానవులయందు లేనిదియు, హటాత్తుగా సంత వించిన స్త్రీలకు సహింప శక్యముకాని, పుణ్యగంధమేననియు, మత్స్య దుర్గంధము కాదనియు, గ్రహించ దగినది.

వ్యాస ఉవాచ ॥

నాగాయుత సమప్రాణో విద్వా న్రాజర్షిసత్తమః ।
మహాభాగో మహావీర్యో మహాబుద్ధి ర్భవిష్యతి ॥ 42

తస్య చాపి శతం పుత్రా భవిష్యంతి మహాత్మనః ।
కింతు మాతు స్స వైగుణ్యాదంధ ఏవ భవిష్యతి ॥ 43

సత్యవత్యువాచ ॥

నాంధః కురూణాం నృపతి రనురూప స్తపోధన ।
ద్వితీయం కురువంశస్య రాజానం దాతు మర్హసి ॥ 44

స తథేతి ప్రతిజ్ఞాయ నిశ్చక్రామ మహాయశాః ।
సాఽపి కాలేన కౌసల్యా సుషువేఽంధం తమాత్మజం ॥
ఋషి మావాహయ త్సత్యా యథా పూర్వ మరిందమ । 45

అంబాలికా మథాభ్యాగా దృషిం దృష్ట్వా చ సాఽపి తం ।
వివర్ణా పాండుసంకాశా సమపద్యత భారత ॥ 46

శశంస స పునర్మాత్రే తస్య బాలస్య పాండుతాం ।
తం మాతా పునరేవాన్య మేకం పుత్రమయాచత ॥ 47

తథేతి స నిరాక్రామ ద్భగవా న్నృషిసత్తమః ॥ 48

వ్యాసుడు చెప్పుచున్నాడు.

42. 10వేల ఏనుగుల బలము కలవాడును, విద్యావంతుడును గొప్ప అదృష్టవంతుడును, గొప్ప బుద్ధి కలవాడును నగు రాజర్షి చంద్రుడు పుట్టగలడు.

43. వానికి నూర్గురు మహాత్ములగు పుత్రులు కలుగగలరు. కాని తల్లి యొక్క లోపమువలన అంధుడుగా వ్మించగలడు.

సత్యవతి చెప్పుచున్నది.

44. ఓతపోధనుడా! అంధుడగు వాడు కురు రాజ్యములకు ప్రభువుగా వుండతగడు. కావున కురువంశమునకు రాజగు మరియొక పుత్రుని అనుగ్రహింపదగును.

45. అతడు వల్లెయని తల్లికి ప్రతిజ్ఞచేసి అంతర్ధానము నొందెను. ఆ అంబికయు ప్రసవకాలమున అంధుడగు కుమారుని కనెను. సత్యవతియు పూర్వమువలె మరల వ్యాసుని ఆహ్వానించినది.

46. వ్యాసుడు తరువాత అంబాలికను పొందెను. ఆమెయు, ఆ ఋషిని జూచి వివర్ణయై తెల్లబారిన ముఖముగల దాయెను.

47. ఆ వ్యాసుడు పుట్టబోవు బాలుని యొక్క పాండుత్వమును తల్లికి మరల చెప్పెను. తల్లియగు సత్యవతి మరియొక పుత్రుని అనుగ్రహించవలసినదిగా పుత్రుని కోరెను.

48. భగవంతుడును, ఋషిశ్రేష్ఠుడు, నగు ఆవ్యాసుడు అలాగే అనుగ్రహించెదనని తల్లితో చెప్పి వెళ్ళిపోయెను.

తతః కుమారం సా దేవీ ప్రాప్తకాలమజీజనత్ ।
పాండులక్షణసంపన్నం దీప్యమానం వరశ్రియా ॥ 49

ఋతుకాలే తతో జ్యేష్ఠాం వధూం తస్మై న్యయోజయత్ ।
తతస్స్వైర్భూషణైర్దాసీం భూషయిత్వాఽప్సరోపమాం ।
ప్రేషయామాస కృష్ణాయ తతః కాశిపతేస్సుతా ॥ 50

సా తం ఋషిమనుప్రాప్తం ప్రత్యుద్గమ్యాభివాద్య చ ।
సంవివేశాభ్యనుజ్ఞాతా సత్కృత్యోపచచార హ ॥ 51

కృష్ణద్వైపాయనో హ్యేతత్ సత్యవత్యై న్యవేదయత్ ।
ప్రలంభమాత్మనశ్చైవ శూద్రాయాః పుత్రజన్మ చ ॥ 52

తస్యై గర్భం సమావేద్య తతస్సోఽన్తరధీయత ।
స జజ్ఞే విదురో నామ కృష్ణద్వైపాయనాత్మజః ॥ 53

* ధృతరాష్ట్రస్య వై భ్రాతా పాండోశ్చైవ మహాత్మనః ।

---

* వ్యా॥ ధృతరాష్ట్రాదిజన్మవిషయే ఆదిపర్వణి ప్రథమాధ్యాయేఽపి ॥ శ్లో॥ మాతు ర్నియోగా ద్ధర్మాత్మా గాంగేయస్య చ ధీమతః । క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా । త్రీనగ్నీనివ కౌరవ్యాన్ జనయామాస

49. తరవాత ప్రసవకాలము రాగా అంబాలికాదేవియు తెల్లటిశరీరకాంతితో కూడుకొన్నదియు గొప్పశోభతో ప్రకాశించుచున్న కుమారుని కనెను.

50. మరల సత్యవతి ఋతుకాలమునందు పెద్దకోడలగు అంబికాదేవిని మహర్షియందు నియోగించెను. అంతట నామెయు తన భూషణములచే దాసీస్త్రీ నలంకరింపచేసి కృష్ణద్వైపాయనుని దగ్గరకు పంపించెను.

51. ఆదాసియు వచ్చిన మహర్షిని ఎదురొడ్డి నమస్కరించి ఆతని యనుజ్ఞవడసి వానిని బొందినదై ఆవ్యాసుని సేవించినది.

53. కృష్ణద్వైపాయనుడును తన్ను అంబిక వంచించిన విషయమును దాసియందుపుట్టబోవు విదురుని జన్మవృత్తాంతము నంతయును తల్లికి నివేదించెను.

53. ఈ విధముగా నాతడు ఆదాసియందు గర్భోత్పత్తిని గావించి అచటనే అంతర్ధానమాయెను. విదురుడను పేరుగల కృష్ణద్వైపాయనుని కుమారుడు ఆదాసియందు దావిర్భవించెను.

* 54 ఈ విధముగా ద్వైపాయనుని వలన విచిత్రవీర్యుని భార్యలయందు

---

* వ్యా:- ధృతరాష్ట్రాదుల జన్మవిషయమున ఆదిప 1 అ. ఇట్లుచెప్పబడినది. ఆదేశన ధర్మాత్ముడగు వ్యాసుడు తల్లి యొక్క నియోగమువలనను ధీమంతుడగు భీష్ముని నియోగము చేతను విచిత్రవీర్యుని భార్యలయందు కౌరవవంశీయులగు ముగ్గురను మూడగ్నులవలె పుత్రుల సృష్టించెను.

ఏతే విచిత్రవీర్యస్య క్షేత్రే ద్వైపాయనాదపి ।
జజ్ఞిరే దేవగర్భాభాః కురువంశవివర్ధనాః ॥ 54

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
చతుర్థోఽధ్యాయః
సమాప్తః

---

బీజప్రాధాన్య క్షేత్రప్రాధాన్య వ్యవస్థాయాం మనుస్మృతిః ॥ శ్లో ॥ యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే । తాదృగ్రోహతి తత్తస్మిన్బీజం స్వైర్వ్యంజితం గుణైః ॥ ఇతి బీజప్రాధాన్యపక్షనిరూపణార్థం ఉక్త శ్లోకః ॥

తత్ర కుల్లూకభట్టవ్యాఖ్యా ॥ విశిష్టం కుత్రచిద్బీజం స్త్రీయోనిస్త్వేవ కుత్రచిత్ ॥ తథా చ వ్యాసఋష్యశృంగాదయో బీజినామేవ సుతాః । విచిత్రవీర్యక్షేత్రే తు క్షత్రియాయాం బ్రాహ్మణోత్పాదితాః క్షత్రియాః శూద్రాయాం తు శూద్రః అభవన్ ॥

అత్ర మనుః ॥శ్లో॥ తపోబీజప్రభావైస్తు తే గచ్ఛంతి యుగే యుగే । ఉత్కర్షం ఇతి అ 10 శ్లో 41 తత్ర కుల్లూక భట్టః। వ్యా॥ స జాతిజానంతరజాః తపః ప్రభావేణ విశ్వామిత్ర

ధృతరాష్ట్రుడును, పాండుమహారాజును, విదురుడును జనించిరి. వీరలు దేవపుత్రులతో సమానులను కురువంశవివర్ధనులుమ నాయిరి.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున ఆదిపర్వయందు
నాలుగవ అధ్యాయము
సమాప్తము

---

బీజము ప్రధానమా! క్షేత్రము ప్రధానమా! అను విషయమున మనుస్మృతి ఇట్లు వ్యవస్థ చేయుచున్నది. శ్లో॥ ఎటువంటి బీజము ఋతుకాలమందు ఉంచబడుచున్నదో ఆబీజము తనయొక్క గుణములతో అటువంటి పుత్రునే కలిగించును. క్షేత్రము యొక్క గుణాగుణములు ఆపుత్రునియందు సంక్రమించవు. ఈ విధముగా బీజము ప్రధానమనెడి పక్షమును నిరూపించుటకొరకు శ్లోకము చెప్పబడినది.

అచ్చట కుల్లూకభట్టువ్యాఖ్య ఇట్లు గలదు. కొన్ని సందర్భములయందు బీజముప్రధానమైనది కొన్నిసందర్భములలో క్షేత్రము ప్రధానమైనది కావుననే వ్యాసుడు ఋష్యశృంగాదులును బీజ ప్రాధాన్యమును అనుసరించి బీజియొక్క వర్ణమును అనుసరించి బ్రాహ్మణులైరి. విచిత్రవీర్యుని భార్యయగు క్షత్రియస్త్రీయందు బ్రాహ్మణుడైన వ్యాసునిచే పుట్టింపబడిన ధృతరాష్ట్ర. పాండువులు క్షత్రియులును శూద్రస్త్రీయందు పుట్టింపబడిన విదురుడు శూద్రుడును అయిరి

ఈ విషయమున మనువు ఇట్లు చెప్పుచున్నాడు. శ్లో॥ ప్రతియుగమందును తపస్సుయొక్కయు, బీజముయొక్కయు ప్రభావముచే ఉత్కృష్టస్థితిని పొందుచున్నాడు. ఈ విషయమున కుల్లూకభట్టు వ్యాఖ్యలో ఇట్లు కలదు విశ్వామిత్రునివలె తపఃప్రభావముచే క్షత్రియస్త్రీయందు బుట్టినవాడైనను గొప్పదగు బ్రాహ్మణత్వమును పొందుచున్నాడు. బీజప్రభా

# పంచమోధ్యాయః

ధృతరాష్ట్రశ్చ పాండుశ్చ విదురశ్చ మహామతిః ।
జన్మప్రభృతి భీష్మేణ పుత్రవత్పరిపాలితాః ॥ 1

సంస్కారై స్సంస్కృతా స్తేతు తతోఽధ్యయనసంయుతాః ।
వేదవేదాంగ తత్వజ్ఞాః సర్వత్ర కృతనిశ్చయాః ॥ 2

ధనుర్వేదేచ వేదేచ గదాయుద్ధేఽపి చర్మణి ।
పాండుర్ధనుషి విక్రాంతో నరేష్వభ్యధికోఽభవత్ ॥ 3

సర్వధర్మవిదాం భీష్మః పురాణాం గజసాహ్వయం ।
దేశాధిపై ర్మహర్షిభిః పౌరజానపదై స్సహ ।
ఆలోచ్య పాండురాజ స్తత్కురురాజ్యేభిషేచితః ॥ 4

---

వత్ । బీజప్రభావేణ, ఋష్యశృంగాదివత్ । కృతత్రేతాదా మనుష్యమధ్యే జాత్యుత్కర్షం గచ్ఛంతి ॥ శ్లో ॥ జాతో నార్యా మనార్యాయా మార్యా దార్యో భవేద్గుణైః । జాతోప్యనార్యా దార్యాయా మనార్య ఇతి నిశ్చయః ॥ యస్మా ద్బీజప్రభావేణ తిర్యగ్జా ఋషయోఽభవన్ । పూజితాశ్చ ప్రశస్తాశ్చ తస్మా ద్బీజం ప్రశస్యతే ॥ ఇతి ॥

# 5 వ అధ్యాయము

1. ధృతరాష్ట్రుడు, పాండురాజు, మహామతి యగు విదురుడును పుట్టినప్పటినుండియు భీష్మునిచే పుత్రులవలె సంరక్షింప బడిరి.

2. వారలు ఉపనయనాది సంస్కారములు చేయబడినవారై వేద శాస్త్రాధ్యయనమునందుంచబడిరి. క్రమముగా వేదవేదాంగముల జదివనవారయి, అన్నిటియందును పండితులయిరి.

3. వేదమునందును, ధనుర్వేదమునందును, గదా యుద్ధమునందును కత్తి యుద్ధమునందును, నిపుణులయిరి. అందులో పాండురాజు ధనుర్బాణములయందు గొప్పపరాక్రమము కలవాడై అందరిలో నధికుడాయెను.

4. భీష్ముడు సర్వధర్మవేత్తలగు హస్తినాపుర ప్రజలతోను, మహర్షులతోను, పౌరులతోను, పల్లెలయందుండు వారితోను, బాగుగా నాలోచించి పాండురాజును కురురాజ్యమునందు పట్టాభిషేకము చేయించెను.

---

వముచే ఋష్యశృంగాదులవలె కృత. త్రేతాదియుగములందు మను ష్యలు ఉత్కృష్టజాతిని పొందుచున్నారు. శ్లో॥ తక్కువజాతిస్త్రీయందు యెక్కువజాతిపురుషునిచే పుట్టినవాడు గుణములచే పూజింపదగినవాడే యగును. అనార్యునివలన యోగ్యమైన స్త్రీయందు బుట్టినవాడు గుణ ములచే అనార్యుడే యగును. ఇది నిశ్చయము, ఎందువలననగా బీజప్రభా వముచే మృగాదిజంతువులయందు ఋషులచే పుట్టినవారలు ఋషులై అందరిచే పూజింపబడినవారును, ప్రశంసింపబడిన వారును అయిరి. ...... క్షేత్రములలో బీజము ప్రధానమైనది.

ధృతరాష్ట్ర్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రతిపద్యత ।
పారశవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవహ ॥ 5

♦ఉపేత్య తాం పాండు రుదారవిక్రమః
ప్రజామనః పల్లయన్ ప్రశాసనాత్ ।
యశః ప్రకాశై ర్యమునాసఖీసఖై
ర్నినాయ లోకం నిజనామవాచ్యతాం ॥ 6

అథ శుశ్రావ విప్రేభ్యో గాంధారీం సుబలాత్మజాం ।
ఆరాధ్య వరదం దేవం భగనేత్రహరం హరం ।
గాంధారీ కిల పుత్రాణాం శతం లేభే వరం శుభా ॥ 7

భీష్మో గాంధారరాజం తు ప్రేషయామాస సోఽపి హి ।
కులం ఖ్యాతిం చ వృత్తం చ బుద్ధ్వాతు ప్రసమీక్ష్య సః ।
దదౌ తాం ధృతరాష్ట్రాయ గాంధారీం ధర్మచారిణీం ॥ 8-9

---

♦వ్యా॥ యమునా సఖ్యాః గంగాయాః, సఖాయః — తాదృశాః తైః। తాదృశై ర్ధవళైః ఇతి యావత్ । యశసః — కీర్తేః ప్రకాశైర్లోకం నిజస్య నామ్నః పాండురితి శబ్దస్య వాచ్యతా మర్థత్వం ధావళ్యమితి యావత్ । నినాయ — ప్రాపితవాన్ ఇత్యర్థః ॥

5. ధృతరాష్ట్రుడు గుడ్డివాడగుటచే రాజ్యాధికారి కాక పోయెను. అట్లే దాసీపుత్రుడగుటచే విదురుడును రాజ్యాధికారి కాకపోయెను. పాండురాజే రాజాయెను.

6. ఆ రాజ్యమును గొప్ప పరాక్రమము గల పాండురాజు పొంది తన పరిపాలనచే ప్రజల మనస్సును రంజింపచేయుచు, యమునా నదికి చెలికత్తెయగు గంగానదితో సమానమగు తెల్లటి కాంతి గల యశః ప్రకాశముచే లోకమును తెల్లనగు దానిగ చేసి తన పేరగు పాండు శబ్దముచే చెప్పబడునట్లు చేసెను.

7. అటుతరువాత విప్రులవలన భీష్ముడు సుబలునియొక్క కుమార్తెయగు గాంధారినిగూర్చి వినెను. ఆమె వరమడుగు ఈశ్వరుని ఆరాధించి నూర్గురు పుత్రులను వరముగా పొందెననియును, భీష్మునకు తెలిపెను

8, 9. గాంధారరాజును గూర్చి భీష్ముడు ఆకన్యను పరిణయమాడ దూతను పంపెను. ఆగాంధార రాజాయు ధృతరాష్ట్రుడు గుడ్డి వాడైనను, కులమును కీర్తిని, వావి నడవడిని మనస్సులో ఆలోచించి, ధర్మాత్మురాలగు నా గాంధారిని ధృతరాష్ట్రునకిచ్చి వివాహము చేసెను.

---

వ్యా॥ యమునకు చెలికత్తెయగు గంగానదికి చెలికత్తెలు అనగా గంగానదితో సమానమైన, అటువంటి గంగానదివలె తెల్లనగు కీర్తులచే నని అర్థము. యశసః = కీర్తియొక్క ప్రకాశముచే లోకమును, నిజనామ్నః = పాండువను శబ్దమునకు, వాచ్యతామ్ = అర్థమగుటను అనగా తెల్లనైన దానినిగ పేరును పొందించెను అని అర్థము.

శ్లో॥ తత స్సా పట మాదాయ కృత్వా బహుగుణం తదా ।
బబంధనే త్రే స్వే రాజన్ పతివ్రత పరాయణా ॥ 10

స్థాతుం గాంధారరాజస్య పుత్ర శ్శతాని రభ్యయాత్ ॥ 11

---

వ్యా:- గాంధారీసోదరీణాం తు దశకం చాంబి కాసుతః భార్యార్థం స్వీకృతో భీష్మశాసనా త్కులవృద్ధయే పునశ్చ రాజకన్యానాం శతం చాహృత్య శాంతనిః ధృతరాష్ట్రస్య భార్యార్థం దదౌ పుత్ర వివృద్ధయే॥

భారతసారే॥

శ్లో॥ గాంధారస్య చ గాంధారీ వివకన్యా బభూవహ అగ్రే సా మేషభర్తారం తయా దేవ్యా వినాశితం పశ్చాద్వివాహితా రాజ్ఞీ ధృతరాష్ట్రే విచక్షణా ఇతి॥

ఏతావతా ధృతరాష్ట్రనామక జీవస్య మానసాభ్యంతరింద్రియ బహిరింద్రియాణి ఏకాదశ ఏకైకస్యేంద్రియస్య ప్రధానేంద్రియేణ దశ దశ ఇంద్రియాణి మనః సాక్షీ బుద్ధిశ్చ ఆహత్య ఇంద్రియాణీ వ భరణా ద్భార్యాశ్చ స్థితా ఇతి జ్ఞాయతే॥ శ్రు॥ శతమానంభవతి శతాయుః పురుష శ్శతేంద్రియః ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతీ త్యత ఏవ శ్రుతి ర్నిర్దిష్టా॥

10. పతివ్రతలలో గొప్పదగు గాంధారి దట్టమగు వస్త్రమును తీసుకొని తన నేత్రములకు కట్టుకొని అంధత్వమును కల్పించు కొనెను,

11. ఆ గాంధారితో బాటు గాంధార రాజపుత్రుడగు శకునియు వచ్చి ఇచ్చటనే యుండెను,

---

వ్యా॥ ధృతరాష్ట్రుడు గాంధారియొక్క చెల్లెండ్రను పదిమందిని భీష్ముని యొక్క ఆజ్ఞచే కులవృద్ధికొరకు భార్యలనుగా స్వీకరించెను మరల భీష్ముడు నూర్గురు రాజకన్యలను తీసుకొనివచ్చి ధృతరాష్ట్రునకు సంతానాభివృద్ధికొరకై భార్యలనుగా ఇచ్చెను.

భారతసారమున శ్లో॥ గాంధార రాజునకు గాంధారీ యనుపేరుగల విషకన్య (భర్త ప్రాణములను హరించునది) ఉండెనట. మొదట ఆమెను వొక చిబోతునకు ఇచ్చి వివాహము చేయగా అది వెంటనే మరణించుటచే ఆదోషము పరిహరింపబడినది. తరువాత దీర్ఘాయుర్దా యముగల ధృతరాష్ట్రుని వివాహమాడి రాణి యయ్యెను. అని చెప్ప బడి యున్నది,

ఈ విధముగా ధృతరాష్ట్రుడను జీవునకు నూట పదకొండు భార్యలనగా జ్ఞానేంద్రియములు అయిదు. కర్మేంద్రియములు అయిదు మనస్సుతో కలసి 11 ఇంద్రియములు గల ఒక్కొక్క ఇంద్రియమునకు ప్రధానములగు ఇంద్రియములతో పది పది ఇంద్రియములను మనస్సునకు సాక్షియగు బుద్ధియు కలిసి 111 ఇంద్రియములవంటి భార్యలు (అనగా భరించదగినవి) ఉందురని అంతరార్థము తెలియ బడు చున్నది. శ్రుతియందును "శతమానం భవతి శతేంద్రియః" అని చెప్పుటచే నూరు ఇంద్రియములుండునని చెప్పబడినదికదా!

శూరో నామ యదుశ్రేష్ఠో వసుదేవపితాఽభవత్ ।
తస్య కన్యా పృథా నామ రూపేణాసదృశీ భువి । 12

పితృష్వస్రీయ పుత్రాయ సోఽనపత్యాయ వీర్యవాన్ ।
అదదాత్కుంతిభోజాయ సుతాం దుహితరం తదా ॥ 13

సా నియుక్తా పితుర్గేహే బ్రాహ్మణాతిథిపూజనే ।
ఉగ్రం పర్యచరద్ఘోరం దుర్వాసం శంసితవ్రతం ॥ 14

ఉవాచ చైనాం భగవాన్ ప్రీతోఽస్మి సుభగే తవ ।
యం యం దేవం త్వమేతేన మంత్రేణావాహయిష్యసి ॥
తస్య తస్య ప్రసాదాత్త్వం దేవి పుత్రాన్ జనిష్యసి ॥ 15 16

ఏవ ముక్తా చ సా బాలా తదా కౌతూహలాన్వితా ।
* కన్యా సతీ దేవ మర్క మాజుహావ యశస్వినీ ॥ 17

---

వ్యా:- ఏతత్కన్యాత్వవిషయే కైయటగ్రంథ మిత్థం పఠతి- యా దేవతామాహూతా స్త్ర్య ద్వా పుంయోగేఽప్యక్షత యోని ర్భవతి యథా కుంతీ మంత్రాహూత దినకరోత్పా

12. యదుశ్రేష్ఠుడును వసుదేవుని తండ్రియగు శూరుడను రాజు కలడు. వానికి పృధయను గొప్ప సౌందర్యవతి యగు కన్యక యుండెను.

13. ఆ శూరుడు తన మేనత్త కుమారుడగు కుంతిభోజునకు సంతానము లేకపోవుటచే తన కూతురగు పృధను వానికి పుత్రికగా నొసంగెను.

14. ఆకుంతీ కన్యకయు తండ్రి యొక్క గృహమునందు వచ్చిన బ్రాహ్మణులగు అతిధులను పూజించుటకై నియమింప బడెను. ఒకానొకప్పుడు తీవ్రమగు తపస్సు గలిగి నట్టియు, అత్యంత కోపనుడు నగు దూర్వాసోమహర్షి అతిధిగా రాగా గొప్పసేవ జేసినది.

15. 16. భగవంతుడగు నా మహర్షి సంతోషించి ఓకుంతీ! నీ సేవకు సంతోషించితిని. నీ కొక మంత్రము ననుగ్రహించు చున్నాను, నీవీ మంత్ర ప్రభావముతో ఏఏ దేవుని అహ్వానింతువో ఆయా దేవుని అనుగ్రహమువలన పుత్రులను బడయగ వు. అని మంత్రోపదేశము గావించెను.

17. ఈవిధముగా ప్రకటబడినదై బాలయగు నాకుంతి కన్యగానుండియే మంత్ర ప్రభావమును పరీక్షింపగోరి సూర్యభగవానుని ఆహ్వానించినది.

---

వ్యా॥ కుంతియొక్క కన్యాత్వ విషయమున వ్యాకరణ మహాభాష్యవ్యాఖ్యానమగు కయ్యట ప్రగంధము ఇట్లు చెప్పుచున్నది. ఏస్త్రీ దేవతలయొక్క ప్రభావముచే పురుషసంయోగము పొందియుఅక్షతయోని

ప్రకాశకరవాన్ సూర్య స్తస్యాం గర్భం దదౌ తదా।
కన్యాత్వం చ దదౌ దేవః మంత్రమూర్తి స్తదా రవిః॥ 18

అజీజన త్సుతం చాస్యాం సర్వశస్త్రభృతాం వరం।
సకుండలం సకవచం దేవగర్భశ్రియాన్వితం॥ 1
* శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే।

---

దిత కర్ణాఖ్యపుత్రాఽపి పునః కన్యైవాభూత్ తదపత్యం కానీన శబ్దాభిధేయ మితి॥

అత ఏవ మహాభారతే ఆశ్రమవాసపర్వణి 30అ॥ వ్యాసం ప్రతి స్వీయకన్యాత్వే కర్ణజననప్రస్తావే కుంతీం ప్రతి వ్యాసవచనం శ్లో॥ సాధు సర్వమిదం భావ్య మేవమేత ద్యథాత్థ మాం। మనుష్యధర్మో దైవేన ధర్మేణ నహి దుష్యతి। అపరాధశ్చ తే నాస్తీత్యాద్యుక్త్యా తన్నదూ ష్యమితి సిధ్యతి॥

* వ్యా:- చైత్రాది దశోత్తరే మాఘే శుక్లపక్షే పతిపది చంద్ర ఇవ కర్ణ ఉద్భూత ఇత్యర్థః మాఘశుక్ల ప్రతి పది కర్ణ నిషేకజన్మ ఇత్యర్థః।

18. ప్రకాశించుచున్న కిరణములుగల సూర్యుడు ఆమెకు ప్రత్యక్షమై గర్భమును గలిగించెను. దేవ దేవుడగు నా సూర్యుడు కన్యాత్వ మునకు భంగము కలుగకుండునట్లు వర మొసంగెను.

19. ఆ సూర్యుడు ఆమెయందు ధనుర్ధారులలో శ్రేష్ఠుడును సహజ కవచకుండలములు గలిగినట్టియు మంచికాంతిగల కర్ణుడను కుమారుని పుట్టించెను. మాఘశుక్లపాడ్యమియందు ఆకాశమున చంద్రునివలె కర్ణుడు ఉద్భవించెను.

---

అగుచున్నదో? అదెట్లన కుంతీదేవి మంత్రముచే ఆహ్వానింపబడిన సూర్యునివలన కర్ణుడను పుత్రుని గనియు మరల కన్యయే ఆయెను కదా। అటువంటి స్త్రీ యొక్క కుమారుడే కానీన శబ్దముచే చెప్ప బడును.

కావుననే మహాభారతము ఆశ్రమవాసపర్వ 30 వ అధ్యాయమున ఆశ్రమవాస పర్వయందు కుంతియొక్క కన్యాత్వవిషయమునను కర్ణ జనన ప్రస్తావము నందు కుంతిని గూర్చి వ్యాసుని వాక్యము శ్లో॥ ఓ కుంతీ! నీవు చెప్పిన దంతయు బాగున్నది అది ఆవిధముగా కాదగి యున్న దైవ నిర్ణయము. మనుష్యధర్మములు (కన్యాత్వాదులు) దైవ ధర్మములచే దూషించబడవు. ఇందు నీ దోషమేదియును లేదు. అని చెప్పుటచే కర్ణోత్పత్తి కుంతికి దోషావహము కాదని సిద్ధించు చున్నది.

వ్యా:- చైత్రాదిదశోత్తరే అనగా చైత్రముమొదలుకొని 11వది యగు మాఘమాసమున శుక్లపక్షమునందు పాడ్యమిరోజున చంద్రుని వలే కర్ణుడు ఉద్భవించెను. అనగా మాఘశుక్లప్రతిపత్తునందు కర్ణుని యొక్క నిషేకజన్మ. (కుంతీ, సూర్యుల సమాగమము గర్భోత్ప త్తియు) అనియర్థము, ఇది నీలకంఠీయవ్యాఖ్య. భారతసారమున శ్లో॥

నిగూహమానా జాతం వై బంధుపక్షభయా త్తదా।
ఉత్ససర్జ జలే కుంతీ తం కుమారం యశస్వినం। 20-21

తముత్సృష్టం జలే గర్భం రాధాభర్తా మహాయశాః।
గృహీత్వా వసుషేణేతి నామ నిర్దిశ్య పాలితః 22

సంవర్ధమానో బలవాన్ సర్వాస్త్రేషూత్తమో ఽభవత్।
♦ వేదాంగాని చ సర్వాణి జజాప జపతాం వరః। 23

తతో రామాద్బ్రాహ్మణోఽహ మిత్యుక్త్వా స్త్రాణి గృహీతవాన్
సోఽపి కాలేన విజ్ఞాయ శప్తవాన్ బ్రాహ్మణేన చ। 24

తమింద్రో బ్రాహ్మణో భూత్వా పుత్రార్థే భూరిభావనః।
యయాచే కుండలే దివ్యే కవచం చ సహాంగజ॥ 25

ఉత్సృజ్య కర్ణో హ్యవదత్ కవచం కుండలే తథా।
శక్తిం శక్రో దదౌ తస్మై దేవాసురమనాపహాం। 26

---

భారతసారే శ్లో॥ సద్యో గర్భధరా కుంతీ కర్ణం ప్రాసూత తం సుతం॥

♦ వ్యా:- వేదాంగనీతి॥ కర్ణః శూద్రత్వా ద్వేదాంగాని జజాప నతు వేదాన్॥

20, 21 కుంతీదేవి ఆ విధముగా పుట్టిన కుమారుని బంధువుల వలని భయముచే జలమునందు విడిచిపెట్టెను.

22. ఈ విధముగా జలమునందు విడిచిపెట్టబడిన కుమారుని రాధాపతి యగు అతిరథుడు గ్రహించి వానికి వసుషేణుడు అను పేరు పెట్టి వానిని పోషించెను.

23. ఈ విధముగా పెంచబడి బలవంతుడగు నా కర్ణుడు సర్వాస్త్రముల యందును గొప్పవాడయ్యెను. సమస్త వేదాంగములను చక్కగా జదివి విద్వాంసుడాయెను.

24. తరువాత కర్ణుడు పరశురాముని యొద్దకు వెళ్ళి తాను బ్రాహ్మణుడనని చెప్పి బ్రహ్మాస్త్రాదులను గ్రహించెను. ఆ పరశురాముడును కొంతకాలమునకు ఈతడు సూతుడని గ్రహించి, శపించెను. తన బాణప్రయోగముచే గోవును సంహరించుటచే ఒకానొక ఋషిచే గూడ, కర్ణుడు శపింపబడెను.

25. భూతప్రియకరుడగు దేవేంద్రుడు బ్రాహ్మణవేషము ధరించి తన పుత్రునికొరకు సహజములగు కవచకుండలములను యాచించెను.

26. అప్పుడు కర్ణుడు తన సహజమగు కవచమును కుండలములను కోసి వానికిచ్చెను. దేవేంద్రుడు కర్ణునకు దేవాసురుల మదమును అణచు ఏకవీరఘ్నియగు శక్తి యను ఆయుధమును ఒసగెను.

---

కుంతి వెంటనే గర్భమును ధరించి ప్రసవకాలమున కర్ణుని కనెను అని కలదు.

వ్యా॥ వేదాంగానీతి॥ కర్ణుడు శూద్రుడగుటచే వేదాంగములను జదివెను. వేదములను జదువలేదు.

స కర్ణ ఇతి విఖ్యాతః పృథాయాం ప్రథమ స్సుతః।
సతు సూతకులే వీరో వవృధే రాజసేవకః॥ 27

దుహితా కుంతిభోజస్య పృథా పృథులలోచనా।
తాం తు తేజస్వినీం కన్యాం రూపయౌవనశాలినీం।
వ్యవృణ్వన్ పార్థివాః కేచి దతీవ స్త్రీగుణై ర్యుతాం॥ 29

తత స్సా కుంతిభోజేన రాజ్ఞాహూయ నరాధిపాన్।
పిత్రా స్వయంవరే దత్తా దుహితా రాజసత్తమ॥ 30

తత స్సా రంగమధ్యస్థం తేషాం రాజ్ఞాం మనస్వినీ।
దదర్శ రాజశార్దూలం పాండుం భరతసత్తమం।
ఆదిత్యమివ సర్వేషాం రాజ్ఞాం ప్రచ్ఛాద్య వై ప్రభాః।
తిష్ఠంతం రాజసమితౌ పురందరమివాపరం॥ 31–32

వ్రీడమానా స్రజం కుంతీ రాజ్ఞః స్కంధే೭వ్యయన్ముదా। 33

తత స్తస్యాః పితా రాజన్ వివాహ మకరో త్ప్రభుః।
సంప్రాప్తో నగరం రాజా పాండుః కౌరవనందనః॥ 34

తత శ్శాంతనవో భీష్మో రాజ్ఞః పాండో ర్యశస్వినః।
వివాహస్యాపరస్యార్థే యయౌ మద్రపతే ర్గృహం। 35

తమాగత మభిప్రేత్య భీష్మం బాహ్లీక ఆహ వై।

27. ఈవిధముగా కుంతి యందు బుట్టిన మొదటి పుత్రుడు కర్ణుడుగా ప్రసిద్ధిగాంచెను. ఆతడు సూతకులమునందు వృద్ధిని పొందింప బడినవాడై రాజసేవకుడగు సూతుడాయెను.

28. 29. విశాల నేత్రియగు కుంతిభోజుని పుత్రికయగు కుంతీ దేవియను సౌందర్యవతి యగు కన్యను స్త్రీ సల్లక్షణములు గలది యగు టచే అనేకమంది రాజులు స్వయముగా వరించిరి.

30. ఆరాజు తో విరోధమువచ్చునను భయముతో తన కుమార్తెకు రాజులనందరను బిలిపించి స్వయంవరమును ఏర్పాటు గావించెను.

31. 32. తరువాత ఈ భూమండలమునందలి రాజులందరను జూచి భరత వంశశ్రేష్ఠుడును అందరరాజులను సూర్యునివలె తనతేజస్సుచే కప్పి ప్రకాశించుచున్నవాడును, మరియొక దేవేంద్రునివలె రాజ సమూహమున ప్రకాశించుచున్న పాండురాజును వరించెను.

33. కుంతి సిగ్గుపడుచున్నదియై పుష్పమాలికను పాండురాజు కంఠ మున సంతోషముతో వైచెను.

34. తరువాత ఆమె తండ్రియగు కుంతిభోజుడు కుంతీపాండువులకు వివాహము చేసెను. ఇట్లు వివాహమాడి కౌరవనందనుడగు పాండురాజు కుంతితోసహా హస్తినాపురమునకు విచ్చేసెను.

35. తరువాత భీష్ముడు పాండురాజునకు మరియొక వివాహము చేయగోరి మద్రదేశాధిపతి ఇంటికి పెళ్ళెను.

36. ఇట్టిఅభిప్రాయములో వచ్చిన భీష్ముని ఎరింగి మద్రదేశాధిపతి యగు బాహ్లీకుడు మాతులమున పూర్వమునుండియు రాజశ్రేష్ఠు

పూర్వం ప్రవర్తితం శ్రేష్ఠం కులే౽స్మిన్ నృపసత్తమః॥ 36

వ్యక్తం తద్భవతశ్చాపి విదితం నాత్ర సంశయః॥ 37

భీష్మ ఉవాచ

విదితేయం చ తే శల్య మర్యాదా సాధుసమ్మతా।
ఇత్యుక్త్వా స మహాతేజాః శాతకుంభం కృతాకృతం॥
రత్నాని చ విచిత్రాణి శల్యాయాదాత్సహస్రశః॥ 38

తత్ప్రగృహ్య ధనం సర్వం శల్యస్సంప్రీతమానసః॥
దదౌ తాం సమలంకృత్య స్వసారం కౌరవర్షభే। 39

స్వీకృతస్య చ ద్రవ్యస్య శతాధిక్యం దదౌ పునః।
జగ్రాహ విధివత్పాణిం మాద్ర్యాః పాండుర్నరాధిపః॥ 40

స తాభ్యాం వ్యచరత్సార్ధం భార్యాభ్యాం రాజసత్తమః।
కుంత్యా మాద్ర్యా చ రాజేంద్రో యథాకామం యథాసుఖం 41
♦ జగ్రాహ నిగ్రాహ పరః పరశ్రియాం

♦ వ్యా:- భోజచ। స్తబ27శ్లో॥ వ్యాఖ్యా।శకుంతానాం పక్షిణాం ఈశః। గరుడః రథోయస్య తథోక్తః విష్ణుః రమాం లక్ష్మీం సముద్రకాంచీం భువం యథా తే। ఉభే ఇవ, కరాగ్రేణ జగ్రాహ ఇత్యర్థః॥

లచే కన్యాశుల్కము అను సంప్రదాయము ప్రవర్తింప జేయబడి నది, అని చెప్పెను.

37. ఈ విషయము మీకును తెలిసియే యుండును, ఇందు సందేహింప నవసరము లేదు. ఇది మా కులధర్మము.

భీష్ముడు చెప్పుచున్నాడు,

38. ఓ శల్యుడా! ఈ మీ సంప్రదాయము నేనెరింగినదే. గొప్పవారం దరు అంగీకరించినదియే. అని పలికి భీష్ముడు అనేక విధము లగు బంగారమును, విచిత్రములైన రత్నములను బహుమూల్య ములగు వాటిని వానికి శుల్కముగా నొసగెను,

39. శల్యుడు సంతోషించినవాడై ఆ ధనమును గ్రహించి తన చెల్లె లగు మాద్రిని అలంకరించి పాండురాజునకు భార్యగా నొసగెను.

40. శల్యుడు తాను స్వీకరించిన ధనమునకు నూరురెట్లుగా మరల అరణముగా నొసగెను. ఈవిధముగా పాండురాజు విధ్యుక్తముగా మాద్రిని పరిణయమాడెను.

41. ఆ పాండుభూపతి కుంతీ, మాద్రులను నిద్దరు భార్యలతో స్వేచ్ఛగా విహరించుచూ, సుఖమనుభవించెను.

•42. పన్నులతో ఇతరుల ఐశ్వర్యమును గ్రహించు గజగామినులగు

---

•వ్యా॥ భోజచంపు 1 స్త, 17 శ్లో॥ వ్యా. శకుంతానాం = పక్షు లకు ఈశః - గరుడుడు, రథముగా గల విష్ణువు రమాం - లక్ష్మిని, సముద్ర కాంచీం - భూమిని, వారిద్దరిని వలె తనచేతితో కుంతీ, మాద్రులను గ్రహించెను.

కణ్ఠైః కరాగ్రేణ కరేణుచంక్రమః।
కుంతీం శశుం తేశరధో యథా రమాం।
సముద్రకాంచీం చ సముద్రకన్యకాం ॥ 42

* అథ పారసవీం కన్యాం దేవకస్య మహీపతే।
వివాహం కారయామాస విదురస్య మహామతేః॥ 43

తస్యాం చోత్పాదయామాస విదురః కురునందనః॥
పుత్రా న్వినయసంపన్నా నాత్మన స్సదృశాన్ గుణైః। 44

జిగీషయా మతిం పాండు ర్నిశ్చక్రామ పురాత్ప్రభో।
స భీష్మప్రముఖాన్ వృద్ధానభివాద్య ప్రణమ్యచ॥ 45

తేన తే నిర్జితా స్సర్వే పృథివ్యాం స్సర్వపార్థివాః।
తమేకం మేనిరే శూరం దేవేష్వివ పురందరం। 46

ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతః స్వబాహువిజితం ధనం॥
భీష్మాయ సత్యవత్యై చ మాత్రే చోపజహార సః॥
విదురాయ చ వై పాండుః ప్రేషయామాస తద్ధనం॥ 47-48
శంతనో రాజసింహస్య భరతస్య చ ధీమతః।
ప్రణష్టకీర్తిజ శ్శబ్దః పాండునా పున రాహృతః॥ 49

---

*వ్యా:- పారసవీం బ్రాహ్మణేన శూద్రాయాం జాతాం

పాండుభూపతి కుంతియొక్కయు, మాద్రియొక్కయు, కరములను పక్షులకు ప్రభువగు గరుత్మంతుడువాహనముగాగల విష్ణువు లక్ష్మి యొక్కయు, సముద్రము మేఖలముగాగల భూదేవి యొక్కయు కరములను గ్రహించి, నట్లు గ్రహించెను.

43. తరువాత ఒకానొక పారసవకన్యను తెచ్చి మహామతియగు విదురునకు వివాహము చేయించెను.

44. కురునందనుడగు విదురుడు ఆమెయందు వినయసంపన్నులను, సద్గుణములచే తనతో సమానులగు పుత్రులను కనెను.

45. తరువాత పాండురాజు వృద్ధులగు భీష్మాదులకు నమస్కరించి వారి యనుమతి బడసి దేశములను జయించవలెనను కోరికతో హస్తినాపురమునుండి దిగ్విజయ యాత్రకు బయలు దేరెను.

46. భూమియందలి శత్రురాజులందరును వానిచే జయింపబడినవారై దేవతలలో దేవేంద్రునివలె అందరురాజులలో ఈ పాండురాజు ఒక్కడే శూరుడని తలంచిరి.

47, 48 పాండురాజు తానుజయించిన ధనమునంతను, ధృతరాష్ట్రుని అనుమతితో భీష్మునకును, తల్లియగు సత్యవతి కొరకును విదురునకును, కానుకగా మొత్తమును పంపివైచెను.

49. పాండురాజుచే రాజసింహుండగు శంతను మహారాజు యొక్కయు, బుద్ధిమంతుడగు భరతుని యొక్కయు, కీర్తితో సమానమగు కీర్తి మరల సంపాదింపబడెను.

---

వ్యా॥ పారశవీం-అనగా బ్రాహ్మణునిచే శూద్ర స్త్రీయందు బుట్టిన కన్యకను అని అర్థము.

తస్య వీరస్య విక్రాంతై స్సహస్ర శతదక్షిణైః
* అశ్వమేధశతై రీజే ధృతరాష్ట్రో మహామఖైః 50

సంప్రయుక్తస్తు కుంత్యాచ మాద్ర్యాచ భరతర్షభః।
అరణ్యనిత్య స్సతతం బభూవ మృగయాపరః। 51

తస్య కామాంశ్చ భోగాంశ్చ నరా నిత్య మతంద్రితాః
ఉపజహ్రు ర్వనాంతేషు ధృతరాష్ట్రేణ చోదితాః। 52

క్షుచ్ఛ్రమాభిపరిగ్లానం ద్వైపాయన ముపస్థితం।
తోషయామాస గాంధారీ వ్యాసం తస్మై వరం దదౌ॥ 53

సా వవ్రే సదృశం భర్తుః పుత్రాణాం శత మాత్మనః॥ 54

తతః కాలేన సా గర్భం ధృతరాష్ట్రా ద్దధాగ్రహీత్।
సంవత్సరద్వయం తం తు గాంధారీ గర్భ మాహితం॥ 55

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
పంచమోధ్యాయః సమాప్తః

---

* వ్యా:- అశ్వమేధశతైః తత్తుల్యైః పంచమహామఖైః

450. వీరుడగు పాండురాజు యొక్క పరాక్రమముచే సంపాదింప బడిన ధనమునుండి అనేక వేల దక్షిణలు కలిగిన అశ్వమేధయాగము లచే ధృతరాష్ట్రుడు దేవతలను సంతృప్తి పరచెను.

51. భరతశ్రేష్ఠుడగు నా పాండురాజు కుంతీ మాద్రులతో కూడినవాడై అరణ్యమునందే నిత్యనివాసము చేయుచు ఎల్లప్పుడు వేటయందా సక్తి కలవాడయ్యెను.

52. ఈ విధముగా వనమునందున్న నాతనికి ధృతరాష్ట్రునిచే ప్రేరే పింపబడిన రాజసేవకులు ఎల్లప్పుడును అప్రమత్తులై యుండి వానికి కావలసిన సమస్త భోగములను కోరికలను నెరవేర్చు చుండిరి.

53. ఒకానొకప్పుడు ఆకలిచేతను, శ్రమచేతను, అలసటనొంది వచ్చిన కృష్ణ ద్వైపాయనునికి గాంధారీ దేవి పరిచర్యలు చేసి తృప్తిని గావింప వ్యాసుడు ఆమెకు వరము నొసంగెను.

54. ఆమెయు తన భర్తతో సమానులగు బలిష్ఠులగు నూర్గురు పుత్రు లను వరముగా కోరెను.

55. తరువాత కొంతకాలమునకు ధృతరాష్ట్రుని వలన ఆమె గర్భ మును ధరించెను. గాంధారీదేవి ఆ ధరించిన గర్భమును రెండు సంవత్సరములు భరించెను.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున ఆదిపర్వయందు అయిదవ అధ్యాయము సమాప్తము

---

౫వ్యా॥ అశ్వమేధ శతైః — అశ్వమేధములతో సమానమగు

# షష్ఠోఽధ్యాయః

రాజా పాండు ర్మహారణ్యే మృగవ్యాళనిషేవితే।
చర న్నైమ్రథున ధర్మస్థం దదర్శ మృగయూథపం।
నిర్బిభేద శరై స్తీక్ష్ణైః పాండుః పంచభి రాశుగైః॥ 1

స చ రాజన్ మహాతేజా ఋషిపుత్ర స్తపోధనః
భార్యయా సహ తేజస్వీ మృగరూపేణ సంగతః॥ 2

త్యక్త్వా మృగశరీరం తు కిందమ స్త్వబ్రవీ న్మునిః।
త్వయాఽహం హింసితో యస్మాత్తస్మాత్త్వామప్యహంశపే॥ 3

త్వమప్యస్యా మవస్థాయాం ప్రేతలోకం గమిష్యసి॥ 4

పాండురువాచ

శత్రూణాం యా వధేవృత్తి స్సా మృగాణాం వధే స్మృతా
అచ్ఛద్మనా మాయయాచ కథమస్మాన్విగర్హసే॥ 5

---

పంచయజ్ఞైః గర్భాంధస్య శ్రౌతయజ్ఞే ష్వనధికారాత్॥

# 6 వ అధ్యాయము

1. పాండురాజు మృగములతోను, సర్పములతోను, నిండిన మహారణ్యమునందు సంచరించుచు, ఒకానొకప్పుడు మైధున ధర్మము నందున్న ఒక లేళ్ళ జంటను చూచెను. అతడు అయిదు వాడియైన బాణములతో ఆ జంటను గొట్టెను.

2. కిమ్మదుడను మహాతేజశ్శాలియు, తపోధనుడగు, ఒక ఋషి పుత్రుడు మృగరూపమును ధరించి, భార్యతో క్రీడించు చుండెను.

3. ఈ విధముగా పాండురాజుచే కొట్టబడినవాడై మృగరూపమును విడిచి స్వస్వరూపమును ధరించిన ఆకిమ్మదుడను ముని పుత్రుడు ఇట్లు పలికెను. ఓ రాజా! నీచే నేను హింసింపబడితిని గాననిన్ను శపించుచున్నాను.

4. నీవు కూడ ఇటువంటి అవస్థయందు మరణమును పొందగలవు అనగా మైధున ధర్మమును పొందిన నీకు మరణము కలుగును

పాండురాజు చెప్పుచున్నాడు.

5. క్షత్రియునకు ఋజు మార్గముననైనను, మాయోపాయముచే గాని, శత్రువులను వధించుట సహజమగు ధర్మమై యున్నది. అట్లే మృగములను వేటాడుటయు, ధర్మమైయున్నది. స్వధర్మము నాచరించిన నన్నేల నిందించుచున్నావు.

---

పంచమహా యజ్ఞములతో నని అర్థము. జాత్యంధుడగు ధృతరాష్ట్రునకు శ్రౌత యజ్ఞములయందు అధికారము లేక పోవుటచే ఇట్లర్థము చెప్పవలయును.

కిందమ ఉవాచ

నాహం ఘ్నంతం మృగాన్ రాజన్ విగర్హే చాత్మకారణాత్
కోహి విద్వాన్ మృగం హన్యా చ్చరంతం మైథునం వనే ॥ 6

ఏవముక్త్వా సుదుఃఖార్తో జీవితా త్స వ్యముచ్యత । 7

తత స్సభార్య శ్శోకార్తః పాండుః పరమదుర్మనాః
భీష్మాదికురువృద్ధానాం వృత్తం సర్వం తు భాషితం॥ 8

శ్రుత్వాతు వృత్తం తే సర్వే దుఃఖితా స్సంస్మర న్స్మరన్॥ 9

ధృతరాష్ట్రో నర! శ్రేష్ఠః పాండుమేవాన్వశోచత
న శయ్యాసనభోగేషు రతిం విందతి కర్హిచిత్ ॥ 10

రాజపుత్రస్తు కౌరవ్యః పాండు ర్మూలఫలాశనః
జగామ సహపత్నీభ్యాం హిమవంత మతీత్య చ ॥ 11

* శతశృంగే మహారాజః తాపస స్సమతప్యత

* వ్యా॥ ప్రమోదూత వత్సరే చాశ్వయుజ మాసే
శుక్లపంచమ్యాం పాండురాజ శ్శతశృంగ పర్వత మాపసా

కిందముడు పల్కుచున్నాడు.

6. ఓ రాజా! నన్ను హింసించితివని మృగములను వేటాడుచున్న నిన్ను నేను నిందించుటలేదు. కాని విద్వాంసుడగువాడు అరణ్యమున మైథునముచేయుచున్న లేడి నెవివతె సంహరించునా!

7. ఈ విధముగా కిందముడు పల్కి, దుఃఖార్తుడైన ఆ కిందముడు ప్రాణములను విడచెను.

8. తరువాత భార్యలతో కూడిన పాండురాజు మిక్కిలి దుఃఖించి, కలవరపాటు నొంది భీష్మాది కురువృద్ధులకు తన శాప వృత్తాంతము నంతను కబురంపెను.

9. ఈ విధముగా వారందరును పాండురాజు శాపవృత్తాంతమును విని దానినే మాటిమాటికి స్మరించుచున్నవారై మిక్కిలి దుఃఖించిరి.

10. నరశ్రేష్ఠుడగు ధృతరాష్ట్రుడు పాండురాజునే ఎల్లప్పుడు విచారించుచు భోజన, శయనాది సకల భోగములయందు ఏమియు సుఖమును బడయజాలకుండెను.

11. రాజపుత్రుడును, కౌరవ శ్రేష్ఠుడును, నగు పాండురాజు భార్యలతో గూడి హిమవంతమును దాటి శతశృంగ పర్వతమునకు వెళ్ళెను.

•12. ఈవిధముగా మహారాజగు పాండువు ఋషియై శతశృంగ పర్వత

---

•వ్యా॥ ఆస్థానమిపుడు పాండుకేశ్వరమని చెప్పబడు చున్నది.

।స మొహాక సంవత్సరముక ఆశ్వయుజ శుక్ల పంచమి యందు

కుంతీ మాద్రీచ తం పాండు మనుసృత్య వ్రతే స్థితాః॥ 12

ఋషయ స్త్వపరే చైనం పుత్రవ త్పరిపాలితాః।
బ్రహ్మాణం ద్రష్టుకామాస్తే సంప్రతస్థు ర్మహర్షయః॥ 13

పాండు రువాచ।
అప్రజస్య మహాభాగా న ద్వారం పరిచక్షతే।
పిత్ర్యా ద్ధృణా దనిర్ముక్త ఇదానీమస్మి తాపసాః॥ 14

దేతి ద్యోత్యతే। తదాది సంవత్సరాంతే ధర్మరాజజననం తతః సంవత్సరం గతే భీమదుర్యోధనాదిజననం ఇతిస్మరణాత్। ఇతః పూర్వమేవ గాంధారీ వర్షద్వయాత్మకం గర్భం ధృతవతీతి స్మరణాచ్చ ఇతి శం॥

తథాచ తదాది కలియుగారంభ కాలస్య సంవత్సరాణి 129-5-26 దినాని సంతీతి జ్ఞాయతే.

ప్రజోత్పత్తివర్షే ఆశ్వయుజ శు॥౫ జ్యేష్ఠా నక్షత్రే ధర్మరాజోత్పత్తిరితి ప్రమాణదర్శనాత్। తదా క్రీస్తోఃపూర్వం ది॥ 16-8-3131.

అతః శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే 28 సంఖ్యాక యుగచతుష్టయేషు ద్వాపరయుగాంతే సం. 129-5-26 దినేష్వవశిష్టేషు కలియుగారంభ సమయే ఇత్యర్థః॥

మున గొప్ప తపమాచరించెను. కుంతియు, మాద్రియు, అతనిని అనుసరించి, వ్రతనియమము గలవారై యుండిరి.

13. అచ్చటనున్న ఇతరులగు ఋషులును, పాండురాజును పుత్రునివలె సంరక్షించుచుండిరి. ఒకానొకప్పుడు ఆఋషీశ్వరులు బ్రహ్మను చూడ గోరినవారై బయలు దేరిరి.

పాండురాజు చెప్పుచున్నాడు.

14. ఓ మహానుభావులారా! సంతానములేని నాకు బ్రహ్మలోకమునకు వెళ్ళుటకు అవకాశము లేదని పెద్దలు చెప్పుచున్నారు. పితౄణము నుండి ఇంతవరకు విముక్తుడను కాకపోతిని గదా!

---

రాజు శతశృంగ పర్వతమును పొందెనని తోచుచున్నది. అప్పటినుండి సంవత్సరాంతమున ధర్మరాజు జననము, తరువాత సంవత్సరాంతమున భీమ, దుర్యోధనాదుల యొక్క జననమని చెప్పబడినది.. ఇంతకు పూర్వమే గాంధారీ దేవి రెండు సంవత్సరములు ధరించదగిన గర్భము ధరించెనని చెప్పబడినది.

ఈ విధముగా అప్పటినుండి కలియుగారంభ కాలమునకు 129 సం॥ ల 5 మా॥ల 26 దినములు వ్యవధానము కలదని తెలియ బడు చున్నది.

ప్రజోత్పత్తినామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పంచమి యందు జ్యేష్ఠానక్షత్రమునందు ధర్మరాజు యొక్క జనన మని ప్రమాణముండుటచే అప్పుడు క్రీస్తుకు పూర్వము 16-8-3131 సంవత్సరమున ధర్మరాజోత్పత్తి.

అందువలన శ్వేతవరాహకల్పమున 28వ మహాయుగమునందు ద్వాపర యుగాంతమున 129 సం॥ ల 5 మా॥ల 26 దినములు కలియుగారంభమునకు మిగిలి యుండగా ధర్మరాజోత్పత్తియని ఎఱుంగ వలయును.

తథైవాస్మి న్స్వను క్షేత్రే కథం వై సంభవే త్ప్రజా॥ 15

ఋషయ ఊచుః॥

అస్తి వై తవ ధర్మాత్మ న్విద్మ దేవోపమం శుభం।
తస్మిన్ దృష్టే ఫలే రాజన్ ప్రయత్నం కర్తు మర్హసి॥ 16

వైశంపాయన ఉవాచ

సోఽబ్రవీ ద్విజనే కుంతీం ధర్మపత్నీం యశస్వినీం।
అపత్యోత్పాదనే యోగ్య మాపది త్వం సమర్థయ। 17

పరిపాలయతోఽపి మే మహీం పరిపూర్తి ర్న తనూజదుర్గతేః
ప్రజయాహి మనుష్య ఇత్యసౌ ప్రథతే హి శ్రుతివర్గపద్ధతిః 18

* గాత్రం న కేవల మశేషబుధోపలాల్యం।
గోత్రం చ తత్రభవతః కుముదైకబంధోః।
ఆపాండు వర్తత ఇతి స్ఫుటమన్య మన్యే।
యస్మాత్ప్రజాం న లభసే యమునేరకన్యే। 19

---

* వ్యా॥ భోజచంపూ 1 స్తబకే 42 శ్లోక వ్యాఖ్యా
గాత్రం కేవలం శరీర మేక మేవ ఆసమం తాత్పాండు శ్వేతం

15. నాకును మీతో బాటు బ్రహ్మలోకమునకు రాకోరిక కలదు అందు వలన నాభార్యయందు ఎట్లు సంతానము కలుగును.

ఋషులు పల్కుచున్నారు.

16. ఓరాజా! నీకు దేవతలతో సమానమగు ఫలప్రదమగు సంతానము కలదు, అట్టి ఫలము కలుగుటకు నీవు ప్రయత్నము చేయ వలసినది.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

17. ఆ పాండురాజు ధర్మపత్నియు, కీర్తియుగల కుంతితో ఏకాంత మున ఓ కుంతీ! ఈ ఆపత్సమయమున సంతానము కనుటయందు ఉపాయమును నీవు సమర్థించగలవు. అని పలికెను.

18. ఓ కుంతీ! నేను భూమిని పరిపాలించుచున్నను సంతానములేని దుర్గతిని పొందుటచే నాకు పూర్ణత్వము లేదు. శృతి సముదాయ మంతయు, సంతానము చేతనే మనుష్యుడు పరిపూర్ణు డగునని వొక్కి చెప్పుచున్నదిగదా!

19. ఓ కుంతీ! సమస్త పండితులు మెచ్చదగిన నా శరీరము మాత్రమే అంతట తెల్లనైనది. (ఆపాండు) శామ. మరేమన లములబాంధ వులకు పూజ్యుడను అగు ఆ చంద్రుని యొక్క వంశముగూడ (ఆ పాండు) పాండురాజ పర్యంతమే ఉండునని ఇప్పుడు స్పష్ట మైనదని తలచుచున్నాను. ఏలనన నీవు సంతానమును కనుట లేదుగదా!

---

వ్యా॥ భోజవంపు 1 స్తబకే 42 శ్లోక వ్యాఖ్య॥ గాత్రం కేవ లమ్ శరీర మొక్కటియే, ఆసమంతాత్ పాండు = అంతట తెల్ల

* ఇమేవై బంధుదాయాదాః షట్పుత్రా ధర్మదర్శనే।
షడేవాఽబంధుదాయాదాః పుత్రాంస్తాన్ శ్రుణుమే పృధే 20

స్వయంజాతః ప్రణీతశ్చ పరిక్రీతశ్చ య స్సుతః॥
పౌనర్భవశ్చ కానీనః స్వైరిణ్యాం యశ్చ జాయతే॥ 21

దత్తః క్రీతః కృత్రిమశ్చ హ్యుపగచ్ఛేత్స్వయం చ యః॥
సహోఢో జ్ఞాతిరేతాశ్చ హీనయోని ర్ధృతశ్చ యః॥ 22

---

వర్తత ఇతి మన్యే కింతు గోత్రం చంద్రవంశోపి ఆపాండు పాండురాజ పర్యంతం వర్తత ఇతి అద్య స్ఫుటం మన్యే। కుత ఏతదత ఆహ "యస్మాదితి"

*వ్యా;- ధర్మదర్శనే ధర్మశాస్త్రే ఉక్తా ఇతి శేషః॥ బంధుదాయాదాః రిక్థహారాః అబంధుదాయాదాః తదన్యే॥

షడాద్యా నాహ స్వయంజాత ఇతి।

1) స్వయంజాతః॥ ఊఢాయాః వోఢుస్సకాశా జ్జాతః 2) ప్రణీతః తస్యామేవోత్తమానుగహా జ్జాతః 3) పరిక్రీతః రేతోమూల్యదానేన తస్యామేవ జనితః 4) పౌనర్భవః పూర్వమన్యేనోఢా పశ్చాదన్యేన తస్యాం ద్వితీయతో జాతః।

20. ధర్మశాస్త్రమునందు బంధుదాయాదులగు ఆర్గురు పుత్రులు చెప్ప బడిరి. అట్లే అబంధుదాయాదులగు ఆర్గురు పుత్రులు చెప్ప బడిరి. ఓకుంతీ! వారలను గూర్చిచెప్పుచున్నాను. వినుము.

21. 1) స్వయంజాతుడు 2) ప్రణీతుడు 3) పరిక్రీతుడు 4) పౌన ర్భవుడు 5) కానీనుడు 6) స్వేచ్ఛా సంచారిణియందు బుట్టిన వారు. ఈ ఆర్గురును బంధుదాయాదులు.

22. 1) దత్తుడు 2) క్రీతుడు 3) కృత్రిముడు 4) సహోఢుడు 5) జ్ఞాతియొక్క రేతస్సుచే పుట్టినవాడు 6) తక్కువజాతి స్త్రీ యందు పుట్టింపబడువాడు ఈ అర్గురును అబంధుదాయాదులు.

---

నై నదిగా, వర్తతే. ఇతి న మన్యే = ఉన్నదని తలచుట లేదు. కింతు- ఇక ఏమన. గోత్రమ్ - చంద్రవంశమును. ఆపాండు-పాండు రాజ పర్యంతమే వర్తత ఇతి-ఉండునని, అద్య స్పష్టంమన్యే-ఇప్పుడు స్పష్ట మైనదని తలచుచున్నాను. ఏలనన. దానికి కారణము ఉత్తర శ్లోక మున యస్మాదితి పాదముచే చెప్పబడుచున్నది.

॥వ్యా॥ ధర్మదర్శనే - అనగా ధర్మశాస్త్రమునందు చెప్పబడిరి. బంధుదాయాదులనగా తనలో భాగమును పంచుకొను వారని అర్థము. అబంధుదాయాదులనగా బంధుదాయాదులకంటె భిన్నమైనవారు.

మొదటి ఆర్గురను వరుసగా చెప్పుచున్నాడు. 1. స్వయంజాతః- తనచే వివాహమాడబడిన స్త్రీయందు తనచే స్వయముగా బుట్టింప బడిన వారు. 2. ప్రణీతుడనగా తనభార్యయందు ఉత్తముల యొక్కయు, దేవ తలయొక్కయు అనుగ్రహమువలన బుట్టినవారు. 3. పరిక్రీతుడనగా తన భార్యయందే ఇతరునకు రేతోమూల్యమును ఇచ్చి వానిచే బుట్టింపబడిన వాడు. 4. పౌనర్భవుడనగా మొదట ఒకనిచే వివాహమాడబడి మరల

భర్త్రోర్యద్యపి పూర్వస్య క్షేత్రజః। తథాపి తస్యాపి పరిణే తృత్వా ద్వితీయ ఏవ। 5) కానీనః వివాహా త్ప్రాగేవ॥ శ్లో॥ అన్యాం చోఢా జనయేత్ పుత్రస్య మే పుత్రో భవిష్యతీతి సమయబంధేన యాం దీయతే। తస్యాం జాతః 6) స్వైరిణ్యా మపూర్వాదాయామేవ నీచాజ్జాతః కుండనామా॥ ఇతి॥

అథ షడబంధుదాయాదాః 1) దత్తః-మాతాపితృభ్యాం సమర్పితః। 2) క్రీతః-ధనాదికం దత్వా గృహీతః। 3) కృత్రిమః ఉక్తప్రకారాష్టకాభావేఽపి యః స్వయమేవోఽపగచ్ఛేత్। అహం తవ పుత్రోఽస్మి త్వ్యాపేయాత్। స త్వ్రతీతః 4) సహోఢః యస్య మాతా గర్భవత్యేవోఢా స చాత్రోఢః 5) జ్ఞాతిరేతాః స్వనహిత భ్రాతాదేః పుత్రః పంచమః॥ శ్లో॥ భ్రాతౄణామేక జాతానాం యద్యేకః పుత్రవాన్ భవేత్। సర్వే తే తేన పుత్రేణ పుత్రిణో మనురబ్రవీత్॥ ఇతి స్మృతేః॥ సాపి భ్రాతృపుత్రస్య ఔరసత్వావిశేషాత్॥ 6) హీనయోనౌ భృతః ఉత్పాదితః॥

ప్రణీతౌ విశేష మాహ॥ ఉత్తమాదితి॥ శ్రేష్ఠం పితుః

ఆమె ఇతరుని వివాహమాడినచో రెండవ భర్తచే పుట్టింప బడినవాడు, రెండవ వానికి పౌనర్భవపుత్రుడగును, ఈతడు ధర్మశాస్త్రము ననుసరించి మొదటి వాని క్షేత్రజుడగును, కాని రెండవవాడును, ఈమెను పరిణయ మాడిన వాడగుటచే రెండవవానికి గూడ జెందినవాడగును, 5. కానీనః- అనగా వివాహమునకు పూర్వమందే శ్లో॥ ఈమెయందు ఎవడుబుట్టునో వాడు నాకును పుత్రుడు కాగలడు. అని నిర్ణయించుకొని ఏకన్యక ఇతరు నకు దానము చేయబడునో ఆమె యందు బుట్టినవాడు. 6. స్వైరిణీ జాతుడు - వివాహమాడిన స్త్రీ స్వేచ్ఛాప్రవృత్తి కల దగుచో ఆమెయందు నీచుని వలన బుట్టినవాడు. వీనికే కుండుడనియు పేరు కలదు.

ఇక అబంధు దాయాదులగు ఆరుగను గూర్చి చెప్పుచున్నాడు. 1. దత్తః - తల్లి దండ్రులచే ఇతరులకు పుత్రుడుగా నొసంగ బడిన వాడు. 2. క్రీతః - ధనాదికమునిచ్చి కొనబడినవాడు 3 కృత్రిమః - అనగా పూర్వము చెప్పబడిన ఎనిమిది విధముల బంధుత్వము లేకపోయి నప్పటికి నేను నీపుత్రుడను అని చెప్పుచు ఎవడు స్వయముగా తన వద్దకు వచ్చునో వాడు మూడవరకము పుత్రుడు. 4. సహోఢః ఎవని యొక్క తల్లి గర్భవతిగా నుండగా వివాహ మాడెనో ఆమెకు బుట్టిన వాడు. 5 జ్ఞాతిరేతాః - వేలువిడచిన సోదరునియొక్క పుత్రుడు ఇందు సాక్షాత్ సోదరుని యొక్క పుత్రుడు చేరడు. ఏలనన సాక్షాత్ సోద రులలో ఏఒకడు పుత్రవంతుడైనను ఆపుత్రునిచే సాక్షాత్ సోదరు లంద రును, పుత్రవంతు లగుదురు. అని మనువు చెప్పుటచే వాడు సాక్షాత్ పుత్రుడున్నూ, ఔరసునితో సమానుడును అగుటచే జ్ఞాతి రేతస్సుడుకాడు, 6) హీనజాతి స్త్రీయందు పుట్టింపబడిన వాడు.

ఇందు రెండవవాడగు ప్రణీతుని విషయమున గల విశేషమును చెప్పుచున్నాడు, తండ్రియొక్క కులముకంటెను ఎవడు ఉత్తమ కుల

పూర్వం పూర్వతమాభావే మత్వా లిప్సేత వై సుతం।
ఉత్తమాత్ దేవరాత్ పుంసః కాంక్షంతే పుత్రమాపది॥ 23

అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విందతి మానవాః।
ఆత్మశుక్రాదపి పృథే మను స్స్వాయంభువోఽబ్రవీత్॥ 24

శృణు కుంతి కథా మేతాం శరదండాయనం ప్రతి।
సౌవీరపత్నీ గురుణా నియుక్తా పుత్రజన్మని॥ 25

వరయిత్వా ద్విజం సిద్ధం హుత్వా పుంసవనేఽనలం।
తత్ర త్రీన్ జనయామాస దుర్జయాదీ న్మహారథాన్॥ 26

॥ కుంత్యువాచ ॥

నహ్యహం మనసా ప్యన్యం గచ్ఛేయం త్వదృతే నరం॥ 27

వ్యుషితాశ్వో యథా పూర్వం స్వశవాత్ క్షత్రపుంగవాన్।
త్రీన్ సాల్వాం శ్చతురో మద్రాన్ స్వభార్యాయై ప్రదత్తవాన్।

---

కులాదపి యః ప్రశస్యతమో భవతి తజ్జం శ్రేష్ఠ మపత్యమితి సామానాధికరణ్యా శ్రేష్ఠా వనన్యత్వా దపత్యస్య॥

23. ఓ కుంతీ! సంతానము లేనప్పుడు వీరలలో పూర్వ పూర్వుడు (అనగా 12 వ వాని కంటె, 11వవాడు. వానికంటె 10 వవాడు) శ్రేష్టులని తలచి అటువంటి కుమారుని పొందవలెనని కోర వలెను. ఉత్తముని నుండి కాని మరది నుండి కాని, అపత్తు నందు పురుషులు పుత్రుని పొందగోరచున్నారు.

24. ఓ కుంతీ! ధర్మఫలము నొసంగునట్టి శ్రేష్టమగు సంతానమును మనుష్యులు తన శుక్రము నుండిగాని, శ్రేష్టులగు వారియొక్క శుక్రము నుండిగాని, పొందదగునని స్వాయంభువ మనువుపలికెను.

25. ఓ కుంతీ! శరదండాయన మహర్షిని గూర్చిన కథను చెప్పు చున్నాను. వినుము. సౌవీర రాజ భార్య గురువుచే పుత్రోత్పత్తి యందు నియోగింపబడినది.

26. ఆమె పుత్రుడు కలుగగలందులకు అగ్నిలో హోమము చేసి ఒకా నొక సిద్ధుడగు బ్రాహ్మణుని పొంది దుర్జయుడు మొదలుగాగల ముగ్గురు మహారథులగు పుత్రులను బడసినది.

కుంతి చెప్పుచున్నది.

27. ఓరాజా! నేను మనస్సుతోడను నీకంటె ఇతరుని పొందగోరను.

28. పూర్వము వ్యుషితాశ్వుడు అనువాడు తన శవమునుండియే ముగ్గురు క్షత్రపుంగవులగుసాల్వులను, నలుగురు మద్రులను తన భార్యకు అనుగ్రహించెను.

---

జాడో వాని నుండియు, దేవతల నుండియు, బుట్టినవాడు శ్రేష్టమగు సంతానమగుటచే, శ్రేష్టునిచే బుట్టినవాడు శ్రేష్టుడగునని సామానాధి కరణ్యము చెప్పబడినది; ఇదంతయు పూర్వయుగ విషయము.

తథా త్వమపి మయ్యేవం మనసా భరతర్షభ।
శక్తో జనయితుం పుత్రాం స్తపోయోగబలాన్వితః॥ 29

పాండురువాచ॥

మర్యాదేయం కృతా తేన ధర్మ్యా వై శ్వేతకేతునా।
సౌదాసేన చ రంభోరు నియుక్తా పుత్రజన్మని।
మదయంతీ జగామర్షిం వసిష్ఠమితి నః శ్రుతం।
అస్మాకమపి తే జన్మ విదితం కమలేక్షణే॥ 30-31

మన్నియోగాద్వచనం ధర్మ్యం కర్తు మర్హస్యనిందితే॥ 32

॥ కుంత్యువాచ ॥

దుర్వాససా మయాదత్తం మంత్రం బాల్యే సుపుత్రదం ।
ఆవాహయామి కం దేవం బ్రూహి సత్యవతాం వర॥ 33

పాండురువాచ॥

ధర్మ మావాహయ శుభే సహి లోకేషు పుణ్యభాక్ ॥ 34

సంవత్సరధృతే గర్భే గాంధార్యా జనమేజయ
ఆహ్వాయామాస వై కుంతీ గర్భార్థే ధర్మ మచ్యుతం । 35

ఆజగామ తతో దేవో ధర్మో మంత్రబలాత్తతః
లేభే పుత్రం వరారోహా సర్వప్రాణభృతాం హితం। 36

29. అట్లే నీవును నీయొక్క తపోయోగ బలములచే మనస్సు చేతనే పుత్రులను బుట్టించ సమర్థురవు.

పాండురాజు చెప్పుచున్నాడు.

30 31. పూర్వము శ్వేతకేతువను మహర్షిచే ధర్మయుక్తమగు ఒకానొక కట్టుబాటు చేయబడినది, సౌదాసుడను వానిచే సంతానోత్పత్తి కొరకై నియోగింప బడినదై మదయంతి యనునామె వసిష్ఠమహర్షిని పొం దెనని మనకు తెలియుచున్నది. ఓ కుంతీ! మాయొక్క జన్మవిష యముగూడ నీవెఱిగినదే కదా.

32. పూజ్యురాలవగు నో కుంతీ! ధర్మయుక్తమైన నావాక్యమును నీవు తప్పక చేయవలసి యున్నది.

కుంతి చెప్పుచున్నది.

33. ఓరాజా! పూర్వము నాబాల్యమున నాకు పుత్రప్రదమగు ఒకానొక మంత్రము దూర్వాసునిచే ఈయ బడినది. ఆమంత్రముచే ఏదేవుని ఆహ్వానించ మందురో చెప్పుడు.

పాండురాజు చెప్పుచున్నాడు.

34. ఓకుంతీ! యమధర్మరాజును ఆహ్వానము చేయుము, ఆతడు సర్వ లోకములయందును పుణ్యవంతుడు.

35. గాంధారి గర్భధారణము చేసిన ఒకసంవత్సరము తరువాత కుంతీదేవి యమధర్మరాజును ఆహ్వానించినది.

36. అంతట యమధర్మరాజు ఆమంత్రబలముచే ఆమెవద్దకు వచ్చెను. ఆమెయు ఆతనివలన సర్వప్రాణులకు హితుడగు పుత్రునిపొందెను

* ఇంద్రే చంద్రసమాయుక్తే ముహూర్తేఽభిజితేఽష్టమే
దివా మధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేఽతి పూజితే
సమృద్ధయశసం కుంతీ సుషావ ప్రవరం సుతం ॥ 37

---

* వ్యా॥ ఇంద్రే - జ్యేష్ఠానక్షత్రే - అభిజితే - దివసస్య అష్టమే ముహూర్తే దివా శుక్లపక్షే మధ్యగతే తులాయనగతే తిథౌ - పూర్ణే - పూర్ణాయాం। పంచమ్యాం అయం యోగః ప్రాయేణాశ్వీన శుక్ల పంచమ్యాం భవతి। తత్రైవ ధర్మరాజస్య జన్మేత్యర్థః ॥

అష్టావింశతితమే ద్వాపరే తురీయభాగే అష్టావింశాధికేషు శతవర్షేషు మాసపంచక 26 దివసే వ్యవశిష్టేషు తదానీం వర్తమాన ప్రజోత్పత్తి సంవత్సరాశ్వీన శుక్లపంచమ్యాం జ్యేష్ఠానక్షత్రే ధనుర్లగ్నే యుధిష్ఠిరస్య జననం॥ భారతే॥ ఆదిపర్వణి॥ 2 అ॥ శ్లో॥ యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః స్కంధోఽర్జునో భీమసేనోఽస్య శాఖాః మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే మూలం కృష్ణో బ్రహ్మచ బ్రాహ్మణాశ్చ॥ శ్లో॥ నర్మో వివర్ధతి యుధిష్ఠిరకీర్తనేన పాపం ప్రణశ్యతి వృకోదరకీర్తనేన। శత్రుర్వినశ్యతి ధనంజయకీర్తనేన మాద్రీసుతౌ కథయతాం న భవంతి రోగాః॥ ధర్మరాజ జననం క్రీస్తోః పూర్వం ది 16-8-3130 ఇతి ॥

శ్లో॥ శంఖాంశజో ధర్మజస్తు గదాంశో మారుతిస్తథా చక్రాంశజోఽర్జునః స్యాత్ఖడ్గాంశో నకుల స్స్వయం

*37. ఇంద్రుడు చంద్రునితో గూడ కొని యున్న 8 వ అభిజిన్ముహూర్తమున పగటియందు సూర్యుడు మధ్యగతుడై యుండగా మిక్కిలి పవిత్రమైన సంపూర్ణ తిధియందు గొప్ప యశశ్శాలియు శ్రేష్టుడునగు కుమారుని కుంతి కనెను.

---

*వ్యా॥ ఇంద్రుడు జ్యేష్టానక్షత్రమునందుండగా అభిజిన్ముహూర్తమున పగటియందు శుక్లపక్ష మధ్యయందు సూర్యుడు తులాయనము నందుండగా సంపూర్ణమైన తిధియందు. తరచుగా ఆశ్వయుజ శుద్ధపంచమి యందు ఈ యోగము సంభవించును. అప్పుడే ధర్మరాజు యొక్క జననమని ఎరుంగునది.

28 వ ద్వాపర యుగమునందు చివరి భాగమున 128 సం॥ల 5 మా॥ల 28 రోజులు మిగిలియుండగా అప్పటి ప్రజోత్పత్తి నామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పంచమి యందు జ్యేష్టా నక్షత్రమందు ధనుర్లగ్నమందు మధ్యాహ్న కాలమున ధర్మరాజ జననము. భారతము ఆదిపర్వ యందు 2 వ అధ్యాయమున శ్లో॥ ధర్మరాజు గొప్ప ధర్మమయమైన వృక్షము. ఆ వృక్షమునకు అర్జునుడు బోదెవంటివాడు. భీమసేనుడు కొమ్మలు. నకుల సహదేవులు సమృద్ధిగల ఫలపుష్పముల వంటి వారు, దానికి వేరు శ్రీకృష్ణుడును, వేదమున్నూ, బ్రాహ్మణులున్న. శ్లో॥ ధర్మరాజును కీర్తించుటచే ధర్మము వృద్ధినొందు చున్నది, వృకోదరుని పొగడుటచే పాపము నశించు చున్నది. ధనంజయుని కీర్తించుటచే శత్రునాశన మగును. నకుల సహదేవులను కీర్తించువారలకు రోగములు సంభవించవు. ధర్మరాజు యొక్క జననము. క్రీ॥ పూ॥ 16-8-3130 అని ఎరుంగవలయును.

శ్లో॥ ధర్మరాజు శంఖము యొక్క అంశచేత పుట్టినవాడు. గద యొక్క అంశచే భీముడు పుట్టెను. వజ్రాంశచే అర్జునుడు, అగ్ని

శార్ఙ్గంశ స్సహదేవస్య శ్రీహరేః పంచసాయకాః

అథ శ్లోకః పంచాయుధస్తోత్ర ముచ్యతే ॥

1) శంఖం - ధర్మః

శ్లో॥ విష్ణో ర్ముఖోత్థానిల పూరితస్య యస్య ధ్వనిర్దానవదర్పహంతా। తం పాంచజన్యం శశికోటిశుభ్రం శంఖం సదాహం శరణం ప్రపద్యే ॥

2) గదా కౌమోదకీ-భీమసేనః ॥

శ్లో॥ హిరణ్మయీం మేరుసమానసారాం కౌమోదకీం దైత్యకులైకహంత్రీం। వైకుంఠ నామాగ్రకరాభిమృష్టాం గదాం సదాహం శరణం ప్రపద్యే ॥

3) చక్రం -అర్జునః ॥

శ్లో॥ స్ఫురత్సహస్రార శిఖాతితీవ్రం సుదర్శనం భాస్కరకోటితుల్యం సురద్విషాం ప్రాణవినాశి విష్ణో శ్చక్రం సదాహం శరణం ప్రపద్యే ॥

4) ఖడ్గం - (నందకం) — నకులః -

శ్లో॥ రక్షోసురాణాం కఠినోగ్రకంఠ చ్ఛేదక్షరచ్ఛోణిత దిగ్ధధారాం తం నందకం నామ హరేః ప్రదీప్తం ఖడ్గం సదాహం శరణం ప్రపద్యే॥

శచే నకులుడును, శార్జ్గాంశచే సహదేవుడును, ఇట్టిరి. ఈవిధముగా శ్రీహరి యొక్క అయిదు ఆయుధములు, పంచపాండవులుగ అవత రించినవి.

విష్ణువు యొక్క పంచాయుధ స్తోత్రము చెప్పబడుచున్నది.

1) శంఖం = ధర్మజు

శ్లో॥ విష్ణువు యొక్క ముఖమునుండి వెలువడిన వాయువుచే, పూరింపబడినట్టియు, దేనియొక్క ధ్వని రాక్షసుల దర్పమును హరిం చునో, అట్టి కోటిచంద్రులవలె, పరిశుద్ధమైన పాంచజన్యమను శంఖ మును నేనెల్లప్పుడును, శరణు పొందుచున్నాను.

2) గదా = కౌమోదకి — భీమసేనుడు

బంగారు వికారమైనదియు, మేరుపర్వతముతో సమానమైన జిగివి కలదియు, రాక్షస కులమును సంహరించుటలో ప్రధాన మైన దియు, శ్రీహరియొక్క కరాగ్రముచే స్పృశించబడిన కౌమోదకి యను గదను నే నెల్లప్పుడూ శరణు పొందుచున్నాను.

3) చక్రం = అర్జునుడు

ప్రకాశించుచున్న వేయి అంచులతో మిక్కిలి వాడి యైనదియు, కోటి సూర్యులతో సమానమైనదియు రాక్షసుల ప్రాణములను తీయు నట్టి శ్రీహరియొక్క సుదర్శనమను పేరుగల చక్రమును నే నెల్లపుడు శరణు పొందుచున్నాను.

4) ఖడ్గం = నందకము — నకులుడు

రాక్షసుల యొక్కయు, అసురుల యొక్కయు, కఠినమైన శరీర మును ఛేదించుటచే వారి రక్తముచే పూయబడిన అంచులుగల కాంతి వంతమైన శ్రీహరియొక్క నందకమను ఖడ్గమును నేనెప్పుడునూ శరణు పొందుచున్నాను.

జాతమాత్రే సుతే తస్మిన్ వాగువా చాశరీరిణీ।
ఏష ధర్మభృతాం శ్రేష్ఠో భవిష్యతి నరోత్తమః ॥ 38

విక్రాంత స్సత్యవాక్చైవ రాజా పృథ్వ్యాం భవిష్యతి॥
యుధిష్ఠిర ఇతి ఖ్యాతః పాండోః ప్రథమజ స్సుతః॥ 39

ధార్మికం తం సుతం లబ్ధ్వా పాండు స్తాం పున రబ్రవీత్।
ప్రాహుః క్షత్రబలం జ్యేష్ఠం బలజ్యేష్ఠం సుతం వృణు॥ 40

తత స్తథోక్తా భర్త్రాతు వాయుమేవాజుహావసా।
తత స్తా మాగతో వాయు ర్మృగారూఢో మహాబలః ॥ 41

---

5) శార్ఙ్గం ధనస్సు) సహదేవః -

శ్లో॥ యజ్జ్యానినాదశ్రవణా త్సురాణాం చేతాంసి నిర్ముక్త భయాని సద్యః భవంతి దైత్యా శనిబాణ వర్షైః శార్ఙ్గం సదాహం శరణం ప్రపద్యే॥

శ్లో॥ ఇమం హరేః పంచ మహాయుధానాంస్తవం పఠేద్యోనుదినం ప్రభాతే సమస్తదుఃఖాని భయాని సద్యః పాపాని నశ్యంతి సుఖాని సంతి॥ ఇతి॥

38. ఆ పుత్రుడు పుట్టగానే అశరీరవాక్కు ఇట్లు పల్కినది. ఈతడు ధర్మాత్ములలో శ్రేష్ఠుడును, నరులలో శ్రేష్ఠుడును కాగలడు. అని

39. మరియు ఈతడు మిక్కిలి పరాక్రమ శాలియు, సత్యవాక్కు గలవాడును, భూమికి ప్రభువును. కాగలడు ఈ పాండు ప్రథమ పుత్రుడు. యుధిష్ఠురుడను పేరుతో ప్రసిద్ధుడు కాగలడు. అని అశరీరవాక్కు పలికినది.

40. పాండురాజు ఈవిధముగా ధార్మికుడగు కుమారుని పొంది మరల కుంతితో నిట్లు పలికెను. ధర్మబలముకంటె దేహబలము శ్రేష్ఠమైనదని దానిమీదనే క్షత్రియుల బలము ఆధారపడి యున్నదని పెద్దలు నుడివెదరు. కాన బలాధికుడగు పుత్రుని పొందుమా!

41. తరువాత భర్త చే ఈ విధముగా కోరబడిన కుంతీదేవి వాయుదేవుని ఆహ్వానించెను. మహాబలుడగు వాయుదేవుడు మృగమును ఎక్కి ఆమెను గూర్చి వచ్చెను.

---

5) శార్ఙ్గం = ధనుస్సు — సహదేవుడు

దేనియొక్క నారిధ్వనిని విని దేవతల మనస్సులు వెంటనే భయము లేని వగుచున్నవో ఏది తన బాణవర్షములచే రాక్షసులనుకూల్చు చున్నదో అట్టి శ్రీహరియొక్క శార్ఙ్గమను ధనుస్సును నేను శరణు పొందుచున్నాను.

శ్లో॥ ఈ హరియొక్క పంచాయుధ స్తవమును ప్రతిదినము ప్రాతఃకాలమున ఎవరు పఠింతురో వారియొక్క సమస్త దుఃఖములు భయములు వెంటనే నశించు చున్నవి. వారికి సుఖములు కలుగును.

తస్మాజ్జజ్ఞే మహాబాహుర్భీమో భీమపరాక్రమః।
* మఘే చంద్రమసా యుక్తే సింహే చాభ్యుదితే గురౌ
దివా మధ్యగతే సూర్యే తిథౌ పుణ్యే త్రయోదశే
పిత్ర్యేముహూర్తే సా కుంతీ సుషువే భీమ మచ్యుతం 42

తమప్యతిబలం జాతం వాగువా చాశరీరిణీ॥ 43

సర్వేషాం బలినాం శ్రేష్ఠో జాతోఽయమితి భారత॥ 44

ఇదమత్యద్భుతం చాసీ జ్జాతమాత్రే వృకోదరే।
యదంకాత్పతితో మాతుః శిలాం గాత్రై ర్వ్యచూర్ణయత్ 45

---

* వ్యా:- మఘానక్షత్రగతే చంద్రే సింహే గురౌ తులాయాం రవౌ స్థితే పుణ్యే తిథౌ పిత్ర్యే ముహూర్తే దివసస్య త్రయోదశే భాగే అపరాహ్ణే కుంతీ భీమం సుషువే ఇతి॥ తథా చ తులాయాం సూర్యే వర్తమానే చాశ్వయుజ మాసో భవేత్ ॥ తదాశ్వినశుక్ల పూర్ణిమాయాం మశ్వినీ నక్షత్రమాయాతి। తదుపరి మఘాభిధం దశమనక్షత్రం భవతి తదాచ తదా క్రీస్తోఃపూర్వం ది॥27-6-3128 ఇతి 1) దుర్యోధన 2) కీచక 3) బక 4) హిడింబ 5) జరాసంధ 6) కిమ్మీరాదయ స్తద్దైవ జాతాః ॥ఇతి॥

42. వాయుదేవుని నుండి అజానుబాహువును, భయంకరమైన పరాక్రమము కలవాడునగు భీముడు పుట్టెను మఘానక్షత్రము చంద్రునితో కూడి యుండగా సింహమునందు గురువు ఉదయించగా పగటియొక్క మధ్యయందు సూర్యుడుండగా పుణ్యమగు తిధియందు పితృదేవతాకమైన పదమూడవ ముహూర్తమున భీమసేనుని కుంతీదేవి కనెను.

43. ఈ విధముగా పుట్టిన మహాబలుడగు భీముని గూర్చి అశరీర వాక్కు ఇట్లు పలికినది.

44. ఓ జనమేజయా! బలశాలులందరిలో ఈతడు చాల శ్రేష్టమైనవాడు.

45. అతడు పుట్టినవెంటనే ఒకానొక అత్యద్భుతమగు విషయము సంభవించినది. అదేదన తల్లియొక్క ఒడినుండి క్రిందపడిన పిల్లవాడు తన శరీర కాఠిన్యముచే క్రిందనున్న రాళ్ళనుకూడ పొడి పొడి చేసెను.

---

వ్యా॥ చంద్రుడు మఘానక్షత్ర మందుండగా బృహస్పతి సింహరాశియందుండగా సూర్యుడు తులారాశియందుండగా పుణ్యమైన తిధియందు పితృదేవతాకమైన ముహూర్తమందు అనగా పగటియొక్క 13 వ భాగమైన అపరాహ్ణమునందు భీముని కుంతి కనెను. అని కలదు. తులారాశియందు సూర్యుడుండగా ఆశ్వయుజమాసమగును. అప్పుడు ఆశ్వయుజ శుక్ల పూర్ణిమయందు అశ్వినీ నక్షత్రము వచ్చుచున్నది. అశ్వినీ నక్షత్రము తరువాత మఘానక్షత్రము పదియవది. అంగీరస సంవత్సరమున ఆశ్వయుజ కృష్ణ నవమి యందు భీమసేనుని జననము. అప్పుడు క్రీ॥ పూ॥ 27–6 -3128 అని తెలియుచున్నది. ఆ ముహూర్తమునసనే 1) దుర్యోధనుడు, 2) కీచకుడు 3) బకుడు 4) హిడింబాయురుడు 5) జరాసంధుడు, 6) కిమ్మీరుడు మొదలగు వారు పుట్టిరని కలదు.

తాం శిలాం చూర్ణితాం దృష్ట్వా పాండుః విస్మయ మాగతః 46

శ్రుత్వా కుంతీసుతం జాతం బాలార్కసమ తేజసం।
స్వోదరం ఘాతయామాస గాంధారీ దుఃఖమూర్ఛితా॥ 47

* తతో జజ్ఞే మాంసపేశీ లోహాష్ఠీలేవ సంహతా॥
అథ ద్వైపాయనో జ్ఞాత్వా త్వరితం సముపాగమత్॥ 48

తతోఽబ్రవీత్ సౌబలేయీం కిమిదం తే చికీర్షితం॥ 49

గాంధార్యువాచ

జ్యేష్ఠం కుంతీసుతం జాతం శ్రుత్వా రవిసమప్రభం।
దుఃఖేన పరమేణేద ముదరం ఘాతితం మయా॥ 50

శంకితం కిల పుత్రాణాం శతీర్ణం మే త్వయా పురా।
ఇయం చ మే మాంసపేశీ జాతా పుత్రశతాయ వై॥ 51

వ్యాసఉవాచ॥

ఏవ మేత త్సౌబలేయి నైతజ్జాతన్యథా భవేత్।
ఘృతపూర్ణం కుండశతం క్షిప్రమేవ విధీయతాం॥ 52

---

లోహాష్ఠీలేవ లోహమయు ఘుటికాకణసంఘాతవత్ ష్ఠీలా సంహతా మాంసపేశ్యాం మిళితా ఇత్యర్థః॥

46. ఈ విధముగా పొడి చేయబడిన శిలను చూచి పాండురాజు మిక్కిలి ఆశ్చర్యమును బొందెను.

47. ఈవిధముగా బాల సూర్యునితో సమానమగు పిల్లవానిని కుంతి కనిన విషయమును విని గాంధారీదేవి, దుఃఖముచే మూర్ఛిల్లినదై తన పొట్టను బాదుకొనెను,

48. తరువాత లోహపు ముద్దవలె గట్టిదగు ఒకానొక మాంసపిండము ఆమెకు పుట్టెను. తరువాత వ్యాసుడు ఈ విషయము నెరింగి అతి వేగమున నచ్చటికి ఏతెంచెను.

49. ఆ విధముగా వచ్చిన వ్యాసుడు గాంధారిని గూర్చి ఇదేమి పని నీ అభిప్రాయమేమి అని పలికెను.

గాంధారీదేవి చెప్పుచున్నది.

50. జ్యేష్ఠుడగు సూర్యునితో సమానమగు కాంతిగల కుంతీసుతుడు పుట్టినాడని విని భరింపరాని దుఃఖముతో నాచే నాగర్భము విచ్ఛిన్నముచేయబడినది.

51. మీరు నాకు నూర్గురు పుత్రులను వరముగా నొసంగితిరి. ఆవరము శంకించ దగినదైనది, మీరొసంగిన నూర్గురు పుత్రులకు బదులు నాకీ మాంసపుముద్ద పుట్టినది.

వ్యాసుడు చెప్పుచున్నాడు.

52. ఓ గాంధారీ! నావరమెప్పుడును వ్యర్థము కానేరదు. నూరు నేతి కుండలను వెంటనే ఏర్పాటు చేయము.

---

వ్యా॥ "లోహ ష్ఠీదేవ" లోహమయమగు గుళ్ళయొక్క సముదాయమువలె గట్టిదగు మాంసపు ముద్దయందు కూడుకొని ఉన్నవారు అని అర్థము

సుగుప్తేషు చ దేశేషు రక్షా చైవ విధీయతాం।
శతాభిరద్భి రక్షితా మిమం చ పరిషించయ॥ 53

ఇత్యుక్త్వా భగవా న్వ్యాస స్తత్రై వాంతరధీయత।
జజ్ఞే క్రమేణ చైతేన తేషాం దుర్యోధనో నృపః॥ 54

స జాతమాత్ర ఏవాథ ధృతరాష్ట్రసుతో నృప।
రాసభారావసదృశం రురావ చ ననాద చ॥ 55

తం ఖరాః ప్రత్యభాషంత గృధ్రగోమాయు వాయసాః।
వాతాశ్చ ప్రవవుశ్చాపి దిగ్దాహాశ్చ భవత్తదా॥ 56

తతస్తు భీతవద్రాజా ధృతరాష్ట్రోఽబ్రవీదిదం।
సమానయ బహూ న్విప్రాన్ భీష్మం విదుర మేవ చ।
అన్యాంశ్చ సుహృదో రాజన్ కురూన్ సర్వాం స్తథైవచ 57

ధృతరాష్ట్రఉవాచ॥

యుధిష్ఠిరో రాజపుత్రో జ్యేష్ఠో నః కులవర్ధనః।
ప్రాప్త స్స్వగుణతో రాజ్యం న తస్మిన్ వాచ్యమస్తి నః॥ 58

* అయం త్వనంతర స్తస్మా దపి రాజా భవిష్యతి।
ఏతద్ధి బ్రూత మే తథ్యం యదత్ర భవితా ధ్రువం॥ 59

---

*వ్యా:- భవిష్యతి కిం ఇతి కాకుః ॥ అనంతరత్వా

53. మంచి సంరక్షణగల ప్రదేశములయందు వాటిని ఉంచి రక్షించ వలసినది. ఈ మాంస ఖండమును నూరు ముక్కలు గావించి వాటిలో పడవేయుము.

54. ఈ విధముగా భగవంతుడగు వ్యాసుడు పలికి అచ్చటనే అంతర్ధాన మాయెను. క్రమముగా ఆ కుండలనుండి దుర్యోధనుడు మొదట పుట్టెను.

55. పుట్టిన వెంటనే ఆ దుర్యోధనుడు గాడిదవలె ఓండ్రుపెట్టుచు, నృత్యము చేసెను.

56. వానిని గూర్చి గాడిదలు తిరిగిఓండ్రు పెట్టినవి, గద్దలు, నక్కలు కాకులు కూసినవి, వాయువులు విపరీతముగా వీచినవి. దిక్కులు వేడిగల వాయెను.

57. అంతట ధృతరాష్ట్రుడు భయమునొందినవాడై చాలమంది బ్రాహ్మ ణులను, భీష్ముని, విదురుని, మరియు స్నేహితులను కులవంశీయు లందరను తీసుకొని రావలసినదని ఆజ్ఞాపించెను.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు

58. రాజకుమారుడగు యుధిష్ఠురుడు పెద్దవాడు. మన కులమును వృద్ధి పొందించువాడు. ఆతడు తన ఉత్తమ గుణములచే రాజ్యమును పొందినాడు. వాని విషయమున మనకేమియును ఎన్నదగినదిలేదు.

59. ఈ దుర్యోధనుడు ధర్మరాజు తరువాత పుట్టిన వాడగుటచే ఎట్లు రాజు కాగలడు మీరీ విషయమున ఇచ్చట కాదగిన దేదోనిశ్చయ ముగా యథార్థము నాతో చెప్పుడు.

---

వ్యా॥ "భవిష్యతి కిం" అని అనునది కాకు స్వరము, అనగా

వాక్యస్యైతస్య నిధనే దిక్షు సర్వాసు భారత।
క్రవ్యాదాః ప్రాణదన్ ఘోరాః శివాశ్చాశివశంసినః॥ 60

లక్షయిత్వా నిమిత్తాని తాని ఘోరాణి సర్వశః।
తేఽబ్రువన్ బ్రాహ్మణా రాజన్ విదురశ్చ మహామతిః। 61

యథేమాని నిమిత్తాని ఘోరాణి మనుజాధిప।
ఉత్థితాని సుతే జ్యేష్ఠే తాని తే పురుషర్షభ।
వ్యక్తం కులాంతకరణో భవితైష సుత స్తవ॥ 62

త్యజైన మేకం శాంతిం చేత్కులస్యేచ్ఛసి భారత।
త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్।
గ్రామం జనపదస్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్। 63-64

స తథా విదురేణోక్త స్తైశ్చ సర్వై ర్ద్విజోత్తమైః।
న చకార తథా రాజా పుత్రస్నేహసమన్వితః। 65

---

దేవ రాజా న భవిష్యతీత్యర్థః॥ శ్లో॥ దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః స్కంధశ్చ కర్ణ శ్శకుని స్తస్య శాఖాః దుశ్శాసనః ఫలపుష్పే సమృద్ధే మూలం రాజా ధృతరాష్ట్రో ఽమనీషీ॥

60. ధృతరాష్ట్రుడు ఇట్లు పలికి చాలించగా అన్నిదిక్కుల యందు నక్కలు కూసినవి. గుంట నక్కలును, ఘోరముగా అమంగళము సూచించుచు అరచినవి.

61. ఈ ఘోరములైన శకునములను అంతటా చూచి బ్రాహ్మణులును, గొప్ప బుద్ధిశాలియగు విదురుడును ఇట్లు పలికిరి.

62. ఓ రాజా! నీ జ్యేష్ఠ కుమారుడు పుట్టగా ఈ ఘోరములైన శకునములు కలుగుటచే నీ కుమారుడగు ఈతడు తప్పక కులమునంతను నశింప జేయువాడు కాగలడు.

63 64 ఓ రాజా! కులమునకు శాంతిని నీవు కోరుచో నీపీతని నొక్కని విడిచి పుచ్చుము. ఒకని వలన కులమునకు హాని సంభవించుచో, ఆ ఒక్కని విడిచి పెట్టవలయును. ఒక కులమువలన గ్రామమునకు హానిసంభవించుచో ఆకులమును విడిచిపెట్టవలయును. ఒక గ్రామమువలన దేశమునకుహాని సంభవించుచో, ఆగ్రామమును విడిచి పెట్టవలయును. ఆత్మ లాభముకొరకు భూమినంతను విడిచి పెట్టవలయును.

65. ఈవిధముగా విదురుడు, బ్రాహ్మణులు చెప్పినప్పటికిని ధృతరాష్ట్రుడు పుత్రుని యందలి మమకారముతో వారు చెప్పినట్లు చేయక పోయెను.

---

రాజు కాడని అర్థము. ఏలనన ధర్మరాజు కంటె ఈతడు తరువాత బుట్టిన వాడగుటచే రాజు కాడని తాత్పర్యము. శ్లో॥ దుర్యోధనుడు ఈర్ష్యామయమైన మహావృక్షము. ఆ వృక్షమునకు బోదె కర్ణుడు. శకునియే దానికి శాఖలు, దుశ్శాసనుడు వృద్ధినొందిన ఫలపుష్పములు, ఆ వృక్షమునకు అవిద్వాంసుడగు ధృతరాష్ట్రుడు కుంకుటి వేరు.

తతః పుత్రశతం పూర్ణం ధృతరాష్ట్రస్య పార్థివ।
మాసమాత్రేణ సంజజ్ఞే కన్యా చైకాశతాధికా। 66

ధృతరాష్ట్రం మహారాజం వైశ్యా పర్యచరత్కిల।
♦ జజ్ఞే ధీమాం స్తత స్తస్యాం యుయుత్సుః కరణో నృప। 67

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
షష్ఠోధ్యాయః సమాప్తః

# సప్తమోధ్యాయః

1. దుర్యోధనో యుయుత్సు శ్చ రాజా దుశ్శాసన స్తథా।
దుస్సహో దుశ్శల శ్చైవ జలసంధ స్సమ స్సహః।
విందానువిందౌ దుర్ధర్షః సుబాహుః దుష్ప్రధర్షణః।
దుర్మర్షణో దుర్ముఖశ్చ దుష్కర్ణః కర్ణ ఏవ చ।
వివింశతి ర్వికర్ణశ్చ శల స్సత్వ స్సులోచనః।
చిత్రోపచిత్రౌ చిత్రాక్ష శ్చారుచిత్ర శ్శరాసనః।
దుర్మదో దుర్విగాహశ్చ వివిత్సు ర్వికటాననః।
ఊర్ణనాభ స్సునాభశ్చ తథా నందోపనందకౌ।
చిత్రబాణ శ్చిత్రవర్మా సువర్మా దుర్విమోచనః।
అయోబాహు ర్మహాబాహు శ్చిత్రాంగ శ్చిత్రకుండలః॥

---

♦ వ్యా - కరణః క్షత్రియాయాం వైశ్యాయాం జాతః।

66. తరువాత ధృతరాష్ట్రునకు ఒకనెలలో నూర్గురు పుత్రులును ఒక కన్యయు బుట్టిరి.

¹ 67. ధృతరాష్ట్ర మహారాజును ఒకానొక వైశ్య స్త్రీ సేవించెనట తరువాత ఆమెయందు బుద్ధిమంతుడును, కరణజాతీయుడగు యుయుత్సు వనువాడు ఉదయించెను.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున ఆదిపర్వమునందు
ఆరవ అధ్యాయము సమాప్తము.

# 7 వ అధ్యాయము

1-13. దుర్యోధనుడు యుయుత్సువు, దుశ్శాసనుడు, దశ్శలుడు, దుస్సహుడు జలసంధుడు, సముడు, సహుడు, విందుడు, అనువిందుడు, దుర్ధర్షుడు, సుబాహువు, దుష్ప్రధర్షణుడు, దుర్మర్షణుడు, దుర్ముఖుడు, దుష్కర్ణుడు, కర్ణుడు, వివింశతి, వికర్ణుడు, శలుడు, సత్వుడు, సులోచనుడు చిత్రుడు, ఉపచిత్రుడు, చిత్రాక్షుడు, చారుచిత్రుడు, శరాసనుడు, దుర్మదుడు, దుర్విగాహుడు, వివిత్సుడు, వికటాననుడు, ఊర్ణనాభుడు, సునాభుడు, నందుడు, ఉపనందుడు, చిత్రబాణుడు, చిత్రవర్మడు, సువర్మడు, దుర్విమోచనుడు, అయోబాహుడు, మహాబాహువు, చిత్రాంగుడు, చిత్రకుండలుడు, భీమవేగుడు, భీమబలుడు, బలాకి, బలవర్ధనుడు, ఉగ్రాయుధుడు, సుషేణుడు, కుండధారుడు, మహోదరుడు, చిత్రాయుధుడు, నిషంగుడు, పాశుడు, బృందారకుడు, దృఢవర్మడు, దృఢక్షత్రుడు, సోమ

---

¹ వ్యా॥ కరణః = క్షత్రియువివలన వైశ్య స్త్రీయందు పుట్టినవాడు.

భీరువేగో భీమబలో బలాకీ బలవర్ధనః।
ఉగ్రాయుధ స్సుషేణశ్చ కుండధారో మహోదరః।
చిత్రాయుధో నిషంగీచ పాశీ బృందారక స్తదా।
దృఢవర్మా దృఢక్షత్రః సోమకీర్తి రనూదరః।
దృఢసంధో జరాసంధ స్సత్యసంధ స్సదస్సువాక్।
ఉగ్రశ్రవా ఉగ్రసేనః సేనానీ దుష్పరాజయః।
అపరాజితః కుండశాయీ విశాలాక్షో దురాధరః।
దృఢహస్త స్సుహస్తశ్చ వాతవేగసువర్చసౌ।
ఆదిత్యకేతు ర్బహ్వాశీ నాగదత్తో ఽగ్రయాయ్యపి।
కవచ గ్రథనః కుండీ కుండధారో ధనుర్ధరః।
ఉగ్ర భీమ రథౌ వీరౌ వీరబాహు రలోలుపః।
అభయో రౌద్రకర్మా చ తథా దృఢ రథాశ్రయః।
అనాధృష్యః కుండభేదీ విరావీ చిత్రకుండలః।
ప్రమథశ్చ ప్రమాదీ చ దీర్ఘరోమ శ్చ వీర్యవాన్।
దీర్ఘబాహు ర్మహాబాహు ర్వ్యూఢోరుః కనకధ్వజః।
కుండాశీ విరజాశ్చైవ దుశ్శలా చ శతాధికా। 1-13

దుశ్శలాం చాపి సమయే ధృతరాష్ట్రో నరాధిపః।
జయద్రథాయ ప్రదదౌ విధినా భరతర్షభ। 14

యస్మిన్నహాని దుర్యోధనో జజ్ఞే దుర్యోధన స్తదా।
తస్మిన్నేవ మహాబాహు ర్జజ్ఞే భీమోఽపి వీర్యవాన్।
[illegible] 15

కీర్తి, అమాదరుడు, దృఢసంధుడు, జరాసంధుడు, సత్యసం
ధుడు, సదుడు. సువాకుడు, ఉగ్రశ్రవుడు, ఉగ్రసేనుడు, సేనాని
దుష్పరాజయుడు, అపరాజితుడు, కుండశాయి, విశాలాక్షుడు, దురా
ధరుడు, దృఢహస్తుడు, సుహస్తుడు, వాతవేగుడు. సువర్చసుడు,
ఆదిత్యకేతువు, బహ్వాసి, నాగదత్తుడు, ఉగ్రయాయి, కవచి, క్రథ
నుడు, కుండి, కుండధరుడు, ధనుర్ధరుడు, ఉగ్రరథుడు, భీమ
రథుడు, వీరబాహువు అలోలుపుడు, అభయుడు, దృఢరథుడు.
అనాధృష్యుడు, కుండభేది. విరావుడు, చిత్రకుండలుడు, ప్రమ
థుడు, ప్రమాది, దీర్ఘరోముడు, దీర్ఘబాహువు, మహాబాహువు,
వ్యూఢోరుడు, కనకధ్వజుడు, కుండాశి, విరజుడు. అను నూర్గురు
పుత్రులను, నూట ఒకటవది యగు దుశ్శల అను కన్యకయు
పుట్టిరి.

14. ధృతరాష్ట్రుడు తనకుమార్తెయగు దుశ్శలను యోగ్యమైన కాల
మున విధ్యుక్తముగా జయద్రథునకు యిచ్చి వివాహము చేసెను.

15. బెదిరింప శక్యముగాని దుర్యోధనుడు. ఏరోజున బుట్టెనో ఆ
రోజు నందే మిక్కిలి పరాక్రమశాలియగు భీముడు గూడ
బుట్టెను. కీచకుడును. జరాసంధుడు, బకాసురుడు. హిడింబా
సురుడు. కూడ ఆ రోజుననే బుట్టిరి

తతః పాండు ర్మహారాజో మంత్రయిత్వా మహర్షిభిః ।
దిదేశ కుంత్యా కౌరవ్యో వ్రతం సంవత్సరం శుభం ॥ 16

ఇంద్రోహి రాజా దేవానాం ప్రధాన ఇతి న శ్శ్రుతం।
తం తోషయిత్వా తపసా పుత్రం లప్స్యే మహాబలం॥ 17

స్వయం పాండు శ్చైకపాదో పర్యతప్యత భారత।
తంతు కాలేన మహతా వాసవః ప్రత్యపద్యత॥ 18

ఇంద్ర ఉవాచ ॥

పుత్రం తవ ప్రదాస్యామి త్రిషులోకేషు విశ్రుతం।
బ్రాహ్మణానాం గవాంచైవ సుహృదాం చార్థసాధకం॥ 19

ఇత్యుక్త్వాంతర్దధే పాండు స్సయం చాహ పృథాం సతీం।
లబ్ధప్రసాదో దేవేంద్రా త్త్వమాహ్వాయ శుచిస్మితే॥ 20

ఏవముక్తా తత శ్శక్ర మాజుహావ యశస్వినీ।
అథాజగామ దేవేంద్రో జనయామాస చార్జునం॥ 21

ఉత్తరాభ్యాం తు పూర్వాభ్యాం ఫల్గునీభ్యాం తతో దివా

16. తరువాత పాండురాజు మహర్షులతో ఆలోచించి, కుంతీదేవిక ఒక సంవత్సర మాచరించ దగిన వ్రతమును చేయవలసినదని ఆజ్ఞాపించెను.

17. ఇంద్రుడు దేవతలకు రాజు. దేవతలలో ప్రధానుడు. అని వినియుంటిమి. వానిని తపస్సుచే ప్రసన్నుని గావించుకొని మహాబలుడగు పుత్రుని పొందెదను. అని పాండురాజు నిశ్చయించుకొనెను.

18. పాండురాజు స్వయముగా ఒక్క పాదముమీద నిలబడినవాడై ఇంద్రుని గూర్చి గొప్ప తపము ఆచరించెను. ఇట్లు కొంతకాలము గడువగా దేవేంద్రుడు వానికి ప్రత్యక్షమాయెను.

దేవేంద్రుడు చెప్పుచున్నాడు.

19. ఓ పాండురాజా! నీకు మూడులోకములయందు కీర్తినొందిన పుత్రుని ఇవ్వగలను. ఆతడు బ్రాహ్మణుల యొక్కయు, గోవుల యొక్కయు, స్నేహితుల యొక్కయు! పనులను నేరవేర్చువాడగును.

20. ఈవిధముగా పలికి ఇంద్రుడు అంతర్ధానమాయెను. పాండురాజు స్వయముగా పతివ్రతయగు కుంతితో ఇట్లుపలికెను. నేను దేవేంద్రుని వలన అనుగ్రహమును బడసితిని. వానిని ఆహ్వానించుము.

21. ఈవిధముగా భర్తచే చెప్పబడినదై కీర్తిగల కుంతి దేవేంద్రుని ఆహ్వానించెను. తరువాత దేవేంద్రుడు వచ్చి అర్జునుదను పుత్రుని అనుగ్రహించెను.

22. ఆ అర్జునుడు ఫాల్గుణ మాసమునందు నిండైన ఉత్తరా ఫల్గునీ

♦ జాతస్తు ఫాల్గునేమాసి తేనాసౌ ఫల్గున స్స్మృతః॥ 22

జాతమాత్రే కుమారేతు వాగువాచాశరీరిణీ
శృణ్వతాం సర్వభూతానాం తేషాం చాశ్రమవాసినాం ॥ 23

కార్తవీర్యసమోహ్యేష శివతుల్యపరాక్రమః
ఏషయుద్ధే మహాదేవం తోషయిష్యతి శంకరం ॥ 24

* అస్త్రం పాశుపతం నామ తస్మాత్తుష్టా దవాప్స్యతి
ఆకాశే దుందుభీనాం చ బభూవ తుముల స్స్వనః ॥ 25

---

♦ వ్యా॥ పూర్వోత్తర ఫల్గునీనక్షత్ర యుక్త శ్రీముఖ వత్సర ఫాల్గున శుక్ల పూర్ణిమాయాం అర్జునస్య జననం॥ తదా క్రీస్తోః పూర్వం ది 6-2-3127 ఇత్యర్థః

వ్యా॥ శ్రీముఖసంవత్సరే ఫాల్గుణ పూర్ణిమాయాం ఉత్తరాఫల్గునీనక్షత్రేఽర్జునస్య జననం భారతే 34అధ్యాయేశ్లో॥ అర్జునా త్తే...శవో జ్యేష్ఠః సప్తమాసై ర్మహాద్యుతిః తథాచ శ్రీముఖవత్సరే శ్రావణకృష్ణాష్టమీతిథౌ రోహిణ్యా మర్ధరాత్రౌ వృషభచంద్రయుతే మీనం గతేషుసర్వేషు గ్రహేషు భగవాన్ శ్రీకృష్ణో జాతః ॥

తథాహి॥ శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే ద్వితీయోఽధ్యాయే॥ శ్లో॥ శ్రీముఖాబ్దే శ్రావణే చ కృష్ణపక్షే

నక్షత్రములతో కూడికొనియున్న పగటియందు పుట్టుటచే ఫల్గుసుడనియు పేరు వచ్చెను.

23. ఆకుమారుడు పుట్టగనే సర్వభూతములు, సర్వఆకాశవాసులు వినుచుండగా అశరీరవాక్కు ఇట్లు పలికినది.

24. ఈపిల్లవాడు కార్తవీర్యార్జునితో సమానమైన వాడు. శివునితో సమానమైన పరాక్రమము కలవాడు ఈతడు యుద్ధమున మహాదేవుడగు శంకరుని సంతోషింప జేయగలడు.

25. ఆవిధముగా సంతోషించిన శంకరునినుండి పాశుపతాస్త్రము పొందగలడు. ఆకాశమునందు దేవతలు దుందుభి మొదలగునాల వాద్యములను గొప్పధ్వనితో వాయించిరి.

---

*వ్యా॥ శ్రీముఖ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పూర్వోత్తర ఫల్గునీ నక్షత్రముతో కూడుకొనిన పూర్ణిమయందు అర్జునుని జననము అని అర్థము. అప్పుడు క్రీ॥ పూ॥ 6-2-3127సం.

* వ్యా॥ శ్రీముఖసంవత్సరమున ఫాల్గుణ శు॥ ఉత్తరాఫల్గునీనక్షత్రయుక్త పూర్ణిమయందు అర్జునునియొక్క జననము. భారతమున 184 అధ్యాయమున శ్లో॥ అర్జునునికంటె కేశవుడు 7మాసములు పెద్దవాడు. అని చెప్పుటచే శ్రీముఖసంవత్సరము శ్రావణబహుళ అష్టమీతిథియందు రోహిణీనక్షత్రమున అర్ధరాత్రియందు చంద్రుడు వృషభలగ్నమందుండగా సర్వగ్రహములు మీనరాశియందుండగా భగవంతుడగు శ్రీకృష్ణుడు జన్మించెను.

అట్లనే శ్రీమద్భాగవత ద్వాదశస్కంధ ద్వితీయాధ్యాయమున శ్లో॥ శ్రీముఖసంవత్సరము శ్రావణమాసమున కృష్ణ అష్టమీతిథియందు

ష్టమీతిథౌ రోహిణ్యా మర్ధరాత్రే చ వృషభే చంద్రసం యుతే మీనం గతేషు సర్వేషు గ్రహేషు భగవాన్ హరిః। దేవక్యాం దేవరూపిణ్యాం అవతారం చకార హ।ఇతి। తతః తత్రైవ ధర్మజాత్ సం 1-10-12 దినాని న్యూనాని శ్రీకృష్ణ జనన స్యేత్యర్థః అస్మిన్ విషయే శ్రీమద్భాగవతే-

దశమస్కంధే శ్రీకృష్ణంప్రతి బ్రహ్మాది దేవోక్తిః యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ। శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం విభో॥ ఏతద్వచనస్థ భవతః పంచవిశాధికం శరచ్ఛతం వ్యతీయాయేతి పదైః శ్రీకృష్ణ మూర్తె ర్జన్మప్రభృతి వ్యతీత సంవత్సరసంఖ్యాతు పంచ వింశోత్తర శతాత్మికేత్యర్థస్తు సుస్పష్టతయా ప్రతిపాదితో భవతి। ఏవమేవ విష్ణుపురాణేపి 5 అంశే 37అధ్యాయే పి॥ శ్లో॥ పంచవింశత్యుత్తరకం శతం తు శరదాగమం। ఇత్యాది హరి వంశాదిషు ప్రతిపాద్యతే ॥

అనయా విధయా శ్రీకృష్ణస్య ఆయుః సం 125-7-7 దినాని। శ్రీకృష్ణస్యాపి యుధిష్ఠిరః। సం 1 10మా 12 దినాని జ్యేష్ఠ ఇతి సుస్పష్ట మవగమ్య తే। అతో ధర్మరాజస్య తావత్పర్యంతం వయోవత్సరాణి 127-5-19 దినాని తతః మహాప్రస్థానపర్యంతం సం 1-1-9 ఆహత్య యుధిష్ఠరస్య జీవితం 128-6-28 అష్టావింశత్యుత్తరశతసం ఖ్యానీతి సుస్పష్ట మవగమ్యతే ॥

అపిచ శ్రీమద్భాగవతే 10స్కంధే 2అ శ్లో॥ యస్మిన్

చంద్రుడు వృషభలగ్నమందుండగా సర్వగ్రహములు మీనరాశియందుం డగా భగవంతుడగు శ్రీహరి దేవరూపియగు దేవకియందు అవతరిం చెను. అని చెప్పబడి యున్నది. అచ్చటనే ధర్మరాజుకంటే శ్రీకృష్ణుడు 1సం॥ మా 10-12 దినములు శ్రీకృష్ణుడు చిన్నవాడు. ఈవిషయమున భాగవతము దశమస్కంధమున శ్రీకృష్ణుని గూర్చి బ్రహ్మదేవుని వచ నము ఇట్లు కలదు శ్లో॥ ఓపురుషోత్తమా। యదువంశమునందు అవత రించిన నీకు 125 సం॥ లు గడచినవి. ఇచ్చట ఉన్ననీకు 125సం॥ లు గడచినవి, ఆ పదములచే శ్రీకృష్ణుని జన్మప్రభృతి గడచిన సంవత్స రముల సంఖ్య సుస్పష్టముగా 125 అని చెప్పబడుచున్నది.

ఇట్లే విష్ణుపురాణమందు 5 వ అంశ 37 వ అధ్యాయమందును శ్లో॥ 125 సంవత్సరములని చెప్పబడియున్నది. ఇట్లే హరివంశాది గ్రంథములయందు చెప్పబడియున్నది. ఈ విధముగా శ్రీకృష్ణుని ఆయు ర్దాయము సం. 125-7-7 ది. లు శ్రీకృష్ణునికంటె ధర్మరాజు సం, 1-10మా 12 దినములు పెద్దవాడని స్పష్టముగా తెలియబడు చున్నది. కావున అప్పటికి ధర్మరాజు యొక్క వయస్సు 127 సం॥లు 5మా॥ల 19 దినములు తరువాత మహాప్రస్థాన పర్యంతము 1 సం॥ 1మా॥ 9 దినములు కలుపుకొనిన ధర్మరాజుయొక్క జీవితకాలము 128సం, 6మా॥ల 28 దినములని స్పష్టముగా తెలియుచున్నది.

మరియు శ్రీమద్భాగవతమున పదోస్కంధము 2 వ అధ్యాయ మున శ్లో॥ ఏరోజున శ్రీకృష్ణుడు దేహత్యాగముచేసి వైకుంఠమునకు

పాండస్తు పునరేవైనాం పుత్రలోభా న్మహాయశాః
వక్తుమైచ్ఛ ద్ధర్మపత్నీం కుంతీ త్వేన మథాబ్రవీత్ ॥ 25

నాత శ్చతుర్థ ప్రసవ మాపత్స్వాపి వదంత్యుత
అతః పరం స్వైరిణీ స్యాద్బంధకీ పంచమే భవేత్ ॥ 27

---

కృష్ణో దివం యాతః తస్మిన్నేవ తదాహాని ప్రతిపన్నం కలి యుగ మితి ప్రాహుః పురాణవిదః॥ జ్యోతిశ్శాస్త్రే శ్లో॥ ప్రమాది శుక్ల చైత్రశుక్లేతు ప్రతిపత్తిథౌ తదా సముత్పన్నం కలి యుగమితి జ్యోతిర్విదో విదురితి వచనాచ్చ. కలియుగారంభః క్రీ.పూ. 20-2-1302 మధ్యాహ్నే గం12-12ని30 సెకండ్లు శ్రీకృష్ణస్య ఆయుర్దాయః సం 125-7-7 ఇతి సుస్పష్టం జ్ఞాయ యతే ఇతి శం॥

ఏతా న్ద్విజ మహాపురుషలక్షణాన్ భేదాన్ కేచిత్పాండి త్యమ్మన్యాః పాండుగోళకేషు ఘటిగాన్ వదంతి॥ పాండగోళలక్షణ ... కం పరాశరమాధవీయే శ్లో॥ పత్యౌ జీవతి కుండస్తు మృతే భర్తరి గోళకః॥ ఇతి॥ న గోళాః పాండవాః ॥

అన్యచ్చ శ్లో॥ అపుత్రాం గుర్వనుజ్ఞాతో దేవరః పుత్ర కామ్యయా। ఇత్యాద్యుక్తరీత్యా భారతే ఆదిప 120అ శ్లో॥ స్వాయంభువః ప్రాశక్త్యుక్తరీత్యా సర్వోత్తమ దేవాను గ్రహోజ్జాతాః ఇతి జ్ఞేయం॥

6. పాండురాజు పుత్రలాభమునే మరల ధర్మపత్నిగు కుంతితో చెప్పదలచెను. కాని కుంతీదేవి పాండురాజుతో ఇట్లు పలికినది,

27. నాలుగవ సంతానమును మహాపత్తు యందును, పొంద గూడదని చెప్పుచున్నారు. ఇక కనినచో స్వైరిణి నగుదును. 5 వ సంతానమును కనినచో బంధకిని కాగలను,

వేశ్యనో అరోజున ఆ క్షణమునందే కలియుగము ప్రవేశించెనవి పురాణవిదులు చెప్పుచున్నారు,

ప్రమాది సంవత్సరమున చైత్ర శుద్ధ పాడ్యమి తిధియందు కలియుగ మారంభమాయెను. అవి జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. కలియుగారంభము క్రీ॥ పూ॥ 3102 సంవత్సరము 2 మా॥ల 20దినముల మధ్యాహ్నము 12 గం.ల 12 ని.ల 30 సెకండ్లు అవి నుడివిరి. అవి చెప్పుటచే శ్రీకృష్ణుని ఆయుర్దాయము 125 సం॥ 7 మా॥ల 7 దినములని సుస్పష్టముగా తెలియబడుచున్నది.

ఇటువంటి మహాపురుష లక్షణములతో కూడియున్న పాండవుల విషయమున కొందరు అపండితులు వారు కుండ గోళకులలో లెక్కింపదగిన వారవి నుడివిరి. పరాశర మాధవీయమున కుండ గోళక లక్షణము చెప్పబడియున్నది. శ్లో॥ భర్త జీవించి యుండగా వ్యభిచారముచే బుట్టినవాడు కుండుడు. భర్త చనిపోగా వ్యభిచారముచే పుట్టినవాడు గోళకుడు అవి కలదు. పాండవులు అట్టివారు కారు,

మరియు శ్లో॥ సంతానము లేని స్త్రీని పెద్దల అనుజ్ఞ తీసుకొనినవారై మరిది సంతానముకొరకు పొందవచ్చును. అని చెప్పబడిన విధముగా బుటినవారు మరియు భారతము ఆది ప. 120 వ అధ్యాయము శ్లో॥ "స్వయం జాతః ప్రణీతశ్చ" అవి చెప్పబడిన విధముగా సర్వోత్తమమైన దేవానుగ్రహముచే పుట్టిన వారగుటచే శ్రేష్ఠులని తెలుసుకొనవలసినది.

కుంతీ పుత్రేషు జాతేషు ధృతరాష్ట్రాత్మజేషు చ
మద్రరాజసుతా పాండుం రహో వచన మబ్రవీత్ ॥ 28

ఇదం తు మే మహద్దుఃఖం తుల్యతాయా మపత్యతా
యదితు త్వాం ప్రసన్నో మే స్వయమేనాం ప్రబోధయ ॥ 29

తతః కుంతీం పునః పాండు ర్వివిక్త ఇద మబ్రవీత్
సా త్వం మాద్రీం ప్లవేనేవ తారయైనా మనిందితే ॥ 30

ఏవముక్తాఽబ్రవీన్మాద్రీం సకృచ్చింతయ దైవతం
తస్మాత్తే భవితా పత్య మనురూప మసంశయం ॥ 31

మంత్రం జజాప సా కుంతీ మాద్రీ సస్మార చాశ్వినా
తావాగత్య సుతౌ తస్యాం జనయామాసతు ర్యమా ॥ 32

నకులం సహదేవం చ రూపేణాప్రతిమా భువి
తథైవ తావపి యమా వాగువాచాశరీరిణీ ॥ 33

స్వయంజాతా ప్రణీతా శ్చ దేవాంశాః పంచ పాండవాః ॥ 34

28. ఈ విధముగా కుంతియందు ముగ్గురు పుత్రులు పుట్టగా ధృత రాష్ట్రుని కుమారులు నూర్గురును పుట్టిన తరువాత పాండురాజు ఏకాంతమున మాద్రితో నిట్లు పలికెను.

29. నవతులలో కుంతికి సంతానము కలిగి నీకు లేకపోవుట నాకు చాల దుఃఖముగా నున్నది. నీకు నాకోరిక ననుసరించి సంతానవాంఛ ఉన్నచో ఆ కుంతిని ప్రతిమాలుకొనుము.

30. తరువాత పాండురాజు ఏకాంతమున కుంతితో మరల ఇట్లు పలి కెను. ఓ కుంతీ! నీవు నీ మంత్రమను ఉపాయముచే మాద్రిని గూడ కృతార్థురాలను చేయుము.

31. కుంతీదేవి ఈవిధముగా చెప్పబడినదై ఓ మాద్రీ! ఒక్కమారు నీకు యిష్టమైన దైవమును స్మరించుము. ఆ దేవత వలన నీకు తప్పక యోగ్యమైన సంతానము కలుగును. ఇందు సందేహము లేదు. అని పలికెను.

32. ఆ కుంతీదేవి మంత్రమును జపించెను. మాద్రి అశ్వినీ దేవతలను స్మరించెను. వారిద్దరువచ్చి ఇద్దరు కవల పిల్లలను ఆమెయందు బుట్టించిరి.

33. సౌందర్యముతో అసదృశులగు నకులుని, సహదేవుని ప్రసా దించిరి. ఆ విధముగానే వారు కవలపిల్లలని అశరీర వాక్కు కూడ పలికినది.

34. పాండవులైదుగురు దేవాంశవలన పుట్టిన వారగుటచే స్వయం జాతులును, ప్రణీత సంతానము కాగలరు.

* సత్వరూపగణోపేతా ధ. తో త్యేన విశః।
నామాని చక్రిరే తేషాం శతశృంగనివాసినః॥ 35

జేష్ఠం యుధిష్ఠిరేత్యేవ భీమసేనేతి మధ్యమం।
అర్జునేతి తృతీయం చ కుంతీపుత్రా నకల్పయన్॥ 36

పూర్వజం నకులేత్యేవం సహదేవేతి చాపరం।
మాద్రీపుత్రా వకథయం స్తే . పాః ప్రీతమానసాః॥ 37

కుంతీ మథ పునః పాండు ర్మాద్ర్యర్థే సమ చోదయత్॥ 38

॥కుంత్యువాచ॥

నాజ్ఞాసిషమహం మూఢా ద్వంద్వాహ్వానే ఫలద్వయం।
బిభే మ్యస్యాః పరిభ యా త్కు స్త్రీణాం గతి రీదృశీ। 39

అనుసంవత్సరం జాతా అపి తే కురుసత్తమాః।

---

*వ్యా;- నకులసహదేవయో ర్జన్మకాలే క్రీ. పూ. 21-1-3126 తథాచ భావసంవత్సరఫాల్గున కృష్ణామావాస్యాయాంఅశ్వినీనక్షత్రేమధ్యాహ్న వేలాయాంనకులసహ నామకౌ మాద్ర్యాం యమలౌ జాతావితి వ్యజ్యతే ।

35. ఆ శతశృంగనివాసులగు ఋషులు వీరిద్దరు పిల్లలును సత్వరూప గుణములతో కూడుకున్న వారును, అశ్వనీ దేవతలను అతి క్రమించిన వారును కాగలరు, అని పలుకుచూ, వారలకు పేర్లను పెట్టిరి.

36. పెద్దవానికి యుధిష్టురుడనియు, మధ్యమునికి భీముడనియు మూడవవానికి అర్జునుడనియు, కుంతీ పుత్రులకు పేర్లిడిరి.

37. మాద్రి పుత్రులలో మొదట బుట్టిన వానికి నకులుడనియు, రెండవ వానికి సహాదేవుడనియు, పలుకుచు, ఆబ్రాహ్మణులు మిక్కిలి సంతోషించిన వారైరి.

38. తరువాత పాండురాజు మరల మాద్రికొరకు కుంతిని ప్రేరే పించెను.

కుంతి పలుకుచున్నది,

39. మూఢురాలనగు నేను ఇద్దరిని ఆహ్వానించిన ఇద్దరు పుత్రులు కలు గుదురని తెలుసుకొన లేకపోతిని. నేను ఈమెనుండి భయ పడుచున్నాను. దుర్మార్గులగు స్త్రీలయొక్క నడివడిక ఇట్లుండును గదా!

40 41. ప్రతి సంవత్సరము పుట్టిన ఆ కురుసత్తములగు పాండుపుత్రులు అయిదు సంవత్సరములవలే ప్రకాశించు చుండిరి. వారు మంచి

---

వ్యా॥ నకుల, సహదేవుల యొక్క జన్మకాలము క్రీ॥ పూ॥ 21-1-3126, ఆ విధముగా ధాతసంవత్సర ఫాల్గుణ బహుళ అమావాస్య యందు అశ్వనీ నక్షత్రమందు మధ్యాహ్నసమయమున మాద్రియందు నకుల సహదేవులను కవలలు పుట్టిరని తోచుచున్నది.

పాండుపుత్రా వ్యరాజంత పంచసంవత్సరా ఇవ।
సంభూతాః కీర్తిమంతశ్చ కురువంశవివర్ధనాః 40 41

ప్రజాధిపో౽సౌ ప్రథమం యుధిష్ఠిరే
సుతేషు తేజస్విషు తేషు పంచసు
ప్రభాకరే పంచతపా ఇవో౽న్నతే
ప్రపాతయామాస విలోచనద్వయం ॥ 42

క్షుత్పీడయా స్తనరసే కలహం శిశూనాం
కుంతీ తదా శమయితుం ఘంచకుంభ యుగ్మే
ఏకం యుధిష్ఠిరధనంజయయోశ్చ భాగ
మేకం సమీరణసుతస్య చ సంవిభేజే ॥ 43

వృద్ధతాపసపురఃప్రసారితం వేణుఖండమవలంబ్య శైశవే
భావయన్నివ గదాపరిగ్రహం భావినం పవనభూశ్చచార సః 44

తతో౽న్నప్రాశనం చౌలం చోపనాయనముత్తమం
తత్తద్వయసి బాలానాం కుర్యుస్తత్ర మహర్షయః
వేదే శాస్త్రే క్షత్రధర్మే ధనుర్వేదే చ శిక్షితాః ॥ 45-46

భీమేన దంతయుగళే విధృతం యమన్యే
వన్యేభమారురుహురద్రినిభం సగర్వాః
శుండాం ప్రగృహ్య విజయస్స్వయమేవ మానీ
తం లీలయా రథపథేన సమారురోహ ॥ 47

బలశాలురు కీర్తిమంతులు కురువంశమును వృద్ధిపొందింపు వారుగను తప్పట్టుచుండిరి.

42. తేజోవంతులగు ఆ అయిదుగురు పుత్రులలో మొదటివాడును, ప్రజలకు ప్రభువు నగు యుధిష్ఠురుడు మిక్కిలి ప్రకాశించుచుండెను. పంచాగ్నులలో ఉన్నతుడగుసూర్యునివలె అతడు నేత్రద్వయమును మిరుమిట్లుగొలుపు చుండెను.

43. ఆకలి బాధచే స్తన్యమువందు శిశువులకు కలహము సంభవించుచుండెను. ఆ కలహమును పోగొట్టుటకై కుంభములవంటి కుచముల జంటలో ఒకదానిని ధర్మజార్జునులకును, ఒక దానిని భీమునకును విభజించి కుంతి యిచ్చుచుండెను.

44. వృద్ధులైన తాపసులు ముందు పెట్టుకొనిన దండములు పట్టుకొని బాల్యము నందు భీముడు జరుగబోవు గదా పరిగ్రహమును భావించుచున్న వాడువలె తప్పటడుగులు వేయుచు, సంచరించుచుండెను.

45 46. తరువాత అచ్చటి మహర్షులు ఆపిల్లలకు అన్నప్రాశనము, చవులము, ఉపనయనము, ఆయా యోగ్యకాలములందు నిర్వర్తించిరి. వేదములందును, శాస్త్రములయందును, క్షత్రధర్మములయందును, వారు చక్కగా ఋషులచే శిక్షింపబడిరి.

47. భీమసేనుడు అడవిపందుల యొక్క రెండుదంతములను పట్టుకొని వంచగా అతని సోదరులు పర్వతముతో సమానమైనదానిని ఎక్కిరి. మానవంతుడను అర్జునుడు స్వయముగా ఒకానొక అడవి ఏనుగ యొక్క తుండమును పట్టుకొని వంచి విలాసముగా దంతమార్గమున దానినెక్కెను.

యుధిష్ఠిరస్తు ధర్మాత్మా బభౌ షోడశవార్షికః
అనుసంవత్సరం చోనా భీమార్జునసమాశ్వినా ॥ 48

తతో పాండు ర్వ్యసంతే తు విధినా సంప్రచోదితః
పూర్ణే చతుర్దశే వర్షే ఫాల్గునస్య చ ధీమతః॥ 49

* యస్మి న్నర్క్షే సముత్పన్నః పార్థ స్తస్య చ ధీమతః
తస్మి న్నుత్తరఫల్గున్యాం ప్రవృత్తే స్వస్తివాచనే ॥ 50
రక్షణే విస్మితా కుంతీ వ్యగ్రా బ్రాహ్మణ భోజనే
మాద్రీం మైథున ధర్మేణ సోఽన్వగచ్ఛ ద్బలాదివ॥ 51

♦ స తయా సహ సంగమ్య భార్యయా కురునందన
పాండుః పరమధర్మాత్మా యుయుజే కాలధర్మణా ॥ 52

నిద్రయా కిల నిమీలితం మృతే।
రున్ద్రయా నిజముదీక్ష్య వల్లభం

---

* వ్యా॥ఫాల్గున పూర్ణిమాయాం ఫల్గునస్య 14 సం ప్రాప్తిః తదాది ఉత్తరఫల్గుని 27 దివసే ఆగమిష్యతి తథాచ తస్మిన్ దినే చైత్ర 12 భవతీతి శం

♦ వ్యా॥ సర్వధారి సంవత్సర చైత్రశు॥ 11 స్యాం శతశృంగే పాండురాజస్య మరణం ॥

48. ధర్మాత్ముడగు యుధిష్ఠిరుడు 16 సం॥ వయసు కలవాడై ప్రకా ప్రకాశించు చుండెను. మిగతా నలుగురును ఒక్కొక్క సంవత్స రము చిన్నవారుగా పెరుగుచుండిరి.

49. తరువాత వసంతకాలమున పాండురాజు విధిచే ప్రేరేపింప బడిన వాడయి. చక్కగా పుష్పించిన వనమునందు వసంతకాలము విజృంభించగా,

ч50,51. ధీమంతుడగు అర్జునునకు 14 సం॥ నిండగా ఆ పాండురాజునకు ఏ నక్షత్రమునందు అర్జునుడు ఉదయించెనో, ఆ ఉత్తర ఫల్గునీ నక్షత్రమురాగా బ్రాహ్మణులు ఆశీర్వచనము చేయుచుండగా కుంతీ దేవి, బ్రాహ్మణ భోజనమునందు నిమగ్నురాలై యుండి పాండు రాజును సంరక్షించుటయందు ఏమరుపాటు చెందియుండ అతడు బలాత్కారముగ మాద్రితో కూడినవాడాయెను.

*52. పాండురాజు భార్యయగు మాద్రితోకూడి శాపవశముచే కాల ధర్మము నొందెను

-53. ఈ విధముగా మరణించి నిద్రతో నేత్రములు మూసుకొనినవాని

---

чవ్యా॥ శ్రీముఖ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పూర్ణిమయందు అర్జు నునకు 14 సం॥ లు ప్రాప్తించెను. అది మొదలుకొని ఉత్తర ఫల్గుణీ నక్షత్రము 27 వ దినమున రాగలదు. కావున చైత్ర శుద్ధ ద్వాదశి కాగలదు.

*వ్యా॥ సర్వధారి సంవత్సర చైత్ర శుద్ధ ద్వాదశి యందు శత శృంగ పర్వతమున పాండురాజుయొక్క మరణము. అప్పుడు ధర్మరాజు నకు 16 సం॥ల 4 మా॥ 21 దినములు అని గ్రహించునది.

ఉద్రవా కరముదస్య విహ్వలా
మద్రరాజతనయా రురోద సా॥ 53

కుంతీ శోకపరీతాంగీ విలలాప సుదుఃఖితా
పాండవా అపి శోచంతో మునిభిః పరివేష్టితాః ॥ 54

కుంత్యువాచ
అహం జ్యేష్ఠా ధర్మపత్నీ జ్యేష్ఠధర్మ ఫలం మమ
అన్విష్యామీహ భర్తార మహం ప్రేతవశం గతం॥ 55

ఉత్తిష్ఠ త్వం విసృజ్యైన మిమాన్ పాలయ దారకాన్ 56

మాద్ర్యువాచ
అహమేవానుయాస్యామి భర్తార మపలాయినం
మాం చ కామయమానోయం రాజా ప్రేతవశం గతః ॥ 57

దారకేష్వప్రమత్తా చ భవేథాశ్చ హితా మమ
ఇత్యుక్త్వా ఋషివాక్యాచ్చ చితాగ్నిస్థం నరర్షభం
మద్రరాజసుతా తూర్ణ మన్వారోహ ద్యశస్వినీ
యోగభూమా మృతత్వాచ్చ నమంత్రా దూర్ధ్వదైహికం॥ 59

తే పరస్పర మామంత్ర్య దేవకల్పా మహర్షయః
భీష్మాయ పాండవాన్ దాతుం ధృతరాష్ట్రాయ చైవహి॥ 60

పాండో ర్దారాశ్చ పుత్రాశ్చ శరీరే తే చ తాపసాః

వతె నున్నభర్తను చూచి మాద్రీదేవి,చేతితో శిరస్సు బాదుకొనుచు వివశురాలై మిక్కిలి దుఃఖించెను.

54. కుంతీదేవి మిక్కిలి శోకము కలిగినదై దుఃఖముతో విలపించెను. దుఃఖించుచున్న పాండవులను మునులచే నోదార్చబడిరి.

కుంతి పలుకుచున్నది.

55. నేను పెద్ద భార్యను, కావున ధర్మఫలము నాకు చెందవలెను. మరణించిన భర్తను నేను సహగమనము చేయుదును.

56. నీవు లెమ్ము, అతని విడిచి వెళ్లుము. ఈ పిల్లలను రక్షించుము. అని పలికెను.

మాద్రి చెప్పుచున్నది.

57. శత్రువుచే పరాజయమెరుగని ఈపాండురాజును నేనే అనుసరింతును నన్నే కోరుచూ ఈతడు మరణమును పొందెను. గదా.

58, 59 పిల్లలను పోషించుటయందు నీవు ఏమరుపాటులేక యుండుము. నాకు హితాభిలాషివై సంచరించుము. ఈ విధముగా పలికి ఋషి వాక్యములచే చితాగ్నియందున్న పాండురాజును మాద్రిదేవి మాట లాడకుండ అనుసరించినది. అది యోగభూమి యగుటచే అచ్చట చనిపోయిన వారలకు మంత్రములతో దహనాది సంస్కారములు లేవు

60. అచ్చటి ఋషులు వారిలో వారాలోచించుకొని భీష్మునకును, ధృతరాష్ట్రునకును, పాండవులను అప్పగించుటకు నిశ్చయించుకొనిరి.

61. ఈవిధముగా ఆలోచించుకొనినవారై పాండురాజు యొక్క

తం త్వదీర్ఘేన కాలేన సంప్రాప్తా కురుజాంగలం ॥ 61

సదారా స్తాపసా న్ద్రష్టుం నిర్యయుః పురవాసినః
తదా భీష్మ శ్శాంతనవో సోమదత్తోఽథ బాహ్లికః॥
ప్రజ్ఞాచక్షు శ్చ రాజర్షిః క్షత్తా చ విదుర స్స్వయం
సా చ సత్యవతీ దేవీ గాంధారీ చాపి నిర్యయా ॥ 62-63

ధృతరాష్ట్రస్య దాయాదాః దుర్యోధన పురోగమాః
భూషితాః భూషణై శ్చిత్రై శ్శతసంఖ్యా వినిర్యయుః॥ 64

తా న్మహర్షిగణాన్ దృష్ట్వా శిరోభి రభివాద్య చ
ఉపోపవివిశు స్సర్వే కౌరవ్యా స్సపురోహితాః ॥ 65

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
సప్తమోఽధ్యాయః సమాప్తః

## అష్టమోఽధ్యాయః

ఋషయ ఊచుః

యస్స కౌరవ్యదాయాదః పాండు ర్నామ నరాధిపః
కామభోగా న్పరిత్యజ్య శతశృంగ మితో గతః ॥ 1

భార్యను, పుత్రులను మాద్రీ పాండుల శరీరములను (శల్యము లను) తీసుకొని శీఘ్రకాలమున కురుదేశమునకు వచ్చిరి,

62 63. పురవాసులు భార్యలతో గూడినవారై ఆ ఋషులను చూచుటకు బయటికి వచ్చిరి. అప్పుడు భీష్ముడును, సోమదత్తుడును, బాహ్లీకుడును. ప్రజ్ఞాశాలియగు విదురుడును, సంజయుడును, సత్యవతీ దేవియు, గాంధారీ దేవియు. ఆ ఋషులను సందర్శించుటకు బయటికి వచ్చిరి,

64. ధృతరాష్ట్రుని పుత్రులగు దుర్యోధనాదులు సూర్గురును చిత్రములైన భూషణములతో అలంకరింపబడిన వారై ఋషుల సందర్శనార్థమై వచ్చిరి,

65. వారందరును ఆ ఋషిగణములను చూచి శిరస్సులతో నమస్కరించి పురోహితులతో కూడిన కౌరవు లందరును వారి సమీపమున కూర్చొనిరి.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున ఆదిపర్వయందు
ఏడవ అధ్యాయము సమాప్తము,

# 8వ అ ధ్యా య ము

ఋషులు చెప్పుచున్నారు,

1. ఓ కౌరవులారా! మీకు దాయాదుడగు పాండువను ప్రసిద్ధిచెందిన మహారాజు కామభోగములను వదలి ఇచ్చటనుండి శతశృంగ పర్వతమునకు వచ్చినాడు,

బ్రహ్మచర్యవ్రతస్థస్య తస్య దివ్యేన హేతునా
సాక్షా ద్ధర్మా దయం పుత్ర స్తత్ర జాతో యుధిష్ఠిరః ॥ 2

మాతరిశ్వా దదౌ పుత్రం భీమం నామ మహాబలం
పురూహూతా దయం జజ్ఞే కుంత్యా మేవ ధనంజయః ॥ 3

యౌతు మాద్రీ మహేష్వాసౌ అసూత పురుషోత్తమౌ
అశ్విభ్యాం పురుషవ్యాఘ్రా విమౌ తావపి పశ్యత ॥ 4

పితృలోకం గతః పాండు రితస్సప్తదశేఽహాని
ప్రవిష్టా పావకం మాద్రీ హిత్వా జీవిత మాత్మనః ॥ 5

ఇమే తయో శ్శరీరే ద్వే పుత్రా శ్చేమే తయో ర్వరాః
ఇయం కుంతీ మహాసాధ్వీ సతీ దేవర్షి సమ్మతా ॥ 6

ఏవం మహర్షయ స్సర్వే ప్రోచ్యమానే సముంతితః
దేవదుందుభినిర్ఘోషః పుష్పవృష్టిశ్చ చాపతత్ ॥ 7

తతో ర్థాయ చ ప్రోచుస్తే కురూ న్సర్వా న్మహర్షయః
తస్యా తస్య చ యత్కార్యం క్రియతాం తదనంతరం ॥ 8

* ఏవముక్త్వా కురూన్ సర్వా న్కురూణా మేవ పశ్యతః

---

* వ్యా సర్వధారి సం। చైత్రకృష్ణ 13 శ్యాం శత
శృంగాత్ హాస్తినాపురం పాండవాః ఋషిభి రానీతాః
భీష్మాదిభ్యో నివేదితాః ॥

2. బ్రహ్మచర్య వ్రతమునందున్న ఆతనికి దివ్యమగు హేతువుచే సాక్షాత్ యమధర్మ రాజువలన ఈ యుధిష్ఠిరుడు పుత్రుడుగా నుద్భవించెను.

3. వాయుదేవుడు మహాబలశాలియగు భీముడను పేరుగల ఈపుత్రుని ప్రసాదించెను. దేవేంద్రుని వలన కుంతీదేవియందే ధనంజయుడను పేరుగల ఈత డుదయించెను.

4. గొప్ప కీర్తిగల మాద్రిదేవి నకుల సహదేవులను అశ్వినీ దేవతల వలన పురుష శ్రేష్ఠులగు వీరిద్దరిని కనినది. వీరిద్దరిని కూడ చూడుడు.

5. నేటికి 17వ రోజున పాండురాజు పితృలోకము పొందెను. మాద్రి తన జీవితమును విడిచి వానితో బాటు అగ్నిని ప్రవేశించినది.

6. ఇవి రెండు వారిశరీరములు. వీరలైదుగురు వారి పుత్రులు. ఈమె మహాపతివ్రతయు, దేవ,ఋషి సమ్మతురాలగు కుంతీదేవి.

7. ఈ విధముగా మహర్షులందరూ చెప్పుచుండగా అంతటను దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది.

8. తరువాత మహర్షులు లేచి కురువుల నందరను గూర్చి ఈవిధముగా పలికిరి. ఆమాద్రికిని పాండురాజునకును, అనంతర కర్తవ్యమేమి కలదో దాని నాచరింపుడు.

9. ఈ విధముగా కురువులను గూర్చి పలికి వారందరూ చూచుచుండ

---

వ్యా॥ సర్వధారి సంవత్సర చైత్రకృష్ణ త్రయోదశి యందు శతశృంగ పర్వతమునుండి పాండవులు ఋషులచే తీసుకురాబడి భీష్మాదుల కప్పగింపబడిరి.

ఋణేనాంత్వన్వితా స్సర్వే తాపసా గుహ్యకైస్సహ ॥ 9

ధృతరాష్ట్ర ఉవాచ
పాండో ర్విదుర సర్వాణి ప్రేతకార్యాణి కారయ
♦రాజవ ద్రాజసింహస్య మాద్ర్యాశ్చైవ విశేషతః॥ 10

యథా చ కుంతీ సత్కారం కుర్యా న్మాద్రీం తథా కురు
న శోచ్యః పాండురనఘః ప్రశస్య స్స నరాధిపః
యస్య పంచసుతా వీరా జాతా స్సురసుతోపమాః ॥ 11

విదుర స్తం తథేత్యుక్త్వా భీష్మేణ సహ భారత
పాండుం సంస్కారయామాస దేశే పరమపూజితే ॥ 12

చుక్రుశుః పాండవా స్సర్వే భీష్మశ్చ సహ బాంధవాః
♦బభూవ పాండవై స్సార్ధం నగరం ద్వాదశక్షపాః ॥ 13

---

♦ వ్యా వద్రాజ్ఞ్యయస్య వతిస్వార్థే ఇత్యర్థః

♦ వ్యా॥ బభూవేతి వ్యా॥ ద్వాదశక్షపా ఇత్యత్ర సర్వధారి వత్సర చైత్ర బ13 ప్రభృతి- వైశాఖ శు10 పర్యంతం పాండురాజస్య మాద్రీసహితస్యోత్తర క్రియానిర్వర్తన మభవదితి సూచ్యతే। తదా యుధిష్ఠిరస్య వయస్సం॥ 16-5-25 దినానీతి జ్ఞాయతే। తదా ఇదానీంతన క్రీస్తోః పూర్వం 11-12-3110 ఇతి సుస్పష్టం వ్యజ్యతే ॥

గనే క్షణములో ఆ తాపసులందరు గుహ్యకులతో కూడఅచ్చటనే అంతర్ధాన మొందిరి.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నారు.

॥10. విదురా! పాండురాజునకు, మాద్రికివి విశేషముగా రాజలాంఛనములతో అన్ని ప్రేత కార్యములను చేయించుము.

11. తగినట్లుగా కుంతి మెచ్చుకొనునట్లుగా మాద్రివి గూర్చి ఆలోచించుము. శ్రేష్ఠుడగు రాజగు పాండువు పాపరహితుడు. దుఃఖింపదగినవాడు కాడు. ఆతనికి వీరులును దేవతాపుత్రులతో సమానులగు 5 గురు కుమారులు కలరు గాన దుఃఖించ నవసరములేదు.

12. విదురుడు అలాగేనవి పలికి భీష్మునితో కూడి పరమ పవిత్రప్రదేశమున పాండురాజుకు సంస్కారములను జరిపించెను.

॥13. పాండవులందరును, భీష్ముడును, బంధువులతో, గూడి విలపించిరి. 12 రోజులు గడిచిన తరువాత పాండవులు నగరమున కేతెంచిరి.

---

॥వ్యా॥ వత్ ప్రత్యయము వత్ స్యార్థే యని చెప్పబడుటచే స్వార్థమునందు వచ్చినది. రాజుకావివానికి రాజునకు వలే అని అర్థము కాక రాజునకే యని అర్థము.

॥వ్యా॥ "బభూ ద్వాదశక్షపాః" అనుచోటనర్వధారి సంవత్సర చైత్ర బహుళ 13 మొదలు వైశాఖ శుద్ధ 10పర్యంతము మాద్రితో కూడిన పాండురాజునకు ఉత్తర క్రియలు జరుపబడినవని సూచింపబడుచున్నది. అప్పుడు ధర్మరాజు వయస్సు 16 సం॥ల 5 మా॥ల 25 దినములని తెలియబడుచున్నది అప్పుడు క్రీ॥ పూ॥ 11_12. 3112 సం॥ వి సుస్పష్టముగా తోచుచున్నది.

తతః కుంతీ చ రాజా చ భీష్మశ్చ సహ బంధుభిః
దదుః శ్రాద్ధం తదా పాండోః స్వధాఽమృతమయం తథా॥ 14

కృతశౌచాం తత స్తాంతు పాండవాన్ భరతర్షభాన్
ఆదాయ వివిశు స్సర్వే పురం వారణసాహ్వయం॥ 15

మందమంద ముపేత్య తత్ర సదసో మత్పాండుపుత్రాంకురాః
క్ష్వేతి ప్రేమపురః ప్రసారితకరః కుర్వన్ దృఢాలింగనం
స్సర్వం సర్వ మిమాన్నిజాంకగమితాన్ భ్రాతు స్స్మరన్కౌరవ
శ్శోచ్యతద్భి ర్నయనాంబుభి స్సవిదధే లోకం నదీమాతృకం 16

అథాప్తవంతో వేదోక్తాన్ సంస్కారాన్ పాండవా స్తదా
సంవర్ధంత భోగాంస్తే భుంజానా పితృవేశ్మని। 17

* తత్ర త్రయోదశాబ్దాని ధార్తరాష్ట్రై స్సహోషితాః
ధార్తరాష్ట్రైశ్చ సహితాః క్రీడంతో ముదితా స్సుఖం॥ 18

---

* వ్యా॥ త్రయోదశ ఇత్యత్ర తదాది త్రయోదశాబ్దాని ధార్తరాష్ట్రై స్సహ పాండవా ఉషితా ఇతి ద్యోత్యతే తథాచ సర్వధారి వైశాఖ శు 10 ఆరభ్య ప్లవసంవత్సర వైశాఖ శు 10 పర్యంతం పాండవాః కౌరవై స్సహోషితా

14. తరువాత కుంతియు, ధృతరాష్ట్రుడు, భీష్ముడు, బంధువులతో గూడి అమృతమయమగు స్వధను సమర్పించి శ్రాద్ధమునొనంగిరి

15. ఈవిధముగా శుచిత్వమును బొందిన ఆ పాండవులను తీసుకొని వారందరును హస్తినాపురమును ప్రవేశించిరి.

16. ధృతరాష్ట్రుడు సభనుండి గ్రుడ్డివాడగుటచే మెల్లమెల్లగా ముందుకు వచ్చి నాసోదరుడగు పాండురాజు పుత్రులు ఎచ్చట ఉన్నారు. అనుచూ ప్రేమతో ముందుకు చాచబడిన చేతులు కలవాడై వారిని గాఢాలింగనము చేసుకొనుచు తన తొడను ఎక్కిన పాండవులను మాటిమాటికి స్పృశించుచు, ప్రేమపూర్వకముగా సోదరుని స్మరించుచు, ఎడతెగని, కన్నీటి కాలువలచే ఈ లోకమునంతను నదీమాతృకమైన దానినిగ చేసెను.

17. తరువాత పాండవులు వేదోక్తములైన సంస్కారములను పొంది పెత్తండ్రిగారి గృహమున విశేష భోగముల ననుభవించుచూ చక్కగా వృద్ధి నొందిరి.

* 18. ఈవిధముగా అచ్చట 13 సంవత్సరములు కౌరవులతోకూడ నివసించి, కౌరవులతో కూడుకొని ఆటలాడుకొనుచు సంతోషించుచూ సుఖముగా నుండిరి.

---

*వ్యా॥ త్రయోదశ అనుచోట అప్పటి నుండి (అనగా పాండురాజు మరణమునుండి) 13 సంవత్సరములు పాండవులు కౌరవులతో గూడి నివశించిరి. అని తెలియుచున్నది. ఆ విధముగా సర్వధారి సంవత్సర వైశాఖ శు॥ దశమి నుండి ప్లవసంవత్సర వైశాఖ శు॥ దశమి వరకు పాండవులు కౌరవులతో [illegible] అగును. అప్పు [illegible] కి॥ పూ॥

దత్వా తత్ర త్రపత్యహం యద్యదిష్టం
యావత్స్వేషా మాతృజానాం శతేఽపి
పాండోః పుత్రేష్వంబికాసూను రేతే
ష్వేకైకస్మి న్నేవ తావ ద్బబంధ ॥ 19

ద్రోణ స్తు ద్రుపదేనాథ పరాభవ మవాప్య చ
మనసా దూయమానోఽగా న్నగరం నాగసాహ్వయం ॥ 20

భార్యాపుత్రయుతో ద్రోణః కృపాచార్య నివేశనే
స్థితోఽపి కురుపుత్రాణాం ఖేలనస్థాన మాగతః ॥ 21

కూపే నిపతితం ద్రోణః కందుకం బాణరజ్జునా
బహి ర్నిన్సా ర్య ప్రదదౌ యుధిష్ఠిరపురోగమాః ॥ 22

---

ఇత్యర్థః తదా క్రీస్తోః పూర్వం దినాని 11-12-3099 ఇతి తదానీం యుధిష్ఠిరస్య వయః సం 29-5-25 ఇతి సిధ్యతి ॥

తతో ప్లవసంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమాయాం ద్రోణాచార్యేణ నిర్దిష్టకుమారాస్త్రసందర్శనాఖ్యా విద్యా పరీక్షా చ ॥

తదనుపదమేవ ప్లవసంవత్సర వైశాఖ కృష్ణపంచమ్యాం గురుదక్షిణార్థం భీమార్జునాభ్యాం ద్రుపదబంధనం పశ్చాద్ద్రోణాజ్ఞయా విమోచనం చాభవత్ తస్య కృత్యం సం 1-4-5 దినాన్యభవత్। తథాచ శుభకృత్ సంవత్సర భాద్రపద శు 15 పర్యంత మభూత్। తదా క్రీస్తోః పూర్వం ది 6-4-3098 ఇతి చతురశ్రం

19. ధృతరాష్ట్రుడు ఆ పాండవులకు ఇష్టమైన ఆ యా భోగములను సమకూర్చుచు. తన నూరురు పుత్రులయందు మొత్తము ఎంత ప్రేమ కలదో అంతంత ప్రేమను వీరిఒక్కొక్కరియందు కలిగి యుండెను.

20. తరువాత ద్రోణాచార్యులు ద్రుపదునిచే పరాభవము నొంది మన స్సులో బాధపడుచున్నవాడై హస్తినాపురమునకు విచ్చేసెను.

21. ద్రోణాచార్యుడు భార్యాపుత్రులతో కూడినవాడై కృపాచార్యుని గృహమున నివసించు చుండెను. ఒకానొకప్పుడు కురుపుత్రుల ఆటస్థలమునకు విచ్చేసెను.

22. కౌరవులాడుకొను బంతి బావిలో పడిపోగా ఆబంతిని బాణముల త్రాటిచే బయటికి తీసి వారికి నొసంగెను.

---

11–12–3099, అప్పుడు ధర్మరాజు వయస్సు 29 సం ల 5 మా॥ల 6 దినములు సిద్ధించుచున్నది.

తరువాత ప్లవసంవత్సర వైశాఖ శు॥ పూర్ణిమయందు ద్రోణా చార్యులచే చేయబడిన కుమారాస్త్ర సందర్శనమనెడి విద్యాపరీక్ష జరుప బడెను.

దాని వెంటనే ప్లవ సంవత్సర వైశాఖ బ॥ పంచమి యందు గురుదక్షిణకొరకు భీమార్జునులచే ద్రుపదుని బంధించుటయు, తరువాత ద్రోణాజ్ఞచే విడిచిపెట్టుటయు, సంభవించెను. ఆపని యంతయు. 1 సం. 4 నెలల 5 దినములు ఆయెను. అనగా శుభకృతు సంవత్సర భాద్రపద శుద్ధ 15 వరకు జరిగెను. అప్పుడు క్రీ॥ పూ॥ 6–4–3098 అని సిద్ధించుచున్నది.

భీష్మం ప్రత్యుక్తవంతా స్స భీష్మోఽగా ద్ద్రోణసన్నిధిం
తద్వృత్తం సకలం జ్ఞాత్వా గాంగేయో గురు మాహ్వయె ॥ 23

బాలానాం శిక్షయ న్బ్రహ్మ న్సాధ్వస్త్రాణి ప్రదీయతాం॥ 24

కురూణామస్తి యద్విత్తం రాజ్యం చేదం సరాష్ట్రకం
త్వమేవ పరమో రాజా సర్వే చ కురవ స్తవ ॥ 25

దిష్ట్యా ప్రాప్తోసి విప్రర్షే మహాన్మేఽనుగ్రహః కృతః
విశ్రాంతేఽథ గురౌ తస్మి న్పౌత్రా నాదాయ కౌరవా న్
శిష్యత్వేన దదౌ భీష్మో వసూని వివిధాని చ ॥ 26

గృహం చ సుపరిచ్ఛన్నం ధనధాన్యసమాకులం
ప్రతిగృహ్యాచ తా న్సర్వా న్ద్రోణో వచన మబ్రవీత్ ॥ 27

కార్యం మే కాంక్షితం కించి ద్ధృది సంపరివర్తతే
కృతాస్త్రై స్తత్ప్రదేయం మే తదేత ద్వదతానఘాః ॥ 28

23. ధర్మరాజుతో కూడిన కౌరవులందరు భీష్ముని వద్దకు వెళ్ళి ఈ వృత్తాంతమును అంతయు భీష్మునకు విన్నవించిరి. భీష్ముడు ద్రోణుని వద్దకు వెళ్ళి ఇట్లు పలికెను.

24 ఓ ద్రోణాచార్యా! ఈ బాలురను చక్కగా శిక్షించుము, చక్కటి అస్త్రములను, శస్త్రములను వీరికి అనుగ్రహించుము.

25. కురురాజులకు ఉన్న ధనమంతయు, సామంతరాజులతో, కూడిన రాజ్యమంతయు, నీదే, నీవే మాకందరకు రాజువు. ఈ బాలకు లందరు నీవారలే.

26. ఓ ద్రోణాచార్యా! మా అదృష్టముచే నీ విచ్చటికి వచ్చితివి. మా యందెంతో అనుగ్రహము చూపితివి, అని పలుకుచు ద్రోణా చార్యుడు విశ్రమించి యుండగా తన పౌత్రులగు కౌరవపాండవు లందరిని తీసుకొనివెళ్ళి విశేషధనములను వానికి సమర్పించి శిష్యులనుగా సమర్పించెను.

27. భీష్ముడు మంచి ధనధాన్యములతో అలంకరింపబడిన, అన్ని సౌకర్యములు గల నొక గృహమును వానికి ఏర్పాటు చేసెను, ద్రోణాచార్యుడు వారి నందరను శిష్యులనుగా స్వీకరించి ఈ విధ ముగా పలికెను.

28. ఓ కురు కుమారులారా! ఒకానొక కార్యము నాచే కోరబడినదై నా హృదయమునందు తిరుగుచు కలత పెట్టుచున్నది. మీరలు అస్త్ర విద్యను నేర్చిన తర్వాత నా యాశయమును నెరవేర్చవలసి యున్నది. ఆ వాగ్దానమును నా కొసంగుడు.

తచ్ఛ్రుత్వా కౌరవేయా స్తే తూష్ణీ మాస న్విశాంపతే
అర్జునస్తు తత స్సర్వం ప్రతిజజ్ఞే పరంతప ॥ 29

వృష్ణయ శ్చాంధకా శ్చైవ నానాదేశ్యాశ్చ పార్థివాః
సూతపుత్రశ్చ రాధేయో గురుం ద్రోణం యయు స్తదా॥ 30

కస్త్వం కస్యేతి వాక్యానాం శ్రుత్వా దేశాంతరంగతః
సర్వేషా మేవ శిష్యాణాం బభూవాభ్యధికోఽర్జునః ॥ 31

పంచధా ప్రవహంతీనాం పవనాత్మజ ఏవ సః
కౌరవక్రోధసింధూనాం క్రమాత్సంగమభూ రభూత్ ॥ 32

జవే లక్ష్యాభిహరణే భోజ్యే పాంసువికర్షణే
ధార్తరాష్ట్రాన్ భీమసేనః సర్వా౯ స పరిమర్దతి ॥ 33

న తే నియుద్ధేన జవేన యోగ్యాసు కదాచన
కుమారా ఉత్తరం చక్రుః స్పర్థమానా వృకోదరం ॥ 34

తతో భ్రాతౄ న్సమాహూయ సుయోధన ఉవాచ సః ॥
అయం బలవతాం శ్రేష్ఠః కుంతీపుత్రో వృకోదరః ॥ 35

29. ఓ జనమేజయా! ద్రోణాచార్యుని ఆమాట విని కౌరవులందరు మెదలకుండిరి. తరువాత అర్జునుడు మాత్రము నేను నెరవేర్చుదు నని ప్రతిజ్ఞ చేసెను.

30. అప్పుడు వృష్ణులు, అంధకులు, నానాదేశీయులైన రాజులు సూత పుత్రుడగు రాధేయుడు విద్యాభ్యాసమునకై గురువగు ద్రోణుని చేరిరి.

31. రాధేయుడు నీ వెవ్వరవు. ఎవరి వాడవు. అను వాక్యములను విని విద్యాభ్యాసమునకై ద్రోణుని విడచి దేశాంతరము వెళ్ళెను. అందరి శిష్యులలో అర్జునుడు మిక్కిలి అధికు డాయెను.

32. పాండవు లైదుగురి మీద 5 విధములుగ ప్రవహించుచున్న కౌరవుల క్రోధ మనెడి నదులకు క్రమముగా బలాధికుడగు భీముడు సంగమస్థాన మాయెను.

33. భీమసేనుడు వేగమునందును, లక్ష్యములను భేదించుటయందును, ఆహారము నందును, రాళ్ళను విసరివేయుట యందును, కౌరవుల నందరను ఓడించు చుండెను.

34. కౌరవ కుమారులందరు యుద్ధమునందును, వేగమునందును, ఇతర బలప్రదర్శనలయందును భీమునికిసాటికాక పోయిరి. వారందరును భీముని మీద ఈర్ష్యవహించి, ఆతని జయించ పట్టుదలతో ప్రయత్నించు చుండిరి.

35. తరువాత దుర్యోధనుడు, ఈ భీముడు బలవంతులలో శ్రేష్ఠుడు జయింపరానివాడు అనియు తన సోదరులతోను, తన వారితోను ఆలోచించెను.

తం తు సుప్తం పురోద్యానే గంగా యాం ప్రక్షిపామహే॥ 36

అథ తస్మా దవరజం శ్రేష్ఠం చైవ యుధిష్ఠిరం
ప్రసహ్య బంధనే బధ్వా ప్రశాసిష్యే వసుంధరాం ॥ 37

ఏవం స నిశ్చయం పాపః కృత్వా దుర్యోధన స్తదా
తతో జలవిహారార్థం కారయామాస భారత ॥ 38

ప్రమాణకోట్యాం తం దేశం స్థలం కించి దుపేత్య హి
తత్రోపవిష్టా స్తే సర్వే పాండవాః కౌరవాశ్చ హ ॥ 39

పరస్పరస్య వక్త్రేభ్యో దదుర్భక్ష్యాం స్తత స్తతః
తతో దుర్యోధనః పాపః తద్భక్ష్యే కాలకూటకం
విషం ప్రక్షేపయామాస భీమసేనజిఘాంసయా ॥ 40

స్వయం ప్రక్షిప్యతే భక్ష్యం బహు భీమస్య పాపకృత్
తత స్తే సహితా స్సర్వే జలక్రీడా మకుర్వతాం ॥ 41

విషేణ చ పరీతాంగో నిశ్చేష్టః పాండునందనః ॥ 42

1 ♦ రహసి నలినతల్పే రత్నపర్యంకకల్పే

36. ఇట్లాలోచించి పురోద్యానమునందు నిద్రపోవుచున్న భీముని గంగ యందు పారవేయుదము అని నిర్ణయించెను.

37. తరువాత వానికంటే పెద్దవాడును, జ్యేష్ఠుడును నగు ధర్మరాజును బలాత్కారముగ కారాగారమున నుంచి నేనే ఈ భూమండలము నంతను ఏలగలనని ఆలోచించెను.

38. ఈ విధముగా పాపాత్ముడగు దుర్యోధనుడు ఆలోచించి, తరువాత జలక్రీడ కొరకు ఏర్పాటు చేసెను.

39. గంగా తీరమున కొంతభాగము ఒడ్డుమీదను కొంతభాగము నీటిలో నుండునట్లుగ, ఒక విహార ప్రదేశమును ఏర్పాటు చేసిరి. అచ్చట పాండవులును, కౌరవులును, కూర్చొనియుండిరి.

40. కౌరవపాండవులు విలాసముగా అన్యోన్యము ఒకరినోటిలో ఒకరు భక్ష్య భోజ్యములను పెట్టుకొనుచుండిరి. అంతట పాపాత్ముడగు దుర్యోధనుడు ఆభక్ష్యమునందు భీముని చంపు నభిప్రాయముతో కాల కూట విషము నుంచెను.

41. దుర్యోధనుడు స్వయముగా ఆభక్ష్యములను పాపనిశ్చయము కల వాడై భీమసేనునకు ఒసంగెను. తరువాత వారందరు కూడి జల క్రీడను చేసిరి.

42. భీమసేనుడు విషముతో వ్యాపించిన శరీరము కలవాడై చేష్ట లుడిగి మూర్ఛిల్లెను.

43. ఆ భీముడు ఒకవాక రహస్య ప్రదేశమున సాయంకాలపు చల్ల గాలుచే సేవించబడుచున్నవాడయి తన్నపర్యంకముతో సమాన

దినకరతిసమీరై స్సేవ్యమాన స్స భీమః
తటభువి కుసుమానాం తాదృశై ర్గంధపూరై
రధికమలసతాయాహానిదద్రా నిదద్ర్యా ॥ 43

తతో బధ్వా లతాపాశై ర్భీమం దుర్యోధన స్స్వయం
మృతకల్పం తదా వీరం స్థలాజ్జల మపాతయత్। 44

ఆక్రామన్నాగభవనే తదా నాగకుమారకాః॥
తతోఽస్య దశ్యమానస్య విషం సర్వంహృతం తదా। 45

దంష్ట్రాశ్చ దంష్ట్రిణాం తేషాం మర్మస్వపి నిపాతితాః॥ 46

తతో వాసుకి ముఖ్యైస్తై ర్నాగై రనుగతై స్తదా।
దృష్ట్వా దౌహిత్రదౌహిత్రః పరిష్వజ్య సుపీడితః। 47

* ఆర్యకేణ చ దృష్ట స్స పృథయా ఆర్యకేణచ।

---

♦ వ్యా॥ హానిం క్షతిం ద్యంతి ఖండయంతీతి హానిదాః ద్రవః వృక్షాః యస్యాం తస్యాం తటభువి - గంగాతీరే ఇత్యర్థః ॥

*వ్యా:- దౌహిత్ర ఇతి తు। ఆర్యకః నాగస్య దౌహిత్రః శూరః తద్దౌహిత్రో భీమః ఇత్యవిరుద్ధమేతత్

మగు కమల శయ్య పొందు గంగాతీరమందలి కుసుమముల గంధ
ములచే సేవించబడుచు శరీరశ్రమను అలసటను, తమ వాసన
లచే పోగొట్టునట్టి వృక్షములు గల గంగాతీరమున విడిదించెను

44. తరువాత దుర్యోధనుడు స్వయముగా లతాపాశములచే బంధించి
చనిపోయిన వానితో సమానముగా నున్న వానిని స్థలమునుండి
జలము లోనికి నెట్టెను.

45. తరువాత ఆతడు నాగలోకమును ప్రవేశించెను. అచ్చటనున్న
నాగ కుమారులచే కాటు వేయబడిన వాడయి. జంతు విషము
స్థావర విషమునకు విరుగుడగుటచే విషమంతయు పోయిన వా
డాయెను.

46. ఆ సర్పములు కోరలచే ఈ భీముని మర్మప్రదేశములయందును.
కాటువేసినవి.

47. ఆ నాగులతో కూడినవాడై భీముడు వాసుకి వద్దకు వెళ్ళెను. వాసు
కియు తన దౌహిత్రుని దౌహిత్రుడగు భీముని గాఢాలింగనము
చేసుకొనెను.

48. గొప్ప యశస్సుగల వాసుకి తన దౌహిత్రుడగు ఆర్యకుడు

---

*వ్యా॥ హానిం=అలసటను ద్యంతి= పోగొట్టునవికాగాహానిదాః
దుమః =వృక్షములుః దేనియందో అటువంటి గంగాతీరమునందు
అని అర్థము.

*వ్యా॥ దౌహిత్ర ఇతి = ఆర్యకుడు (శూరుడు)వాసుకియొక్క
దౌహిత్రుడు. ఆ శూరుని దౌహిత్రుడు భీముడు కావున దౌహిత్రునికి
దౌహిత్రుడు.

సుప్రీత శ్చాధవత్తస్య వాసుకి స్సుమహాయశాః। 48

వాసుకి రువాచ ॥

* ధనౌఘో రత్ననిచయో వసుచాస్య ప్రదీయతాం।
బలం నాగసహస్రస్య యస్మిన్ కుండే ప్రతిష్ఠితం।
యావత్పిబతి బాలోఽయం తావదస్మై ప్రదీయతాం। 49

---

* వ్యా॥రత్నధారణమాహాత్మ్యముక్తంస్కాందేహేలాస్యమాహాత్మ్యే శ్లో॥ ఆదిత్యవారే మాణిక్యం సోమవారేతు మౌక్తికం విద్రుమం భౌమ వారేతు సౌమ్యేమరకతం తథా పుష్యరాగం గురోర్వారే వజ్రం వారే భృగోరపినీలం వారే రవేస్సూనోర్గోమేధం రవివాసరే వైఢూర్యం శశినోవారే ఇతి పీడావినిర్ణయః ॥

తస్మాద్వజ్రంతు రత్నానాం శ్రేష్ఠమాహుర్మనీషిణాం విప్రక్షత్రియ విట్ఛూద్రా ధారయేయు ర్యథాక్రమం। స్వ స్వ జాతియుతం వజ్రమగ్రజస్సర్వ మర్హతి।నుంగళా ధరవేవజ్రం కులస్త్రీణాం న యోజయేత్ ॥

నీలరత్నపరీక్షాయాం చింతామణౌ॥ శ్లో॥ క్షీరమధ్యే క్షిపేన్నీలం క్షీరంచేన్నీలతాంవ్రజేత్ ఇంద్రనీలమితిఖ్యాతంతథోక్తం రత్నకోవిదైరితి ॥ సువర్ణ రుద్రాక్షధారణ విధిరుక్తా

(శూరుడు) వాని కుమార్తెయగు కుంతియొక్క కుమారుని చూచి మిక్కిలి ఆనందించెను.

వాసుకి చెప్పుచున్నాడు.

40. ధన సమూహమును, రత్నసముదాయమును, బంగారమును, ఈతవి కీయుడు. ఏ కుండగందు వేయి ఏనుగుల బలమును కలిగించు నట్టి రసము కలదో ఆ కుండలను ఈ పిల్లవాడు ఎన్నిత్రాగునో అన్నియు ఈయ వలసినది.

---

*వ్యా॥ స్కాంద పురాణమున హాలాస్య మహాత్మ్యమున రత్న ధారణ మహిమ చెప్పబడినది. శ్లో॥ ఆదివారమున మాణిక్యమును, సోమ వారమున ముత్యమును, మంగళ వారమున పగడమును, బుధవారమున మరకతమును, గురువారమున పుష్యరాగమును, శుక్రవారమున వజ్ర మును, శనివారమున నీలమును, ఆదివారమున గోమేధమును, వైఢూర్య మును శనివారమున ధరించవలయునని నిర్ణయము.

అందువలన వజ్రమును రత్నములలో శ్రేష్ఠమైన దానిగావిద్వాం సులుచెప్పుచున్నారు. కావున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వారి వారి జాతితో కూడుకున్న వజ్రమును క్రమముగా ధరించవలయును. బ్రాహ్మణుడు ఏజాతి వజ్రమునైనను ధరించవచ్చును. కులస్త్రీలకు మాంగల్యమునందు వజ్రమును ఉంచకూడదు.

నీల రత్న పరీక్షయందు చింతామణి గ్రంథము ఇట్లు చెప్పు చున్నది. శ్లో॥ క్షీరములో నీల రత్నమును పడవేసిన ఆ క్షీరము నల్ల బడిన యెడల అది ఇంద్రనీలమని రత్నకోవిదులచే చెప్పబడినది. సువర్ణమును రుద్రాక్షలను ధరించు విధానము మునిభావబోధిని అను గ్రంథమున ఇట్లు చెప్పబడినది. శ్లో॥ అందముగా సువర్ణముతో

తతో భీమ స్తదా నాగైః కృతస్వస్త్యయన శ్శుచిః
ఏకోచ్ఛ్వాసా త్తతః కుండం పిబతిస్మ మహాబలః ॥ 50

ఏవ మష్టౌ సుకుండాని హ్యపిబ త్పాండునందనః ॥ 51

తతస్తు శయనే దివ్యే నాగదత్తే మహాభుజః
ఆశేత భీమసేనస్తు యథాసుఖ మరిందమః ॥ 52

తతస్తే కౌరవా స్సర్వే వినా భీమంచ పాండవాః
బ్రువంతో భీమసేనస్తు యాతో హ్యగ్రత ఏవ నః
భ్రాతృభి స్సహితో హృష్టో నగరం ప్రవివేశ హ ॥ 53

తతోఽష్టమే తు దివసే ప్రత్యబుధ్యత వాయుజః
ఆజగామ మహాబాహు ర్మాతురంతిక మంజసా ॥ 54

తతస్తత్సర్వ మాచష్ట దుర్యోధనవిచేష్టితం ॥ 55

ఏవం దుర్యోధనో మంత్రీ శకుని శ్చాపి సౌబలః
అనేకై రభ్యుపాయైస్తాన్ జిఘాంసంతిస్మ పాండవాన్ ॥ 56

పాండవా అపి తత్సర్వం ప్రత్యజాన న్నమర్షితాః

---

మ॥ బు॥ భా॥ బోధిన్యాం శ్లో॥ సువర్ణముద్రాకృతా మనోజ్ఞా మౌక్తికప్రవాసంతతధారాస్సు భూతగ్రహాద్యుద్భవనివారణం చ ఉసిర్ణంతంయాముత ప్రైత్యఘూం ఇతి ॥

50. తరువాత భీముడు ఆ నగులచే ఆశీర్వదించ బడినవాడై పరి శుద్ధుడై ఒక గ్రుక్కతో ఒక కుండెడు రసము పానము చేసెను.

51. ఈ విధముగా పాండునందనుడును, మహాబలుడును అగు భీముడు ఎనిమిది కుండల రసమును పానముచేసెను.

52. భీమసేనుడు నాగులచే విప్పబడిన దివ్యమైన శయనమందు సుఖముగా నిద్రించెను

53. తరువాత దుర్యోధనుడు భీముడు లేని పాండవులను గూర్చి మన కంటె ముందే భీమసేనుడు వెళ్ళెనని పలుకుచు తన సోదరులతో గూడి మిక్కిలి సంతోషించుచు, నగరమును ప్రవేశించెను

54. భీముడు 8 వ రోజున నిద్ర మేల్కొంచి, వెంటనే తల్లి వద్దకు వచ్చెను.

55. తరువాత దుర్యోధనుడు చేసిన దుశ్చేష్టనంతనూ తల్లితో చెప్పెను

56. ఈ విధముగా దుర్యోధనుడును, అతని మంత్రియగు శకునియు పాండవులను అనేక ఉపాయములతో చంప యత్నించిరి.

57. పాండవులును, అవన్నియు ఎరిగియు, కౌరవులమీద అసూయ లేనివారై విదురుని చెప్పుచేతలలో నుండి కౌరవుల దుర్మార్గమును

---

కూడిన రుద్రాక్షమాలను ఎల్లప్పుడూ ధరించిన అది ముక్తి ప్రదమగును. భూత గ్రహములయొక్క అపత్తును నివారించును. వాయురోగమును, పైత్యరోగమును పోగొట్టును అవి —

ఉద్భావన మకుర్వంతో విదురస్య మతే స్థితాః ॥ 57

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
అష్టమోఽధ్యాయః సమాప్తః

## నవమోఽధ్యాయః

ద్రోణ స్సర్వకుమారాణా మిష్వస్త్రం ప్రత్యపాదయత్
కమండలుం చ సర్వేషాం ప్రాయచ్ఛ జ్జలకారణాత్ ॥ 1

యావత్తేనోపగచ్ఛంతి తావదస్మై పరాం క్రియాం
పుత్రాయ చ దదౌ కుంభ మావిలం జలకారణాత్ ॥ 2

ద్రోణ ఆచష్ట పుత్రాయ తత్కర్మ జిష్ణురాహత
తత స్తే కౌరవా స్సర్వే జలాశయ మగాద్ద్రుతం ॥ 3

తత స్స వారుణాస్త్రేణ పూరయిత్వా కమండలుం
సమ మాచార్యపుత్రేణ గురు మభ్యేతి ఫాల్గునః॥ 4

ఆహూయ వచనం ద్రోణో రహ స్సూద మభాషత
అంధకారేఽర్జునాయాన్నం న దేయం తే కదాచన ॥ 5

తస్మాల్లాదేవ కౌంతేయ స్స్వాంధకారాస్త్ర మాప్నుయా త్

బహిర్గతము చేయక శాంతముతో సహించుచుండిరి.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వయందు
ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.

# 9 వ అధ్యాయము

1. ద్రోణాచార్యుడు క్షత్రియ కుమారులకు శస్త్రాస్త్రములను నేర్పెను. అందరికిని ఒక్కొక్క కమండలమును ఇచ్చి జలము తీసుకొని రమ్మని ఆజ్ఞాపించెను.

2. జలము తీసుకొని ఎవరు ముందు వచ్చిన వారు నేర్పరులని పలికెను. పుత్రుడగు అశ్వత్థామకు జలము తీసుకొని వచ్చుటకు నొక వెడల్పు మూతిగల కుంభమునిచ్చెను.

3. ద్రోణాచార్యుడు ఆ పనిని కమూపనికిని. అర్జునునికి అందరికి చెప్పగా కౌరవులందరూ వెంటనే జలాశయమువద్దకు వెళ్ళిరి.

4 తరువాత ఫల్గునుడు వారుణాస్త్రముచే ఆ కమండలమును నింపి గురుపుత్రునితోబాటు ద్రోణాచార్యుని సమీపించెను.

5. ఒకానొకప్పుడు ద్రోణాచార్యుడు వంటవానితో నీవు ఎన్నడునూ అర్జునునకు చీకటిలో అన్నము పెట్టవద్దు. అని ఏకాంతమున చెప్పెను.

6. చీకటిలో అన్నము భుజించునపుడు స్వాభావికముగా ఎట్లు చేయి నోటివద్దకు వచ్చునో దానిని ఊహించుకొని అర్జునుడు అంధ

తతో ద్రోణోఽరుసం భూమౌ శిష్యం ద్వైతవర్జితం ॥ 6

తతో నిషాదరాజస్య హిరణ్యధనుషస్సుతః
ఏకలవ్యో గురుం మత్వా ద్రోణం మృణ్మయవిగ్రహం ॥ 7

విమోక్షాధానసంధానే లఘుత్వం పరమాప సః
వనే మృగవిధా దృష్ట్వా పార్థ స్సగురు రాగతః ॥ 8

ద్రోణఉవాచ

యది శిష్యోఽసి మే వీర త్వయాంగుష్ఠం తు దీయతాం
ఛిత్వా విదార్య తం ప్రాదా ద్ద్రోణాయాంగుష్ఠ మాత్మనః ॥ 9

స సత్యసంధం నైషాదిం దృష్ట్వా ప్రీతోఽబ్రవీ దిదం ॥ 10

♦ ఏవం కర్తవ్యమితి వా ఏకలవ్య మభాషత
తత శ్శరం తు నైషాది రంగుళీభి ర్వ్యకర్షత ॥ 11

♦ ద్రోణస్య సత్యవాగాసీ న్నాన్యోఽభిభవి తార్జునం

---

♦ వ్యా॥ ఏవం కర్తవ్యమితి తర్జనీమధ్యమాభ్యాం శరం ధృత్వా జ్యాకర్షణం కర్తవ్యం మిత్యభినీయ దర్శయతీత్యర్థః ॥

కారాస్త్రమును పొందెను. తరువాత ద్రోణుడు ఒంటరిపాటున విశేషముగా అస్త్ర శస్త్రములను అర్జునునకు నేర్పెను.

7. తరువాత నిషాదరాజగు హిరణ్యధనువనువాని కుమారుడగు ఏకలవ్యుడు ద్రోణాచార్యుని గురువుగా భావించి ద్రోణుని మట్టి విగ్రహమును పెట్టుకొని విలువిద్య నేర్చెను.

8. అతడు బాణములను విడిచిపెట్టుట యందు, సంధించుటయందు, గ్రహించుటయందు, మిక్కిలి లాఘవమును సంపాదించెను. వనమునందు మృగమును కొట్టుటకై యాతని నేర్పరితనమును చూచి గురువుతో సహా అర్జునుడు అతని వద్దకు వచ్చెను.

ద్రోణుడు పలుకుచున్నాడు

9. ఓ ఏకలవ్యా! నీవు నా శిష్యుడవగుచో నీ యంగుష్ఠమును నాకు గురుదక్షిణగా నొసంగుము. అని యడిగెను. అతడు తన అంగుష్ఠమును కోసి ద్రోణునకు ఒసంగెను.

10. ఈ విధముగా సత్యసంధుడును, గురుభక్తియు గల ఏకలవ్యుని చూచి ద్రోణాచార్యుడు సంతోషించి ఇట్లు పలికెను.

11. ఈ విధముగా ధనుస్సును ఎక్కుపెట్టుము. ఈవిధముగా బాణమును విడువుము. అని ద్రోణుడు చెప్పగా నాతడు వేళ్ళలోనే ధనస్సును ఎక్కుపెట్టి బాణములను వదలెను.

*12. ఈ విధముగా ద్రోణుడు అర్జునుని కంటె వేరొక సమానుడగు

---

*వ్యా॥ ఇచ్చట గల ఏకలవ్యుని అంగుళచ్ఛేదనము సాక్షాత్తుగా గురుముఖమునుండియే విద్య తెలుసుకొనవలెను. లేనిచో ఇట్లే జరుగును

తతోఽర్జునః ప్రీతమనా బభూవ విగతజ్వరః ॥ 12

కృత్రిమద్విజఘాతేతు విజజ్ఞేఽర్జున ఏవ సః ॥ 13

ద్రోణ ఉవాచ

అగస్త్యస్య ధనుర్వేదే శిష్యో మమ గురుః పురా
అగ్నివేశ ఇతి ఖ్యాత స్తస్య శిష్యోఽస్మి భారత
తపసా యన్మయాప్రాప్తమమోఘ మశనిప్రభం ॥ 14

గృహాణేమం మహాబాహో విశిష్ట మతిదుర్ధమం ॥ 15

---

ర వ్యా। అత్రత్య ఏకలవ్య స్యాంగుళీచ్ఛేదనం సాక్షా ద్గురుముఖేన విద్యా జ్ఞాతవ్యా నోచేత్ ఏవం విధం భవతీతి ధర్మనిర్ణయార్థమేవ నాన్యత్। తథాహి అరణ్య పర్వణి 135 యవ కీతచరిత్రేపి ఏతద్విధయా ప్రాప్త ఇతి జ్ఞాయతే

యవక్రీతః ఇంద్రంప్రతి శ్లో॥ కాలేన మహతా వేదాః శక్యా గురుముఖా ద్విభో తపసా జ్ఞాతుమిచ్ఛామి సర్వజ్ఞా నాని కౌశిక ॥

ఇంద్రః- అమార్గ ఏష విప్రర్షే యేన త్వం యాతు మిచ్ఛసి కిం విఘాతేన తే విప్రగచ్ఛాధీహి గురోర్ముఖాత్ ॥

క్షిప్రమేవ వినశ్యంతి విద్యాః నశోగురు ర్వినా ఏవం విధమైవ మతంగ వ్యాకరణాధ్యా పకాశ్చాపి నష్టా ఇతి శ్రూయతే ॥

తథా చ జీవతో గురుముఖా ద్విజ్ఞాతవ్యమేవ నాన్యథా కేడియో మార్గేణ తన్నిర్జీవత్వాదిత్యర్థః ॥

ధనుర్ధారి లేడను ప్రతిజ్ఞను చెల్లించుకొనెను. అర్జునుడును, తాపము పోయిన వాడయి, సంతోషించెను.

13. కృత్రిమమైన పక్షిని కొట్టుట యందును అర్జునుడే విజయము గాంచెను.

ద్రోణుడు చెప్పుచున్నాడు.

14. పూర్వమందు నాగురువగు అగ్నివేశుడు ధనుర్వేదమునందు అగస్త్యునకు శిష్యుడు. నేను ఆ అగ్నివేశుని శిష్యుడను.

15. తపస్సుచే నాచే పొందబడిన అమోఘమైన పిడుగువంటి విశిష్టమైన అస్త్రమును యిచ్చుచున్నాను. గ్రహించుము.

---

అనెడి ధర్మమును నిర్ణయించుట కొరకే ద్రోణుడట్లు చేసెను. అరణ్య పర్వయందు 137వ అధ్యాయమున యవక్రీత చరిత్రయందును, ఇట్లే సంభవించెనని తెలియుచున్నది. యవక్రీతుడు ఇంద్రునితో శ్లో॥ ఓ ప్రభూ! గురుముఖముగ వేదములు పొందుటకు చాలాకాలము పట్టును. కావున తపస్సుచే ఆ వేదములను సత్వజ్ఞానమును పొందుటకు కోరుచున్నాను.

ఇంద్రుడు చెప్పుచున్నాడు.

ఓ బ్రహ్మర్షీ అది మార్గము కాదు. తపస్సుతో నీవు వేదములను పొంద నిశ్చయించుట మంచిదికాదు. కావున గురుముఖముగా అధ్యయనము చేయుము. గురువులేని విద్యావంతులు వెంటనే నశించెదరు. అని చెప్పెను. ఈవిధముగానే గురువు లేకుండగా వ్యాకరణాధ్యాపకులగు మతంగాదులును నశించిరని తెలియుచున్నది.

కావున జీవించి యున్న గురుముఖము నుండియే విద్యలు తెలుసుకొనవలెను. అట్లుగాక నిర్జీవములైన రేడియో మొదలగు వానిచే విద్య నార్జించుట నిరర్థకము అశాస్త్రీయమునై యున్నది.

అస్త్రం బ్రహ్మశిరో నామ స్వప్రయోగ నివర్తనం
నచ తే మానుషేష్వేత త్ప్రయోక్తవ్యం కథంచన ॥ 16

తథేతి స ప్రతిశ్రుత్య బీభత్సు స్తం గృహీతవాన్ ॥ 17

* తతోఽస్త్రపారగాన్ జ్ఞాత్వా బాలాన్ సర్వాన్ కురూద్వహాః
నానాదేశాధిపాన్ శూరా న్సమాహూయ నృపాన్ బహిః॥ 18

రంగం ప్రకల్ప్య శుత్త్రాద్యాః కుమారాస్త్రప్రదర్శనే
గాంధార్యాద్యా వరస్త్రీభిః బంధుభి ర్జ్ఞాతిభిస్సహ
ద్రష్టుం భీష్మాదిభిస్సాకం ధృతరాష్ట్రో విశత్సభాం ॥ 19-20

తత శ్శుక్లాంబరధర శ్శుక్లయజ్ఞోపవీతవాన్
శుక్లకేశ స్సితశ్మశ్రు శ్శుక్లమాల్యానులేపనః
రంగమధ్యం తదాచార్య స్సపుత్రః ప్రవివేశహ 21

సుఖపుణ్యాహఘోషస్య పుణ్యస్య సమనంతరం।
తతో బద్ధాంగులిత్రాణా బద్ధకక్ష్యా మహారథాః।

---

* వ్యా॥ తతః ప్లవసంవత్సర వైశాఖశుక్ల పూర్ణిమాయాం ద్రోణాచార్యేణ నిర్దిష్ట కుమారాస్త్ర సందర్శనాఖ్య -విద్యాపరీక్షా

16. ఆ అస్త్రము బ్రహ్మశిరోనామకాస్త్రము. దానిని ప్రయోగోప సంహా రములతో నీకుపదేశించుచున్నాను. దానిని మనుష్యులయందు ఎన్నటికిని ప్రయోగించ కూడదు.

17. అలాగేనని ఆ అర్జునుడు గురువుగారికి ప్రతిజ్ఞచేసి దానిని గ్రహించెను.

18. తరువాత ద్రోణాచార్యుడు ఈ కురు కుమారులందరు సకలశస్త్రాస్త్ర పారగులుగ తెలుసుకొని ఖూరులగు నానా దేశాధిపతులను ఆహ్వా నించి ఒక రంగస్థలమును ఏర్పాటు చేసెను

19, 20 కుమారుల యొక్క అస్త్రవిద్యాప్రదర్శనమునకై విదురాదులు ఒక రంగస్థలమును ఏర్పాటు చేసిరి. గాంధారి మొదలుగాగల స్త్రీలతోను జ్ఞాతులతోను, భీష్మాదులతో గూడినవాడై అది చూచుటకు ధృత రాష్ట్రుడు రంగస్థలమును ప్రవేశించెను.

21. తరువాత తెల్లటి వస్త్రములను ధరించి తెల్లటి యజ్ఞోపవీతములను తెల్లటి కేశములను, తెల్లటి గడ్డములను, తెల్లటి పుష్పమాల్యాను లేపములను ధరించిన ద్రోణాచార్యుడు పుత్రునితోగూడ రంగస్థల మును ప్రవేశించెను.

22-23 శుభప్రదమగు పుణ్యాహ ఘోషానంతరంయుధిష్ఠిరుడు మొదలు గాగల మహారథులందరు జేష్ఠానుక్రమముగా కవచాది యుద్ధవేష ములను ధరించి రంగస్థలమును ప్రవేశించిరి ఆరాజకుమారులు

---

వ్యా॥ అటు తరువాత ప్లవ సంవత్సర వైశాఖ శు॥ పూర్ణిమ యందు ద్రోణాచార్యునిచే కుమారుల అస్త్ర సందర్శనము అనుపేరుగల విద్యాపరీక్ష ఏర్పాటు చేయబడినది.

అనుజ్ఞాతం తు తే తత్ర యుధిష్ఠిరపురోగమాః।
చక్రురస్త్రం మహావీర్యాః కుమారాః పరమాద్భుతం॥ 22-23

అథ తౌ నిత్యసంహృష్టౌ సుయోధనవృకోదరౌ।
చేరతు ర్నిర్మలగదౌ సమదావివ కుంజరౌ। 24

విదురో ధృతరాష్ట్రాయ గాంధార్యై పాండవాగ్రణీః।
న్యవేదయే తాం తత్సర్వం కుమారాణాం విచేష్టితం। 25

తత స్తావుద్యతగదౌ గురుపుత్రేణ వారితౌ।
యుగాంతానిలసంక్షుబ్ధౌ మహావేలావివార్ణవౌ। 26

ఆచార్యవచనేనాథ కృతే స్వస్త్యయనే తథా
కాంచనం కవచం బిభ్రత్ప్రత్యదృశ్యత ఫాల్గునః। 27

తతో రంగాంగణగతో ద్రోణో వచనమబ్రవీత్॥ 28

యో మే పుత్రాత్ప్రియతరః సర్వశస్త్రవిశారదః॥
ఐంద్రి రింద్రానుజసమ స్స పార్థో దృశ్యతామితి॥ 29

ఏష కుంతీసుత శ్శ్రీమా నేష మధ్యమపాండవః।
ఏషోఽస్త్రవిదుషాం శ్రేష్ఠో ఏష ధర్మభృతాం వరః॥ 30

దరు అత్యద్భుతముగా వారువారు నేర్చిన అస్త్ర శస్త్ర కౌశలము లన్నింటిని చూపించిరి.

24. తరువాత అత్యుత్సాహము కల సుయోధన భీమసేనలు గదా ధరులై మదించిన ఏనుగులవలే వారివారి గదాయుద్ధ పాండిత్య మును ప్రదర్శించిరి.

25. విదురుడు ధృతరాష్ట్రునకును ధర్మరాజు గాంధారికిని కురుకుమా రులయొక్క ప్రావీణ్యము నంతనూ వారు ఒనరించిన ప్రదర్శన మును తెలియ జెప్పిరి.

26. తరువాత యుగాంతాగ్నివలే క్రోధోద్దీపితులై చెలియలకట్ట నతిక్ర మించిన సముద్రములవలేనుండి ఎత్తినగదలుగల భీమ, దుర్యో ధనులు అశ్వత్థామచే వారింపబడిరి.

27. తరువాత ద్రోణాచార్యుని ఆజ్ఞచే గురువుచే నాశీర్వదింపబడినవాడై బంగారు కవచమును ధరించిన యువకుడగు అర్జునుడు రంగమున ప్రవేశించెను.

28. తరువాత ఆరంగస్థలమున ఉన్నతప్రదేశమున ఉన్న ద్రోణాచా ర్యుడు ఈవిధముగా పలికెను.

29. ఈ అర్జునుడు నాపుత్రుని కంటెను నాకు ప్రియమైనవాడు. సర్వశ స్త్రాస్త్రవిశారదుడు. విష్ణువుతో సమానుడగు ఇంద్రపుత్రుడగు అర్జు నుడు. ఈతనిని చూడుడు.

30. ఈతడు కుంతీపుత్రుడు గొప్పపరాక్రమశాలి. అస్త్రవేత్తలలోను శ్రేష్ఠుడు. ధర్మాత్ములలోను గొప్పవాడు

ఇత్యేవం తుములా వాచః శుశ్రువుః ప్రేక్షకేరితాః।
కుంత్యాః ప్రస్నవసంయుక్తైరస్త్రైః క్లిన్న మరోఽభవత్ ॥ 31

ధృతరాష్ట్రః

ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి రక్షితోఽస్మి మహామతే।
పృథారణిసముద్భూతైస్త్రిభిః పాండవ వహ్నిభిః। 32

దర్శయామాస బీభత్సు రాచార్యాయాస్త్రలాఘవం।
ఆగ్నేయేనాసృజ ద్వహ్నిం వారుణే నాసృజ త్పయః। 33

భౌమేన ప్రావిశ ద్భూమిం పార్వతేనాభజ ద్గిరిం।
అంతర్ధానేన చాస్త్రేణ పున రంతర్హితోఽభవత్। 34

క్షణాత్ప్రాంశుః క్షణాద్ధ్రస్వః క్షణాచ్చ రథధూర్గతః।
క్షణేన రథమధ్యస్థః క్షణేనావతర న్మహీం। 35

తత స్సమాప్తభూయిష్ఠే తస్మి న్కర్మణి భారత॥
వివేశ రంగం విస్తీర్ణం కర్ణః పరపురంజయః। 36

భార్గవాత్తధనుర్విద్యాపారగ స్స రవిప్రభః।

31. అని ఈవిధముగా ప్రేక్షకులు పలికిన వాక్యములను అందరూ వినిరి ఈవాక్యములను విని కుంతికి ఆనందాశ్రువులచే వక్షస్థలమంతయు తడిసిపోయెను.

ధృతరాష్ట్రునకు పలుకుచున్నాడు

32. కుంతి యనెడి అరణినుండి పుట్టిన ఈపాండవులనెడి మూడగ్నులచే నేనుధన్యుడనైతిని. అనుగ్రహీతుడనైతిని. రక్షింపబడితిని.

33. అర్జునుడు ద్రోణాచార్యునకు తన అస్త్రలాఘవమునంతను చూపించెను ఆగ్నేయాస్త్రముచే అగ్నిని పుట్టించెను. వారుణాస్త్రముచే ఉదకమును సృజించెను.

34 అట్లే భౌమాస్త్రమును ప్రయోగించి భూమిని ప్రవేశించెను. పార్వతాస్త్రముచే పర్వతమును భేదించెను. అంతర్ధానాస్త్రమును ప్రయోగించి ఎవరికి కనపడకుండా మాయమాయెను.

35. క్షణకాలములో పొడగరిగా పెరుగుట మరల క్షణకాలములో పొట్టివాడగుట క్షణములో రధమొగిన నుండుట. క్షణములో రధమధ్యగతు డగుట మరల క్షణములో భూమికి దిగుట ఇత్యాది అనేకము ప్రదర్శించెను.

36. తరువాత ఈవిధముగా ప్రదర్శనమంతయు పూర్తి కామండగా మహాపరాక్రమశాలియగు కర్ణుడు విశాలమైన రంగమును ప్రవేశించెను.

37. ఆకర్ణుడు పరశురామునినుండి ధనుర్విద్యాపారంగతుడై సూర్యునితో సమానమైన కాంతిగలవాడుగ నుండెను. అతని సహజమగు

సహజం కవచం బిభ్ర త్కుండలద్యోతితాననః| 37

ప్రాంశుః కనకతాళాభః సింహసంహననో యువా|
స నిరీక్ష్య మహాబాహుః సర్వతో రంగమండలం| 38

ప్రణామం ద్రోణకృపయో ర్నాత్యాదృత ఇవాకరోత్| 39

తతో ద్రోణాభ్యనుజ్ఞాతః కర్ణః ప్రియరణ స్తదా|
యత్కృతం తత్ర పార్థేన తచ్చకార మహాబలః| 40

అథ దుర్యోధన స్తత్ర భ్రాతృభి స్సహ భారత|
కర్ణం పరిష్వజ్య ముదా తతో వచన మబ్రవీత్|| 41

అహం చ కురురాజ్యం చ యథేష్ట ముపభుజ్యతాం||
భుంక్ష్వ భోగా న్మయా సార్ధం బంధూనాం ప్రియకృద్భవ|
దుర్హృదాం కురు సర్వేషాం మూర్ధ్ని పాద మరిందమ| 42

||కర్ణ ఉవాచ||

కృతం సర్వమహం మన్యే సఖిత్వంచ త్వయా వృణే|
ద్వంద్వయుద్ధంచ పార్థేన కర్తుమిచ్ఛా మ్యహం ప్రభో| 43

అర్జున ఉవాచ||

అనాహూతోపదిష్టానా మనాహూతోపజల్పినాం|

లైన కవచముచేతను కుండలములచేతను ముఖము మిక్కిలి ప్రకాశించు చుండెను.

38. మిక్కిలి పొడగరిగా బంగారు తాడిచెట్టువలె నుండెను. సింహము వంటి నడక కలిగినట్టియు, యువకుడగు ఆకర్ణుడు ఆ రంగస్థలము నంతను తేరిపార చూచెను.

39. ఆ కర్ణుడు ద్రోణ, కృపాచార్యులకు నిరాదరముగా నమస్కారము చేసెను.

40. తరువాత ద్రోణుని అనుజ్ఞ పొంది మహాబలుడగు కర్ణుడు అర్జు నుడు చేసిన పనులన్నింటినీ చేసెను.

41. తరువాత సోదరులతో కూడిన దుర్యోధనుడు మిక్కిలి సంతోష ముతో వాని నాలింగనము చేసుకొని వానితో ఇట్లు పలికెను.

42. నన్నునూ, ఈ కురురాజ్యమును యథేష్టముగా ననుభవించుము. నాతో గూడ భోగముల ననుభవింపుము, బంధువుల కందరకు ప్రియమును చేయువాడవు అగుము. శత్రువు లందరి యొక్క శిర స్సున పాదము నుంచుము.

కర్ణుడు పలుకు చున్నాడు.

43. నీవు పలికిన దంతయు, నెరవేరినట్లే తలచు చున్నాను. నీతో స్నేహ మును నేను కోరుచున్నాను. అర్జునునితో ద్వంద్వ యుద్ధము చేయుటకు నేనభిలషించు చున్నాను.

అర్జును డనుచున్నాడు.

44. పిలువక వచ్చి ఉపదేశించు వారలకును, పిలువక, వచ్చిమాట్లాడు

యే లోకా స్తాన్ హతః కర్ణ మయా త్వం ప్రతిపత్స్యసే॥ 44

॥కర్ణఉవాచ॥

రంగోఽయం సర్వసామాన్యః కిమత్ర తవ ఫాల్గున।
గురోస్సమక్షం యావత్తే హరామ్యద్య శిర శ్శరైః। 45

తతో దుర్యోధనేనాపి సభ్రాత్రా సమరోద్యతః।
తావుద్యతమహాచాపౌ కృప శ్శారద్వతోఽ బ్రవీత్।
ద్వంద్వయుద్ధసమాచారే కుశల స్సర్వధర్మవిత్।
అయం పృథాయా స్తనయః కనీయాన్ పాండునందనః।46-47

త్వ మప్యేవం మహాబాహో మాతరం పితరం కులం।
కథయస్వ నరేంద్రాణాం యేషాం త్వం కులభూషణః। 48

తతో విదిత్వా పార్థ స్త్వాం ప్రతియోత్స్యతి వా న వా।
ఏవముక్తస్య కర్ణస్య వ్రీడావనత మాననం। 49

దుర్యోధన ఉవాచ

ఆచార్య త్రివిధా యోనీ రాజ్ఞాం శాస్త్రవినిశ్చయే।
సత్కులీనశ్చ శూరశ్చ యశ్చ సేనాం ప్రకర్షతి। 50

వారలకును, ఏ నరకాది లోకములు కలవో ఓ కర్ణా! నాచే చంప బడినవాడవై నీవా లోకములను పొందగలవు.

కర్ణుడు చెప్పుచున్నాడు.

45. ఈ రంగ స్థలము అందరికిని సమానమైనది. నీకిచ్చటగల ప్రత్యేకత ఏమి గలదు? ఓ అర్జునా! చూడుము. ఇప్పుడే గురువుగారి ఎదుట బాణములచే నీ శిరస్సును పడవేయుదును.

46 47 అంత సోదరులతో గూడిన దుర్యోధనునితో గూడ కర్ణుడు సమరోద్యుక్తుడాయెను. అంతట ద్వంద్వ యుద్ధ విషయమున నేర్పరియు సర్వధర్మవేత్తయగు కృపాచార్యుడు ఈ విధముగా వలికెను, ఈ అర్జునుడు పాండుకుమారులలో మధ్యముడు. కుంతీ పుత్రుడు.

48, ఓ కర్ణా! నీవు కూడ ఆ విధముగా నీ తల్లిని, దండ్రిని చెప్పుచూ ఏ రాజవంశమునకు అలంకారమైన వాడవో చెప్పుము.

49. నీ కులాదులను తెలుసుకొని పార్థుడు యుద్ధము చేయుటయో, మానుటయో, నిర్ణయించుకొనును. ఇట్లు వలుకగా కర్ణుడు సిగ్గుచే ముఖమును వంచుకొనెను.

దుర్యోధనుడు వలుకుచున్నాడు.

50. ఆచార్యా! శాస్త్ర ప్రకారము రాజులకు మూడు విధములైన పుట్టుక గలదు. (1) సత్కులమునందు పుట్టినవాడు (2) శూరుడగువాడు (3) గొప్పసేన గలవాడును రాజుకాగలడు.

యద్వాఽయం ఫల్గునో యజ్ఞే న రాజ్ఞా యోద్ధుమిచ్ఛతి।
తస్మాత్కోఽసావంగవిషయే మయా రాజ్యేఽభిషిచ్యతే॥ 51

---

*వ్యా:- న దుర్యోధనస్య రాజ్యస్వత్వం చేత్కథం కర్ణాయాంగరాజ్యం దత్తవాన్॥ తత్రస్థా అపి పాండవాః కిమర్థముపేక్షితవంత ఇతి ప్రశ్నే సమాధీయతే॥

రాజ్యార్హాః పాండవా అపి తాత్కాలేయత్కించిదంశేఽపి రాజ్యే స్వాధీనస్థలాదిరహితాః సర్వాధికారశూన్యాః। ధృతరాష్ట్రనిగ్రహేషు త్రజీవిన ఇతి ప్రచలితకథాయాం విశదం భవతి। తథాఽపి దుర్యోధనః పితృరనుజ్ఞామాత్రాధికారేణ కర్ణాయాంగరాజ్యం దత్తవాన్॥ ధృతరాష్ట్రస్తు పుత్రపక్షపాతిత్వాత్ పుత్రపారవశ్యాత్ తద్విషయే ఉపేక్షితః। తత్రస్థభీష్మాదయోఽపి ముఖ్యాధికారకర్తృభావకాలే తాత్కాలికరాజప్రతినిధ్యధికారా ఏవన రాజ్యదానాదమనాదికమితి విజ్ఞాయ స్వాధికారం వలయితుమశక్తా ఉపేక్షితాః। భీష్మవిదురద్రోణకృపాదీనాం ప్రత్యేకశః రాజ్యాంశమస్తి తత్సర్వం తాత్కాలికం ధృతరాష్ట్రాధీనే విద్యతే స్వయం శాసితుమసమర్థా హి తే॥

అన్యచ్చ। యుధిష్ఠిరం పురస్కృత్య వివదితుమపి న సంగచ్ఛతే। కథమితిచేద్యుధిష్ఠిరస్యాభిప్రాయస్త్విదం॥ భారతే ఆదిపర్వణి 145 అధ్యాయే యుధిష్ఠిరస్యాభిప్రాయః శ్లో॥ పితా మాన్యో గురుశ్శ్రేష్ఠో యథాఽహం పృథివీపతిః।

*51. అట్లుకాక ఈ అర్జునుడు రాజుకాని వానితో యుద్ధము చేయ కోర
 డిచో ఇదిగో ఈతడు ఇప్పుడే నాచే అంగరాజ్యమునందు పట్టాభి
 షిక్తుడు చేయబడు చున్నాడు.

---

*వ్యా॥ దుర్యోధనునకురాజ్యార్హతే లేనిచో ఎట్లు కర్ణునకు అంగ రాజ్యము నిచ్చెను. అచ్చట ఉన్న పాండవులును, అభ్యంతర పెట్టక ఏల ఉపేక్షించిరి. అని ప్రశ్నరాగా సమాధానము చెప్పబడు చున్నది. పాండవులే రాజ్యార్హులైనను ఆకాలమున రాజ్యమునందు ఎచ్చటనూ, ఏ అంశయందునూ, భుక్తములేనివారు. ఏ విధమైన అధికారము లేకుం డగా ధృతరాష్ట్రుని అనుగ్రహ మాత్రముచే జీవితమును గడుపుచున్న వారని జరిగిన కథ వలన మనకు స్పష్టమగుచున్నది.

రాజ్యాధికారము లేకపోయినను దుర్యోధనుడు తండ్రిఅనుమతి మాత్రముచే కర్ణునకు అంగరాజ్యమును ఇచ్చెను. ధృతరాష్ట్రుడుపుత్రుల యందు పక్షపాతము కలవాడగుట చేతను, పుత్రుల ఆధీనములోనుండుట చేతను, కాదనలేక ఉపేక్ష వహించెను. అచ్చటనున్న భీష్మాదులును, ముఖ్యాధికారియగు పాండురాజు లేనికాలమున తాత్కాలికమైన రాజప్రతి నిధి యొక్క అధికారము గలవారగుటచే రాజ్య దానాదులయందు, తాము అధికారమును చలాయించుటకు శక్తిలేనివారై ఉపేక్షించిరి. భీష్మ, విదుర, ద్రోణ, కృపాదులకు ప్రత్యేకముగా రాజ్యమునందు భాగ ములు గావు. కాని అదంతయు వారు స్వయముగా పరిపాలించుటకు అసమర్థు లగుటచే తాత్కాలికముగా ధృతరాష్ట్రుని ఆధీనములోనున్నది.

మరియు ధర్మరాజును పురస్కరించుకొనిఅంగరాజ్యదానమునకు అభ్యంతర పెట్టుటయు, వారికు కుదరలేదు, ఏలనన భారతము ఆది ప॥ 145 అధ్యాయమున ధర్మరాజుయొక్క అభిప్రాయము శ్లో॥ తండ్రి యగు ధృతరాష్ట్రుడు గురువు, శ్రేష్ఠుడు పూజింప దగినవాడు; అయన

వైశంపాయన ఉవాచ

తత స్తస్మిన్ క్షణే కర్ణ స్సలాజకుసుమైః ఘటైః।
అభిషిక్తో ఽఙ్గరాజ్యస్య శ్రియా యుక్తో మహాబలః॥ 52

దుర్యోధన ఉవాచ

అత్యన్తం సఖ్య మిచ్ఛామీ త్యాహ తం హి సుయోధనః
ఏవ ముక్త స్తతః కర్ణ స్తథేతి ప్రత్యువాచ హ॥ 53

వివేశాథిరథో రంగం దృష్ట్వా తం పితృగౌరవాత్
కర్ణోఽభిషేకార్ద్రశిరాః శిరసా సమవందత
తం దృష్ట్వా సూతపుత్రోఽయ మితి సంచింత్య పాండవః॥ 54

భీమ ఉవాచ॥

---

అశంకమానై స్తత్కార్య మస్మాభి రిది నో వ్రతం॥ ఇతి।
తస్మాత్తే నిరుత్తరా అభవన్॥

తథాచ మధ్వాచార్యకృతమహాభారతనిర్ణయే 18అ॥
39శ్లో॥ అభ్యషేచయ దంగేషు రాజానం పిత్రనుజ్ఞయా
ధృతరాష్ట్రః పక్షపాతా త్పుత్రస్యానువశోఽభవదితి॥

తస్మాత్పరస్పరాధారావంత స్స్మత్రస్థా ఇతి తస్మా
దేవ ఉపేక్షితా ఇతి॥ పితృబలేన దుర్యోధనః కర్ణాయాంగ
రాజ్యాభిషేకం కృతవానితి జాయతే॥

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

52. తరువాత ఆ క్షణమునందే మహాబలుడగు కర్ణుడు పేలాలతోను, పుష్పములతోను, కూడిన జలఘటములతో, అంగ రాజ్యమునకు అభిక్తుడు గావింపబడెను.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

53. ఓ కర్ణా! నీతో నేను మిక్కిలి స్నేహమును కోరుచున్నాను అని సుయోధనుడు పలికెను. అలాగేనని కర్ణుడును, వాగ్దానముచేసెను।

54. అంతలో కర్ణుని తండ్రియగు అతిరథుడు రంగస్థలమును ప్రవేశించెను. తండ్రి యందలి గౌరవముతో అభిషేకముచే తడిసిన శిరస్సుగల కర్ణుడుఆశిరస్సుతో వానికి నమస్కరించెను, అది చూచి ఈ కర్ణుడు సూతపుత్రుడని తెలుసుకొనిరి,

భీముడు చెప్పుచున్నాడు,

---

ఏది చెప్పిన అది నిస్సందేహముగ మేమాచరించ వలయును, ఇది మా వ్రతము.కావున వారు నిరుత్తరులైరి.

కావుననే మధ్వాచార్య విరచిత మహాభారత నిర్ణయమున 18అ॥ 39 శ్లో॥ దుర్యోధనుడు కర్ణుని అంగదేశమునకు రాజుగా తండ్రియొక్క ఆజ్ఞచే అభిషేకించెను. ధృతరాష్ట్రుడు పుత్ర పక్షపాతి యగుటచే పుత్రులను అనుసరించెను అని చెప్ప బడియున్నది. కావున అచ్చట వున్న వారందరు ఒకరిమీద నొకరు ఆధార పడి యుండినవారగుటచే అభ్యంతర పెట్టక ఉపేక్షించిరి. తండ్రియొక్క మద్దతుతో దుర్యోధనుడు అంగరాజ్యాభిషేకము చేసెనే గాని అధికారముండి కాదని తెలియు చున్నది.

అంగరాజ్యస్య నార్హస్త్వ ముపభోక్తుం నరాధమ
శ్వా హుతాశసమీపస్థం పురోడాశ మివాధ్వరే ॥

దుర్యోధన ఉవాచ

శూరాణాం చ నదీనాం చ దుర్విదాః ప్రభవాః కిల
ఆచార్యః కలశా జ్జాతో ద్రోణ శ్శస్త్రభృతాం వరః ॥ 56

గౌతమ స్యాన్వవాయే చ శరస్తంబాచ్చ గౌతమః
భవతాంచ యథాజన్మ తదప్యాగమితం మయా॥ 57

సకుండలం సకవచం సర్వలక్షణలక్షితం
కథ మాదిత్యసదృశం మృగీ వ్యాఘ్రం జనిష్యతి ॥ 58

పృథివీరాజ్య మర్హోయం నాంగరాజ్యం నరేశ్వరః ॥ 59

వైశంపాయన ఉవాచ ॥

తత స్సర్వస్య రంగస్య హాహాకారో మహానభూత్
సాధువాదా నుసంబంధః సూర్యశ్చాస్త ముపాగమత్ ॥ 60

దుర్యోధనస్యాపి తదా కర్ణ మాసాద్య పార్థివ
భయ మర్జునసంజాతం క్షిప్ర మంత రధీయత ॥ 61

55. నీచుడవగు ఓ కర్ణా! యజ్ఞమున అగ్నిహోత్ర సమీపమున నున్న పురోడాశమును కుక్కవలే నీ వీ అంగరాజ్యమును అనుభవించు టకు తగవు.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

56. శూరుల యొక్కయు, నదుల యొక్కయు, పుట్టుకలు తెలియ రానివి. ద్రోణాచార్యులు కుండనుండి బుట్టెను.

57. అట్లే గౌతమకులమున రెల్లుదుబ్బు నుండి కృపాచార్యులవారు పుట్టిరి. మీయొక్క జన్మయు ఎట్లు కలిగినదో నాకు తెలియబడినది

58. ఈ కర్ణుడు అతిరథుని పుత్రుడనుట పొసగదు. సహజ కవచ కుండలములు గలిగి సర్వశుభ లక్షణములు గలిగి సూర్యునితో సమానమగు ఈతడు వాని పుత్రుడెట్లగును. లేడి పెద్దపులిని ఎట్లు కనగలదు

59. ఇట్టి పరాక్రమశాలి యగు నీతడు ఒక్క అంగ రాజ్యమునకేగాక ఈ భూమండలము నంతను ఏలదగిన వాడు.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

60. అంతట రంగస్థలము నందలి అందరును, గొప్ప హాహాకారములు చేసిరి. చాల బాగున్నదని కొందరనిరి. ఇంతలో సూర్యాస్తమాన మాయెను.

61. దుర్యోధనునకును, కర్ణుని పొంది, అప్పుడు అర్జునునివలన బుట్టిన భయమంతయు మాయమై పోయెను.

భీష్మేణ సహితా స్సర్వే యయు స్స్వం స్వం నివేశనం ॥ 62

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
నవమోధ్యాయః సమాప్తః

## దశమోధ్యాయః

* ద్రోణ స్సర్వాన శేషేణ దక్షిణార్థం మహీపతే
పాంచాలరాజం ద్రుపదం గృహీత్వా రణమూర్ధని
పర్యానయత భద్రం వః నాస్యాః పరమదక్షిణా ॥ 1

తథేత్యుక్త్వా తు తే సర్వే రథైస్తూర్ణం సమాయయుః । 2

ద్రుపదః కౌరవాన్ దృష్ట్వా ప్రాధావత సమంతతః
శరజాలేన మహతా మోహయన్ కౌరవీం చమూం ॥ 3

---

* వ్యా॥ తతః ప్లవసంవత్సర వైశాఖ కృష్ణ పంచమ్యాం గురుదక్షిణార్థం భీమార్జునాభ్యాం ద్రుపదబంధనం పశ్చాద్ద్రోణాజ్ఞయావిమోచనం చాభవత్। తత్కృత్యం సం॥ 1-4-౧ దినాన్యభవత్। తథాచ శుభకృత్ సంవత్సర భాద్ర పద శు ౹5 పర్యంత మిత్యర్థః। తదా క్రీస్తోః పూర్వం 6-4-౬0౨౩ ఇతి శం॥

62. అంతట కురు కుమారులందరును భీష్మునితో గూడినవారై వారి వారి ఇళ్ళకు పోయిరి.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వయందు
తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

# 10 వ అధ్యాయము

* 1. ద్రోణుడు గురుదక్షిణ కొరకు కురుకుమారులందరితో ఇట్లు పలికెను. పాంచాలరాజగు ద్రుపదుని రణమున జీవముగా గ్రహించి నావద్దకు తీసుకొని రండు. నీకు క్షేమమగు గాక. ఇదియే నాకు గొప్ప గురుదక్షిణ.

2. కౌరవులందరూ అలాగేనని రథముల నధిష్టించి వెంటనే పాంచాల దేశమునకు వెళ్ళిరి.

3. ద్రుపదుడు కౌరవులు దండెత్తి వచ్చిరని తెలుసుకొని యుద్ధము నకువచ్చి కౌరవసైన్యమును గొప్ప శరవర్షముచే ముంచెత్తివేసెను.

---

* వ్యా॥ ప్లవసంవత్సర వైశాఖ బ॥ పంచమి యందు గురుదక్షిణ కొరకు భీమార్జునులు ద్రుపదుని బంధించుటయు తరువాత ద్రోణునిఆజ్ఞచే విడిచి పెట్టుటయు జరిగెను. ఈపని 1 స, 4మా, 6 రోజులు పట్టెను. కావున శుభకృతు సంవత్సర భాద్రపద శు॥ 15 వరకు పట్టెనని అర్థము. అప్పుడు క్రీ॥ పూ॥ 6-4-3098 అని తెలుసుకొనుడు.

దుర్యోధనశ్చ కర్ణశ్చ కౌరవాశ్చ వినిర్జితాః
పాంచాలరథ మాస్థాయ హ్యవిత్రస్తో ధనంజయః ॥ 4

విక్షోభ్యాంభోనిధిం పార్థ స్తం నాగమివ సోఽగ్రహీత్
తతస్తు సర్వపాంచాలా విద్రవంతి దిశో దశ ॥ 5

తం యజ్ఞసేనం ద్రుపదం గృహీత్వా రణమూర్ధని
ఉపాజహ్రు స్సహామాత్యం ద్రోణాయ భరతర్షభ ॥ 6

ద్రోణ ఉవాచ

మాభైః ప్రాణభయా ద్వీర క్షమిణో బ్రాహ్మణావయం
వరం దదామి తే రాజన్ రాజ్యస్యార్ధ మవాప్నుహి ॥ 7

రాజాఽసి దక్షిణే కూలే భాగీరథ్యాఽహ ముత్తరే
ఏవముక్త స్స తం ద్రోణో మోచయామాస భారత ॥ 8

సోధ్యావసు ద్దీనమనాః కాంపిల్యం నగరోత్తమం
దక్షిణాంశ్చాపి పాంచాలాన్ యావచ్చర్మణ్వతీ నదీ॥ 9

అహిచ్ఛత్రం తు విషయం ద్రోణస్తు సమపద్యత ॥ 10

తత సంవత్సరస్యాంతే యావరాజ్యాయ పార్థివ
స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః ॥ 11

4. దుర్యోధనుడు, కర్ణుడు, కౌరవులు జయింపలేక పారిపోయిరి. అర్జునుడు భయము లేనివాడై ద్రుపదుని రథమును ఎక్కెను.

5. ఈ విధముగా అర్జునుడు ద్రుపదసేనను చెల్లాచెదరు గావించి ఏనుగునువలె ఆతనిని పట్టుకొనెను. అంతట పాంచాలసైనికు లందరు, అన్నిదిక్కులకు పారిపోయిరి.

6. తరువాత ఆ ద్రుపదుని రణరంగమున సజీవముగా గ్రహించి మంత్రులతో గూడ ద్రోణుని వద్దకు తీసుకొని వచ్చెను.

ద్రోణుడు చెప్పుచున్నాడు.

7. ఓవీరుడా! ప్రాణాపాయము కలుగునని భయపడకుము. మేము క్షమావంతులమగు బ్రాహ్మణులము. ఓరాజా! రాజ్యములో సగభాగమును పొందుము, అని నీకు వరము నిచ్చుచున్నాను,

8. గంగానదికి దక్షిణపు ఒడ్డున నీవు రాజు కాగలవు, నేను గంగానది కుత్తరభాగమున రాజు కాగలను, ఈవిధముగా పలికి ద్రోణుడు ద్రుపదుని విడిచి పెట్టెను,

9, ద్రుపదుడు దీనమైన మనస్సుకలవాడై కాంపిల్యనగరమున నివసించుచు చర్మణ్వతి నదివరకు గల దక్షిణ పాంచాలదేశములను పరిపాలించు చుండెను.

10. ద్రోణుడు ఉత్తరపాంచాలదేశమునకు రాజై అహిచ్ఛత్రమును రాజధానిగా చేసుకొనెను.

11 తరువాత ఒక సం॥ నకు పాండుపుత్రుడగు ధర్మరాజు ధృతరాష్ట్రునిచే యువరాజుగా పట్టాభిషిక్తుడయ్యెను,

◆ తాతోఽపి ధర్మతనయం తపనీయపీఠ
మారోప్య చక్షురివ లబ్ధ మమూం తపోభిః
ఆవర్జితైః కలశవారిభి రభ్యషించ
దానందబాష్పకలితై రనఘం చ పౌరాః ॥ 12

పితు రంతర్దధే కీర్తిం శీలవృత్తశమాదిభిః
సంకర్షణా దశిక్షద్వై శ్వాశ్వచ్ఛిక్షాం వృకోదరః ॥ 13

ద్రోణ ఉవాచ
ఆచార్యదక్షిణాం దేహి జ్ఞాతిగ్రామస్య పశ్యతః
దదానీతి ప్రతిజ్ఞాతే ఫాల్గునే చాబ్రవీ ద్గురుః॥ 14

యుద్ధేఽహం ప్రతియోద్ధవ్యో యుధ్యమాన స్త్వయానఘ
తథేతి ప్రతిజజ్ఞా కు ద్రోణాయ కురుపుంగవః ॥ 15

తతో భీమసహాయేన ఫాల్గునో సవ్యదక్షుచ।
విజిత్యసర్వన్నృపతీన్ రథాన్ వాజీన్ గజాన్ జనాన్।
ధనౌఘం ప్రాపయామాస కురురాష్ట్రం ధనంజయః॥ 16
ఏవం సర్వే మహాత్మానః పాండవా మనుజోత్తమాః॥
పరరాష్ట్రాణి నిర్జిత్య స్వరాష్ట్రం వవృధు స్తదా॥ 17

---

◆ వ్యా॥ తతః ఏకవర్షానంతరంశుభకృత్ సంవత్సరఆ॥శు॥ దశమ్యాం యుధిష్ఠిరస్య యావరాజ్య పట్టాభిషేకః తదా యుధిష్ఠిరస్యవయః సం 31-11-25 క్రీ పూ 1-5-3097 ఇతి ధ్యేతి॥

12. ధృతరాష్ట్రుడును ధర్మరాజును సింహాసనము నెక్కించి తన తపస్సుచే నేత్రములను తిరిగి పొందిన వానివలె తలచి ఉదకుంభములచే వానిని అభిషేకించెను. పౌరులున్నూ ఆనందబాష్పములచే భూమిని అభిషేకించిరి.

13. ధర్మరాజు తన శీలముచేతను, ప్రవర్తనచేతను; యింద్రియనిగ్రహముచేతను. తండ్రికీర్తిని మరుగు పరచెను భీముడు బలరాముని వలన యెల్లప్పుడు గదాయుద్ధశిక్షణను విశేషముగా పొందెను.

ద్రోణుడు చెప్పుచున్నాడు

14. ఓ అర్జునా! గురుశిష్య సౌసంగము అని బంధుసముదాయము చూచుచుండగా అడిగెను, యిచ్చెదనని అర్జునుడు ప్రతిన చేయగా గురువు పలికెను

15. యుద్ధమున నేను నీచే ప్రతియుద్ధము చేయబడవలయునని కోరెను. అలాగేనని అర్జునుడు గురువునకు ప్రతిన చేసెను.

16. తరువాత భీముని సహాయముతో అర్జునుడు సకల దిక్కుల రాజులను జయించి రథములను, గుఱ్ఱములను, యేనుగులను, సైనికులను, ధనసమూహమును, కురురాష్ట్రమునకు సమకూర్చెను.

17. ఈ విధముగా మహాత్ములగు పాండవులు పరరాష్ట్రములను జయించి స్వరాష్ట్రమును వృద్ధిపొందించిరి,

* వ్యా॥ తరువాత ఒకసంవత్సరమునకు అనగా శుభకృత్ సం॥ర ఆశ్వయుజ శుద్ధ దశమి యందు ధర్మరాజునకు యువరాజ పట్టాభిషేకము. అప్పుడతని వయస్సు సం॥ 31-11-25 ది క్రీ॥ పూ॥ 1-౦-3097 అని సిద్ధించుచున్నది.

తతో బల మతిఖ్యాతం విజ్ఞాయ దృఢధ్వనినాం।
దూషిత స్సహసా భావో ధృతరాష్ట్రస్య పాండుషు॥ 18

స చింతాపరమో రాజా న నిద్రా మలభన్నిశి॥
బ్రాహ్మణం తం భరద్వాజం గాంధారేయస్య మంత్రిణం॥ 19

తత ఆహూయ కణికం రాజశాస్త్రార్థ విత్తమం।
ధృతరాష్ట్రస్తు స్వాంతస్థ ముక్త్వా తేనైవ బోధితః। 20

ధృతరాష్ట్రఉవాచ

ఉత్సిక్తాః పాండవా నిత్యం తేభ్యోసూయే ద్విజోత్తమ।
కణిక త్వం మమాచక్ష్వ కరిష్యే వచనం తవ॥ 21

కణికఉవాచ

దయాతస్మి న్న కర్తవ్యా శరణాగత ఇత్యుత।
నామత్వా మత్స్యఘాతీవ నరో భద్రాణి పశ్యతి॥ 22

కంటకో హ్యపి దుశ్ఛిన్న ఆస్రావం జనయే చ్చిరం॥
భ్రాతృవ్యా బలినో యస్మాత్ పాండుపుత్రా నరాధిప॥ 23

అల్పోప్యగ్ని ర్వనం కృత్స్నం దహత్యాశ్రయ సంశ్రయాత్।
తస్మాత్త్వం పాండుపుత్రేభ్యో రక్షాత్మానం నరాధిప॥ 24

ప్రహరిష్య న్ప్రియం బ్రూయా త్ప్రహరన్నపి భారత।

18. తరువాత గొప్పధనుర్ధారులగు పాండవుల బలపరాక్రమములు లోక విఖ్యాతి గావించినవిగా తెలిసికొని వెంటనే ధృతరాష్ట్రుని భావము పాండవులపై కలుషిత మాయెను.

19. అతడు మిక్కిలి చింతగలవాడై రాత్రియందు నిద్రలేనివాడయ్యెను అపిమ్మట అర్థశాస్త్రవేత్తయు! బ్రాహ్మణుడును, భరద్వాజస గోత్రుడును, గాంధార రాజమంత్రియు నగు కణికుని పిలిపించెను.

20. ధృతరాష్ట్రుడు తనహృదయము నందున్న ఆవేదనను వానితో నిట్లు చెప్పెను.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

21. పాండవుల బలశాలులు వారిమీద నాకసూయ కల్గుచున్నది. ఓ కణికా! నీవు ఉపాయమును చెప్పుము. నీవు చెప్పినట్లు చేతును.

కణికుడు చెప్పుచున్నాడు.

22. పాండవులు శరణాగతులని! వారియందు దయ తల్పగూడదు. జాలరి వానివలె చంపక యేమనుష్యుడు మంగళముల బడయ జాలడు.

23. ముల్లుయు బాగుగ గుచ్చుకొనిన యెడల చిరకాలము రక్తమును స్రవింపజేయును. బలగంతులగు పాండుపుత్రులు నీకు శత్రువులే.

24. స్వల్పమైన అగ్ని వనమువంతను క్షణములో దహించి వేయును కాన ఓరాజా! నీవు పాండుపుత్రుల నుండి నిన్ను నీకుమారులను రక్షించుకొనుము.

25. అపకారముచేయ బోవుచుండియు అపకారము చేయుచు గూడ ప్రియమునే పలుకవలెను. అపకారము చేసియు వారియందు దయ

ప్రహృత్య చ కృపాయీత శోచేత చ రుదేత చ॥ 25

అంజలిం శపథం సాంత్వం శిరసా పాదవందనం।
ఆశాకరణ మిత్యేవం కర్తవ్యం భూతిమిచ్ఛతా॥ 26

సుపుష్పితః స్యాదఫలం ఫలవాన్ స్యా ద్దురారుహః
ఆశాం కాలవతీం దద్యా త్కాలం విఘ్నేన యోజయేత్। 27

విఘ్నం నిమిత్తతో బ్రూయా న్నిమిత్తం చాపి హేతుతః।
క్షురో భూత్వా హరే త్ప్రాణాన్ నిశితః కాలసాధనః॥ 28

యస్మా ద్దనుప్రాప్తవధ స్తస్యాంగారం ప్రదీపయేత్।
న సంశయ మనారుహ్య నరో భద్రాణి పశ్యతి॥ 29

* కథా చోదాహృతా తేన శివాఖువృకవ్యాఘ్రజా। 30

---

*వ్యా:- తత్ర కథా- పురా వనే కశ్చి జ్జంబుకః అర్థశాస్త్రప్రపండిత శ్చాసీత్। సతు వ్యాఘ్రమూషికనకులవృకై స్సహ స్నేహేన తిష్ఠన్ కశ్చి న్మృగం భక్షితుం ఇయేష। తతో మృగం నిద్రాసమయే మూషికేన పాదచ్ఛేదనం కారయిత్వా వ్యాఘ్రేణ మారయిత్వా సర్వే స్నాత్వా క్రమశః ఆగచ్ఛత అహమత్రైవ స్థాస్యామి పశ్చాదహమపి స్నాత్వాగచ్ఛామి। సర్వే భక్షయిష్యామ ఇత్యుక్త్వా మూషికవాక్యా ద్వ్యాఘ్రం వ్యాఘ్రవాక్యాత్ వృకం నకు

గలవానివలె జాలిపడుచు బిగ్గరగా దుఃఖించ వలెను.

26. ఐశ్వర్యములను కోరువాడు, "చంకదుడ్డు శరణార్థి"వలె శత్రువునకు ఆశకల్గించుచు, యెంతో నమ్రతతో మెలగవలెను.

27. ఏ వృక్షమైనను, పుష్పించిన గాని ఫలించదు గదా! అట్లే మన ఆశ గూడ దోహదము చేసినచో, కొంతకాలమునకు ఫలించును, కావ కాలమును వ్యర్థ పరుపకూడదు.

28 విఘ్నములు వచ్చినచో ఆశ ఫలించదు విఘ్నమునకు హేతువుల నన్వేషించి వాటిని పరిహరించవలెను. కావున కార్యసాధకుడు మంగలి కత్తివలె వాడియైన వాడై ప్రాణములను హరించవలెను.

29. ఎవని వధను కోరునో వానికి నిప్పుపెట్టవలెను. సాహసము చేయనిచో యెవడును శుభమును పొందజాలడు.

ч 30. నక్క, ఎలుక, తోడేలు! పెద్దపులులకు సంబంధించిన ఒక కథ గూడ వానిచే చెప్పబడినది.

---

ч వ్యా॥ పూర్వమువందు ఒకవనములో అర్థశాస్త్రపండితుడగు వొక జంబుకము (నక్క) యుండెను. అది పెద్దపులి, యెలుక, ముంగిస తోడేళ్ళతో స్నేహముగా నుండెను, అది ఒకప్పుడు యొక లేడిని తినదలచెను అంతట ఆ లేడి నిద్రించుచుండగా దాని కాలును యెలుకచే కరపించెను, పెద్దపులిచే చంపించెను. మీరందరు వరుసగా స్నానముచేసి తందు నేనిక్కడే యుండి దీనిని కావలా కాయుదును. తరువాత నేనుకూడ స్నానము చేసి వచ్చెదను. అందరము భుజించుదము, అని చెప్పి యెలుక మాటచే పెద్దపులిని పులివాక్యముచే తోడేలును, ముంగిసవాక్యముచే యెలుకను

♦ కృత్వా కర్తుం వన శ్చక్రే రాజా పుత్రవశే స్థితః॥ 31

వైశంపాయన ఉవాచ

గుణైస్సముదితాన్ దృష్ట్వా పౌరాః పాండుసుతాం స్తదా
కథయంతి స్మ సంభూయ చత్వరేషు సభాసు చ ॥ 32

* ప్రజ్ఞాచక్షు రచక్షుష్ట్వాత్ ధృతరాష్ట్రో జనేశ్వరః।
రాజ్యం న ప్రాప్తవాన్ పూర్వం కథం స నృపతి ర్భవేత్ ॥ 33

---

లోక్యా మూషకం స్వవాక్యేన నకులం బహిర్నిస్సార్య స్వయమేవ భక్షిత ఇత్యేవం విధయా పాపాచరణేన ఇత రాన్ బహి ర్నిస్సార్య స్వోదరపోషణం కర్తవ్యమితి యోజనా॥

♦వ్యా- తతః కించిదధిక పంచసంవత్సరాణి యుధిష్ఠిరేణ యావద్రాజ్యపరిపాలనం ప్రజారంజనం చ। ధనంజయేన దిగ్విజయకరణం ధనౌఘం కురురాష్ట్రప్రాపణం తదను దుర్యోధనసంతాప శ్చాభవదితి జ్ఞాయతే॥

తథాచ శుభకృత్ సంవత్సర ఆశ్వయుజ శు॥౧౦మీ సమారభ్య ప్లవంగ సంవత్సర మాఘ బ౩౦ పర్యంతం సం॥5-4-20 దినాని హాస్తినపురే పాండవానాం వసతిరితి సుస్పష్టం। తదా యుధిష్ఠిరస్య వయః 36-4-10 దినానీతి జ్ఞాయతే। తదా క్రీ.పూ. ది॰ 11-12-3091.

*వ్యాః- నీల వ్యాః ప్రజ్ఞాచక్షుః అంధః అత ఏవానధి

• 31. ధృతరాష్ట్రుడు కణికుని వాక్యములను విని పుత్రుల వశము నందున్న వాడై పాండవుల కపకారము చేయ నిశ్చయించెను.

వైశంపాయనుడు జెప్పుచున్నాడు.

32. గుణములతో కూడియున్న పాండవులను చూచి, పౌరులందరును వీధులందును, సభలందును, గుమికూడి వారిని గురించియే చెప్పుకొను చుండిరి.

* 33. విద్వాంసుడైన ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడగుటచే రాజ్యాధికారి కాజాలడు. అందువలననే ఆతడు పూర్వము రాజ్యమును పొందలేదు. యిప్పుడు రాజు ఎట్లు కాగలడు!

---

తన వాక్యముచే మింగినను బయటికి పంపివేసి తానే అంతనుభక్షించెను ఈవిధముగా పాపము నాచరించి యితరులను వెళ్ళగొట్టి తనయుదరము నింపుకొనవలెను.

• వ్యా॥ ధర్మరాజునకు యౌవరాజ్య పట్టాభిషేకమైన తదుపరి 5 సంవత్సరములపైగా ప్రజలను సంతోషపెట్టుట అర్జునుడు దిక్కులను జయించుట ధనములను కురురాష్ట్రమునకు చేర్చుట తర్వాత దుర్యోధనునకు సంతాము కలుగుట సంభవించెనని తెలియుచున్నది.

ఈవిధముగా శుభకృతు సం॥ ఆశ్వయుజ శు॥ 10నుండి ప్లవంగ సం॥ మాఘ బ॥ అమావాస్య వరకు 5సం॥ 1నెల 20దినములు హస్తినాపురమున పాండవులు వుండిరని తెలియుచున్నది. అప్పటికి ధర్మరాజు వయస్సు 36 సం॥ 4 నెలల 10 దినములు. అప్పటికి క్రీ॥ పూ॥ 11_12 3191.

* వ్యా॥ ప్రజ్ఞాచక్షుః = అంధుడు రాజ్యాధికారము లేకపోవుటచే పూర్వము రాజ్యమును పొందలేదు. యిప్పుడు ఆతడు పుత్రుల ద్వారా

కారా ద్రాజ్యం న ప్రాప్తవాన్ స ఇదానీ మపి పుత్ర ద్వారా కథం నృపతి ర్భవేత్ న కథమపి। ద్వారలోపా దిత్యర్థః॥

ధృతరాష్ట్రస్య రాజ్యానర్హతావిషయే మనుస్మృత్యాది ప్రమాణవచననిరూపణం క్రియతే॥

తథాహి మను 9అ॥ శ్లో॥ అనంశౌ క్లీబపతితౌ జాత్యంధబధిరౌ తథా ఉన్మత్తజడమూకాశ్చ యే చ కేచి న్నిరింద్రియాః ॥కుల్లూకభట్టవ్యా॥ నపుంసక పతిత జ్యాత్యంధ శ్రోత్రవికలోన్మత్త జడమూకాశ్చ యే చ కుణిపం గ్వాందయో వికలేంద్రియా స్తే పిత్రాది రాజ్యభాగహరా న భవంతి। కింతు గ్రాసాచ్ఛాదనభాగిన ఏవేతి॥

అపిచ ॥ శ్లో॥ సర్వేషామపి తు న్యాయ్యం దాతుం శక్త్యా మనీషిణా। గ్రాసాచ్ఛాదన మత్యంతం పతితో హ్యదద ద్భవేత్ ॥ఇతి॥ కు॥ వ్యా॥ తదేవాహ సర్వేషా మేషాం క్లీబాదీనాం శాస్త్రజ్ఞేన రిక్థహారిణా యావజ్జీవం స్వశక్త్యా గ్రాసాచ్ఛాదనం ధనం దేయం అదద త్పాపీ స్యాదితి॥

యాజ్ఞవల్క్యోఽపి॥ శ్లో॥ క్లీబోంధపతిత స్తజ్జః పంగురున్మత్తకో జడః అంధోఽచికిత్స్య రోగాద్యా భర్తవ్యా స్యు ర్నిరంశకాః। తస్య విజ్ఞానేశ్వరవ్యాఖ్యా- ఏ తేక్లీబాదయో నిరంశకాః రిక్థభాజో న భవంతి। కేవలం అశనాచ్ఛాదనేన పోషణీయా భవేయుః ॥ఇతి॥

అతఏవ తేషాం పోషణార్థం తస్య తస్య రాజ్యే స్పృహా

రాజు యెట్లు కాగలడు? గ్రుడ్డివాడగుటచే యే విధముగాను కాజాలడని భావము. ధృతరాష్ట్రునకు రాజ్యాధికారము లేదను విషయమున మను స్మృత్యాది ప్రమాణవచనములు చెప్పుచున్నవి.

మనుస్మృతి 9 వ అ॥ శ్లో॥ అంగ వికలుడు, నపుంసకుడు, పతితుడు, పుట్టుగ్రుడ్డి, చెవిటివాడు, పిచ్చివాడు, జడుడు, మూగవాడు మరియు యింద్రియ లోపము గలవారున్నూ, రాజ్యార్హులు కారు. దీనికి కుల్లూకభట్ట వ్యాఖ్యానములో నపుంసకుడు, పతితుడు, పుట్టుగ్రుడ్డి చెవి లేనివాడు, ఉన్మత్తుడు, మూగవాడు చేయిలేనివాడు కుంటివాడు, యింద్రియ లోపము గలవాడు, తండ్రియొక్క రాజ్యభాగమును పొంద వర్హులు కారు, ఇంతేమన అన్నవస్త్రములను పొందువారు మాత్రమే కాగలరని చెప్పబడియున్నది.

మరియు శ్లో॥ రాజ్యము పొందినవారు యిటువంటి వీరికంద రకును అన్నవస్త్రములను యియ్యవలసి యుండును. ఇవ్వనిచో పతి తుడు కాగలడు, అని చెప్పబడెను. దీనికి కు॥ వ్యా॥ సర్వేషాం=నపుం సకుడు మొదలుగా గల రాజ్యమందధికారములేని అందరుకును తనశక్తి ననుసరించి యావజ్జీవితము అన్నవస్త్రములను యీయవలయును, అట్లి వ్వనిచో వాడు పాపియగును.

యాజ్ఞవల్క్యుడును శ్లో॥ నపుంసకుడు, అంధుడు, పతితుడు, తెలివిమాలిన వాడు, కుంటివాడు, పిచ్చివాడు, జడుడు, చికిత్సకు నలవి కానిరోగముకలవాడు, ఆస్తిలో భాగములేని వీరందరు పోషించదగిన వారు. దీనికి విజ్ఞానేశ్వరవ్యాఖ్య యిట్లుకలదు, నపుంసకుడు మొదలు గాగల వీరు ఆస్తియందు భాగము పొందువారు కారు. కేవలము అన్న వస్త్రములచేత, పోషించతగిన వారుమాత్రమే అని.

కావుననే కౌరవుల యొక్క పోషణకొరకు అర్థరాజ్యము చాలు

తథా శాంతనవో రాజ్యం న స జాతు కరిష్యతి
తే వయం పాండవజ్యేష్ఠం తరుణం యుద్ధశీలినం ॥ 34

అభిషించామ సాధ్వద్య సత్యకారుణ్యవేదినం ॥
సహి భీష్మం శాంతనవం ధృతరాష్ట్రంచ ధర్మవిత్
సపుత్రం వివిధై ర్భోగై ర్భోజయిష్యతి పూజయన్ ॥ 35
తేషాం దుర్యోధనః శ్రుత్వా తాని వాక్యాని జల్పతాం
దుశ్శాసనం చ కర్ణంచ శకునిం ప్రాప్య మంత్రయన్
లాక్షాగృహే పాండవానాం దహనం కర్తు మాయతః ॥ 36

తతో దుర్యోధనస్తైస్తైః ఏకాంతే సముపస్థితం
ఈర్ష్యయా చాపి సంతప్తో ధృతరాష్ట్ర ముపాగమత్ ॥ 37

తతో విరహితందృష్ట్వా పితరం ప్రతిపూజ్యచ
దుర్యోధనో మహాప్రాజ్ఞం దుఃఖితో వాక్యమబ్రవీత్ ॥ 38

దుర్యోధన ఉవాచ
శ్రుతా మే జల్పతాం తాత పౌరాణా మశివాగిరః
త్వా మనాదృత్య భీష్మం చ పతి మిచ్ఛంతి పాండవం॥ 39

---

అర్ధరాజ్య మలమితి. నిర్ణయం కారయిష్యంతి తతః పరం॥
స్వపిత్రా దుర్యోధనప్రస్తావసమయే భారతేప్యేవమేవ ధర్మ ఇతి నిర్ణీతం భవతి। భారతే ఆదిపర్వణి 141–142 అధ్యాయసారే అవగతే ప్యేవమేవార్థః స్పష్టం భవతీతి శం॥

34. "భీష్ముడు యెన్నటికిని రాజ్యము చేయడు. కావున మనము యువకుడును, పరాక్రమవంతుడును. దయాసత్యములు కలిగిన ధర్మరాజును అభిషేకము జేయుదము" అని ప్రజ లనుకొనుచుండిరి.

35. ధర్మవేత్తయగు ధర్మరాజు భీష్మని. పుత్రులతో గూడిన ధృతరాష్ట్రుని గౌరవించుచు. వివిధ భోగములచే పోషింప గలడు.

36. ఈ విధముగా పలుకుచున్న ప్రజల వాక్యములను. దుర్యోధనుడు విని దుశ్శాసనుని. కర్ణుని. శకునుని. కూడి ఆలోచించి. లక్క యింటిలో పాండవులను తగుల బెట్టుటకు. నిశ్చయించెను.

37. తరువాత ఈర్ష్యతో సంతాపము నొందినవాడై ఏకాంతమందున్న ధృతరాష్ట్రుని వద్దకు యొంటరిగా వెళ్ళెను.

38. తరువాత యేకాంతమునందున్న తండ్రిని చూచి అతనిని పూజించి గొప్పవిద్వాంసుడగుతండ్రితో దుర్యోధనుడు దుఃఖించుచున్నవాడై ఇట్లు పలికెను.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

39. ఓ తండ్రీ! పురజనులు మాట్లాడుకొను అమంగళ వాక్యములను నేను వింటిని. నిన్ను భీష్ముని. లెక్కచేయక పౌరులుధర్మరాజును రాజుగా గోరుచున్నారు.

---

నని తరువాత నిర్ణయము చేయుబడినది. భారతమునందును ఈ విధముగానే ధర్మమని దుర్యోధనుడు తండ్రితో ప్రస్తావించు సమయమున నిర్ణయింప బడినది. భారతమున ఆదిపర్వ 141. 142. అధ్యాయముల సారమును అవలోకించిన ఈ విషయమే స్పష్టమగుచున్నది.

పితృతః ప్రాప్తవాన్ రాజ్యం పాండు రాత్మ గుణైః పురా
యది త్వంహి పురా రాజన్నిదం రాజ్య మవాప్తవాన్
ధృవం ప్రాప్స్యామ చ వయం రాజ్య మప్యవశే జనే ॥ 40

త్వమంధగుణ సంయోగా త్ప్రాప్తం రాజ్యం న లబ్ధవాన్ ॥ 41

స ఏవ పాండో ర్దాయాద్యం యది ప్రాప్నోతి ధర్మజః
తస్య పుత్రో ధృవం ప్రాప్త స్తస్య తస్యాపి చాపరః ॥ 42

తే వయం రాజవంశేన హీనా స్సహ సుతైరపి
సతతం నిరయం ప్రాప్తాః పరపిండోపజీవినః ॥ 43

వైశంపాయన ఉవాచ

ధృతరాష్ట్రో ద్విధా చింతాశోకార్త స్సముపద్యత
ముహూర్తమివ సంచింత్య దుర్యోధనమథాబ్రవీత్ ॥ 44

ధర్మనిత్య స్సదా పాండు స్తథా ధర్మపరాయణః
తస్య పుత్రో యథా పాండు స్తథా ధర్మపరాయణః ॥ 45

పితృపైతామహా ద్రాజ్య త్ససహాయో విశేషతః
స కథం శక్యతేఽస్మాభి రపాకర్తుం బలాదితః ॥ 46

దుర్యోధన ఉవాచ

స భవా న్పాండవా నాశు వివాసయితు మర్హసి
మృదునైవాభ్యుపాయేన నగరం వారణావతం ॥ 47

40. పూర్వము పాండురాజు తన సద్గుణములచే తండ్రి రాజ్యమును పొందినారు. నీవు పూర్వమే యీ రాజ్యమును పొందియున్నచో నీ పుత్రులమగు మేము జనుల కిష్టము లేకపోయినను, రాజ్యము పొందెడి వారము.

41. నీవు అంధుడవగుటచే రాజ్యమును పొందక పోయితివి కదా!

42. ఆ ధర్మరాజు పాండురాజ వారసుడుగా రాజ్యమును పొందుచో ధర్మరాజ పుత్రుడు తరువాతను, వాని తర్వాత వాని పుత్రుడును, పరంపరగా రాజ్యమును పొందగలరు.

43. మేము మా సంతానముతో గూడ రాజ్యాధికారము లేనివారమై, యెల్లప్పుడు పరుల దయాధర్మ బిచ్చముపై ఆధారపడినవారమై దుఃఖించెదము.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

44. ధృతరాష్ట్రుడు ఈ మాటలు విని రెండువిధములుగా దుఃఖార్త డాయెను. క్షణకాలము ఆలోచించి, దుర్యోధనునితో నిట్లనెను.

45. పాండురాజు ఎట్లు ధర్మపరాయణుడో అతని పుత్రుడగు ధర్మ రాజును, అట్లే ధర్మపరాయణుడు.

46. విశేషించి ససహాయుడైన ధర్మరాజు పరంపరాగతమైన రాజ్యము నుండి బలాత్కారముగా త్రోసివేయబడుటకు మనచే ఎట్లుసాధ్య మగును.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

47. నీవు పాండవులను మృదువైన యుపాయముతో నిచ్చటనుండి వారణాసి (కాశీ) నగరమునకు పంపుము.

యదా ప్రతిష్ఠితం రాజ్యం మయి రాజన్ భవిష్యతి
తదా కుంతీ సహాపత్యా పునరేష్యతి భారత ॥ 48

ధృతరాష్ట్ర ఉవాచ

దుర్యోధన మమాప్యేతి ధృది సంపరివర్తతే
అభిప్రాయస్య పాపత్వా న్నైనంతు వివృణోమ్యహం ॥ 49

నచ భీష్మో నచ ద్రోణో నచ క్షత్తా చ గౌతమః
వివాస్యమానాన్ కౌంతేయాన్ అనుమంస్యంతి కర్హిచిత్ ॥50

సమాహికౌరవేయాణాం వయం తే చైవ పుత్రక ॥ 51

దుర్యోధన ఉవాచ

మధ్యస్థ స్సతతం భీష్మో ద్రోణపుత్రో మయి స్థితః
యతః పుత్ర స్తతో ద్రోణో భవితా నాత్ర సంశయః ॥ 52

కృప శ్శారద్వత శ్చైవ యత ఏతౌ తతో భవేత్
ద్రోణం చ భాగినేయం చ న సంత్యక్ష్యతి కర్హిచిత్ ॥ 53

క్షత్తార్థబద్ధ స్త్వస్మాకం ప్రచ్ఛన్నం సంయుతః పరైః
విన్నిదకరణం ఘోరం హృది శల్యమివార్పితం ॥ 54

48. కొంతకాలము జరుగగా రాజ్యము నాయందు స్థిరపడును. అప్పుడు కుంతీదేవి పుత్రులతో గూడి యిచ్చటికి రావచ్చును.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

49. దుర్యోధనా! నాకును యీ అభిప్రాయము కొంతకాలము నుండి హృదయమున తిరుగు చున్నది. కాని యీ అభిప్రాయము పాపమైన దగుటవలన యెవరికిని వెల్లడించనైతిని.

50. భీష్ముడు గాని, ద్రోణుడు గాని, విదురుడు గాని, కృపాచార్యుడు గాని, పాండవులను ప్రవాసము పంపుటకు యేవిధముగను, ఒప్పుకొనరు.

51. ఇక నీవును, నీసోదరులును, కర్ణశకునులును, నేనుమాత్రమే యీ విషయమున అభిప్రాయము గలవార మగుదుము.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు

52. భీష్ముడు ఎప్పుడూ ఏ పక్షమున చేరక మధ్యస్థుడు. అశ్వత్థామ నా పక్షమున గలడు. పుత్రుడు ఎటువుండిన ద్రోణుడు గూడ ఆ పక్షముననే ఉండును, ఇందు సందేహము లేదు.

53. కృపాచార్యుడు ద్రోణాశ్వత్థామ లెటువుందురో, అటువైపుండును ద్రోణుని, మేనల్లుడగు అశ్వత్థామను ఎన్నటికినీ విడిచి ఉండడు.

54. మనవల్ల జీవించు విదురుడు శత్రువులతో రహస్యముగ కూడినవాడై హృదయమందలి శల్యమువలె నిద్ర కలిగించకుండగా, మనకు మిక్కిలి వ్యతిరేకముగా నున్నాడు.

శోకపావక ముద్భూతం కర్మణై తేన నాశయ ॥ 55

వైశంపాయనఉవాచ

శ్రుత్వాహ స సుతం రాజా జనవశ్యం కురుష్వ భో । 56

తతో దుర్యోధనో రాజా సర్వాః ప్రకృతయ శ్శనైః
అర్థమానప్రదానాభ్యాం సంజహార సహానుజః ॥ 57

ఉవాచచైతా నథ తాన్ పాండవా నంబికాసుతః
మమైతే పురుషా నిత్యం కథయంతి పునః పునః ॥ 58

తే తాత యది మన్యధ్వ ముత్సవం వారణావతే
సగణా సాన్వయాశ్చైవ విహారధ్వం యథాఽమరాః ॥ 59

తస్యాశయం హృది విదన్నపి ధర్మసూనుః
స్తాతస్య వాచ మవిలంబ్య త థేత్యగృహ్ణాత్ ।
తత్త్వాదృశేషు గురుశాసనపాలనేషు।
కూలంకషం గుణగణేన కులం హి పూరోః। 60

తతః కృతస్వస్త్యయనా పితృవాక్యచ్చ పాండవాః।
కృత్వా సర్వాణి కార్యాణి ప్రయయు ర్వారణావతం॥ 61

55. కావున ఓ తండ్రీ! పాండవుల విషయమై పుట్టిన దుఃఖమనెడి అగ్నిహోత్రమును వారిని వారణావతము పంపి నశింప చేసి చల్లార్పుము.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

56. ఆ ధృతరాష్ట్రుడు కుమారుని మాటలను విని నీవు జనులను వశ పరచు కొనుము. అని పలికెను.

57. తరువాత దుర్యోధనుడు సోదరులతో కూడినవాడయి, ప్రజలకు అర్థమును, గౌరవమును ఇచ్చుటచే వారందరిని ఆకర్షించెదము. అని పలికెను.

58. తరువాత ధృతరాష్ట్రుడు నాయొక్క సేవకులు వారణావతమును గూర్చి విశేషముగ ఎల్లప్పుడు చెప్పుచున్నారు.

59. కావున ఓ బిడ్డలారా! అచ్చట జరుగు ఉత్సవమును, చూడ మీకు అభిప్రాయ మున్నచో మీసోదరులందరును, తల్లితోగూడి అచ్చట దేవతలవలే విహరించుడు, అని చెప్పెను.

60. ధర్మరాజు, ధృతరాష్ట్రుని, హృదయాభిప్రాయమును ఎరిగి యుండియు, తండ్రియొక్క వాక్యమును అలాగేనని వెంటనే అంగీకరించెను. పూరువు యొక్క వంశమునందు పుట్టినవారు, తండ్రి యాజ్ఞను పరిపాలించుట యనెడి సద్గుణములతో నిండిన వారు కదా!

61. తరువాత పాండవులు అందరిచే ఆశీర్వదింప బడినవారై శుభప్రద ములగు మంగళ కృత్యముల నాచరించి వారణావతమును గూర్చి బయలుదేరిరి.

తతః కేచి ద్వ్రివంతిస్మ బ్రాహ్మణా నిర్భయా స్తదా।
వయమేత దనిచ్ఛంతః సర్వ ఏవ పురోత్తమాత్।
గృహాన్ విహాయ గచ్ఛామో యత్ర గంతా యుధిష్ఠిరః 62

యుధిష్ఠిర ఉవాచ।

పితా మాన్యో గురుశ్శ్రేష్ఠో యథాహ పృథివీపతిః।
అశంకమానై స్తత్కార్య మస్మాభిరితి నో వ్రతం॥ 63

ప్రతినంద్య తదాశీర్భిః నివర్తధ్వం యథాగృహం॥
పౌరేషు వినివృత్తేషు విదుర స్సర్వమర్మవిత్ ॥ 64

♦ ప్రాజ్ఞః ప్రాజ్ఞఃప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞమిదం వచః। 65

§అలోహం నిశితం శస్త్రం శరీరపరికర్తనం।

---

♦వ్యా:- ప్రాజ్ఞః-ప్రకర్షేణ అజ్ఞాః-ప్రాజ్ఞాః పశు ప్రాయామ్లెచ్ఛాః తేషాం ప్రలాపం, మ్లెచ్ఛప్రాకృతభాషా విజ్ఞాతా ఇత్యర్థః॥

§వ్యా;- తా మేవాపద మాహ అలోహ మిత్యాదినా॥ తం శత్రుకృతం వారణావతస్థం॥ శస్త్రం- శస్తి శేతే అస్మిన్నితి వ్యుత్పత్యా శస్త్రశబ్దేన ప్రాసాదోఽభిహితః॥ సకారస్థానే శకారః మ్లెచ్ఛభాషాత్వాత్॥ అలోహం అలః అవలః వర్ణలోపః। తేన ఆగ్నేయాని జతుశణసర్జరసాదీని

62. అప్పుడు నిర్భయులైన బ్రాహ్మణులు కొందరు ఇచ్చటనుండిమీరు వెళ్ళుట మాకిష్టముకాదు. మేమందరము ఇండ్లను వదలి ధర్మ రాజుతో బాటు వారణావతము వచ్చెదము. అని పలికిరి.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

63. గురువగు తండ్రి ఏదిచెప్పునో అది ఆచరించి, గౌరవించవలసి యున్నది. వారేది ఆజ్ఞాపించినను మేము విస్సందేహముగా చేయు దుము. ఇది మా వ్రతము.

64. కావున మీరు మమ్మాశీర్వదించి మీ గృహములకు మరలిపొండు. అని వారిని ప్రార్థించెను. పౌరులు తిరిగి వెళ్ళగా సర్వరహస్య ములు ఎరిగిన విదురుడు ధర్మరాజుతో ఇట్లు చెప్పెను.

* 65. ప్రాజ్ఞుడును, మ్లేచ్ఛ భాష ఎరిగిన విదురుడు మ్లేచ్ఛ భాష నెరిగిన ధర్మరాజుతో రహస్యముగా ఇతరులకు తెలియబడ కుండునట్లు చెప్పెను.

66. ఓ ధర్మజా! వారణావతమందలి మేడ మిక్కిలి ప్రమాదమైనది. అది శీఘ్రముగా నిప్పంటుకొను లక్క, జనపనార, సర్జరసాదులచే

---

*వ్యా॥ ప్రాజ్ఞః = విశేషించి అజ్ఞుడు, పశుప్రాయులగు మ్లేచ్ఛులు, వారి యొక్క భాష యగు ప్రాకృత భాషను ఎరిగినవాడు,

వ్యా॥ రాబోవు ఆపదను అలోహం అను శ్లోకముచే చెప్పు చున్నాడు. వారణావతమునందున్న శత్రువుచేచేయబడిన శస్త్రం అనగా నస్తి, దీని నుండు శమనించుమన్నారు. అను వ్యుత్పత్తి వలన శస్త్ర శబ్దముచే మేడచెప్పబడినది. మ్లేచ్ఛభాష యగుటచే సకారమునకుబదులు శకారము వాడబడినది. అలోహం అనగా అయః అనః అగ్నిహోత్రము

యో వేత్తి న తు తం ఘ్నంతి ప్రతిఘాతవిదం ద్విషః॥ 66

♦కక్షఘ్నః శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలౌకసః ।
న దహేదితి చాత్మానం యో రక్షతి స జీవతి ॥ 67

---

లక్ష్యంతే తేషాం ఊహాః సమూహాః యస్మిన్నితి శస్త్రవిశేషణం॥ తర్హి కిం తాని జ్ఞాతు మశక్యాని వా నవా ఇత్యత ఆహ। శరీరపరికర్తన మితి॥ శరీరం-స్వస్వరూప మిత్యర్థః మ్లేచ్ఛభాషాత్వా దవిభక్తికోఽయం నిర్దేశః॥ పరి - పరిలుప్య పరివర్జ్యేతి వర్జనార్థో వా। అగ్నౌ ప్రక్షిప్తే సతి స్వం రూపం హిత్వేత్యర్థః పరిలుప్తే త్యత్ర వర్ణద్వయలోపో మ్లేచ్ఛభాషాత్వాత్ । కర్తనం – హింసకం । సింహాసార్థస్య కృణాతే రూపమిదం చ ఛేదనార్థస్య – ప్రతిఘాతః - శస్త్రప్రతీకారః తద్విదం । ద్విషో న ఘ్నంతీతి యోజనా । తస్మిన్ – జతుగృహే - అంతర్హితా స్వేనాగ్నేయాని ద్రవ్యాణి భిత్త్యాదావర్తంతే స్వేన రూపేణ దృశ్యంతే। అత స్తాదృగ్విధః ప్రాసాదః పరిత్యాజ్య ఇతి భావః॥

♦వ్యా॥ క స్తర్హి సాధనం తస్మిన్ గృహే వసతోఽస్మాన్ భస్మీకర్తుం యతిష్యత ఇత్యాహ॥ కక్షఘ్న ఇతి । కక్షః = కుక్షః పార్శ్వం తత్ర యాంతి గచ్ఛతీతి కక్షఘ్నః॥

నిర్మింపబడినది. అగ్నిహోత్ర మంటుకొనినచో వెంటనే తన స్వరూపమును కోల్పోవును. అందున్నవారిని నశింపజేయును. ఎవడు ఈ విషయమును గుర్తెరిగి దానికి ప్రతిక్రియ చేయునో వానిని శత్రువులు నశింపజేయలేరు.

॥ 87. ఈ ప్రక్క వచ్చుచున్న పురోచనుడే ఆ గృహమునకు నిప్పంటించి మిమ్ము నశింపజేయువాడు. కావున ఆ గృహమున ఒక సొరంగమును త్రవ్వించి దానిలో ఉండినచో అగ్ని మిమ్మునశింప జేయజాలదు, ఈ విధముగా ఉపాయముగా ఎవడు తనను రక్షించుకొనునో వాడే జీవించ గలుగును.

---

ఇచ్చట వర్ణలోపము వచ్చినది. తొందరలో అగ్నిని గ్రహించు లక్కవారపీచు, సర్జరసము, ఘృతము మొ॥ పదార్థములు చెప్పబడుతవి. వాటియొక్క సమూహమే ఆ మేడ. అలాఅగుచో ఆమేడ ఆటువంటిదని తెలియబడునా? లేదా? అనుచో శరీర పరికర్తనమ్ శరీరం స్వరూపమును మ్లేచ్ఛభాష యగుటచే విభక్తి లేకుండగా ప్రయోగించబడినది. పరికర్తన మనగా విడిచి పెట్టునది. అనగా అగ్ని పెట్టగనే ఆ సౌధము తన స్వరూపమును కోల్పోవును. పరియను పదమునకు పరిలుప్తా అని అర్థము. లుప్తాయని రెండక్షరములు మ్లేచ్ఛ భాషయగుటచే లోపించినవి, కర్తనం = హింసించునది, హింసార్థముగల ఛేదించుట యను అర్థముగల కృణు ధాతువునుండి ఏర్పడినరూపము ప్రతిఘాతః = ఆ మేడకు ప్రతీకారము ఎరిగిన వానిని శత్రువులు చంపలేరు, అలక్కయింటి యందు, గోడలయందు లాక్షాది ఆగ్నేయద్రవ్యములు రహస్యముగా ఉంచబడినవి. కావున అటువంటి మేడ విడిచిపెట్ట దగినదని భావము.

॥వ్యా॥ అలా అగుచో అందు నివశించియున్న మమ్ము ఏదుర్మా

నాచక్షు ర్వీక్షతే పంథానం నాచక్షు ర్విందతే దిశః ।
నాధృతిర్బుద్ధి మాప్నోతి బుద్ధ్యస్వైవం ప్రబోధితః ॥ 68

చర న్మార్గా న్విజానాతి నక్షత్రై ర్విందతే దిశః ।
ఆత్మనా చాత్మనః పంచ పీడయ న్నాను పీడ్యతే ॥ 69

.................................

పురోచనః—హంతా । మ్లేచ్ఛభాషాత్వాత్ అప్రసిద్ధ గత్యర్థే ప్రయోగః । శిశిరఘ్నః । శృణాతి - హినస్తీతి । శిశిరః - అగ్నిః । అయమేవ పార్శ్వవర్తీ అగ్నినా హంతు మాయాతీ త్యర్థః । తస్మాదయ మేవ హంతవ్యః । ఉత వారణావత గృహం వా న ప్రవేష్టవ్యం । ఉత వారణావత మగత్వైవ హస్తినపురం ప్రత్యేవాగంతవ్యమి త్యాశంక్యాహ - కక్ష ఇతి । కం - సుఖం । క్షిణోతీతి కక్షః యః శత్రుః । అస్మిన్ సతి కపటే జ్ఞాతే యోవాన్ - శత్రుం ప్రత్యక్షం ప్రహరేదితి భావః ।

క స్తర్హ్యత్రోపాయ ఇత్యాశంక్యాహ । బిలౌకసః = బిలాంతరప్రవిష్టాన్ యుష్మాన్ పురోచనో న దహేత్ । బిలే దాహాసంభవా త్తత్ర గృహే అంతర్బిలం కర్తవ్యమిత్యర్థః ॥ ఇత్యాత్మానం యో రక్షతి స జీవతి । ఏవం జ్ఞాత్వా త్వయోపాయేన ఆత్మా రక్షణీయ ఇత్యర్థః ॥

68. నేత్రములు లేనివాడు మార్గమును ఎరుగడు. దిక్కులను తెలిసికొనడు. ధైర్యము లేనివాడు జ్ఞానమును పొందలేడు. ఈ విధముగా ప్రబోధింపబడినవాడవై విషయమును గ్రహించుము.

69. నడచినచో ముందుమార్గమును తెలిసికొనగలవు. నక్షత్రములచే దిక్కులను తెలిసికొనగలవు. నీవు నీతో ఐదుగురిని పీడించుచు పీడింపబడగలవు.

---

ర్గుడు తగలబెట్టుటకు ప్రయత్నించగలడు. అనగా చెప్పుచున్నాడు. కక్షఘ్నః = కక్షః = ప్రక్కన, ఘ్నంతి = వచ్చుచున్నవాడు పురోచనుడు = చంపువాడు. ఇచ్చట మేచ్ఛభాష యగుటచే హనధాతువు గమనార్థమున వాడబడినది. శిశిరఘ్నః = ప్రకాశించు = చంపునదికాగా శిశిరః = అనగా అగ్ని. ఈ ప్రక్కనున్న పురోచనుడే అగ్నితో మిమ్ము చంపుటకు మీ వెంట వచ్చుచున్నాడు. అటులైన వీనినే మనము చంపకూడదా? లేక వారణావత గృహమును ప్రవేశించకుండ ఉండగూడదా? లేక వారణావతమే వెళ్ళక హస్తినాపురమే తిరిగి రాకూడదా? అను సందేహము రాగా విదురుడు సమాధానము చెప్పుచున్నాడు. కక్ష=కం=సుఖమును, క్ష=నశింపచేయువాడు అనగా శత్రువు. వాని యొక్క కపటము తెలియబడగా వాడే తెగబడి ప్రత్యక్షముగ చంపును గాన వారి కపటమును మన మెరిగియు, ఎరుగనట్లు నటించవలెను.

అటులైన ఈ ఆపత్తునుండి తప్పించుకొను ఉపాయమేమి; అని ప్రశ్నరాగా ఉపాయమును చెప్పుచున్నాడు బిలౌకసః = బిలమును ప్రవేశించినచో పురోచనుడు మిమ్ములను తగులపెట్టలేడు. సొరంగము నందున్న వానికి అగ్నిభయములేదు. కావున ఆ గృహమున నొక సొరంగమును త్రవ్వుడు. ఇట్లు ఎవడు తనను రక్షించుకొనునో వాడు జీవించును. కావున ఈవిషయమును తెలుసుకొని ఉపాయముగా మిమ్ము రక్షించుకొనుడు. అని అర్థము.

ఏవముక్తః ప్రత్యువాచ జ్ఞాత మిత్యేవ పాండవః ॥ 70

ధర్మభూ రనుజైస్సాకం తద్గిరా తత్పురం యయౌ ।
కర్మచోదనయా జీవః కాయమన్య మివేంద్రియైః ॥ 71

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
దశమోఽధ్యాయః సమాప్తః

## ఏకాదశోఽధ్యాయః

*అష్టమేఽహని రోహిణ్యాం ప్రయాతా ఫాల్గునస్య తే ।
వారణావత మాసాద్య దదృశు ర్నాగరం జనం ॥ 1

తే ప్రవిశ్య పురం వీరా స్తూర్ణం జగ్ము రథోగృహాన్ ।
తేభ్యో భక్ష్యాణి పానాని శయనాని శుభానిచ ॥
ఆసనాని చ ముఖ్యాని ప్రదదౌ స పురోచనః ॥ 2

* వ్యా॥ తతః ప్లవంగ సం॥ర ఫాల్గుణశుక్లాష్టమ్యాం రోహిణీ నక్షత్రే శకుని మంత్రిణః కణకస్య దుర్మంత్రేణ ధృతరాష్ట్రేణ ఆజ్ఞప్తానాం పాండవానాం వారణావతప్రవేశః ॥ తదా యుధిష్ఠిరస్య వయః కాలః సం 37—5—8 దినానీతి వ్యజ్యతే । క్రీ. పూ. 18—11—3091 ఇతి ॥

70. ఈ విధముగా విదురునిచే చెప్పబడినవాడయి, ధర్మరాజు నా కర్ధ మైనది - అని మాత్రము సమాధాన మొసంగెను

71. ఈ విదురుని వాక్యమును విని ధర్మరాజు జీవుడు తన ఇష్టము లేకపోయినను. ఇంద్రియములతో సహా అవశుడయి, కర్మ ప్రేరణచే మరియొక దేహమును పొందినట్లు సోదరులతో గూడి వారణావతమునకు వెళ్ళను.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వయందు
పదవ అధ్యాయము సమాప్తము.

# 11 వ అ ధ్యా య ము

*1. పాండవులు ఫాల్గుణ మాసముయొక్క 8 వ రోజున రోహిణీ నక్షత్రమునందు వారణావతమును పొంది ఆ నగరమును, జన మును చూచిరి.

2. వారు ఆ పట్టణమును ప్రవేశించి వారి కేర్పాటు చేయబడిన గృహ మును ప్రవేశించిరి. వీరి వెంటనున్న ఆ పురోచనుడు మంచి భక్ష్యములను, పానీయములను, వస్త్రలను, మంచి సింహాసనము లను అన్ని ఏర్పాట్లను చేసెను.

---

* వ్యా॥ ప్లవంగ సంవత్సర ఫాల్గుణ శు॥ అష్టమియందు శకుని యొక్క మంత్రి యగు కణకుని యొక్క దురాలోచనచే ధృతరాష్ట్రునిచే ఆజ్ఞాపింపబడిన పాండవులు వారణావతమును ప్రవేశించిరి. అప్పుడు యుధిష్ఠురుని వయస్సు 37 సం॥ 5 మా॥ 8 రోజులు. క్రీ॥ పూ॥ 18–11–3001.

ఉవాచాగ్నేయ మిత్యేవం భీమసేనం యుధిష్ఠిరః ।
పురోచనా ద్రక్ష్యమాణా స్తత్ర సంవత్సరం స్థితాః ॥ 3

విదురస్య సుహృత్కశ్చిత్ ఖనకః కుశలో నరః ।
పరిఖాయాం కరోత్తస్మిన్ మహాంతం సుమహాబిలం ॥ 4

ఖనక ఉవాచ ॥
కృష్ణపక్షే చతుర్దశ్యాం రాత్రావస్య పురోచనః ।
భవనస్య తవ ద్వారి ప్రదాస్యతి హుతాశనం ॥
ఇత్యుక్త్వా గతవాన్ సోపి ఖనకో హాస్తినాపురం ॥ 5-6

తాం తు దృష్ట్వా సుమనసః పరిసంవత్సరోషితాన్ ।
విశ్వస్తానివ సంలక్ష్య హర్షం చక్రే పురోచనః ॥ 7

అథ దానాపదేశేన కుంతీ బ్రాహ్మణభోజనం ।
చక్రే నిశి మహారాజ హ్యాజగ్ముః తత్ర యోషితః ॥ 8

నిషాదీ పంచపుత్రా తు తస్మిన్ భోజ్యే యదృచ్ఛయా ।
సుష్వాప విగతజ్ఞానా మృతకల్పా నరాధిప ॥ 9

న విదుః పాండవా స్తాంతు అజ్ఞాతస్థలనిద్రితాం ।

3. ధర్మరాజు భీమసేనునితో ఈగృహము సులభముగా తగలబడునది యని మాత్రమే చెప్పెను పురోచనుని కనిపెట్టి ఉండి వాని నుండి తమను సంరక్షించుకొనుచు, ఒకసంవత్సరకాలము అచ్చట నివసించిరి.

4. ఇంతలో విదురుని ఒకానొక స్నేహితుడగు ఖనకుడనువాడు ఈ గృహమునుండి గంగాతీరమువరకు ఒక పెద్ద సొరంగము ఎవ రికి తెలియబడకుండ త్రవ్వెను.

ఖనకుడు చెప్పుచున్నాడు.

5,6. కృష్ణపక్ష చతుర్దశి రాత్రియందు ఈ పురోచనుడు ద్వారదేశ మున నిప్పు పెట్టగలడు. అని చెప్పి ఆ ఖనకుడు హస్తినా పురమునకు వెళ్ళిపోయెను.

7. మంచి ఉల్లాసముగా సంవత్సరము పైబడి అచ్చట నివసించుచున్న పాండవులను చూచి వీరు విశ్వాసముతో నున్నవారు అని తెలుసు కొని పురోచనుడు చాల సంతోషించెను.

8. దానమను మిషచే కుంతి అనోజా రాత్రి బ్రాహ్మణభోజనము ఏర్పాటు చేసెను, చాలామంది స్త్రీలు, పురుషులు భోజనమునకు వచ్చిరి.

9. ఒకానొక బోయ కాంత 5 గురు పుత్రులతో ఆ భోజనమునకు వచ్చి మిక్కిలి భుజించుటచే తెలివితప్పి చనిపోయిన దానివలె దైవయోగముచే వచ్చటనే నిద్రించెను.

10. ఎచ్చటనో అజ్ఞాత స్థలమున నిద్రించిన ఆమె ఏ పాండవులతె లుసు

* గృహం ప్రదీపయద్భీమః శేతే యత్రపురోచనః ॥ 10

సురుంగాద్వివిశు స్తూర్ణం మాత్రా సార్ధమరిందమాః ॥ 11

దుర్యోధనప్రయుక్తేన కారితం దాహితం చ తత్ ।
అహో ధిగ్ధృతరాష్ట్రస్య బుద్ధి ర్నాతిసమంజసీ ॥
య శ్శుచీన్ పాండుదాయాదాన్ దాహయామాస శత్రువత్ ।
ఏవం తే విలపంతిస్మ వారణావతకా జనాః ॥ 12–13

సపుత్రయుతనైషాదీ శల్యానాదాయ చాస్తినం ।
ప్రేషయామాసు రాజానం యథావృత్తం నివేదితుం ॥ 14

సంవృత్త స్తే మహాన్ కామః పాండవాన్ దగ్ధవానసి ।
సకామో భవ కౌరవ్య భుంక్ష్వ రాజ్యం సపుత్రకః ॥ 15

---

*వ్యా ॥ తతః కీలక సం॥ర ఫాల్గు॥ కృష్ణ త్రయోదశీ యుత చతుర్దశ్యాం రాత్రౌ ద్వితీయ యామావసానే తృతీయే యామే భీమసేన లాక్షాగృహ దాహః కృతః । తస్మిన్ గృహే పురోచనమరణం పుత్రయుతనిషాదీమరణం చ జాతే । తత స్తస్యా మేవ రాత్రౌ విదురప్రేరిత ఖనకకృతబిలద్వారా పాండవబినిర్గమనం గంగావతరణం చాభూత్ ।

కానలేక పోయిరి. అర్ధరాత్రియందు పురోచనుడు పడుకొని ఉన్న చోటనే భీమసేనుడు ఆ గృహమునకు నిప్పంటించెను.

11. పాండవులైదుగురును తల్లితో గూడ వెంటనే సొరంగమార్గమున వెళ్ళిపోయిరి,

12 13 దుర్యోధనునిచే ప్రేరేపింపబడినవాడై వారణావతమునకు బంపుట, అచ్చట దహింప చేయుట, ఇది ధృతరాష్ట్రునికి మంచిపనికాదు. ధర్మాత్ములును, పవిత్రులునగు పాండు పుత్రులను శత్రువులను వలె తగులబెట్టించెను గదా! ఎంత దారుణకృత్యము. అని వారణావత జనులందరును మిక్కిలి విలపించిరి.

14. అచ్చటి జనులు పుత్రులతో కూడిన నిషాద స్త్రీ యొక్క ఎముకలను తీసుకొని, హస్తినాపురమునకు పంపి జరిగిన వృత్తాంతము నంతయు నివేదించిరి.

15. ఓ ధృతరాష్ట్రా! నీ గొప్పకోరిక ఈడేరినది. పాండవులను దగ్ధము చేసిరి. పుత్రులతో గూడి నిష్కంటకముగ రాజ్యమును అనుభవించుము. అని పౌరులుపలికిరి,

---

వ్యా॥ కీలక సంవత్సర ఫాల్గుణ బహుళ త్రయోదశితో కూడుకొన్న చతుర్దశి రాత్రియందు రెండు జాములు గడచి మూడవజాము ప్రవేశించగా, భీమునిచే లక్క యిల్లు తగులబెట్టబడినది. ఆ గృహమునందు పురోచనుడు మరణించుట, పుత్రులతో గూడిన నిషాది మరణము సంభవించినది. ఆ రాత్రియందే విదురుడు పంపిన ఖనకునిచే త్రవ్వబడిన సొరంగము ద్వారా పాండవులు బయటికి వచ్చుట, గంగను దాటుట జరిగెను,

తచ్ఛ్రుత్వా ధృతరాష్ట్రస్తు సహాపుత్రేణ శోచయన్ ।
ప్రేతకార్యాణి చ తదా చకార సహ బాంధవైః ।
పాండవానాం తథా క్షత్తా భీష్మశ్చ కురుసత్తమః ॥ 16

తత్రాలయే దగ్ధతనూ నధైతా
న్నిశ్చిత్య పార్థా న్నిచచార వాచా ।
దుఃఖాపదేశేన సుయోధనాద్యాః
సమ్మోదబాష్పం సస్పృజు స్సభాయాం ॥ 17

తద్రాత్రావేవ భీమాద్యా గుహా ముత్తీర్య తద్వనే
అంధకారే గతా స్తూర్ణం చతుర్వింశతియోజనం ॥ 18
విదురప్రేషితాం నావ మారుహ్యా చ సరిద్వరం
గంగా ముత్తీర్య వివిశుః హిడింబస్య వనం తదా ॥ 19

తత్ర తేషు శయానేషు హిడింబో నామ రాక్షసః
ఆఘ్రాయ మానుషం గంధం భగినీ మిద మబ్రవీత్ ॥ 20

* గచ్ఛ జానీహి కేత్వేతే కేరతే వన మాశ్రితాః
సాఽపి కన్యా తథేత్యుక్త్వా వృక్షమూలే స్థితా న్నరాన్

---

* వ్యా॥ కీలక ఫాల్గునస్య అమాయాం ఉమః కాలే గంగా ముత్తీర్య తస్మిదినపరస్మిన్ ఆసాయంత్రంప్రయాణం రాత్రౌ ప్రథమయామే సుప్తాన్ భ్రాతౄన్ మాతరం చ రక్షతా భీమసేనేన హిడింబాగమనం తదను హిడింబాసుర యుద్ధం సూర్యోదయకాలే సౌమ్య చైత్రశు 1 ది హిడింబ వధః జాత ఇత్యవగమ్యతే ॥

16. అది విని ధృతరాష్ట్రుడు పుత్రులతో కూడి దుఃఖించుచు, పాండవులకు అన్ని ప్రేత కార్యములను విదురుడు, భీష్ముడు, మొదలగు బంధువులతో గూడి చేయించెను.

17. ఆ లాక్షాగృహమున పాండవులు దగ్ధమైరని విశ్వయించి, సుయోధనాదులు దుఃఖమనే మిషతో సభయందు అనందబాష్పములనే వదలిరి.

18. ఆ రాత్రియందే భీమాదులు ఆ సొరంగమును దాటి చీకటిలో 24 యోజనముల దూరము వెళ్ళిరి.

19. విదురుడు పంపిన నావ నెక్కి గంగానదిని దాటి హిడింబాసురుని వనమును ప్రవేశించిరి.

20. అచ్చట వారునిద్రించుచుండగా హిడింబుడను రాక్షసుడు మనుష్య గంధమును మూకొని చెల్లెలితో ఇట్లు పలికెను.

*21 22 మన వనమువందు నిద్రించుచున్న వా రెవ్వరో కనుకొనిరమ్మని. ఆ కన్యకయు అలాగేనని చెప్పి చెట్టునీడను నింద్రించుచున్న పాండవులను చూచెను. కుంతియు, మిగత నలుగురును నిద్రించు

---

*వ్యా॥ కీలక సంవత్సర అమావాశ్యయందు ఉదయము గంగను దాటుట, ఆసాయంత్రమువరకు ప్రయాణించి, రాత్రి ప్రథమయామమున నిద్రించిన సోదరులను తల్లిని రక్షించుచున్న, భీమసేనుని గూర్చి హిడింబి వచ్చుటయు, హిడింబాసురునితో యుద్ధము సౌమ్య సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమినాడు హిడింబాసురని వధయు సంభవించెను. అని తెలియుచున్నది,

దదర్శ తత్స్వసా గత్వా పాండవాన్ పృథయా సహ
శయానాన్ భీమసేనం చ జాగ్రతం త్వపరాజితం ॥ 21-22

సా కామరూపిణీ రూపం కృత్వా మానుష ముత్తమం
స్మితపూర్వమిదం వాక్యం భీమసేన మథాబ్రవీత్ ॥ 23

రుధిరం పాతుకామేన తేన హా హంతు మీరితా
అథరం పాతుకామాఽహ మస్మి తే రూపసంపదా ॥ 24

భర్తా భవేతి స్వం వృత్తం సర్వం తస్య నివేదితా ॥ 25

భీమ ఉవాచ
నాహం మదిషీషుత్వం మాతృద్రోహం కరోమి వై
గచ్ఛవా తిష్ఠవా భద్రే యద్వాపీచ్ఛసి తత్కురు ॥ 26

తాం విదిత్వా చిరగతాం హిడింబో రాక్షసేశ్వరః
అవతీర్య ద్రుమా త్తస్మా దాజగామాశు పాండవాన్ ॥ 27

అభ్యద్రవత సంక్రుద్ధో భీమసేన మరిందమం
మాశబ్ద స్సుఖసుప్తానాం భ్రాతౄణాం మే భవేదితి ॥ 28

అన్యోన్యం తౌ సమాసాద్య విచకర్షతు రోజసా
తయో శ్శబ్దేన మహతా విబుద్ధాస్తే నరర్షభాః ॥ 29

చుండిరి వానిని సంరక్షించుచు, మేల్కొనియున్న భీమసేనుని ఆమె చూచెను.

23. కామరూపిణియగు ఆ హిడింబి సుందరమగుమనుష్య స్త్రీరూపమును ధరించి చిరునవ్వుతో భీమసేనునితో ఇట్లు పలికెను.

24. నీ రక్తమును త్రాగకోరిన మా సోదరునిచే మిమ్ము చంపుటకు ప్రేరేపింపబడిన నేను మీ సౌందర్యమును చూచి మోహితురాలనై మీ అధరమును త్రాగ కోరుచున్నాను.

25. నీవు నా భర్తవు కమ్ము. అని పలుకుచూ,తనవృత్తాంతమునంతనూ ఆ భీమునికి నివేదించెను.

భీముడు చెప్పుచున్నాడు.

26. నేను అన్నగారికంటె ముందు వివాహ మాడువాడను కాను, మాతృద్రోహమును చేయను. నీవు వెళ్ళిన వెళ్ళుము. ఉండిన ఉండుము, నీ యిష్టము వచ్చినట్లుచేయుము.

27. అప్పుడు హిడింబాసురుడు తన సోదరి ఎంత సేపటికి రాకపోవుటచే వృక్షమునుండి దిగి శీఘ్రముగా పాండవుల వద్దకువచ్చెను.

28. మిక్కిలి కోపముకలవాడై కేకలువేయుచు భీమసేనుని మీదకు పరుగెత్తెను. సుఖముగా నిద్రించుచున్న నాసోదరులకునిద్రాభంగము వాటిల్లును. శబ్దము చేయవలదని భీముడువారించెను.

29. వారిద్దరును, ఒకరి నొకరు డీకొని మిక్కిలి వేగముతో పోట్లాడు కొనిరి. భయంకరమగు వారి శబ్దముచే పాండవులందరు మేల్కొంచిరి.

తౌ తే దదృశు రాసక్తౌ వికర్షంతౌ పరస్పరం
నిష్పిడ్యైతం బలాద్బాహూ పశుమార మమారయత్ ॥ 30

♦ స్వసు స్సమక్షం స్వయమేవ ముష్ట్యా
వలం బిడౌజా ఇవ వజ్రసఖ్యా
హిడింబమేనం యమరాజధానీ
కుటుంబిముఖ్యం కురుతేస్మ భీమః । 31

హిడింబం నిహతం దృష్ట్వా సంహృష్టా స్తే తపస్వినః
ప్రయయౌ పురుషవ్యాఘ్రౌ హిడింబా చైవ రాక్షసీ ॥ 32

తతోఽంతరిక్షే మాత్రా చ భ్రాత్రా చ సచ బోధితః
హిడింబాం తాంతు గాంధర్వే జగ్రాహ సచ వాయుజః । 33

* షాణ్మాసా జ్జాతుమగృహా న్ముక్తా జ్జాతో ఘటోత్కచః ॥ 34

ప్రజజ్ఞే రాక్షసీ పుత్రం భీమసేనా న్మహాబలాత్
సద్యోహి గర్భా న్రాక్షస్యో లభంతే ప్రసవంతి చ
కామరూపధరా శ్చైవ భవంతి బహురూపికాః ॥ 35

---

♦ వ్యా॥ భీమః వజ్రస్య అశనేస్సఖ్యా। తద్వదతిసార యేత్యర్థః బిడౌజాః ఇంద్రః వలం- వలాసురమివ। యమరాజధాన్యాం కుటుంబిషు వాస్తవ్యేషు ముఖ్యం కురుతేస్మ అవధీదిత్యర్థః ॥

* వ్యా॥ తత్ర చ సౌమ్య సంవత్సర ఆశ్వయుజశు॥ ద్వితీయాయాం ఘటోత్కచజనన మభూత్ ॥

౩౦. ఒకరి నొకరు లాగుకొనుచు, క్రిందకు పడవేసుకొనుచు యుద్ధము చేయుచున్న వారిద్దరిని చూచిరి. భీముడు బలాత్కారముగా వానిని క్రింద పడవేసి, పశువును చంపినట్లు చంపివేసెను.

*౩౧. భీముడు ఆతని సోదరి సమక్షములో వజ్రముతో సమానమైన తన పిడికిలితో దేవేంద్రుడు వలాసురునివలె హిడింబాసురుని యమ యమరాజధానియందు అతిథిగా చేసెను.

౩౨. చనిపోయిన హిడింబాసురుని చూచి అచ్చటనున్న ఋషులు సంతోషించిరి. రాక్షసియైన హిడింబియు, భీముని వద్దకు వచ్చెను.

౩౩. అంతట ఆకాశవాణి వాక్యము ననుసరించియు, తల్లిచేతను సోదరుని చేతను, బోధింపబడి భీముడు ఆమెను గాంధర్వ విధితో స్వీకరించెను.

•౩౪. లక్కయింటినుండి బయలువెడలిన 6 మాసములకు ఘటోత్కచుడు పుట్టెను. ఈ విధముగా హిడింబి మహాబలుడగు భీమసేనుని వలన పుత్రుని బడసెను.

౩౫. రాక్షస స్త్రీలు వెంటనే గర్భమును ధరించగలరు. వెంటనే ప్రసవించనూ గలరు. కామరూపమును ధరించు వారగుటచే అనేక రూపములను ధరించగలరు.

---

*వ్యా॥ భీముడు పిడుగుతో సమానమైన అనగా దానివలే మిక్కిలి బలముగల ముష్టితో. బిడౌజాః — దేవేంద్రుడు, వలం = వలాసురుని వలే, యమరాజధానియందు నివసించువారిలో ముఖ్యుని చేసెను. అనగా చంపివేసెనని అర్థము.

•వ్యా॥ సౌమ్యవత్సర ఆశ్వయుజ శు॥ విదియ యందు ఘటోత్కచుడు పుట్టెను.

* ప్రణమ్య వికచః పాదా వగృహ్ణాత్ పితు స్తదా
ఘటో హాస్యోత్కచో నామ మాతా తం ప్రత్యభాషత ॥ 36

అనురక్తశ్చ తా నాసీ త్పాండవాన్ స ఘటోత్కచః
కృత్యకాల ఉపస్థాస్య పితౄనథఘటోత్కచః ॥ 37

ఆమంత్ర్య మాతృసహితః ప్రతస్థే చోత్తరాం దిశం । 38

అపక్రమ్య యయూ రాజన్ త్వరమాణా మహారథాః
మత్స్యాం స్త్రిగర్తాన్ పాంచాలాన్ కీచకానంతరేణ చ ॥ 39

జటాః కృత్వా త్మన స్సర్వే వల్కలాజినవాససః
సహ కుంత్యా మహాత్మానో బిభ్రత స్తాపసం వపుః ॥ 4

బ్రాహ్మం వేద మధీయానా దదృశు ర్వ్యాస మాగతం
తేఽభివాద్య వృతా స్సర్వే సహమాత్రా పరంతపాః । 4

వ్యాస ఉవాచ

---

* వ్యా॥ ఘటసాదృశ్యా ద్ఘటశబ్దేనాత్ర శిరః ప్రతీయతే। ఉత్కచః- కేశహీనః। హేత్యాశ్చర్యే। వికేశస్థూల శిరస్కత్వా దస్య ఘటోత్కచ నామాబ్రవీదిత్యర్థః ।

436. జుట్టులేని ఆ పుత్రుడు తండ్రికి నమస్కరించి, తండ్రినుండి సెలవు తీసుకొనెను. జుట్టులేని కుండవంటి తల గలవాడగుటచే తల్లి వానికి ఘటోత్కచుడు అని పేరు పెట్టెను.

37. ఆ ఘటోత్కచుడు పాండవులయందు మిక్కిలి ప్రేమ గల వాడయ్యెను. సేవ చేయదగిన కాలములయందు తండ్రులకు మిక్కిలి సేవ చేసెను.

38. తరువాత అతడు తండ్రులవద్ద సెలవు తీసుకొని తల్లితో గూడి ఉత్తర దిక్కునకు వెళ్ళిపోయెను.

39. పాండవులు అచ్చటనుండి బయలుదేరి వేగముగా మత్స్య దేశములను, త్రిగర్త దేశములను, మధ్యలో నున్న కీచకదేశములను, దాటి పాంచాల దేశమును చేరిరి.

40. వారు జడలను ధరించి నారచీరలను కృష్ణాజినములను ధరించి మౌని వేషములతో కుంతితో కూడ వెళ్ళుచుండిరి.

41. బ్రాహ్మణ వేషములతో వేదములను పఠించుచు, వెళ్ళుచున్నవారు అచటకు వచ్చిన వ్యాసుని గాంచి తల్లితో గూడ వానికి నమస్కరించి వాని చుట్టును చేరిరి.

వ్యాసుడు చెప్పుచున్నాడు.

---

॥ వ్యా॥ కుండయొక్క పోలిక వలన ఘటశబ్దముచే యిచ్చట తలప్పు చెప్పబడెను. ఉత్కచః = కేశహీనుడు కేశములు లేని పెద్ద తప్పుకలవాడగుటచే ఘటోత్కచుడను పేరు తల్లి పలికెనని భావము.

ఏతద్ద్వై శాలిహోత్రస్య తపసా నిర్మితం సరః
రమణీయ మిదం తోయం క్షుత్పిపాసాశ్రమాపహం ॥ 42

♦ కార్యార్థినస్తు షాణ్మాసా న్విహరధ్వం యథాసుఖం
మయేదం వ్యసనం పూర్వం విదితం భరతర్షభాః ॥ 43

ఇదం నగర మధ్యాశే రమణీయం నిరామయం
వసతేహ ప్రతిచ్ఛన్నా శ్శుభాగమన కాంక్షిణః॥ 44

జీవత్పుత్రి సుత స్త్వయం ధర్మనిత్యో యుధిష్ఠిరః
పృథివ్యాం పార్థివాన్ సర్వాన్ ప్రశాసిష్యతి ధర్మరాట్ ॥ 45

రాజసూయాశ్వమేధాద్యైః క్రతుభి ర్భూరిదక్షిణైః
పితృపైతామహం రాజ్య మిమే భోక్ష్యంతి తే సుతాః ॥ 46

ఏవముక్త్వా జగామాశు యథాగత మృషిః ప్రభుః ॥ 47

గతే భగవతి వ్యాసే పాండవా విగతజ్వరాః
ఊషు స్తత్ర చ షాణ్మాసా న్వటవృక్షే యథాసుఖం ॥ 48

---

♦ వ్యా॥ అనేన సౌమ్యవత్సరాశ్వయుజ ద్వితీయా మారభ్య సాధారణచైత్రశు ద్వితీయా పర్యంతం షాణ్మాసం శాలిహోత్రాశ్రమే నివాసః వేదాంతేతి హాసాది పురాణ శ్రవణం చ ॥

42. ఇది శాలి హో్త్రుని తపస్సుచే నిర్మింపబడిన సరోవరము. ఇచటి యుదకము ఆకలి దప్పులను పోగొట్టునది.

* 43. ఒక పవి కొరకు యిచ్చట ఆరు మాసములు సుఖముగా నివసించుడు. మీ కీ వచ్చిన కష్టము నాకు పూర్వమే తెలియును.

44. ఇచ్చటికి సమీపమందే నగరము కలదు. ఇది ఏ కష్టములు లేని మనోహర ప్రదేశము. శుభమును నిరీక్షించుచు, ఇచ్చట ప్రచ్ఛన్నముగా నివసించుడు.

45. ఓ కుంతీ! నీపుత్రుడగు ధర్మరాజు ధర్మాత్ముడు. భూమియందలి రాజులనందరను పరిపాలించగలడు.

46. రాజసూయము, అశ్వమేధము, మొదలుగా గల యజ్ఞములను ఈతడు చేయగలడు. పితృ పితామహ రాజ్యమును నీ పుత్రులు అనుభవించగలరు.

47. ఈవిధముగా పలికి వచ్చినవాడు వచ్చినట్లుగా వ్యాసుడు వెంటనే అంతర్ధాన మాయెను.

48. భగవంతుడగు వ్యాసుడు వెళ్ళిపోగా పాండవులు దుఃఖముమ వీడినవారై అచ్చటనున్న మట్టి చెట్టునీడను, శాలి హో్త్రాశ్రమమున సుఖముగా నివసించిరి.

---

*వ్యా॥ సౌమ్యవత్సర అశ్వయుజ శుద్ధ విదియనుండి సాధారణ సంవత్సర చైత్రశుద్ధ విదియ వరకు ఆరు మాసములు శాలిహో్త్రాశ్రమమందు నివసించుట యితిహాస వేదాంత పురాణములను వినుట జరిగెను. అప్పుడు ధర్మరాజువయస్సు 30 సం॥ 5మా॥ 26 దినములు.

* ఏకచక్రం గతా స్తేతు కుంతీపుత్రా మహారథాః
ఊషు ర్నాతిచిరం కాలం బ్రాహ్మణస్య నివేశనే
ఏకచక్రేతు షాణ్మాసా నుషితాః పాండవా స్తదా ॥ 49
తత్ర తత్ర ద్విజై శ్చైతే పృష్టా నాశం పృథా భుజాం
ఇత్యూచు ర్వ్యయమత్త్రైవ విద్మ స్తేషాం తు సంస్థితిం ॥ 50

యక్షేణ కేనాపి హతో హిడింబ
ఇతి బ్రువాణేషు మిథో ద్విజేషు
ఆకూతగర్భం హసితం సగర్భ్యా
శ్చక్రు ర్ముఖం వీక్ష్య సమీరసూనోః ॥ 51

చేరు ర్భైక్ష్యం తదా తేతు సర్వఏవ విశాంపతే
నివేదయంతి స్మ తదా కుంత్యాః భైక్ష్యం సదా నిశి ॥ 52

అర్ధం తే భుంజతే వీరాః సహ మాత్రా పరంతపాః
అర్ధం సర్వస్య భైక్షస్య భీమో భుంక్తే మహాబలః ॥ 53

తదా తు తేషాం వసతాం తస్మిన్ రాష్ట్రే మహాత్మనాం।
అతిచక్రామ సుమహాన్ కాలోఽథ భరతర్షభ। 54

---

* వ్యా॥ తథాచ సాధారణచైత్రశుక్ల ద్వితీయా మారభ్య ఆశ్వయుజ శుక్ల ద్వితీయాపర్యంతం యేకచక్ర పురే పాండవానాం నివాస ఇతి గమ్యతే। తదా యుధిష్ఠిరస్య వయస్సం॥ 39–11–8 దినాని ఆశ్వయుజ శు॥ 10 బకవధో జాతః తదాతు సం॥ 40–0– 7 దినాని యుధిష్ఠిరస్య। క్రీ॥ పూ॥ 11-5-3089

49. తరువాత అచ్చటనుండి ఏక చక్రపురమునకు వెళ్ళి కొద్దికాలము అనగా ఆరు మాసములు ఒక బ్రాహ్మణగృహమునందు నివసించిరి

50. అచ్చటచ్చట పాండవులయొక్క నాశము సంభవించెనట. మీ రెరుగుదురా। అని బ్రాహ్మణులచే అడుగబడినవారై వారిచ్చటనే వున్నారని మేమెరుగుదుము, అని సమాధానము చెప్పుచుండిరి.

51. ఎవడో యక్షునిచే. హిడింబాసురుడు చంపబడెనట, యని బ్రాహ్మణులు వారిలో వారు చెప్పుకొనుచుంతగా సోదరులు చిరు నవ్వుతో భీముని ముఖమును చూచి, తమలోతాము నవ్వుకొను చుండిరి.

52. వారందరు యేకచక్రపురమునందు విప్రవేషములతో భిక్షాటనము చేయుచుండిరి. రాత్రియందు లభించిన ద్రవ్యమును కుంతికి అప్ప జెప్పుచుండిరి.

53. ఆ ద్రవ్యములో సగభాగమును తల్లితో గూడ వారు నలుగురు భుజించు చుండిరి. మహాబలుడగు భీముడు మిగతా సగమును భుజించు చుండెను.

54. ఆ విధముగా వారు అచ్చట నివసించి యుండగా కొంతకాలము (అనగా ఆరు మాసములు) గడచిపోయెను.

---

వ్యా॥ సాధారణ శుద్ధ విదియమొదలుకొని ఆశ్వయుజ శుద్ధ విదియ వరకు యేకచక్రపురమున పాండవుల నివాసమని తెలియు చున్నది, ఆశ్వయుజ శుద్ధ దశమి యందు బక వధ జరిగెను. అప్పటికి ధర్మరాజు వయస్సు 40 సంవత్సరముల 7 దినములు, క్రీ॥ పూ॥ 11–5–3089.

తతః కదాచిత్ భైక్షాయ గతా స్తే పురుషర్షభాః।
సంగత్యా భీమసేనస్తు తత్రాస్తే పృథయా సహ। 55

బ్రాహ్మణస్య గృహే దుఃఖం కుంతీ శుశ్రావ భారత।
గృహం గత్వాతు సా కుంతీ బ్రాహ్మణం ప్రాహ కారణం।56

సోఽప్యబ్రవీ ద్బకః కశ్చి ద్రాక్షస స్తస్య భూరిశః।
భోజనం పురుషశ్చైకః ప్రదేయం వేతనం మయా। 57

సోఽయ మస్మా ననుప్రాప్తో వారః కులవినాశనః। 58

కుంత్యువాచ

న విషాద స్త్వయా కార్యో భయా దస్మా త్కథంచన।
ఏకస్త్వ సుతో బాలో కన్యా చైకా తపస్వినీ॥ 59

న చైతయో స్తదా పత్న్యా గమనం తవ రోచయే।
మమ పంచ సుతా బ్రహ్మం స్తేషా మేకో గమిష్యతి॥ 60

బ్రాహ్మణ ఉవాచ।

నాహమేత త్కరిష్యామి జీవితార్థీ కథంచన।
బ్రహ్మవధ్యా త్మవధ్యావా శ్రేయా నాత్మవధో మయా। 61

కుంత్యువాచ।

నచాప్యనిష్టః పుత్రో మే యది పుత్రశతం భవేత్।
వీర్యవాన్ మంత్రసిద్ధశ్చ తేజస్వీ చ సుతో మమ। 62

55. తరువాత నొకానొకప్పుడు వారందరును, భిక్షాటనమునకు వెళ్ళిరి. భీముడు మాత్రము యేదో సందర్భవశమున తల్లితోగూడి ఇంటిలో నుండెను.

56. బ్రాహ్మణుని యింటిలో యేడుపును కుంతి విని వారి యింటిలోనికి వెళ్ళి దుఃఖకారణమును అడిగెను.

బ్రాహ్మణు డిట్లనెను.

57. బకుడను రాక్షసుడు కలడు. వానికి విస్తారమగు భోజనము, ఒక మనుష్యుని ప్రతి దినము కానుకగా యీయవలెను.

58. ఆ వంతు నేడు నా వంశము వహించునట్లుగా నాకు వచ్చినది.

కుంతి అనుచున్నది.

59. ఈ భయము వలన నీవు బాధపడవలసిన అవసరము లేదు, నీ కొక్కడే కుమారుడు, ఒక్క కుమార్తెయు గలరు.

60. వారుగాని నీవుగాని, నీ భార్యగాని వెళ్ళుట నాకిష్టము లేదు. నాకు అయిదుగురు పుత్రులు గలరు.వారిలో ఒకడు వెళ్ళగలడు.

విప్రుడు పలుకుచున్నాడు,

61. నా జీవితము కొరకు నే నెన్నడును, యిట్టి పనిని చేయను. బ్రాహ్మణవధ, ఆత్మవధలలో ఆత్మవధయే యుత్తమ మైనది.

కుంతి పలుకుచున్నది,

62. నాకు నూర్గురు పుత్రులున్ననూ, యే ఒకడును అయిష్టుడుగాడు. కాని నా పుత్రుడు మిక్కిలి బలము గలవాడు, మంత్రసిద్ధుడును

బలవంతో మహాకాయా నిహతా శ్చాప్యనేకశః
ఏవముక్తస్తు పృథయా స విప్రో భార్యయా సహ।
పృథాం పురస్కృతో గత్వా భీమసేనంమహాబలం॥ 63

మమబ్రూతాం కురుష్వేతి స తథేత్యబ్రవీ త్పునః।
తద్రాత్రౌ స ప్రభూతాన్నం భుక్త్వా భక్ష్యాదిసంయుతం॥ 64

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
ఏకాదశోఽధ్యాయః సమాప్తః

## ద్వాదశోధ్యాయః

తతో రాత్ర్యాం వ్యతీతాయా మన్న మాదాయ పుష్కలం।
స్వయంభుక్త్వా చ పీత్వాచ షడ్రసోపేతభోజనం।
భీమసేనో యయౌ తత్ర యత్రాస్తే పురుషాదకః॥ 1

స శకట మధిరుహ్య భీమసేనో దధికలశీకులశీభ రాన్న రాశిం।
బకభవనవనం వివేశ శాఖానగర మివాంతకపీర రాజధాన్యాః 2

కంకాళోద్భయకల్పితాంతక చమూశాటీకుటీవిభ్రమే।
తత్ర ప్రస్త శవాంగవాహ్యసుహాంసశ్మాపసోగచర్తానికే।

63. నా పుత్రుడు చాలా మందిని వధించినవాడు. బకుని గూడ చంప గలడు. ఈ విధముగా కుంతిచే చెప్పబడినవాడయి, ఆ బ్రాహ్మ ణుడు భార్యతోను, కుంతితోను, కూడుకొని మహాబలుడగు భీముని చూచుటకు వచ్చెను.

64. ఆ బ్రాహ్మణుడు నీవు బకుని చంపగలవా? అని భీముని అడుగ భీముఁడలాగేనని సమాధానము చెప్పెను. ఆ రాత్రి భీముడు భక్ష్య ములతో గూడిన చాల అన్నమును భుజించెను.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వయందు
పదకొండవ అధ్యాయము సమాప్తము.

# 12 వ అ ధ్యా య ము

1. తరువాత ఆ రాత్రి తెల్లవారిన తరువాత విస్తారమగు అన్నముమ, షడ్రసోపేతముగ తాను భుజించి భీమసేనుడు బండ్లమీద అన్న మును తీసుకొని మనుష్యులను తినునట్టి బకాసురుఁ డుండుచోటికి వెళ్ళెను.

2. ఆ భీముడు పెరుగు బానలతో కూడిన అన్నరాసులు గల శకటము నెక్కి, యమధర్మరాజు యొక్క రాజధానీనగరమునకు పేటవలే నున్న బకాసురుని భవనమును ప్రవేశించెను.

3. ఆ భీముఁడు మనుష్యకంకాళములచే చేయబడిన యమదూతల నివాసయోగ్యమగు దేరావలే నున్నట్టియు, కోపగించిన ఆయముని వాహనమగు మహిషము యొక్క భీకరమైన సుడిగాలులు కలిగి

గృధ్రధ్వాంక్షసృగాలఘోషవికసద్రక్షోపదాంసస్తనే।
భుంజాన శ్శకటస్థ ఏవ స తదా చక్రే మహత్ క్ష్వేళితం॥ 3

భుంజానమన్నం తం దృష్ట్వా భీమసేనం స రాక్షసః ।
జఘాన పృష్ఠే పాణిభ్యా ముభాభ్యాం పృష్ఠతః స్థితః ॥ 4

నైవావలోకయామాస రాక్షసం భుక్త ఏవ సః ।
తత స్స వృక్ష మాదాయ పునరభ్యద్రవ ద్బలీ ॥ 5

తతో భీమ శ్శనై ర్భుక్త్వా తదన్నం పురుషర్షభః ।
క్షిప్తం కృద్ధేన తద్వృక్షం ప్రతిజగ్రాహ వీర్యవాన్ ॥ 6

తద్వృక్షయుద్ధ మభవ న్మహీరుహవినాశనం ।
సకృష్యమాణో భీమేన కర్షమాణశ్చ పాండవం ।
సమయుజ్యత తీవ్రేణ క్రమేణ పురుషాదకః ॥ 7

తత స్సభగ్న పార్శ్వాంగో నదిత్వా భైరవం రవం ।
శైలరాజప్రతీకాశో గతాసు రభవ ద్బకః ॥ 8

తదస్రంఘా నాగతా స్సర్వా న్నాశయామాస వాయుజః ।
తతః ప్రభృతి రక్షాంసి తత్ర సౌమ్యాని భారత ॥ 9

నట్టియు, దేగలు గుడ్ల గూబలు, నక్కలియొక్క అరుపులచే వృద్ధి పొందుచున్న రాక్షసుని హింసాకర్మల స్తవము కలిగినట్టి ఆ బకాసుర నివాసము ను చేరి, శకటము మీద నుండియే గొప్ప సింహనాదమును చేసెను.

4. అన్నమును భుజించుచున్న భీమసేనుని చూచి, బకాసురుడు వెనుక నుండి వచ్చి, రెండుచేతులతోను, అతని వీపును చరచెను.

5. భుజించుచున్న భీముడు రాక్షసునివైపే చూడలేదు. తరువాత బల వంతుడగు ఆ బకాసురుడు ఒక వృక్షమును చేబూని భీముని మీదకు పరుగెత్తెను.

6. తరువాత భీముడు నిదానముగా భోజనము చేసి రాక్షసుడు విసరి వేసిన వృక్షమును పట్టుకొనెను.

7. తరువాత భీమునిచే లాగబడుచున్న బకాసురునకు, బకాసురునిచే లాగబడుచున్న భీమునకు క్రమముగా తీవ్రమగు వృక్ష యుద్ధము జరిగెను.

8. తరువాత ఆ బకాసురుడు విరిగిపోయిన ప్రక్కఎముకలు కాలు చేతులు కలవాడై భయంకరమైన ధ్వనిని చేసిపర్వతమువలె క్రింద పడిపోయి, చనిపోయెను.

9. అతని బంధువులందరూ యుద్ధమునకు రాగా వారి నందరినీ కూడ భీముడు సంహరించెను అప్పటినుండి అచ్చట నున్నరాక్షసులు సౌమ్యులుగా సంచరించుచుండిరి.

తతో బకశరీరం తు ద్వారదేశే నిధాయ సః ।
ఆచచక్షే బకవధం బ్రాహ్మణం మాతరం పృథాం ॥ 10

కతతః కతిపయామాసు బ్రాహ్మణ శ్శంసితవ్రతః ।
ప్రతిశ్రయార్థీ తద్వేశ్మ బ్రాహ్మణస్యాజగామహ ॥ 11-12

తతస్తే పాండవా స్సర్వే సహ కుంత్యా నరర్షభాః ।
ఉపాసాం చక్రిరే విప్రం కథయంతః కథాశ్శుభాః ॥ 13

స తత్రాకథయ ద్విప్రః కథాం తే జనమేజయ ।
పాంచాలేష్వద్భుతాకారం యాజ్ఞసేన్యా స్స్వయంవరం ॥ 14

ధృష్టద్యుమ్నస్య చోత్పత్తి ముత్పత్తిం చ శిఖండినః ।
అయోనిజత్వం కృష్ణాయా ద్రుపదస్య మహామఖే ॥ 15

పాంచాలికాం యువమనోరథరత్నసాధ
పాంచాలికాం హృది మమేతి మమేతి కృత్వా

---

కవ్యా ॥ తథాచ - సాధారణాశ్వయుజ బ ౧౧ ఆరభ్య పుష్య శు ౧౦ పర్యంతం 75 దినాని భవంతి । తతః కతిప యామాసు ఇతి శ్లోకార్థపర్యాలోచనయా బకవధానంతర మపి మా1-25 ది॥ పర్యంతం పంచపంచాశద్దినాని తథా చ సాధారణ మార్గశిర బ॥ ౫ పర్యంతం ఏకచక్రపురే స్థితాః । తతః పరం పాంచాలదేశగమనమితి సుస్పష్టం ॥

10. తరువాత బకాసురుని కళేబరమును పట్టణ ద్వారదేశమున పడ వైచి భీముడు తాము నివశించు గృహ బ్రాహ్మణునకు, తనతల్లికిని బక వధను చెప్పెను.

11 12 తరువాత కొన్నిరోజులు గడువగా గొప్ప తపోవ్రతుడగు బ్రాహ్మణుడు వీరున్న బ్రాహ్మణుని గృహమునకు నివసించుటకువచ్చెను.

13 పాండవులందరూ కుంతితో గూడి ఆ బ్రాహ్మణపుంగవుని సేవించుచూ, పరస్పరము పుణ్యమైన కధలను చెప్పుకొనుచుండిరి.

14. ఆ బ్రాహ్మణుడు ప్రసంగవశమున అప్పుడు పాంచాల దేశమున జరుగబోవునట్టి అద్భుతమైన ద్రౌపదీ స్వయంవర వృత్తాంతమును గూర్చి చెప్పెను.

15. ద్రుపద మహారాజు యొక్క యజ్ఞమునందు అద్భుతముగా అగ్ని నుండి దృష్టద్యుమ్నుడు పుట్టుట, ద్రౌపది యు అయోనిజగ పుట్టుట శిఖండి యొక్క పుట్టుకను గూర్చియు వివరించి చెప్పెను.

16. యువకుల కోరిక యనెడి సౌధమునకు అలంకారపు బొమ్మవంటి ద్రౌపదిని హృదయమునందు నాకగుగాక। నా కగుగాక। యని

వ్యా॥ ఆ విధముగా సాధారణ సం॥ర ఆశ్వయుజ బహుళ ఏకాదశి మొదలు పుష్యశుద్ధ దశమివరకు 75 దినములగుచున్నది. తతఃకతి పయాహస్సు అను శ్లోకార్థమును విచారించగా బక వధానంతరముకూడ ఒక నెల 25 రోజులు అనగా సాధారణ సంవత్సర మార్గశిర బహుళ పంచమివరకు 55 దినములు ఏకచక్ర పురమున వుండి ఆ తరువాత పాంచాల దేశమునకు వెళ్ళిరని తెలియుచున్నది.

అద్య స్వయంవరమహాయ నృపాః ప్రయాంతి
ద్రష్టుం స్వయం ద్రుపదభూపతి రాజధానీం ॥ 16

భోక్తుమన్నమపి సూపసమగ్రం
దోగ్ధుమప్యభినవ ప్రసవా గాః ।
లప్స్యతే ద్విజగణోఽపి చ
తస్మాద్వత్సలాద్గృహీతు రుత్సవకాలే ॥ 17

పాండవా ఊచుః ॥
కథం ద్రుపదపుత్రస్య ధృష్టద్యుమ్నస్య పావకాత్ ।
వేదీమధ్యాచ్చ కృష్ణాయా స్సంభవః కథ మద్భుతః ॥ 18

బ్రాహ్మణ ఉవాచ ॥
ద్రోణాత్పరిభవం ప్రాప్య ద్రుపదస్తు మహీపతిః ।
యాజినం చోపయాజం చ వరయామాస ఋత్విజౌ ॥ 19

ద్రోణాంతకం సుపుత్రం చ కన్యాం చైవార్జునప్రియాం ।
తయోః పుంజననార్థం వై హావయామాస దీక్షితః ॥ 20

యాజస్తు హావనస్యాంతే దేవీ మాజ్ఞాపయత్తదా ।
*ప్రైహి మాం రాజ్ఞి పృషతి మిథునం త్వా ముపస్థితం॥ 21

*వ్యా ॥ ప్రైహి = శీఘ్ర మాగచ్ఛ । హవి ర్గృహీతు మితి శేషః ।

రాజులందరును, స్వయంవర మహోత్సవమునకై ద్రుపదుడు పంపిన దూతలతోగూడ పాంచాల రాజధానికి త్వరగా వెళ్ళుచున్నారు.

17. దధి సూపములతో నిండిన మృష్టాన్నమును భుజించుటకును, ద్రౌపది యందు ప్రేమగల ద్రుపదుడు ఆమె వివాహసమయమున దానముచేయు అప్పుడే ప్రసవించిన గోవులను పొంది పాలను పిండుకొనుటకునూ, బ్రాహ్మణ సమూహములును, ద్రుపదుని రాజధానికి వెళ్ళుచున్నవి.

శాంతవు లడుగుచున్నారు.

18. అగ్నిహోత్రమునుండి ద్రుపద పుత్రుడగు ధృష్టద్యుమ్నుడు ఎట్లు పుట్టెను. వేదిమధ్యమండి ద్రౌపది యొక్క అద్భుతమైన పుట్టుక ఎట్లు సంభవించినది.

బ్రాహ్మణుడు చెప్పుచున్నాడు.

19. ద్రుపదుడు ద్రోణుని నుండి పరాభవమును పొంది యాజోప యాజులను ఋత్విక్కులను వేడుకొనెను.

20. ద్రోణుని చంపునట్టి ఒక సుపుత్రుని, అర్జునుని భార్యయగు నొక కన్యారత్నమును నాకనుగ్రహించుడు. వారుపుత్రుడు పుట్టుటకై ద్రుపదునిచే నొక యజ్ఞమును చేయించిరి.

*21. యాజుడు హోమాంతమున ఓ అమ్మాయీ! నావద్దకు రమ్ము.

---

*వ్యా॥ పైశ్లోకార్థముగా రమ్ము హవిస్సును గ్రహించుటకు అని అర్థము.

రాజ్ఞ్యువాచ ॥

♦ అవలిప్తం ముఖం బ్రహ్మన్ దివ్యాన్ గంధాన్ బిభర్మి చ ।
సుతార్థే నోపలభ్యాస్మి తిష్ఠ యాజ మమ ప్రియే ॥ 22

యాజ ఉవాచ ॥

యాజేన శ్రపితం హవ్య ముపయాజాభిమంత్రితం ।

♦ వ్యా ॥ అవలిప్తం = దూషితం । లాలాది సహితత్వా దితి భావః । గంధాన్ = అంగరాగాదిజాన్ । అస్నాతాస్మీతి భావః ॥ శ్రు॥ యా దతో ధావతే తస్యై శ్యావదన్ యా స్నాతి తస్యా అప్సు మారుక ఇత్యుక్త్వా ॥ అపి చ ॥ ॥ శ్రు ॥ తిస్రో రాత్రీ ర్వ్రతం చరేదితి । విహితాదా అస్పృశ్యధర్మా వేతౌ ॥ సుతార్థే నోపలభ్యాస్మి - ఉపలబ్ధుం - స్ప్రష్టుం యోగ్యా నాస్మి ॥ శ్రు ॥ తస్మాన్మలవద్వాససా న సంవదేతేతి తయా సహ సంవాదస్యాపి నిషిద్ధత్వాత్ । అతో హేతోః । హే యాజ ! మమ ప్రియే సుతార్థే - సుతప్రయోజనే తిష్ఠ । శుచికాలం ప్రతీక్షస్వేత్యర్థః ॥

ఠ వ్యా ॥ కామం కథం న సందధ్యాత్ । అవయోస్సామర్థ్యాత్ మిథునం ఉత్పాదయే దిత్యర్థః । విప్రైహి - దూరం వా గచ్ఛ । ప్రయోగవిధిస్తు న విలంబం సహతే ఇత్యర్థః ॥

నీకు ఒక పుత్రుడు, ఒక పుత్రికయు, కలగనున్నారు. ఈ హవిస్సును గ్రహించుము. అని ద్రుపదుని రాణిని ఆజ్ఞాపించెను.

రాణి చెప్పుచున్నది.

22. ఓ బ్రాహ్మణుడా! నా ముఖము మలినమై యున్నది, నా శరీరము సుగంధములతో కూడియున్నది. ఓ యజ్ఞకర్తవైన నీ రవాత రాగలను, కాన నాయందు అభిమానముచే అంతవరకు కాగుము. అని పలికెను.

23. ఓ రాణీ! మా కోరిక ఎట్లు నెరవేరకుండును నీవు వచ్చినను

---

వ్యా॥ అవలిప్తం = ముఖము దూషితమైనది. చొంగతో కూడు కొని యుండుటచే నని భావము. గంధాన్ = అంగరాగాదిగంధములను స్నానము చేయలేదని భావము. శ్రు॥ వెలుపల వుండి ఏ స్త్రీ దంతము లను తోముకొనునో ఆమెకు పిప్పిపళ్ళుగల పుత్రుడు పుట్టును. ఎవతె స్నానము చేయునో ఆమెకు నీటి గండము కలవాడు పుట్టును. అని చెప్పుచున్నది. మరియు శ్రు॥ మూడురాత్రులు వ్రతము నాచరించవలయును. ఎవరిని తాక కూడదు. అది ముఖ్యధర్మము సుతార్థోపలబ్ధాస్మి= తాకుటకు యోగ్యమైన దానిని కాను శ్రు॥ కావున వెలుపల ఉన్న స్త్రీతో మాట్లాడకూడదు. అనిమాట్లాడుటగూడ నిషిద్ధమగుటచే హే యాజ! నాకు ప్రియమైన కుమారుడనే ప్రయోజనమునందు తిష్ఠ = శుచికాలము కొరకు నిరీక్షించుము అని అర్థము.

వ్యా॥ కామం = కోరిక. కథం సందధ్యాం = మాయొక్క సామర్థ్యమువలన పుత్రాపుత్రులను పుట్టింగగలము. నీవు దూరముగా నున్నను సరియే. నీ కొరకు ఇచ్చటి యజ్ఞకలాపము ఆలస్యము చేయదగదు. అని భావము

కథం కామం న సందధ్యా త్సాత్వం విప్రేహి తిష్ఠవా॥ 23

ఏవ ముక్త్వా తు యాజేన హుతే హవిషి సత్కృతే ।
ఉత్తస్థౌ పావకా త్తస్మా త్కుమారో దేవసన్నిభః ॥ 24

బిభ్రత్సఖడ్గ స్సశరో ధనుష్మా న్వినద న్ముహుః ।
సోధ్యారోహ ద్రథవరం తేన చ ప్రయయా తదా ॥ 25

రాజ్ఞ శ్శోకాపహో జాత ఏష ద్రోణవధాయ వై ।
ఇత్యువాచ మహద్భూత మదృశ్యం ఖేచరం తదా ॥ 26

కుమారీ చాపి పాంచాలీ వేదీమధ్యా త్సముత్థితా ।
సుభగా దర్శనీయాంగీ స్వసితాయతలోచనా ॥ 27

మానుషం విగ్రహం కృత్వా సాక్షా దమరవర్ణినీ ।
నీలోత్పలసమోగంధో యస్యాః క్రోశా త్ప్రధావతి ॥ 28

♦ దేవదానవయక్షాణా మీప్సితాం దేవరూపిణీం ।
తాం చాపి జాతాం శుశ్రోణీం వాగువాచాశరీరిణీ ॥ 29

---

♦ వ్యా ॥ దేవరూపిణీం - దుష్టవధాయోద్యతా దుర్గేత్యర్థః ॥

సరియే. లేక దూరముగా మన్నను సరియే. మా మంత్ర సామ ర్థ్యముచేతనే పుత్రికా పుత్రికలు పుట్టగలరు.

24. ఈ విధముగా పలికి యాజునిచే సంస్కరింపబడిన హవిస్సు అగ్నియందు హోమముచేయబడగా అగ్నినుండి దేవతలతోసమాను డగు కుమారు డుద్భవించెను.

25. ఆ పుత్రుడు ఖడ్గమును, బాణముతో కూడిన ధనుస్సును ధరించి పెద్ద ధ్వని చేయుచు, ఒక గొప్ప రథమును ఎక్కి వచ్చెను.

26 ఈతడు ద్రుపదునకు శోకమును పోగొట్టువాడును, ద్రోణుని వధించువాడును, కాగలడు. అని అదృశ్యమగు ఆకాశవాణి పలికెను.

27. మంచి అందగత్తెయు, నల్లనిదియు, విశాలమైన నేత్రములు గల దియు శుభలక్షణములు గల ద్రౌపదియను కుమార్తెయు, వేదీ మధ్యమునుండి ఉద్భవించినది.

28. సాక్షాత్తు స్వర్గలక్ష్మియే మానవ దేహమును ధరించి అవతరించి నది. ఆమె శరీరమునుండి నల్లకలువల గంధముతో సమాన మగు సుగంధము అంతటా వ్యాపించుచుండెను.

29. దేవ దానవులందరు కోరునట్టియు, దేవరూపిణి యగు ఆమె పుట్టు కను గూర్చి అశరీరవాణి ఇట్లు పలికెను:

---

వ్యా॥ దేవరూపిణీం = దుష్టులను వధించుట కొరకు అవత రించిన దుర్గాదేవి. అని అర్థము.

సర్వయోషిద్వరా కృష్ణా నినీషుః క్షత్రియాన్ క్షయం ।
సురకార్యమిదం కాలే కరిష్యతి సుమధ్యమా ॥ 30

యస్యాః హేతోః కౌరవాణాం మహదుత్పత్స్యతే భయం ।
తయోశ్చ నామనీ చక్రుర్ద్విజాః సంపూర్ణమానసాః ॥ 31

ధృష్టత్వాదతిధృష్టత్వాద్ ద్యుమ్నాద్యుత్సంభవాదపి ।
ధృష్టద్యుమ్నః కుమారోఽయం ద్రుపదస్య భవత్వితి ॥ 32

కృష్ణేత్యేవాబ్రువన్ కృష్ణాం కృష్ణాభూత్సా హి వర్ణతః ॥ 33

ధృష్టద్యుమ్నం తు పాంచాల్యః స్వానీయ స్వం నివేశనం ।
ఉపాకరోదస్త్రహేతోర్భారద్వాజః ప్రతాపవాన్ ॥ 34

---

టీకా ॥ ధృష్టత్వాత్ = ప్రగల్భత్వాత్ । అతిధృష్టత్వాత్ = అతీవపాలనే శక్తత్వాత్ । ద్యుమ్నాద్యుత్సంభవాత్ = ద్యుమ్నం = బలం ఆదిః యేషాం తే ద్యుమ్నాదయః । ఆదిశబ్దాత్ కవచకుండలశస్త్రశౌర్యోత్సాహాదీనాం గ్రహణం । తేషాం - ఉత్సంభవాత్ = ఉత్కృష్టోత్పత్తేః తైస్సహోత్పన్నత్వాదిత్యర్థః ॥

30. ఈ ద్రౌపది అందరిస్త్రీలలో శ్రేష్ఠురాలు. ఈ క్షత్రియులను నశింప జేయుట అనెడి దేవకార్యమును ఈమె యుక్తకాలమున చేయ గలదు.

31. ఈమె వలన కౌరవులకు మరణము సంప్రాప్తించగలదు, అని పలికెను. బ్రాహ్మణులు ఆనందించినవారై వారిద్దరికిని నామ కరణము చేసిరి.

32. ఈ ద్రుపద పుత్రుడు మిక్కిలి గంభీరముగా నుండుటచేతను, పరిపాలించుట యందు మిక్కిలి సామర్థ్యము గలవాడగుటచేతను, బలము, కవచకుండలములతో విశేషముగా పుట్టుటచే దృష్టద్యు మ్నుడు అను పేరుగలవాడగును.

33. ఈమెయు వర్ణముచే నల్లని వర్ణము కలది యగుటచే కృష్ణయను పేరు గలది కాగలదు.

34. ఈవిధముగా పుట్టిన ద్రుపద పుత్రుడగు దృష్టద్యుమ్నుని స్వయ ముగా తన గృహమునకు తీసుకొనివచ్చి ద్రోణాచార్యుడు ఉప నయనము చేసి విద్యాభ్యాసము చేయించెను.

వ్యా॥ ధృష్టత్వాత్ = గాంభీర్యమును, అతిధృష్టుత్వాత్ మిక్కిలి పరిపాలన సామర్థ్యము కలిగియుండుటచేతను, ద్యుమ్నం = బలము మొదలుగా గలిగినవి ద్యుమ్నాదులని చెప్పబడుతవి, ఆది శబ్దముచే, కవచ కుండల, శస్త్ర, శౌర్య, ఉత్సాహములు గ్రహించబడుతవి. తేషాం ఉత్పన్నత్వాత్ = విశేషముగా పుట్టుటవలన, అనగా వాటితో గూడి పుట్టుటచే వానికి ధృష్టద్యుమ్నుడని పేరు గలిగెను.

అమోఘణీయం దైవం హి భావి మత్వా మహామతిః ।
ఏవ ముక్త్వా కథాం విప్రో విరరామ మహాయశాః ॥ 35

తదద్భుతతమం శ్రుత్వా లోకే తస్య మహాత్మనః ।
కియత్కాలం చ తత్రైవ స్థిత్వా విప్రగృహే సుఖం ॥ 36

తత ఆమంత్ర్య తం విప్రం కుంతీ రాజన్ సుతైః సహ ।
ప్రతస్థే నగరీం రమ్యాం ద్రుపదస్య మహాత్మనః ॥ 37

తే త్వగచ్ఛన్నహోరాత్రా త్తీర్థం సోమాశ్రయాయణం ।
ఆసేదుః పురుషవ్యాఘ్రా గంగాయాం పాండునందనాః ॥ 38

ఉల్ముకం తు సముద్యమ్య తేషా మగ్రే ధనంజయః ।
ప్రకాశార్థం యయౌ తత్ర రక్షార్థం చ మహారథః ॥ 39

---

వ్యా ॥ తేఽపి పాండవాః బకవధానంతర మపి ఏక చక్రపురే పంచపంచాశద్దినాని నీత్వా తథాచ మార్గశిర బ ౧౧ పర్యంతం స్థిత్వా పాంచాలదేశం గమనం చక్రుః - మార్గమధ్య ప్రయాణం దినత్రయం నీత్వా ధౌమ్యాశ్రమే 16 దినాని స్థిత్వా 18 దివసే పుష్య శు సప్తమ్యాం పాంచాల నగరం ప్రవిశ్య కుంభకారగృహే నివాసం కృతా ఇతి వ్యజ్యతే।పుష్య శుక్ల దశమ్యాం ద్రౌపదీ స్వయంవర ఇతి సుస్పష్ట మవగమ్యతే ।

35. దైవము అనుల్లంఘనీయమైనది. తప్పక జరుగును. అని తలచి ద్రోణాచార్యులు అట్లు చేసెను. ఈ విధముగా బ్రాహ్మణుడు పాండవులకు కథను చెప్పి విరమించెను.

* 36. ఆ అద్భుతమైన వార్తను ఆ మహానుభావుని నుండి విని కొంత కాలము ఆ బ్రాహ్మణుని గృహమునందే సుఖముగా పాండవులుండిరి.

37. ఆ తరువాత కుంతీదేవి కుమారులతోగూడ బ్రాహ్మణునివద్ద శలవు తీసుకొని మహాత్ముడగు ద్రుపదుని యొక్క నగరమును గూర్చి బయలు దేరిరి.

38. వారలు ఒక రాత్రిం బవలు పయనించి గంగాతీర మందలి సోమాశ్రయాయణ తీర్థమును చేరిరి.

39. వారికి ముందర ఉల్ముక మనుపేరు గల కొరవిని పట్టుకొని అర్జునుడు వారి రక్షణ కొరకును, వెలుతురు కొరకును, ముందు నడుచుచుండెను.

---

*వ్యా॥ ఆ పాండవులు బక వధ జరిగిన తరువాత ఏకచక్రపురమున 55 దినములు అనగా మార్గశిర బహుళ పంచమి వరకు ఉండి పాంచాల దేశమునకు బయలు దేరిరి. మార్గమధ్యమున 3 రోజులు ప్రయాణముచేసి ధౌమ్యాశ్రమమున 15 రోజులు ఉండి, 18 వరోజున పుష్య శుద్ధ సప్తమినాడు పాంచాలనగరమును ప్రవేశించి, కుమ్మరివాని గృహమున నివాసము చేసిరని తెలియుచున్నది. పుష్యశుద్ధ దశమి యందు ద్రౌపదీ స్వయంవరము జరిగెనని స్పష్టముగా తెలియుచున్నది.

తత్ర గంగాజలే రమ్యే వివిక్తే క్రీడయన్ స్థితః ।
♦ అంగారపర్ణ స్తాన్ దృష్ట్వా క్రుద్ధ ఆయమ్య కార్ముకం ।
ముమోచ బాణా న్నిశితా నహీ నాశీవిషానివ ॥ 40

*ఉల్ముకం భ్రామయం స్తూర్ణం పాండవా శ్చర్మ చోత్తరం ।
వ్యపోహత శరాం స్తస్య సర్వానేవ ధనంజయః ॥ 41

తత స్స పాండవః క్రుద్ధో గంధర్వాయ ముమోచ హ ।
ప్రదీప్త మస్త్రమాగ్నేయం దదాహాస్య రథం తు తత్ ॥ 42

శిరోరుహేషు జగ్రాహ గంధర్వం తం ధనంజయః ।
యుధిష్ఠిరం తస్య భార్యా ప్రపేదే శరణార్థినీ ॥ 43

యుద్ధే జితం విముంచేతి తమువాచ యుధిష్ఠిరః ॥ 44

గంధర్వ ఉవాచ ॥
జితోఽహం పూర్వకం నామ ముంచా మ్యంగారపర్ణతాం ।
చాక్షుషీ నామ విద్యేయం యాం సోమాయ దదౌ మనుః ।
నివేదయిష్యే త్వాం దివ్య ప్రాణదాయ మహాత్మనే ॥

---

♦వ్యా ॥ అంగారపర్ణః । అంగారవత్ భాస్వరం దుస్పర్శం వాహనం రథో యస్య తస్య భావ స్తత్తా । అంగారపర్ణతాం ॥

*వ్యా ॥ ఉల్ముకం । అలాతం । చర్మఛత్రాకార వరాయుధత్రాణం ॥

•40. అచ్చట రమ్యమైన జనులులేని గంగజలమునందు విహరించు చున్న అంగారపర్ణుడనువాడు ఆ పాండవులను చూచి క్రుద్ధుడై ధనుస్సును ఎక్కుపెట్టి వాడియైన బాణములను సర్పములనువలె వీరిమీద ప్రయోగించెను.

॥41. అర్జునుడు ఉల్ముకమను త్రిప్పుచూ, ఒక ప్రశస్తమైన కృష్ణాజినమును కూడ త్రిప్పుచూ, వాని అన్ని బాణములను వారించెను.

42. తరువాత క్రుద్ధుడైన అర్జునుడు ఆ గంధర్వుని మీదకు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను, అది వాని రథమును కాల్చివేసెను.

43. ఆ గంధర్వుని అర్జునుడు పట్టుకొనెను. అతని భార్య ధర్మరాజును శరణువేడెను.

44. యుద్ధమునందు జయింపబడిన వానిని విడిచి పెట్టుమని ధర్మరాజు తమ్ముని ఆదేశించెను

గంధర్వుడు చెప్పుచున్నాడు.

45. నేను జయింపబడితిని. అంగారపర్ణుడను పూర్వనామమును వదలి పెట్టుచున్నాను. మనువు చంద్రునకు ఉపదేశించిన చాక్షుష విద్యను ప్రాణదానము చేసిన నీకు ఇచ్చెదను.

---

•వ్యా॥ అంగారపర్ణ = కొరవివలె ప్రకాశించుచున్న, ఎవరును తాకరాని రథము వాహనముగా గలవాడు. వాని ధర్మము అంగారపర్ణత అని చెప్పబడును

॥వ్యా॥ ఉల్ముకం = కొరవి, చర్మపు గొడుగు ఆకారము గల ఒకానొక డాలు వంటి రక్షకము.

యచ్చక్షుషా ద్రష్టుమిచ్ఛే త్త్రిషు లోకేషు కించన।
* తత్పశ్యే ద్యాదృశం చేచ్ఛే త్తాదృశం ద్రష్టు మర్హతి॥ 46

విద్యయా హ్యనయా రాజన్ వయం నృభ్యో విశేషితాః।
అనయా విద్యయా జ్ఞాతం భవిష్యం తవ భూపతే॥ 47

రాజసూయాధ్వరం త్వం హి కరిష్యసి సహానుజః॥
జ్ఞాతవ్యం సర్వదీ పేషు దీనానాం భోజనాదికం॥ 48

తదాజ్ఞే తా న్రక్షితవ్యం తస్మాద్గృహ్ణీష్వ భారత।
గంధర్వజానా మశ్వానాం మహాపురుషసత్తమ॥ 49

భ్రాతృభ్య స్తవ తుభ్యం చ పృథగ్దాతా శతం శతం।
దేవగంధర్వవాహాస్తే దివ్యవర్ణా మనోజవాః॥ 50

♦ క్షీణాక్షీణా భవంత్యేతే న హీయంతే చ రంహసాః।

---

*వ్యాః-తదితి తత్ ధర్మరూపం పశ్యేత్ । యాదృశం యద్ధర్మవిశిష్టం సామాన్యతో విశేషతశ్చ సర్వం సర్వావస్థం వస్తు సర్వదా స్వసంకల్పానుసారేణ పశ్యే దిత్యర్థః॥

♦వ్యాః- క్షీణాశ్చ అక్షీణాశ్చ క్షీణా క్షీణాః। వృద్ధా స్తరుణా వా ఏతే న భవంతి। రంహసా వేగాచ్చాపి న హీయంతే న క్షీయంతే ఇత్యర్థః॥

* 46. మూడు లోకములను నేత్రములచే చూడగలవు. ఏ వస్తువును ఎట్లు చూడ దలచినను అట్లు చూడగలవు.

47. ఓ ధర్మజా! ఈ విద్యచే మేము మనుష్యులకన్న గొప్పవారము; ఈ విద్యచే నీకన్ని విషయములు తెలియగలవు.

48. నీవు నీ సోదరులతో కలసి రాజసూయయాగమును చేయగలవు. సర్వద్వీపములయందు యెవరెవరు అన్నాతురులై యున్నారో వారిని తెలుసుకుని భోజనాదులు సమకూర్చగలవు.

49. రాజసూయ యాగమును చేసినవాడు అట్టి ఆర్తులను రక్షించవలెను కాన గంధర్వకులమున బుట్టిన అశ్వములను యిచ్చుచున్నాను, గ్రహించుము.

50. నీ సోదరులకును, నీకును, ఒక్కొక్కరికి నూరుచొప్పున దేవ గంధర్వుల వాహనములున్నూ, దివ్యమైన వర్ణముగల మనో వేగముగల గుర్రములను యిచ్చెదను.

•51. ఈ గుర్రములు ముసలివివి, చిన్నవయస్సు గలిగినవి కాక

---

*వ్యా॥ తదితి తత్ = ధర్మరూపమును చూడగలవు. యాదృశం = ఏ ధర్మముతో కూడుకున్న దానిని సామాన్యముగ గాని విశేషముగా గాని, సర్వం = సర్వావస్థలోనున్న వస్తువును, సర్వదా— ఎల్లప్పుడునూ, నీ యొక్క సంకల్పము నను సరించి చూడ గలవు.

•వ్యా॥ క్షీణాశ్చ = ముసలివి, అక్షీణాశ్చ = లేగవి, అటువంటివి కానివి, మధ్యవయస్సు కలిగినటువంటివని భావము. రంహసా = వేగముచే నహీయంతే = క్షీణించవని అర్థము.

త్వత్తోప్యహం గ్రహీష్యామి హ్యస్త్ర మాగ్నేయ ముత్తమం 51

అర్జున ఉవాచ

కారణం బ్రూహి గంధర్వ కిం తద్యేన స్మ ధర్షితాః 52

గంధర్వ ఉవాచ

నారదప్రభృతీనాం తు దేవర్షీణాం మయా శ్రుతం।
గుణాన్ కథయతాం వీర పూర్వేషాం తవ ధీమతాం। 53

ధర్మం వాయుం చ శక్రం చ విజన మశ్వినౌ తథా।
పాండుం చ కురుశార్దూల షడేతాన్ కురూద్వహాన్॥ 54

జానన్నపి చ యః పద్ధర్మే వశిష్ఠ ధర్షణం।
పురోహితం ప్రకుర్వీత రాజన్ గుణసమన్వితం।
బ్రాహ్మణప్రముఖం రాజ్యం శక్యం పాలయితుం చిరం। 55

యవీయాన్ దేవలస్యైష వనే భ్రాతా తపస్యతి।
ధౌమ్య ఉత్కోచకే తీర్థే తం వృణుధ్వం యదీచ్ఛథ। 56

తతోఽర్జునో స్త్రమాగ్నేయం దత్వా చాశ్వాని గ్రాహయత్।
చాక్షుషం చాగ్రహీద్విద్యాం కుంతీపుత్రో యుధిష్ఠిరః। 57

యెప్పుడును, మధ్యమవయస్సులో నుందును. వేగముచే అలసట నొందవు. నీవలన ఉత్తమమైన ఆగ్నేయాస్త్రమును గ్రహించెదను.

అర్జునుడు అడుగు చున్నాడు.

52. ఓ గంధర్వుడా! ఏ కారణముచే మమ్ము బెదిరించితివి? యథార్థముగా తెల్పుము.

గంధర్వుడు చెప్పుచున్నాడు.

53. గొప్పవారగు మీ పూర్వుల యొక్క గుణములను చెప్పుచున్న నారదాది దేవర్షుల వలన నేను వారి చరిత్రను వింటిని.

54. యమధర్మరాజును, వాయుదేవుని, దేవేంద్రుని, అశ్వినీ దేవతలను పాండురాజు అను యీ ఆరుగురు కురువంశవర్ధనులను నేను యెరుగుదును.

55. మీ గొప్పతనము నేనెరిగి యుండియు, మిమ్ములను బెదిరించితిని. మీరు గుణవంతుడగు పురోహితుని నియమించు కొనుడు. బ్రాహ్మణుడు ప్రసన్నముగ నున్నచో చిరకాలము రాజ్యము పరిపాలించ శక్యమగును.

56. దేవలముని తమ్ముడగు ధౌమ్యుడను వాడు ఉత్కచక తీర్థమునందు తపస్సు చేయుచున్నాడు. మీకంగీకారమగుచో వానిని పురోహితునిగా వరించుడు.

57. తరువాత అర్జునుడు వానికి ఆగ్నేయాస్త్రము నిచ్చి వానినుండి అశ్వములను గ్రహించెను. ధర్మరాజు వానినుండి చాక్షుష విద్యను గ్రహించెను.

కార్యకాలే గ్రహీష్యామి తథ్యశ్వాన్ తత్రైవ న్యస్య చ। 58

* తం వవ్రుః పాండవా ధౌమ్యం పౌరోహిత్యాయ పాండవాః
తాన్ ధౌమ్యః ప్రతిజగ్రాహ సర్వవేదవిదాం వరః॥ 59

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
ద్వాదశోఽధ్యాయః సమాప్తః

## త్రయోదశోధ్యాయః

అనుపూర్వేణ సంప్రాప్తాః పాంచాలాన్ పాండునందనాః ।
కుంభకారస్య శాలాయాం నివాసం చక్రిరే తదా ॥ 1

---

*వ్యా;–భారతే అనుశాసనిక పర్వణి 14అ॥ ఉపమన్యు వచనం, శ్లో॥ పురా కృతయుగే తాత ఋషి రాసీ న్మహా యశాః। వ్యాఘ్రపాద ఇతి ఖ్యాతో వేదవేదాంగపారగః॥ తస్యాహ మభవం పుత్రో ధౌమ్యశ్చాపి మమానుజః। ఇత్యత ఏవ విరాటం ప్రతి యుధిష్ఠిరః – స్వగోత్రం వ్యాఘ్రపద్య మిత్యుక్తం ॥ భీష్మతర్పణేఽపి వైయాఘ్రపద్యగోత్రాయ ఇతికీర్తయంతి। తథాచ ఉపమన్యురపి వైయాఘ్రపద్యగోత్ర ఏవ తథైవ దేవలోఽపి । వ్యాఘ్రపాదస్యాపి వైయాఘ్ర పద్యత్వం గోత్రాపత్య సంబంధాదేవ వైయాఘ్రపద శబ్దః। యథా చ వసిష్ఠస్య పుత్రః కుండినః । తథా వసిష్ఠస్య గోత్రః కుండిన ఇతి ।

58. ఈ అశ్వములను నీ వద్దనే నుంచుము, అవసరము వచ్చినపుడు వాటిని నీనుండి తీసుకొందును.

* 59. పాండవులు ధౌమ్యమహర్షి నిపురోహితునిగ వరించిరి. సర్వవేద వేత్తయగు ధౌమ్యుడు వారలను శిష్యులనుగాస్వీకరించెను.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున ఆదిపర్వయందు
పన్నెండవ అధ్యాయము సమాప్తము.

# 13వ అధ్యాయము

1. పాండవులు క్రమముగా పాంచాల దేశమును ప్రవేశించిరి, అప్పుడు ఒక కుమ్మరివాని యింటియందు నివశించిరి.

---

* వ్యా॥ భారతమున అనుశాసనిక పర్వయందు 14 వ అధ్యాయమున ఉపమన్యుని వచన మిట్లుగలదు, శ్లో॥ పూర్వకాలమందు కృతయుగమున వేదవేదాంగ పారగుడును, గొప్పకీర్తిగల వ్యాఘ్రపాధుడను ఋషి కలడు, నేను ఆతని పుత్రుడను. నా తమ్ముడు ధౌమ్యుడు. అని చెప్పెను. కావుననే విరాట రాజును గూర్చి తన గోత్రము వైయాఘ్రపద్యగోత్రమని ధర్మరాజు చెప్పుకొనెను. భీష్ముని తర్పణము నందు మనూ. వైయాఘ్రపద్య గోత్రాయ అని చెప్పుచున్నారు. ఉపమన్యుడు గూడ వైయాఘ్రపద్య గోత్రుడే. వ్యాఘ్రపాదుడు గూడ వైయాఘ్రపద్య గోత్రుడే. గోత్రాపత్య సంబంధమువలన కాగలరు. కావుననే వశిష్ఠుని యొక్క కుమారుడు కుండినుడు, అయినప్పటికి వసిష్ఠుని గోత్రము కుండిన గోత్రము,

తత్ర భైక్ష్యం సమాజహ్రుః బ్రాహ్మణీం వృత్తిమాశ్రితాః॥ 2

యజ్ఞసేనస్య కామస్తు పాండవాయ కిరీటినే।
కృష్ణాం దద్యామితి సదా నచైత ద్వివృణోతి సః॥ 3

సోఽన్వేషమాణః కౌంతేయం పాంచాల్యో ద్రుపదస్తదా।
దృఢంధనురనాయమ్యం కారయామాస సాయకాన్॥ 4

యంత్రం వైహాయసం చాపి కారయామాస కృత్రిమం।
తేన యంత్రేణ సమితం రాజా లక్ష్యం చకార సః॥ 5

ఇదం సజ్యం ధనుః కృత్వా జజ్ఞైరేభిశ్చ సాయకైః।
అతీత్య లక్ష్యం యో వేద్ధా స లబ్ధా మత్సుతా మితి॥ 6

ఇతి స ద్రుపదో రాజా స్వయంవర మఘోషయత్।
తచ్ఛ్రుత్వా పార్థివా స్సర్వే సమీయు స్తత్ర భారత॥ 7

ఋషయశ్చ మహాత్మాన స్స్వయంవరదిదృక్షవః।
దుర్యోధన పురోగాశ్చ సకర్ణాః కురవో నృప॥ 8

కృష్ణావర్ణ్యవసిద్ధ్యర్థం సర్వేత స్సముపావిశన్॥
బ్రాహ్మణాస్తే చ సహితాః పాండవా స్సముపావిశన్॥ 9

పుష్యమాసేతు రోహిణ్యాం మేకాదశ్యాం శుభేదినే।

2. పాంచాల నగరమునందు వారు బ్రాహ్మణ వేషములను ధరించి బ్రాహ్మణ వృత్తి యగు భిక్షాటనము చేయుచు జీవించుచుండిరి.

3. ద్రుపదుని కోర్కె మాత్రము ద్రౌపదిని పాండు పుత్రుడగు అర్జునునకు యీయవలెనని యుండెను. కాని ఆతడు తన కోరికను బహిర్గతము చేయలేదు.

4. ఆతడు పాండవులను వెదకుచు, అర్జునుడు తప్ప యితరులు యెక్కుపెట్టలేని, ధనుస్సును బాణములను తయారుచేయించెను.

5. ఆకాశము నందున్న ఒక కృత్రిమమైన యంత్రమును, యంత్రముతో కూడిన యొక లక్ష్యమును యేర్పాటు చేసెను.

6. ఈ ధనుస్సు యెక్కుపెట్టి యీ బాణములతో యంత్రము ద్వారా లక్ష్యమును యెవడు కొట్టునో వాడు నా పుత్రికను పొందగలడు.

7. ఈ విధముగా, ద్రుపదుడు యేర్పాటు చేసి స్వయంవరమును ప్రకటించెను, అది విని రాజులందరు విచ్చేసిరి.

8. మహాత్ములగు ఋషులును, కర్ణునితో గూడిన దుర్యోధనాది కౌరవులును, అచ్చటికి విచ్చేసిరి

9. ద్రౌపదిని చూచుట కొరకు నిరీక్షించుచు అందరు కూర్చుని యుండిరి. బ్రాహ్మణ బృందముతో కూడియున్న పాండవులును, అచ్చట కూర్చుని యుండిరి.

10. పుష్యమాసమున రోహిణీ నక్షత్రముతో కూడిన యేకాదశి శుభ

మాలాంచ సముపాదాయ కాంచనీం సమలంకృతామ్।
అవతీర్ణా తతో రంగం ద్రౌపదీ భరతర్షభ। 10
పురోహిత స్సోమకానాం మంత్రవి ద్బ్రాహ్మణ శ్శుచిః।
పరిస్తీర్య జుహావాగ్ని మాజ్యేన విధివత్తదా॥ 11
నిశ్శబ్దే తు కృతే తస్మిన్ ధృష్టద్యుమ్నో విశాంపతే।
వాక్య ముచ్చై ర్జగాదేదం శ్లక్ష్ణమర్థవ దుత్తమమ్॥ 12
ఇదం ధను ర్లక్ష్య మిమే చ బాణాః
శృణ్వంతు మే భూపతయ స్సమేతాః॥ 13
ఛిద్రేణ యంత్రస్య సమర్పయధ్వం
శ్శరై శ్శితై ర్వ్యోమచరై ర్దశార్ధైః।
ఏతన్మహత్కర్మ కరోతి యో వై
కులేన రూపేణ బలేన యుక్తః
తస్యాద్య భార్యా భగినీ మమేయం
కృష్ణా భవిత్రీ న మృషా బ్రవీమి॥ 14-15
తానేవ ముక్త్వా ద్రుపదస్య పుత్రః।
పశ్చాదిదం తాం భగినీ మువాచ।
నామ్నా చ గోత్రేణ చ కర్మణా చ।
సంకీర్తయన్ భూమిపతీన్ సమేతాన్॥ 16
అథాయయు ర్దేవగణా విమానైః
రుద్రాదిత్యావసవో ఽథాశ్వినౌ చ।
సాధ్యాశ్చ సర్వే మరుత స్తథైవ।
యమం పురస్కృత్య ధనేశ్వరం చ॥ 17

మన బంగారుమాలను స్వీకరించి ద్రౌపదీదేవి రంగస్థలమును ప్రవేశించెను.

11. ద్రుపదరాజ పురోహితుడు దర్భలను పఱచి విధ్యుక్తముగా ఆజ్యముచే అగ్నికి హోమములు చేసెను.

12, సభయంతయు నిశ్శబ్దముగా నుండగా ధృష్టద్యుమ్నుడు లేచి అర్థవత్తులగు ఉత్తమమైన వాక్యములను గంభీరముగా పలికెను.

13. ఇది ధనస్సు, యివి బాణములు. రాజులందరు నా వాక్యమును సావధానముగ ఆలకింపుడు.

14. 15. ఈ యంత్రము యొక్క రంధ్రముగుండ ఐదు బాణములను ప్రయోగించి లక్ష్యమును ఛేదించవలెను. కులము, రూపము, బలము గల యెవడు ఈ గొప్ప పనిని చేయగ౦డో వానికి నా సోదరియగు ద్రౌపది భార్య కాగలదు. యిందసత్య మేమియు లేదు.

16, నామముతోను, పరాక్రమముతోను వచ్చిన రాజుల నందరిని కీర్తించి ద్రుపదపుత్రుడు చెల్లెలిలో వారి వారి వృత్తాంతమునంతను చెప్పెను.

17. తరువాత విమానములతో దేవగణములు, రుద్రులు, ఆదిత్యులు వసువులు, అశ్వనీదేవతలు, సాధ్యులు, మరుద్దేవతలు, కుబేరునితో కూడి యమధర్మరాజు అచ్చటకు విచ్చేసిరి.

హలాయుధ స్తత్ర జనార్దనశ్చ।
వృష్ణ్యం ధకాశ్చైవ యథాప్రధానం॥ 18
దృష్ట్వా తు తాన్ మత్త గజేంద్ర రూపాన్
పంచాభిపద్మా నివ వారణేంద్రాన్।
భస్మావృతాంగానివ హవ్యవాహాన్ ।
కృష్ణః ప్రదధ్యౌ యదువీరముఖ్యః॥ 19
శశంస రామాయ యుధిష్ఠిరం సః।
భీమం స జిష్ణుం చ యమౌ చ వీరౌ॥ 20
తస్మాత్కార్ముకం సంధానోపపన్నం।
సజ్యం న శేకు ర్మనసాఽపి కర్తుం।
తే విక్రమంతః స్ఫురతా దృఢేన।
నిక్షిప్యమాణా ధనుషా నరేంద్రాః॥ 21
సర్వా నృపాం స్తా న్ప్రసమీక్ష్య కర్ణో ।
ధనుర్ధరాణాం ప్రవరో జగామ ।
ఉద్ధృత్య తూర్ణం ధనురుద్యతం త
త్సజ్యం చకారాశు యుయోజ బాణాన్॥ 22
దృష్ట్వా తు తం ద్రౌపది వాక్యమచ్చై
ర్జగాద నాహం వరయామి సూతం।
సామర్ష భావం ప్రసమీక్ష్య సూర్యం
తత్యాజ కర్ణః స్ఫురితం ధనుస్తత్॥ 23
యదా నివృత్తా రాజానో ధనుష స్సజ్యకర్మణః।
అథోదతిష్ఠ ద్విప్రాణాం మధ్యా జ్జిష్ణు రుదారధీః॥ 24

18. బలరాముడు, శ్రీకృష్ణుడు, వృష్ణి, అంధకులలో ప్రధానులును విచ్చేసిరి.

19. శ్రీకృష్ణుడు మదించిన గజేంద్రములవలె సున్నట్టియు పద్మములచే కప్పబడిన యేనుగులవలె నున్నట్టియు, బూదిదచే కప్పబడిన అగ్నులవలె నున్నట్టి పంచపాండవులను చూచి మిక్కిలి విచారించెను.

20. అతడు ధర్మరాజును, భీముని, అర్జునుని, నకుల సహదేవులను బలరామునకు చూపి చెప్పెను.

21. రాజులు వంచి బిగించగల ఆ ధనస్సును మనస్సు చేతనున్నూ యెక్కుపెట్టలేకపోయిరి, ప్రకాశించుచున్న దృఢమైన ఆ ధనస్సుతో పోరాడుచున్నవారై బెదరగొట్టబడిరి.

22. ఆ రాజుల నందరిని చూచి ధనుర్ధరులలో శ్రేష్ఠుడగు కర్ణుడు వచ్చెను. ఆ ధనస్సును యెత్తి వెమ్మదిగా వంచి బాణములను యెక్కుపెట్టెను.

23. వానిని ద్రౌపది చూచి సూతుని నేను వరించను అని బిగ్గరగా పలికెను. కర్ణుడు ఆమాయతో సూర్యునివంక చూచి ప్రకాశించు ఆ ధనస్సును విడిచి పెట్టెను.

24. ఈ విధముగా రాజు లందరును పరాఙ్ముఖులు కాగా గొప్ప పరాక్రమశాలియగు అర్జునుడు బ్రాహ్మణుల మధ్యనుండి లేచెను.

ఉదక్రోశన్ విప్రముఖ్యా విధున్వంతోఽజినానిచ ।
కేచి దాస న్విమనసః కేచిదాస న్ముదాన్వితాః ॥ 25

ప్రణమ్య శిరసా దేవ మీశానం వరదంప్రభుం ।
కృష్ణం చ మనసా కృత్వా జగృహే చార్జునో ధనుః॥ 26

సజ్యం చ చక్రే నిమిషాంతరేణ
శరాంశ్చ జగ్రాహ దశార్ధ సంఖ్యాన్ ।
వివ్యాధ లక్ష్యం నిపపాత తచ్ఛి
ద్రేణ భూమౌ సహసాఽతివిద్ధః ॥ 27

తతోఽంతరిక్షే చ బభూవ నాద
స్సమాజమధ్యే చ మహాన్నినాదః ।
పుష్పాణి దివ్యాని వవర్ష దేవః
పార్ధస్య మూర్ధ్ని ద్విషతాం నిహంతుః ॥ 28
ఆవాసమే వోపజగామ శీఘ్రం
సార్ధం యమాభ్యాం స చ ధర్మసూనుః ॥ 29
విద్ధంతు లక్ష్యం ప్రసమీక్ష్య కృష్ణా ।
గ శ్వేరఽర్పయ ద్దామ మహేంద్రసూనోః ॥ 30
స తాముపాదాయ విజిత్య రంగే
ద్విజాతిభి స్తైరపి పూజ్యమానః।
రంగా న్నిరక్రామ దచింత్యకర్మా
పత్న్యా తయా చాప్యనుగమ్యమానః॥ 31

25. కొంతమంది బ్రాహ్మణులు కృష్ణాజినములను దులుపుచు హర్ష ధ్వానములు చేసిరి. కొంతమంది విషణ్ణులైరి. కొందరు సంతోషించిరి.

26. అర్జునుడు శిరస్సుతో ఈశ్వరుడును, వరదుడు నగు శివునికి నమస్కరించి మనసార గోవిందుని స్మరించి ధనస్సును పట్టుకొనెను.

27. క్షణకాలములో ధనస్సును యెక్కుపెట్టి అయిదు బాణములను తీసుకొని లక్ష్యమును యంత్రము యొక్క రంధ్రముగుండా ఛేదించెను. ఆ లక్ష్యము కొట్టబడినదై క్రిందపడెను.

28. అంతట అంతరిక్షమునందును జనసమూహమునందును గొప్ప ధ్వని బయలుదేరెను. శత్రువులను సంహరించు అర్జునుని శిరస్సు మీద దేవతలు పుష్పవర్షము కురిపించిరి.

29. ధర్మరాజు కవలలను వెంట నిడుకొని తమ నివాసస్థానమునకు వెళ్ళిపోయెను.

30. అర్జునుడు లక్ష్యమును ఛేదించుట చూచి ద్రౌపది వాని గళమున మాలిక నర్పించెను.

31. అర్జునుడు ద్రౌపదిని తీసుకొని రంగమునందు జయించి బ్రాహ్మణులచే బూజింపబడుచు భార్య వెంట రాగా రంగస్థలమునుండి వెలుపలకు వచ్చెను.

తం దృష్ట్వా ద్రుపదః ప్రీతో బభూవ రిపుసూదనః ।
సహ సైన్యంచ పార్థస్య సహాయార్థ మియేష సః॥ 32

తత స్సము త్పేతు రుదాయుధా స్తే
మహీక్షితో బద్ధతలాంగుళిత్రాః।
జిఘాంసమానా కురురాజపుత్రా
వమర్షయంతోఽర్జునభీమసేనౌ॥ 33

తతస్తు భీమోఽద్భుతభీమకర్మా ।
మహాజవో వజ్రసమానసారః।
ఉత్పాట్య దోర్భ్యాం ద్రుమ మేకవీరో
నిష్పత్రయామాస యథా గజేంద్రః॥ 34

తతః కర్ణో మహాతేజా జిష్ణుం ప్రతియయౌ రణే।
పాతితే భీమసేనేన శల్యే కర్ణే చ శంకితే ।
యుద్ధాత్కర్ణో న్యవర్తంత ధార్తరాష్ట్రే చ భారత। 35

బ్రాహ్మం తేజం సదాఽజయ్యం మన్యమానా మహారథాః।
శంకితా స్సర్వరాజానః పరివవ్రుః వృకోదరం॥ 36

బ్రాహ్మణా హి సదా రక్ష్యాః సాపరాధాఽపి భూభృతా।
ఇతి బ్రువంతః ప్రయయు ర్యే తత్రాసన్ సమాహితాః॥ 37

కృచ్ఛ్రేణ జగ్మతు స్తేతు భీమసేన ధనంజయౌ॥ 38

గత్వా తు తాం భార్గవకర్మశాలాం

32. ఆ అర్జునుని చూచి ద్రుపదుడు సంతోషించెను. పార్థునికి సహా యార్థము సైన్యమును పంపుటకు యిచ్ఛయించెను.

33. తరువాత రాజులు ఆయుధములతో గూడి భీమార్జునులను చంపవలెనను అసూయతో నెదుర్కొనిరి.

34. భీముడు అద్భుతమైన పరాక్రమము కలవాడై ఒక వృక్షమును పెకలించి యేనుగవలె వారి నందఱను చెల్లాచెదరు చేసెను.

35. కర్ణుడు యుద్ధమునకై అర్జునునికి యెదురు వెళ్ళను. భీమసేనునిచే శల్యుడు పడవేయబడగా కర్ణుడు భీతి చెంది కౌరవులతో గూడి యుద్ధమునుండి మరలిపోయెను.

36. బ్రాహ్మణతేజస్సు ఎల్లప్పుడు జయింపరానిది. అని మహారథులగు రాజులు సందేహించుచున్న వారివలె వృకోదరని విగిచిపెట్టిరి.

37. ఎంత అపరాధము చేసినప్పటికిని బ్రాహ్మణులు రాజులచే ఎల్లప్పుడునూ రక్షించదగినవారు. అని పలుకుచు. సమాధానము చెప్పుకొని రాజులందరూ వెళ్ళిపోయిరి.

38. తరువాత అతికష్టముగా భీమార్జునులు తమ విడిదిగృహమునకు వెళ్ళిపోయిరి.

39 నరశ్రేష్ఠులగు భీమార్జునులు ద్రౌపదితో గూడి వారి విడిదియ

పార్థా పృథాం ప్రాప్య మహానుభావౌ।
తాం యాజ్ఞసేనీం పరమప్రతీతౌ
భిక్షేత్యథాఽవేదయతాం నరాగ్ర్యౌ ॥ 39

కుటీగతా సా త్వనవేక్ష్య పుత్రౌ
ప్రోవాచ భుంక్త్వేతి సమేత్య సర్వే।
పశ్చాచ్చ కుంతీ ప్రసమీక్ష్య కృష్ణాం
కష్టం మయా భాషిత మిత్యువాచ ॥ 40

యుధిష్ఠిర ఉవాచ॥
త్వయా జితా ఫాల్గున యాజ్ఞసేనీ
త్వయైవ శోభిష్యతి రాజపుత్రీ।
ప్రజ్వాల్యతా మగ్ని రమిత్రసాహ
గృహాణ పాణిం విధివ త్త్వమస్యాః ॥ 41

అర్జున ఉవాచ॥
భవాన్నివేశ్యః ప్రథమం తతోఽయం
భీమో మహాబాహు రచింత్యకర్మా।
అహం తతో నకులోఽనంతరో మే
పశ్చాదయం సహదేవ స్తరస్వీ ॥ 42

---

వ్యా॥ భిక్షా భిక్షిత వస్తుషు॥ ఇత్యమరః॥ తథాచ- భిక్షిత - కామిత- వస్తుష్వితర్థః॥ అతఏవ భారతే భాగవతే- పతిభిక్షాం మమ దేహీతి వింధ్యావళ్యాం॥ దేహి పతి భిక్షా మితి కాళీయపత్నీనాం ప్రలాపో దృశ్యతే॥

•కుమ్మరి ఇంటికి వెళ్ళి మిక్కిలి సంతోషముతో భిక్ష దొరికినదిఅని తల్లికి నివేదించిరి.

40. గృహము లోపల ఉన్న ఆ కుంతి ద్రౌపదిని, పుత్రులను చూడక లోపల నుండియే " ఆ భిక్షను మీరందరూ సమానముగా భుజించుడు, " అని పలికెను, తరువాత కుంతీదేవి ద్రౌపదిని చూచి '' అయ్యో నేనెంత కష్టమైనది పలికితిని. '' అని పరితాపపడెను.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

41. ఓ అర్జునా ! ద్రౌపది నీచే జయింపబడినది. ఈమె నీ చేతనే శోభించగలదు. అగ్నిహోత్రమును ప్రజ్వలింప చేయుము. ఈమె పాణిని విధ్యుక్తముగా గ్రహించుము.

అర్జునుడు చెప్పుచున్నాడు.

42. నీవు మొదట వివాహము చేసికొనవలయును, తరువాత మహాబలశాలియగు భీముడు, తరువాత నేను, తరువాత నకులుడు, వాని తరువాత సహదేవుడు వివాహమాడ వలసియున్నది గదా ! ఇది సరియగు క్రమము.

---

•వ్యా ॥ " భిక్షా శబ్దము యాచింపబడిన వస్తువులను చెప్పును. " అని అమర నిఘంటువు చెప్పుచున్నది. మరియు భిక్షా శబ్దము కోరబడిన వస్తువుల యందును ప్రవర్తించును. కావుననే భారతమునందును భాగవతమునందును పతిభిక్షను వాక్ప్రసంగము. అని విం ధ్యావళి వాక్యము, కాశీయ పత్నుల వాక్యములు కనబడుచున్నవి.

తేషా మాకారభావజ్ఞః కుంతీపుత్రో యుధిష్ఠిరః।
ద్వైపాయనవచః కృత్స్నం సస్మార మనుజర్షభః। 43

*అబ్రవీ త్సహితాన్ భ్రాతౄ న్స్నిగ్ధో భేదభయా న్నృపః।
సర్వేషాం ద్రౌపదీ భార్యా భవిష్యతి హి న శ్శుభా। 44

తతోఽబ్రవీ ద్వాసుదేవోఽభిగమ్య
కుంతీసుతం ధర్మభృతాం వరిష్ఠం।
కృష్ణోఽహ మస్మీతి బలేన సార్ధం
ననామ కుంతీం చ పితృష్వసాం తాం॥ 45

అజాతశత్రుశ్చ కురుప్రవీరః
పప్రచ్ఛ కృష్ణం కుశలం సహానుజం।
సోఽనుజ్ఞాతః పాండవై ర్నావ్యయశ్రీః
ప్రాయా చ్ఛీఘ్రం బలదేవేన సార్ధం॥ 46

*వ్యా॥ భేదభయం, యస్య ద్రౌపదీ తస్యేతరే శత్రవః స్యురితి భేదః। ఏతేన వైదికానాం - తద్ధర్మధీ స్సంస్కృతాత్మనామ్ ఆత్మతుష్టేః ప్రమాణత్వం। సిద్ధం తద్ధర్మశుద్ధమేతి పూర్వమీమాంసా వచనం॥ తంత్రవార్తికే ఽపి-యథా వా సర్వసిద్ధాంతే నకులో యాం కిలౌషధీం దంష్ట్రే గృహ్ణాతి తా మాహా స్సమస్త విషహారిణీతిమి చ సిద్ధం॥

43. ధర్మరాజు సోదరుల ఆకారములను, భావములను పూర్తిగా ఎరిగిన వాడై వ్యాసుని యొక్క వచనమును అంతను స్మరించెను.

॥44. ధర్మరాజు పరస్పరము ద్రౌపదివలన విరోధము సంభవించునని భయముచే ద్రౌపది తమ కందరికిని భార్యయగు గాక యని పలికెను.

45. తరువాత వీరివద్దకు శ్రీకృష్ణుడు, బలరామునితో గూడ వచ్చి నేను శ్రీకృష్ణుడను, నమస్కరించు చున్నానని చెప్పుచు ధర్మ రాజునకు నమస్కరించెను. తరువాత మేనత్త యగు కుంతికిని నమస్కరించెను.

46. సోదరులతో గూడిన ధర్మరాజువారిని కుశలప్రశ్నలడుగ ధర్మరాజు అనుజ్ఞ పొందినవాడై బలదేవునితో గూడి శీఘ్రముగా వెళ్ళి పోయెను.

---

॥వ్యా ॥ భేదభయం = ఎవనికి ద్రౌపది భార్య యగునో వానికి ఇతరులు నలుగురు శత్రువులగుదురు. అనునదే భేదభయము. అందుకనే సంస్కృత మనస్సు కలవారియొక్క ఆత్మతుష్టి ప్రమాణమగుట సిద్ధించి నది. కావుననే తద్ధర్మశుద్ధయే అనగా ఆత్మతుష్టి ధర్మము శుద్ధమైనదని చెప్పుటకు హేతువు అని మీమాంసావచనము కలదు. తంత్ర వార్తికము నందు కూడ సత్వసిద్ధాంతమున ముంగిస ఏ ఓషధిని దంతములతో గ్రహించునో ఆ ఓషధి అన్ని విషములను పోగొట్టునదగును, అని చెప్పబడినది,

ధృష్టద్యుమ్నో రాజపుత్రస్తు సర్వం
వృత్తం తేషాం కథయామాస పిత్రే।
నిస్సంశయం క్షత్రియపుంగవాస్తే
యథా హి యుద్ధం కథయంతి రాత్రౌ॥ 47

తత ఆహూయ పాంచాలో ధర్మజం త్విద మబ్రవీత్।
కథం జానీమ భవతః క్షత్రియాన్ బ్రాహ్మణా నుత। 48

యుధిష్ఠిర ఉవాచ॥

వయం హి క్షత్రియా రాజన్ పాండుపుత్రా మహాత్మనః।
జ్యేష్ఠం మాం విద్ధి కౌంతేయం భీమసేనార్జునా విమౌ॥
యమౌ చ తత్ర కుంతీ చ యత్ర కృష్ణా వ్యవస్థితా
సర్వేషాం ధర్మతః కృష్ణా మహిషీ నో భవిష్యతి॥ 49-50

తచ్ఛ్రుత్వా ద్రుపదో హార్షా త్కుంతీ పుత్రస్య భాషితం।
విగర్హయామాస తదా ధృతరాష్ట్రం నరేశ్వరం॥ 51

ద్రుపద ఉవాచ॥

నైకస్యాం బహవో లోకే శ్రూయంతే పతయః క్వచిత్।
లోకవేదవిరుద్ధం త్వం నాధర్మం ధర్మవి చ్ఛుచిః॥ 52

యుధిష్ఠిర ఉవాచ॥

సూక్ష్మో ధర్మో మహారాజ నాఽస్య విద్మో వయం గతిం।

47. రాజపుత్రుడగు ధృష్టద్యుమ్నుడు పాండవుల సర్వవృత్తాంతమును తండ్రికి చెప్పెను వీరు రాత్రియందు యుద్ధవార్తలను చెప్పుకొను చున్నారు. కాన నిస్సందేహముగ వీరు క్షత్రియపుంగవులే అని చెప్పెను.

48. తరువాత ద్రుపదమహారాజు వారిని పిలిపించి "మీరు క్షత్రియులా? లేక బ్రాహ్మణులా ? నేను ఎట్లు ఎరుగగలను ?" అని ధర్మ రాజుతో పలికెను.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

49. 50. ఓ రాజా ! మేము క్షత్రియులము. పాండుపుత్రులము. నన్ను పెద్దవాడనగు ధర్మరాజుగను, వీరిద్దరిని భీమార్జునులుగను. వారలను నకులసహదేవులుగా నెరుంగుము. ఆ ద్రౌపదితో నున్న ఆమెను మా తల్లియగు కుంతిగా నెరుంగుము. మాకందరకును ధర్మము ననుసరించి ఈ ద్రౌపది భార్య కాగలదు.

51. ద్రుపదుడు ఆ వాక్యమును విని మిక్కిలి సంతోషించెను. ధృత రాష్ట్రుని నిందించెను.

ద్రుపదుడు చెప్పుచున్నాడు.

52. ఒక స్త్రీకి అనేకమంది భర్తలు ఉండుట లోకములో నెచ్చటను వినము. లోకవేదములకు విరుద్ధమైన ఈ అధర్మమును ధర్మ వేత్తవగు నీవాచరింపదగదు.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

53. 54. ఓ రాజా ! ఇది సూక్ష్మధర్మము. దీని విషయము మనము ఎరు

శ్రూయతే హి పురాణేఽపి జటిలా నామ గౌతమీ।
ఋషీ నధ్యాసితవతీ సప్త ధర్మభృతాం వరా॥ 53-54

తథైవ మునిజా వార్క్షీ తపోభి ర్భావితాత్మనః।
*సంగతా భూ ద్దశ భ్రాతౄ నేకనామ్నః ప్రచేతసః॥ 55

గురూణాంచైవ సర్వేషాం మాతా పరమకో గురుః।
సా చాప్యుక్తవతీ వాచం భైక్షవ ద్గృహ్యతా మితి॥ 56

ఇతి శ్రీ మహాభారత సారోద్ధారే ఆది పర్వణి
త్రయోదశోఽధ్యాయః సమాప్తః॥

---

*వ్యా॥ ధర్మరాజం ప్రతి వేమనాఖ్యైః ప॥ పేరు ధర్మ రాజు పెనువేపవిత్తయా విశ్వా॥ ఇత్యాక్షిప్త ఇతి ప్రలపంతి॥ తన్న॥ స ఏవ ప॥ ధర్మమరసి పూని ధర్మరాజాదులు నిర్మలంపు కీర్తి నిలుపుకొనిరి. ధర్మమే నృపులకు తారక యోగంబు విశ్వా॥ ఇత్యుక్తత్వాత్। నింబ బీజా సర్వోపయోగీ న భవతీత్యర్థః॥

గము. పురాణమునందు గౌతమ గోత్రమునందు పుట్టిన జటిల యను నామె 7 గురు ఋషులను వివాహమాడెనని పురాణమునందు కలదు కదా ।

*55. అష్ట మని కన్యకయగు వార్తి గొప్ప తపోబలసంపన్నులగు ప్రచేతస్సులను ఒకే పేరుగల 10మంది భర్తలను వివాహమాడెనని తెలియుచున్నది.

56. మరియు గురువులందరిలో తల్లి మిక్కిలి పూజ్యురాలు గదా ? ఈ భిక్షను అందరు అనుభవించుమని ఆమె చెప్పినది.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వమందు
పదమూడవ అధ్యాయము సమాప్తము.

---

*వ్యా॥ ధర్మరాజును గూర్చి వేమనయోగి ప॥ పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా" అని ఆక్షేపించెను, అని కొంతమంది ధర్మరాజు అధర్మపరుడని పలుకుచున్నారు. అది తగదు, ఏలనన ఆ వేమన యోగియే " ధర్మమరసి పూని ధర్మరాజాదులు నిర్మలంపు కీర్తి నిలుప కొనిరి. ధర్మమే నృపులకు తారకయోగంబు విశ్వ ॥ అని నుడివెను కదా. పెనువేప విత్తయా అనుట వేపగింజ అ వరికిని ఉపయోగించదు కాన ధర్మాత్ముడగు ధర్మరాజు కూడ దుర్యోధనాది దుష్టులకు హితుడు కాక పోయెననియే వేమనయోగి తాత్పర్యము. కాన ధర్మరాజు దుష్టు డని భావము కాదు.

# చతుర్దశోధ్యాయః

అథ ద్వైపాయనో రాజన్నభ్యాగచ్ఛద్యదృచ్ఛయా।
ప్రత్యుత్థాయ మహాత్మానం కృష్ణం సర్వేఽభ్యవాదయన్॥ 1

ద్రుపదః॥

కథ మేకా బహూనాం స్యాద్ధర్మపత్నీ న సంకరః।
ఏతన్మే భగవాన్ సర్వం ప్రబ్రవీతు యథాతథం॥ 2

తత ఏకాంత మాశ్రిత్య ద్రుపదం ముని రబ్రవీత్ ।
బ్రహ్మహత్యావృతశ్శక్రో స్వశక్తిం దత్తవాన్ పురా।
ధర్మం వాయుం చాశ్వినౌచ స్వయం చైకం నివేశితః॥ 3

శివాజ్ఞయా చ తే సర్వే స్వాంతస్థం చేంద్రతేజసం।
కుంత్యాం నివేశితాః పూర్వ మాహూతా మంత్రవిద్యయా॥ 4

*ఇహైవ తే పాండవా వీర్యవంత
శ్శక్రస్యాంశః పాండవ స్సవ్యసాచీ ।
ఏవ మేతే పాండవా సంబభూవు
ర్యే తే రాజన్ పూర్వమింద్రా బభూవుః ॥ 5

---

*హ్య॥ మార్కండేయ పురాణేపి శ్లో॥ బ్రహ్మహత్యా
భిభూతస్య పరా హాని రజా కుత। యదింద్రదేహజం తేజ

# 14 వ అధ్యాయము

1. తరువాత దైవయోగముచే కృష్ణద్వైపాయనమహర్షి అచ్చటికి వచ్చెను, అచ్చటనున్న మహాత్ములగు వారందరు వానికి నమస్కరించిరి.

ద్రుపదుడు అడుగుచున్నాడు.

2. ఓ అనఘా ! ఒక స్త్రీ అనేకమందికి ధర్మపత్ని ఎట్లు కాగలదు ? సాంకర్యము ఎట్లు లేకుండును ? ఈ విషయమున ఉన్నది ఉన్నట్లు మీరు చెప్పగోరుచున్నాను.

3. తరువాత ఏకాంతమును పొంది ద్రుపదునితో ముని ఇట్లు పలికెను, పూర్వము దేవేంద్రుడు బ్రహ్మహత్యా దోషముతో కూడినవాడై తన శక్తిని యమధర్మరాజునకును, వాయుదేవునకును, అశ్వినీ దేవతలకు పంచి ఒక భాగమును తన యందును ఉంచుకొనెను.

4. శివాజ్ఞచే ఆ దేవతలందరు తమయందున్న ఇంద్ర తేజస్సును కుంతిచే ఆహ్వానింపబడినవారై కుంతియందుంచిరి.

5. వీర్యవంతులగు పాండవులందరు ఇక్కడనే ఉన్నారు. అర్జునుడు స్వయముగా ఇంద్రాంశచే పుట్టినవాడు. అట్లే మిగత నలుగురు పాండవులును ఇంద్రాంశముచే పుట్టినవారే. కావున 5 గురును ఇంద్రస్వరూపులు.

---

వ్యా॥ మార్కండేయ పురాణమునందును శ్లో॥ దేవేంద్రునకు బ్రహ్మహత్యచే ఆవరింపబడుటచే గొప్ప హాని కలిగెను. ఆ ఇంద్రుడు తనదేహమునుండి తేజస్సును స్వయముగా విడిచి పెట్టెను. కుంతియందు

లక్ష్మీశ్చైషాం పూర్వమేవోపదిష్టా
భార్యా య్యైషా ద్రౌపదీ దివ్యరూపాన్,
చక్షుర్దివ్యం ప్రదదౌ తాంశ్చ సర్వాన్
రాజాఽపశ్యత్పూర్వదేహై రుపేతాన్ ॥ 6

---

స్స్వయమ్ముమోచ స్వయం వృషః। కుంత్యాం జాతో మహా తేజా స్తతో జాతో యుధిష్ఠిరః। బలం ముమోచ పవన స్తత్ర భీమో వ్యజాయత। శక్రస్య వీర్యాత్సైవ జజ్ఞే పార్థో ధనంజయః।ఉత్పన్నౌ యమజౌ మాద్ర్యాం శక్రరూపౌ మహా ద్యుతీ। పంచానాం మహిషీ చైషాఽభూ దింద్రాంశావతారాం। శక్రస్యైకస్య సా పత్నీ కృష్ణా నాన్యస్య కస్యచిత్। యోగీశ్వరా శ్శరీరాణి కుర్వంతి బహులాన్యపి। పంచానా మేకపత్నీత్వ మిత్యేవం కథితం తవ॥ ఇతి॥

మహాభారతేపి స్వర్గారోహణ పర్వణి 4 వ అధ్యాయే యుధిష్ఠిరంప్రతి ధర్మదేవతావచనం। శ్లో॥ శ్రీరేషా ద్రౌపదీరూపా త్వదర్థం మానుషం గతా। అయోనిజా లోక కాంతా పుణ్యగంధా యుధిష్ఠిర। పంచానాం పాండవార్థం హి నిర్మితా శూలపాణినా। ద్రుపదస్య కులే జాతా భవద్భి శ్చోపజీవితా॥ ఇతి॥

తదనుపదమేవ మహాభారతే 5 అధ్యాయే- ద్వాపరం శకునిః ప్రాప ధృష్టద్యుమ్నస్తు పావకం। ధర్మ ఏవాభవ ద్రాజా భీమో వాయు స్తథా ర్జునః। ఇంద్రం యమజౌ చాశ్వినం చ మాం ప్రాప్తా ద్రౌపదీ తదా॥ ఇత్యాదినా ప్రతిపాదితం॥

6. స్వర్గరాజ్యలక్ష్మి పూర్వమే ఆదేశింపబడి వీరలకు భార్యగా ద్రౌపదిగా ఆవిర్భవించినది. తరువాత వ్యాసుడు ద్రుపదునకు దివ్యదృష్టి నొసంగెను, ఆ పాండవుల 5 గురిని అతడు వారి పూర్వరూపమగు ఇంద్రరూపములో చూచెను.

---

ఆ ఇంద్ర తేజస్సుతో ధర్మరాజు పుట్టెను, వాయుదేవుడు బలమును విడిచిపెట్టెను, దాని వలన భీముడు పుట్టెను. దేవేంద్రుని వీర్యముతోనే అర్జునుడు పుట్టెను. నకులసహదేవులు మాద్రియందు దేవేంద్రరూపముతో పుట్టిరి. ఈ విధముగా ఇంద్రాంశతో బుట్టిన వీరైదుగురికి దేవేంద్ర పత్నియే ద్రౌపదిగా పుట్టినది. యోగీశ్వరులు ఆత్మభేదము లేకపోయినను అనేక శరీరములను కల్పించుకొనుచున్నారు. కావున 5 గురికి ద్రౌపది భార్యయగుట దోషము లేదు. అని మహాభారతమునందును స్వర్గారోహణ పర్వమందు 4 వ అధ్యాయమున యుధిష్ఠిరుని గూర్చి ధర్మదేవత యొక్క వాక్యము ఇట్లు గలదు. శ్లో॥ స్వర్గలక్ష్మి ద్రౌపదిరూపముతో మీ కొరకు మనుష్యత్వమును పొందినది. అయోనిజయు, త్రిలోకసుందరియు పుణ్యగంధయు కలిగిన ఈ ద్రౌపది ఈశ్వరునిచే మీ 5 గురి కొరకును నిర్మింపబడినది. ద్రుపదుని వంశమునందు పుట్టిన ఈమె మీచే సంరక్షింపబడినది అని కలదు.

దాని తరువాత 5 వ అధ్యాయమున శ్లో॥ శకుని చనిపోయి ద్వాపరునిలో లీనమాయెను. ధృష్టద్యుమ్నుడు అగ్నిని పొందెను. ధర్మరాజు యమధర్మరాజే ఆయెను. భీముడు వాయువును అర్జునుడు ఇంద్రుని నకులసహదేవులు అశ్వినీదేవతలను ద్రౌపది నన్ను పొందిరి. అని చెప్పబడినది.

తతో దివ్యాన్ హేమకిరీటమాలినః
శక్రప్రఖ్యాన్ పావకాదిత్యవర్ణాన్।
స తద్దృష్ట్వా మహదాశ్చర్యరూపం
జగ్రాహ పాదౌ సత్యవత్యాస్సుతస్య॥ 7

వ్యాస ఉవాచ॥
ఏషా నాళాయనీ పూర్వం మౌద్గల్యం స్థవిరం పతిం।
ఆరాధయామాస తదా కుష్ఠినం త మనిందితా॥ 8

తతః కదాచి దంగుష్ఠో భుంజానస్య విశీర్యత।
అన్నాదుద్ధృత్య తచ్చాన్న ముపభుంక్తే ఽవిశంకితా॥ 9

తేన తస్యాః ప్రసన్నేన కామవ్యాహారిణా తదా।
వరం వృణీ ష్వేత్యసకృ దుక్తా వవ్రే వరం తదా॥ 10

పంచధా మాం విశుద్ధాత్మన్ భగవన్ లోక విశ్రుత।
రమయ త్వ మచింత్యాత్మన్ పునశ్చ జననే తథా॥ 11

తాం తథేత్యబ్రవీ ద్ధీమాన్ స మహర్షి ర్మహాతపాః।
ఆత్మానం పంచధా కృత్వా రమయామాస సర్వదా॥ 12

ఏకపత్నీ పురా భూత్వా స్వర్గే వై సైషా తపస్వినీ।
అరుంధతీవ సీతేవ బభూవాను పతివ్రతా॥ 13

7. తరువాత బంగారు కిరీటములను మాలికలను ధరించినట్టియు, దేవేంద్రునితో సమానమైనట్టియు, సూర్యునివంటి, అగ్నివంటి వర్ణము కలిగినదివ్యమగు రూపములను ధరించిన ఆ పాండవులను ద్రుపదుడు చూచెను, మిక్కిలి ఆశ్చర్యమును పొంది వ్యాసుని పాదములను పట్టుకొనెను.

వ్యాసుడు చెప్పుచున్నాడు,

8. ఈ ద్రౌపది పూర్వజన్మయందు నాళాయనియను పేరుగలది. ఈమె వృద్ధుడును, కుష్ఠురోగియగు మౌద్గల్యుడను భర్తకు మిక్కిలి సేవ చేసినది.

9. ఒకానొకప్పుడు భుజించుచున్న ఆతని బొటనవ్రేలు ఊడి అన్నములో పడిపోయెను. పతివ్రతయగు నామె శంక లేకుండగా ఆ వ్రేలును అన్నమునుండి తీసివేసి ఆ అన్నమునే భుజించెను.

10. అది చూచి ప్రసన్నుడగు భర్తచే వరమును కోరుమా ! అని పోరబడినదై ఆతనిని వరము కోరెను.

11. ఓ భగవంతుడా ! మరుసటి జన్మమున నీవు 5 రూపములతో లోకమున ప్రఖ్యాతి పొందునట్లుగ నాతో క్రీడించి నన్ను తృప్తి నందించుము.

12. ఆతడు అలాగేనని పలికి మహాతపశ్శాలి యగుటచే తనను ఐదు రూపములుగా చేసి ఎల్లప్పుడూ ఆమెతో క్రీడించెను.

13. ఈమె పూర్వజన్మయందు ఎల్లప్పుడునూ ఏకపత్నివ్రతము గల తపోనిష్ఠురాలు, ఈమె అరుంధతి వలెను, సీతవలెను గొప్ప పతివ్రత ఆయెను.

ఇంద్రసేనేతి విఖ్యాతా సైషా నాళాయనీ పురా॥ 14

మౌద్గల్యః ॥

భవిష్యతి నృలోకే త్వం రాజపుత్రి యశస్విని।
పాంచాలరాజస్య సుతా ద్రుపదస్య మహాత్మనః॥ 15

భవితారస్తు తే తత్ర పతయః పంచ విశ్రుతాః।
తైస్సార్ధం మధురాకారైశ్చిరం రతి మవాప్స్యసి॥ 16

అహమేవేంద్రరూపేణ పంచధా సంభవామ్యహం।
ఇత్యుక్త్వా చేంద్రసాయుజ్యమాప్తవాన్ సాఽభవత్పునః॥ 17

తీవ్రేణ తపసా తస్యాస్తుష్టః పశుపతి స్స్వయం।
వరం ప్రాదాత్తతో రుద్ర స్సర్వలోకేశ్వరః ప్రభుః॥ 18

పంచకృత్వ స్త్వయా ప్యుక్తః పతిం దేహీత్యహం పునః।
పంచ తే పతయో భద్రే భవిష్యంతి సుఖావహాః॥ 19

నాళాయన్యువాచ॥

ఏకోహి భర్తా నారీణాం కౌమార ఇతి లౌకికః।
ఆపత్సు చ నియోగే చ సంతానార్థేఽపర స్స్మృతః॥ 20

గచ్ఛేత్తృతీయం యా నారీ తస్యా నిష్కృతి రుచ్యతే।
చతుర్థే పతితా ధర్మాత్పంచమే బంధకీ భవేత్॥ 21

14. పూర్వమందు నాళాయనీ అను పేరు గలిగిన ఈమె తరువాత ఇంద్ర సేనయను పేరుతో ప్రసిద్ధి నొందినది.

మౌద్గల్యమహర్షి చెప్పుచున్నాడు.

15. నీవు భూలోకములో కీర్తిగల రాజపుత్రికవై జన్మించగలవు. మహాత్ముడును పాంచాలరాజగు ద్రుపదునకు పుత్రికగా పుట్టగలవు

16. అప్పుడు నీకు మహావీరులగు 5 గురు భర్తలు కాగలరు, సుందరు లగు వారితో చిరకాలము రతిని పొందగలవు.

17. నేనే ఇంద్రరూపముతో 5 విధములుగా పుట్టగలను అని పలికి ఇంద్రసాయుజ్యమును పొందెను.

18. ఆమెయు మరల గొప్ప తపస్సు చేసెను. ఆమె తపస్సుకు సంతో షించి ఈశ్వరుడు ప్రత్యక్షమై ఆమెకు వరము విచ్చెను.

19. ఓ అమ్మాయీ ! భర్తను ఇమ్ము అని 5 పర్యాయములు నీవు పలికి తివి. కావున నీకు అనుకూలురగు 5 గురు భర్తలు కలుగగలరు.

నాళాయని చెప్పుచున్నది.

20. స్త్రీలకు ఒకే భర్త యనెడి లోక మర్యాద కలదు. ఆపత్సమయ ముల యందును, నియోగవిధి యందును, సంతానము కొరకు మరియొకడు గూడ స్మృతి యందు చెప్పబడినాడు.

21. ఒకే స్త్రీ 3 వ వానిని భర్తగా పొందుచో ఆమెకు పాపము చెప్ప బడినది. 4 వ వానిచే పతితురాలగును. 5 వ వానిచే బంధకి యని పించుకొనును.

ఏవం గతే ధర్మపథే న వృణే బహుపుంస్కతాం ॥ 22

రుద్ర ఉవాచ॥

సకృదుక్తం త్వయా నైతన్నాధర్మస్తే భవిష్యతి।
పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి॥ 23

ద్వాపరే యుగమధ్యే తు సోమవంశో భవిష్యతి॥
పుత్రీ భవ భవాని త్వం రాజ్ఞో వై ద్రుపదస్య చ॥ 24

కృతే యుగే వేదవతీ కుశధ్వజసుతా శుభా।
త్రేతాయాం రామపత్నీ చ సీతేతి జనకాత్మజా।
తచ్ఛాయా ద్రౌపదీ దేవీ ద్వాపరే ద్రుపదాత్మజా॥ 25

శంఖం చక్రం గదా పద్మం ఖడ్గం నారాయణస్య చ।
ధర్మో భీమశ్చార్జునశ్చ నకులశ్చ సహానుజః।
అంశజా ఇతి జానీహి సాక్షాన్నారాయణస్య వై॥ 26

ద్రుపద ఉవాచ॥

యది చైవం విహితశ్శంకరేణ
ధర్మోఽధర్మోవా నాత్ర మమాపరాధః।
గృహ్ణాత్విమే విధివత్పాణి మస్యాః
యథోపజోషం విహితైషాం హి కృష్ణా॥ 2

22. ధర్మమార్గము ఇట్లుండగా అనేకమంది భర్తలను నేను కోరను. అని పలికెను.

రుద్రుడు చెప్పుచున్నాడు.

23. ఓ అమ్మాయీ! నాకు భర్తనొసంగమని నీవు ఒక్కమారు అనక పోతివి. కావున 5 గురను పొందియు నీకు ధర్మలోపము కలుగదు. నీవు కన్యవు పతివ్రతవు. కాగలవు.

24. ద్వావరయుగ మధ్యమున చంద్రవంశము ఉండగలదు. అందు నీవు ద్రుపదుని పుత్రిక కాగలవు.

25. కృతయుగమునందు ఆమెయే కుశధ్వజుని కుమార్తెయగు వేదవతియు. త్రేతాయుగమున రామపత్నియగు సీతయు, వారి ప్రతిబింబమే ద్వాపరయుగమున ద్రుపదాత్మజ యగు ద్రౌపది ఆయెను.

26. నారాయణుని ఆయుధములగు శంఖము చక్రము, గద. పద్మము ఖడ్గములే ధర్మ. భీమార్జున, నకుల. సహదేవులుగా పుట్టిరి, కావున ఈ పాండవులు నారాయణుని అంశల వలన పుట్టినవారని తెలుసుకొనుము.

ద్రుపదుడు చెప్పుచున్నాడు.

27. ఈ విధముగా శంకరునిచే విధింపబడినచో ధర్మముగాని, అధర్మముగాని, ఏమైనను నా దోషము లేదు. వీరలు విధ్యుక్తముగా వారిష్టము వచ్చినట్లు ఈమెను వివాహమాడుదురు గాక. ఈ ద్రౌపది వీరలకు ఇవ్వబడినది.

కతతోఽబ్రవీ ద్భగవాన్ ధర్మరాజ
మద్యైవ పుణ్యాహ ముత వః పాండవేయాః।
అద్య పౌష్యం యోగ ముపైతి చంద్రమాః
పాణిం కృష్ణాయా స్త్వం గృహాణాద్య పూర్వం॥ 28

తతో రాజా యజ్ఞసేనశ్చ పుత్రో
జన్యార్థముక్తం బహు తత్తదగ్ర్యం।
సమానయామాస సుతాం చ కృష్ణా
మాప్లావ్య రత్నై ర్బహుభి ర్విభూష్య॥ 29

తతస్తు సర్వే సుహృదో నృపస్య
సమాజగ్ము స్సహితా మంత్రిణశ్చ।
ద్రష్టుం వివాహం పరమప్రతీతా
ద్విజాశ్చ పౌరాశ్చ యథా ప్రధానాః॥ 30

♦ఋషిసంఘ సమాయుక్తో ధౌమ్య స్తత్రాగతః స్వయం। 31

కవ్యా॥ పౌష్యం - పుష్యాయ హితం- బహుసంతతి ప్రద మిత్యర్థః। అతః పుష్య శు॥ ౧౫ పుష్యమీనక్షత్రయుక్త శుభలగ్నే పాండవానాం పాణిగ్రహణమభూదిత్యర్థః।

♦వ్యా॥ తత ఇత్యత్ర పాండవానాం గోత్రం వైయాఘ్రపద్యం -వ్యాఘ్రపాద వైయాఘ్ర పద్య త్రికేతి-వ్యాఘ్ర పద్యంత్రయార్షేయం గోత్రం 1 శంతను 2 విచిత్రవీర్య 3 పాండు -4 ధర్మ భీమార్జున నకుల సహదేవాఖ్య పంచరూప ధారీ శ్రీపురందర నామధేయః వరః॥

*28. తరువాత వేదవ్యాసుడు ధర్మరాజుతో ఇట్లు పలికెను. ఇది పుణ్య దినము ఇప్పుడు చంద్రుడు పుష్యమీ నక్షత్రముతో కూడుకొని యున్నాడు. కావున ఇప్పుడే మొదట నీవు ఈ ద్రౌపదీపాణిగ్రహణమును చేయుము.

29. తరువాత ద్రుపదమహారాజు పుత్రునితో గూడిన వాడై శ్రేష్ఠమగు అనేక ఆభరణాదులచే ఆమెను అలంకరించి ముంచెత్తి వైచెను.

30. తరువాత బంధువులందరు. మిత్రులు, మంత్రులతో కూడి ఆ వివాహమును చూచుటకు విచ్చేసిరి. ప్రధానులగు బ్రాహ్మణులును. పౌరులును ఏతెంచిరి,

ч31. ఋషి సంఘములతో కూడి పాండవుల పురోహితుడగు ధౌమ్యుడును అచ్చటికి విచ్చేసెను.

---

*వ్యా॥ పౌష్యం = పుష్యాయ హితం. అనగా బహుసంతతిని ఇచ్చునదని అర్థము. కావున పుష్య శు॥ ౧౫ పుష్యమీ నక్షత్రముతో కూడుకొన్న శుభలగ్నమున పాండవులకు వివాహమాయెను.

чవ్యా॥ పాండవుల గోత్రము వైయాఘ్రపద్య గోత్రము, వ్యాఘ్రపాద, వైయాఘ్రపద్య, తండి అను ముగ్గురు ఋషులు గలిగినది, ఆ గోత్రము (1) శంతను (2) విచిత్రవీర్య (3) పాండు (4) ధర్మ భీమార్జున, నకుల సహదేవులను పేరుగల 5 రూపములను ధరించిన పురందర నామధేయుడు వరుడు.

తతస్తు తే కౌరవరాజపుత్రా
విభూషితాః కుండలినో యువానః ।
మహార్హవస్త్రాంబరచందనోక్షితాః
కృతాభిషేకాః కృతమంగళక్రియాః॥
పురోహితేనాగ్ని సమానవర్చసా
సహైవ ధౌమ్యేన యథావిధి ప్రభో।
క్రమేణ సర్వే వివిశు స్తత స్సదో
మహర్షభా గోష్ఠమి వాభినందినః॥ 32—33

తత స్సమాదాయ స వేదపారగో
జుహావ మంత్రైర్జ్వలితం హుతాశనం।
యుధిష్ఠిరం చాప్యుపనీయ మంత్రవి
న్నియోజయామాస సహైవ కృష్ణయా॥ 34

ప్రదక్షిణం తౌ ప్రగృహీతపాణీ ।
పరీణయామాస స వేదపారగః ॥ 35

---

అంగీరస భారద్వాజ్యాశ్వ మౌద్గల్య త్రయార్షేయ మౌద్గల్య సగోత్రస్య పూరువంశోద్భవస్య పాంచాల ప్రథమ రాజస్య మౌద్గలవర్మణః పుత్రస్య 1) దివోదాస వర్మణో నప్త్రీం 2) పృషత వర్మణః పౌత్రీం 3) ద్రుపద వర్మణః పుత్రీం 4) ద్రౌపదీ నామ్నీం కన్యాం। ఇతి।

32, 33 తరువాత మంగళ స్నానములు చేసి గొప్ప విలువగల వస్త్రము లను ధరించి చందనము అలది కుండలాద్యలంకారములచే న-లంకరింపబడిన ఆ పాండుపుత్రులు ధౌమ్యునితో గూడ యథా విధిగా క్రమముగా అందరూ ఆ సభను ప్రవేశించిరి.

34. తరువాత వేదవేత్తయగు ధౌమ్యుడు మంత్రములతో అగ్నిని జ్వలింపజేసి యుధిష్ఠిరుని తీసుకొని వచ్చి మంత్రయుక్తముగా ద్రౌపదితో పాణిగ్రహణము చేయించెను.

35. ఈ విధముగా పాణులు గ్రహించిన వారిద్దరు అగ్నిప్రదక్షిణము చేసిరి. వేదపారగుడగు ధౌమ్యుడు వారిద్దరికి వివాహము చేయించెను.

---

ఆంగిరస భార్మ్యాశ్వ. మౌద్గల్య అను ముగ్గురు ఋషులగల మౌద్గల సగోత్రుని యొక్క ను, పూరువంశమునందు పుట్టిన పాంచాల ప్రథమరాజగు మౌద్గలవర్మయొక్క పుత్రుడగు దివోదాసవర్మ యొక్క 1) నప్త్రియు. 2) పృషతవర్మయొక్క పౌత్రియు. 3) ద్రుపదవర్మ యొక్క పుత్రియు ద్రౌపది యను పేరుగల కన్యను అని సంకల్పము చెప్పవలెను.

తతోఽభ్యనుజ్ఞాయ తమాజిశోభినం।
పురోహితో రాజగృహాద్వినిర్యయౌ॥ 36

క్రమేణ చానేన నరాధిపాత్మజా
వరస్త్రియస్తే జగృహుస్తదా కరం।
అహన్యహన్యుత్తమరూపధారిణో
మహారథాః కౌరవవంశవర్ధనాః॥ 37

ఇదం చ తత్రాద్భుతరూప ముత్తమం
జగాద దేవర్షిరతీవ మానుషం।
మహానుభావాః కిల సాధుమధ్యమా
బభూవ కన్యైవ గతే గతేఽహని॥ 38

కృతే వివాహే ద్రుపదో ధనం దదౌ
మహారథేభ్యో బహురూప ముత్తమం।
శతం రథానాం వరవర్ణశోభినాం
చతుర్యుజాం హేమవిచిత్రమాలినాం॥ 39

కృతే వివాహే తు తతస్తు పాండవాః
ప్రభూతరత్నా ముపలభ్య తాం శ్రియం।
విజహ్రు రింద్రప్రతిమా మహాబలాః
పురేతు పాంచాల నృపస్య తస్యహ॥ 40

తతస్తు కృతదారేభ్యో పాండుభ్యః ప్రాహిణోద్ధరిః।
వైడూర్య వజ్రచిత్రాణి శతశో భాజనాని చ॥ 41

36. తరువాత ద్రుపదుని అనుజ్ఞ తీసుకొని పురోహితుడు రాజగృహము నుండి వెళ్ళిపోయెను.

37. ఒక్కొక్క రోజున ఒక్కొక్కరు చొ॥న క్రమముగా మంచి రూపమును ధరించి పాండువంశవర్ధనులును మహారథులగు మిగత వలుగురు పాండవులు ద్రౌపదీ పాణిగ్రహణ మొనర్చిరి.

38. దేవర్షియగు నారదుడు మిక్కిలి ఆశ్చర్యకరమైన ఈ విషయము లోకాతీతమైనదని ప్రశంసించెను. ఆ ద్రౌపదియు ప్రతిరోజును కన్యయే యగుచుండెను.

39. వివాహము కాగా ద్రుపదమహారాజు విశేషమగు ధనమును మిక్కిలి ప్రకాశించునట్టియు, నాలుగు గుఱ్ఱములతో కూడుకున్నట్టియు బంగారు మాలికలు గల నూరు రథములను కానుకగా ఇచ్చెను.

40. వివాహము కాగా పాండవులు విస్తారమైన రత్నములను, స్త్రీరత్నమును పొంది ఇంద్రునితో సమానముగ ఆ పాంచాలరాజు పట్టణమునందు దేవేంద్రుని వలె విహరించుచుండిరి.

41. తరువాత శ్రీకృష్ణుడు వివాహితులైన పాండవుల కొరకు వజ్ర వైడూర్యములతో కూడిన అనేక పళ్ళెములను కానుకగా పంపెను

*తత్రైవ సంస్థితా స్సర్వే వర్షం పాంచాలకే గృహే।
తేతత్ర ద్రౌపదీం లబ్ధ్వా పరి సంవత్సరోషితాః॥ 42

విదుర స్త్వథ తాం శ్రుత్వా ద్రౌపదీం పాండవై ర్వృతాం।
వ్రీడితాన్ ధార్తరాష్ట్రాంశ్చ భగ్నదర్పా నుపాగతాన్। 43

తతః ప్రీతమనాః క్షత్తా ధృతరాష్ట్రం విశాంపతే।
ఉవాచ దిష్ట్యా కురవో వర్ధంత ఇతి విస్మితః॥ 44

వైచిత్ర్యవీర్యస్తు నృపో నిశమ్య విదురస్య తత్॥
మన్యతే స వృతం జ్యేష్ఠం పుత్రం ద్రుపద కన్యయా॥ 45

అథ త్వాజ్ఞాపయామాస ద్రౌపద్యా భూషణం బహు।
ఆనీయతాం వై కృష్ణేతి పుత్రం దుర్యోధనం తథా॥ 46

అథాస్య పశ్చా ద్విదుర ఆచఖ్యౌ పాండవాన్ వృతాన్॥ 47

---

*వ్యా॥ అనేన వాక్యేన విరోధికృతు సంవత్సర పుష్య బహుళ 30 పర్యంతం పాంచాల నగరే పాండవాస్థితా ఇతి ద్యోత్యతే। ద్రౌపద్యా వివాహకాలే యుధిష్ఠిరస్య వయః సంవత్సరాణి 40-3-12 దినాని తతః పరి సంవత్సరసహితం ఆహత్య సం 41-4-18 తదా క్రీస్తోః పూర్వం ది 6-2-3089.

42. పాండవులు అచ్చటనే ద్రుపదుని గృహమునందున్నవారై ద్రౌపదిని పొంది ఒక సంవత్సరము నివసించిరి.

43. తరువాత విదురుడు పాండవులచే ద్రౌపది వరింపబడినదనియు, సిగ్గుపడినవారై దర్పము పోయి కౌరవులు తిరిగి వచ్చిరనియు, వినెను.

44. తరువాత విదురుడు సంతోషించినవాడై ఓ రాజా! పాండవులు వృద్ధిని పొందుచున్నారు. అని ధృతరాష్ట్రునితో ఆశ్చర్యముగ పలికెను.

45. ధృతరాష్ట్రుడు విదురుని ఆ వాక్యమును విని పెద్దవాడగు ధర్మ రాజు ద్రౌపదిచే వరింపబడెనని తలచెను.

46. తరువాత తన పుత్రుడగు దుర్యోధనుని ద్రౌపదికి అనేక భూషణ ములను కానుకగా నొసంగుచు, పాండుపుత్రులతో కూడ ద్రౌపది నిచ్చటకు తీసుకు రమ్ము అని ఆజ్ఞాపించెను.

47. తరువాత విదురుడు పాండవులందరు ఆమెచే వరింపబడిరను విష యము చెప్పెను

---

వ్యా॥ ఈ వాక్యముచే విరోధికృతు సంవత్సర పుష్యబహుళ ౩౦ వరకు పాండవులు పాంచాల నగరము నందుండిరని తెలియుచున్నది. ద్రౌపదీ వివాహకాలమునందు ధర్మరాజు వయస్సు 40 సం॥ 3 మా॥ 12 రోజులు. అచ్చట నివసించిన కాలము 1 - 1 - 6 రోజులు కలిపిన మొత్తము 41-4-18 రోజులు. అపుడు క్రీ. పూ. 6 -2 -3089.

ధృతరాష్ట్ర ఉవాచ॥

యథైవ పాండోః పుత్రాస్తు తథైవాభ్యధికా మమ॥ 48

విదుర ఉవాచ॥

నిత్యం భవతు తే బుద్ధి రేషా రాజన్ శతం సమాః।
సపుత్రాహి పురా కుంతీ దగ్ధా జతుగృహే శ్రుతా॥ 49

పునర్జాతానివ చ తాన్ తే మన్యంత నరాధిపాః।
ధిగకుర్వం స్తదా భీష్మం ధృతరాష్ట్రం చ కౌరవం॥ 50

తతః కదాచి ద్రాజాన స్సమాజగ్ము స్స్వయంవరే।
కళింగవిషయే రాజన్ రాజ్ఞః చిత్రాంగదస్య చ॥ 51

శ్రీమద్రాజపురం నామ నగరం తత్ర భారత।
రాజాన శ్శతశ స్తత్ర కన్యార్థం సముపాగమన్॥ 52

శ్రుత్వా దుర్యోధన స్తత్ర కర్ణేన సహితో యయౌ॥ 53

తత స్స్వయంవరే తస్మిన్ సంప్రవృత్తే మహోత్సవే
అత్యక్రామ ద్ధార్తరాష్ట్రం సా కన్యా వరవర్ణినీ॥ 54

స వీర్యమదమత్తత్వా ద్భీష్మ ద్రోణా వుపాశ్రితః।
రథ మారోప్య తాం కన్యామాజహార సుయోధనః॥ 55

దుర్యోధనస్తు కర్ణేన పాల్యమానోఽభ్యయా త్తదా। 56

ధృతరాష్ట్రుడు పలుకుచున్నాడు

48. పాండవులు ఎట్లు పాండురాజునకు ప్రియతములో అట్లే నాకును ప్రియతములు.

విదురుడు చెప్పుచున్నాడు.

49. ఓ రాజా ! ఎల్లప్పుడూ నీకీ సదభిప్రాయము వారియందు చిరకాలం ముందుగాక ! పూర్వము పుత్రులతో గూడిన కుంతి లక్కయింటి యందు మీచే తగులబెట్ట బడినదని వింటిమి కదా !

50. రాజులందరు పాండవులు మరల పుట్టినవారిని వలె తలచుచున్నారు, భీష్మని, విన్ని, వించించుచున్నారు,

51. తరువాత కొంతకాలమునకు కళింగదేశమున చిత్రాంగదుని యొక్క కుమార్తె స్వయంవరమునకు రాజులందరును వెళ్ళిరి.

52. చిత్రాంగదుని రాజధాని యగు రాజపురమను పట్టణమును అనేక వేలరాజులు కన్యార్థమై వచ్చిరి.

53. ఈ విషయమును దుర్యోధనుడు విని కర్ణునితో గూడి అచ్చటికి వెళ్ళెను.

54. తరువాత స్వయంవరము ప్రారంభము కాగా మిక్కిలి సౌందర్య వతి యగు ఆ కన్యక దుర్యోధనుని దాటి వెళ్ళిపోయెను.

55. భీష్మ ద్రోణుల నాశ్రయించుకొని వీర్యమదమత్తుడగు దుర్యోధ నుడు ఆ కన్యను రథమెక్కించుకొని ఎత్తుకొని వచ్చెను.

56. దుర్యోధనుడు కర్ణునిచే రక్షింపబడుచు ఇంటికి వచ్చెను.

నాగసాహ్వయ మానీయ కన్యాం భానుమతీం ముదా।
దుర్యోధనస్తు తాం కన్యాం వివాహ మకరో త్స్వయం॥ 57

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
చతుర్దశోఽధ్యాయః సమాప్తః॥

## పంచదశోధ్యాయః

తతో దుర్యోధనశ్చాపి రాధేయశ్చ విశాంపతే।
ధృతరాష్ట్ర ముపాగమ్య వచో బ్రూతా మిదం తదా॥ 1

వివిక్త మితి వక్ష్యావః కింత వేదం చికీర్షితం ।
అభిష్టాపిచ యత్ తత్తు స్సమీపే ద్విమతోవరః॥ 2

ధృతరాష్ట్ర ఉవాచ॥
అహామప్యేవ మేవైత చ్చికీర్షామి యథా యువాం।
వివేక్తుం నాహ మిచ్ఛామి త్వాకారం విదురం ప్రతి॥ 3

నావబుధ్యేత విదురో మమాభిప్రాయ మింగితైః॥ 4

దుర్యోధన ఉవాచ॥
అద్య తాన కుశలై ర్విప్రై స్సుగుప్తై రాప్తకారిభిః।
కుంతీపుత్రాన్ భేదయామో మాద్రీపుత్రౌ చ పాండవౌ॥ 5

57. హస్తినాపురమునకు తీసుకొనివచ్చి భానుమతి యను ఆ కన్యను వ్యయముగా వివాహ మాడెను.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున ఆదిపర్వయందు
పదునాలుగవ అధ్యాయము సమాప్తము.

# 15వ అధ్యాయము

1. తరువాత దుర్యోధనుడును. కర్ణుడును. ధృతరాష్ట్రుని కలిసుకొని ఇట్లు పలికిరి.

2. విజనముగా నున్నదని చెప్పుచున్నాము. ఇప్పుడు నీవు చేయదలచుకొన్న పని ఏమి ? నీవు విదురుని సమీపమున శత్రువులను ప్రశంసించు చున్నావు. నీ అభిప్రాయమేమి ?

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

3. మీరేది చేయదలచిరో నేనును అదియే చేయదలచి యున్నాను. విదురుని ఎదుట మన హృదయాభిప్రాయమును బహిర్గతము చేయనా కిష్టము లేదు.

4. నా చేష్టలచే నా అభిప్రాయమును విదురుడు ఎరుగకుండు గాకయని విదురుని ఎదుట అట్లు పలికితిని.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

5. ఇప్పుడు నేర్పరులును మనకు హితులును అగు విప్రులను రహస్యముగా పాండవుల వద్దకు పంపి వారిలో వారికి భేదమును కల్పింతుదము.

వ్యక్తాసయంతు వా కృష్ణాం బహుత్వా త్సుకరంహి తత్।
అజేయో హ్యర్జున స్సంఖ్యే పృష్ఠగోపే వృకోదరే॥ 6

కర్ణ ఉవాచ॥
దుర్యోధన తవ ప్రజ్ఞా న సమ్యగితి మే మతిః।
నహ్యుపాయేన తే శక్యాః పాండవాః కురువర్ధన॥ 7

న చ తే వ్యసనై ర్యోక్తుం శక్యా దిష్టకృతేన చ।
శంకితా శ్చేప్సవశ్చైవ పితృపైతామహం పదం॥ 8

ఏకస్యాం యే రతాః పత్న్యాం న భిద్యంతే పరస్పరం।
విక్రమేణ మహీం ప్రాప్తా భగ్నతేన మహాత్మనా॥ 9

ప్రమథ్య ద్రుపదం శీఘ్రు మానయామేహ పాండవాన్।
తా న్విక్రమేణ జిత్వేమా మఖిలాం భుంక్ష్వ మేదినీం॥ 10

తత ఆనాయ్య తా న్సర్వా న్మంత్రిణ స్సుమహాయశాః।
ధృతరాష్ట్రో మహారాజ మంత్రయామాస వై తదా॥ 11

భీష్మ ఉవాచ॥
ఏవం గతే విగ్రహం తై ర్నరోచే।
సంధాయ వీరై ర్దీయతా మర్ధభూమిః॥ 12

6. యుద్ధమున భీముడు సహాయముగా నుండగా అర్జునుడు జయింరానివాడు. గాన ద్రౌపదికిని వారికిని కలత లేర్పరచుదము. వారనేకులు ద్రౌపది ఒకతె యగుటచే అది సుకరమని నాకు తోచుచున్నది.

కర్ణుడు చెప్పుచున్నాడు.

7. దుర్యోధనా ! నీ ఆలోచనమంచిది గాదని నా అభిప్రాయము. పాండవులు భేదోపాయమునకు లొంగరు.

8. వారికి కష్టములు కలుగజేయుటయు దైవయోగముచే కుదరనిది. పితృపితామహ రాజ్యమును వారు కష్టములలో నుండియు మిక్కిలి కోరుచున్నారు.

9. ఒక స్త్రీ యందు వారాసక్తులై యుండుటచే ఎట్టి భేదోపాయమునకు లొంగరు. పరాక్రమముచే వారి రాజ్యమును వారు పొందగలరు.

10. కావున బలాత్కారముగా ద్రుపదుని ఓడించి పాండవులను ఇచ్చటికి తీసుకొని వచ్చి వారలను పరాక్రమముచే జయించి ఈ రాజ్యమునంతను అనుభవించుము.

11. ధృతరాష్ట్రుడు మంత్రులందరను రావించి వారితో నాలోచించెను.

భీష్ముడు చెప్పుచున్నాడు.

12. ఈ సమయమున వారితో విరోధము నేను ఇష్టపడను. వారితో సంధి చేసుకొని అర్ధరాజ్యము వారి కీయబడును గాక,

తేషా మపీహ ప్రపితామహానాం
రాజ్యం పితుశ్చైవ కురూత్తమానాం॥ 13

*సమధుర్యేణైవ రాజ్యస్య తేషా మర్ధం ప్రదీయతాం।
ఏతద్ధి పురుషవ్యాఘ్ర హితం సర్వజనస్యచ॥ 14

దిష్ట్యా ధ్రియంతే పార్థాహి దిష్ట్యా జీవతి సా పృథా।
పిత్ర్యంశ శ్చాస్య ఆదాతు మపివజ్రభృతా స్వయం॥ 15

తే సర్వేఽవస్థితా ధర్మే సర్వేచై వైకచేతసః।
క్షేమంచ యది కర్తవ్యం తేషా మర్ధం ప్రదీయతాం॥ 16

ద్రోణ ఉవాచ॥
మమాప్యేషా మతి స్తాత యా భీష్మస్య మహాత్మనః॥ 17

విదుర ఉవాచ॥
ఏతద్ధి పరమం శ్రేయో మన్యేహం తవ భారత॥ 18

---

*వ్యా॥ అత్రార్ధరాజ్యదానహేతుః। భీష్మద్రోణకృత రాష్ట్రవిదురాదీనాం స్వస్వదేశాదికం పూర్వమేవ పాండోః కాలే ఏవ దత్తం రాజ బంధుజీవనార్థం వా। పోషణీయత్వేన వా। కృపాచార్యాయ శంతను కాలే దత్తం। సర్వం చైవార్ధ రాజ్య ప్రాయం భవతి॥

13. వారికిని ఈ రాజ్యము పరంపరాగతమైనది. వారి తండ్రిదే గదా ఈ రాజ్యము.

14. మంచి మాటలతో వారికి అర్ధరాజ్యము ఇవ్వబడుగాక. ఇది అందరికిని హితమైనది.

15. దైవయోగముచే పాండవులు జీవించియున్నారు. అదృష్టముచే కుంతియు జీవించియున్నది. వారి తండ్రి రాజ్యము దేవేంద్రునకును హరించుటకు శక్యము కానిది.

16. వారందరును ధర్మమార్గమున నున్నారు. అందరును ఒకే అభిప్రాయము కలవారు. వారికిని. మీకును ప్రజలందరికిని క్షేమము చేయదలచినచో వారికి అర్ధరాజ్యము ఇవ్వబడుగాక.

ద్రోణుడు చెప్పుచున్నాడు.

17. మహాత్ముడగు భీష్ముని అభిప్రాయము ఏదియో అదియే నా అభిప్రాయము.

విదురుడు చెప్పుచున్నాడు.

18. ఓ ధృతరాష్ట్రా ! ఇది నీకు మిక్కిలి శ్రేయస్కరమైనదని నేను తలచుచున్నాను.

---

*వ్యా॥ ఇచ్చట అర్ధరాజ్య దానమునకు కారణమేమన పూర్వమే పాండురాజు కాలమున భీష్మ. ద్రోణ. ధృతరాష్ట్ర విదురాదులకు రాజబంధువులగు వీరు జీవించుటకొరకు గాని పోషణకొరకుగాని. వారి వారికి కొన్ని ప్రదేశము లివ్వబడినవి. కృపాచార్యునకు శంతనుని కాలముననే కొంతప్రదేశము ఇవ్వబడినది. అందరియు కలసి అర్ధరాజ్యముతో సమానము కాగలదని భావము.

ధృతరాష్ట్ర ఉవాచ॥

హితం చ పరమం వాక్యం త్వం చ సత్యం బ్రవీషి మాం।
పుత్రానాయ గచ్ఛైతాన్ సహమాత్రా సుసత్కృతాన్॥ 19

తతో జగామ విదురో ధృతరాష్ట్రస్య శాసనాత్। 20

ద్రుపదం పాండుపుత్రాణాం సన్నిధౌ కేశవస్య చ।
ప్రోవాచ చామితమతిః ప్రశ్రితం వినయాన్వితః॥ 21

తతస్తే సమనుజ్ఞాతా ద్రుపదేన మహాత్మనా।
పాండవాశ్చైవ కృష్ణశ్చ విదురశ్చ మహీపతే॥ 22

ఆదాయ ద్రౌపదీం కృష్ణాం కుంతీం చైవ యశస్వినీం।
సవిహారం సుఖం జగ్ముర్నగరం నాగసాహ్వయం॥ 23

*విశ్రాంతాస్తే మహాత్మానః కంచిత్కాలం మహాబలాః।
ధార్తరాష్ట్రైస్సహోషిత్వా పంచవర్షాణి భారత॥ 24

---

*వ్యా॥ విరోధికృత్ సం॥ర మాఘ శు ౨ మంగళ దివస మారభ్య పింగళ సం॥ర శ్రావణ శు ౨ ప[illegible] సం॥ 5-6-0 తత్రైవ ఉషిత్వా ఇంద్రప్రస్థం గతా ఇతి ద్యోత్యతే। తదా యుధిష్ఠిర వయః సం॥ 46-౨-29 క్రీ॥ పూ॥ 6-5-3059 ఇతి వ్యజ్యతే॥

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

19. మీరు హితమైనది సత్యమైనది నగు మంచి మాటను నాకు చెప్పిరి. ఓ విదురా! నీవు వెంటనే వెళ్ళి తల్లితో గూడ వారిని సగౌరవముగా తీసికొని రమ్ము.

20. అంతట విదురుడు ధృతరాష్ట్రుని ఆజ్ఞచే వారి వద్దకు వెళ్ళెను.

21. మిక్కిలి తెలివిగల విదురుడు వినయముతో కూడినవాడై పాండు పుత్రుల యొక్కయు, శ్రీకృష్ణుని యొక్కయు సన్నిధానమున ద్రుపదునితో సత్రమమగు వాక్యమును పలికెను.

22. తరువాత పాండవులును, కృష్ణుడును, విదురుడును ద్రుపదునివద్ద శలవు తీసికొనిరి.

23. వారు ద్రౌపదిని, కుంతిని తీసుకొని విలాసముగా సుఖముగా హస్తినా పురమునకు వెళ్ళిరి.

*24. హస్తినాపురమున విశ్రాంతి తీసుకొనుచున్నవారై 5 సం॥ములు మహాబలులగు పాండవులు కౌరవులతో కూడి యుండిరి.

---

*వ్యా॥ విరోధికృతు సంవత్సర మాఘ శు॥ విదియ మొ॥ పింగళ సంవత్సర శ్రావణ శు॥ విదియ వరకు 5 సం॥ 6 మా॥ అచ్చటనే ఉండి తరువాత ఇంద్రప్రస్థ పట్టణమునకు వెళ్ళిరని తెలియుచున్నది. అప్పుడు ధర్మరాజు వయస్సు 46–9–29 క్రీ. పూ. 6–5–3050 అని తోచు చున్నది.

♦ఏకైకశో వివాహాశ్చ సమభూ న్నృపకన్యకాః।
తథైవ ధృతరాష్ట్రస్య పుత్రాణాంహి పృథ క్పృథక్॥ 25

కళ్యాణాని బభూవాథ పత్తనే గజసాహ్వయే॥ 26

ధృతరాష్ట్ర ఉవాచ॥
భ్రాతృభి స్సహ కౌంతేయ నిబోధ గదతో మమ।
పునర్నో విగ్రహం మాభూత్ ఖాండవప్రస్థ మావిశ॥ 27

నచ వో వసత స్తత్ర కశ్చి చ్ఛక్తః ప్రబాధితుం।
అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశ॥ 28

---

♦వ్యా॥ తేషాం వివాహాదివిషయే తావత్ భారతే ఆది ప॥ 95॥ అ॥ ఏవం ప్రతిపాదితం। తథాహి॥ యుధిష్ఠిరస్తు గోవాసనస్య శైభ్యస్య దేవికాం నామకన్యాం స్వయంవరా ల్లేభే। తస్యాం పుత్రం జనయామాస ధౌరేయం నామ॥ భీమ సేనోఽపి కాశ్యాం బలంధరాం నామోపయేమే వీర్య శుల్కాం। తస్యాం పుత్రం సర్వగం నామోత్పాదయామాస। అర్జునః ఖలు నాగరాజకన్యా ములూపీ ముపయేమే। తథైవ మణిపురేఽపి చిత్రాంగదాం ద్వారకాయాం తు సుభద్రాం చేతి వక్ష్యతి॥ నకులస్తు చైద్యాం కరేణుమతీం భార్యా ముద వహాత్ తస్యాం నిరమిత్రం నామ పుత్ర మజనయత్। సహ దేవోఽపి మాద్రీమేవ స్వయంవరే విజయాం నామోపయేమే మద్రరాజస్య ద్యుతిమతో దుహితరం। తస్యాం పుత్ర మజ నయ త్సుహోత్రం నామేతి॥

425. ఒక్కొక్కనికి ఆ యా రాజకన్యలతో వివాహము లైనవి. అట్లే కౌరవులకును వేరు వేరుగా వివాహములు జరిగినవి.

26. ఈ విధముగా హస్తినాపురమున కురుకుమారు లందఱికిని వివాహము లైనవి.

ధృతరాష్ట్రుఁడు చెప్పుచున్నాడు.

27. ఓ ధర్మరాజా ! నీవు నీ సోదరులతో గూడి నేను చెప్పెడి వాక్యమును వినుము. మనకు మఱల విరోధము లేకుండుగాక. ఖాండవ ప్రస్థరాజ్యమును ప్రవేశించుము.

28. అక్కడ నివసించుచున్న మిమ్ము నెవరును బాధింపలేరు. అర్ధరాజ్యమును పొంది ఖాండవప్రస్థమును ప్రవేశించుము.

---

4వ్యా॥ వారి వివాహము విషయములో భారతము ఆదిపర్వ 95 అధ్యాయమున ఇట్లు చెప్పబడి యున్నది. ధర్మరాజు గోవాసుడగు శైబ్యుని యొక్క కుమార్తెయగు దేవికను స్వయంవరము వలన పొందెను. ధౌరేయుడను పేరుగల పుత్రుని ఆమెయందు కనెను. భీమసేనుడు కాశీయందు బలంధర అను పేరుగల కన్యను తన పరాక్రమమునకు కానుకగా పొంది సర్వగుడు అను పుత్రుని ఆమెయందు బడసెను. అర్జునుడు నాగరాజ కన్యయగు ఉలూపిని వివాహము చేసుకొనెను. అట్లే మణిపురమునందు చిత్రాంగదను, ద్వారకయందు సుభద్రను వివాహమాడెనని చెప్పబడును. నకులుడు చైద్యయగు కరేణుమతి అను నామెను వివాహమాడెను. ఆమెయందు నిరమిత్రుడను పుత్రుని పొందెను. సహదేవుడును మద్రరాజగు ద్యుతిమంతుని పుత్రికయగు విజయా అను నామెను స్వయంవరమునందు వివాహమాడెను. ఆమెయందు సుహోత్రుడను పుత్రుని పుట్టించెను.

*ప్రతిగృహ్యాచ తద్వాక్యం నృపం సర్వే ప్రణమ్య చ।
ప్రతస్థిరే తతో ఘోరం వనం త న్మనుజర్షభాః॥ 29

అర్థం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశన్॥ 30

తతః పుణ్యే శివే దేశే శాంతిం కృత్వా మహారథాః।
నగరం మాపయామాసుః ద్వైపాయనపురోగమాః॥ 31

సాగర ప్రతి రూపాభిః పరిఘాభి రలంకృతాం।
ప్రాకారేణచ సంఛన్నం దివ మావృత్య తిష్ఠతా॥ 32

ద్విపక్షగరుడప్రఖ్యైః ద్వారై స్సౌధై శ్చ శోభితం।
తత్త్రివిష్టపసంకాశ మింద్రప్రస్థం వ్యరోచత॥ 33

†శుక్లేచాశ్వయుజే మాసే దశమ్యాం వై యుధిష్ఠిరః॥
ఇంద్రప్రస్థే చాభిషిక్తో భ్రాతృభిః కృష్ణయా సహ॥ 34

---

*వ్యా॥ నీలకంఠీయా॥ ఘోరం వనమిత యూనో దేశః పాండవేభ్యో దత్త ఇతి జ్ఞాయతే॥ ఇంద్రప్రస్థం పాండవానం తరం పృథ్వీరాజేన పాలితః। తదిదానీం ఢిల్లీ ఇతి వ్యవహరంతి। క్రీస్తోః 1327 వర్షే ఢిల్లికా ఇత్యపి వ్యవహృతా। ఢిల్లీ నామ్నా — రాజ్యవిగహాంతపురాతనం ఖండపట్టణాని స్వరా జ్యోతన్నామ్నా భూపాః వ్యవహరంతీతి జ్ఞాయతే॥

†వ్యా॥ ఇత్యుక్తేన వాక్యేన పింగళ సంవత్సర ఆశ్వ

*29 ఆ వాక్యమును అంగీకరించి ధృతరాష్ట్రునకు అందరు నమస్కరించి భయంకరమైన వనమును గూర్చి వారు బయలుదేరిరి.

30. రాజ్యపు అర్ధ భాగముగా పాండవులు ఖాండవప్రస్థమును పొంది దానిని ప్రవేశించిరి.

31. తరువాత మంగళప్రదమగు ప్రదేశమున శాంతిని చేసి వ్యాసుని ముందుంచుకొని నగరమును స్థాపించిరి.

32. సముద్రముతో సమానమగు అగడ్తతో అలంకరింపబడినట్టియు, ఆకాశము నంటుచున్న ప్రాకారముచే చుట్టబడిన పట్టణమును నిర్మించిరి.

33. రెండు రెక్కలు గల గరుడునితో సమానమగు ద్వారములతోను, మేడలతోను, ప్రకాశించుచున్న స్వర్గముతో సమానముగా యింద్రప్రస్థపట్టణము ప్రకాశించుచుండెను.

*34 ఆశ్వయుజ శుద్ధ దశమి యందు యింద్రప్రస్థమునందు సోదరులతోను, ద్రౌపదితోను పట్టాభిషిక్తుడాయెను.

---

*వ్యా॥ నీలకంఠీయ వ్యాఖ్య, ఘోరం వనం = ఎడారిప్రదేశము పాండవులకు యివ్వబడినదని తెలియుచున్నది. యింద్రప్రస్థపట్టణము పాండవుల తరువాత పృధ్వీరాజుచే పరిపాలింపబడినది. దాని నిప్పుడు 'ఢిల్లి' అని వ్యవహరించుచున్నారు, క్రీ. శ. 1327 వ సం॥మున దానినే ఢిల్లికా అనియు వ్యవహారించిరి. ఢిల్లి అను పేరుతో రాజ్యము లేనటువంటి పురాతన శిధిలపట్టణములను యీ పేరుతోనే రాజులు వ్యవహరించుచుండిరని తెలియుచున్నది.

*వ్యా॥ ఈ వాక్యముచే పింగళ సం॥ర ఆశ్వయుజ శుక్ల దశమి

తాన్నివేశ్య తతో వీరో రామేణ సహ కేశవః।
యయౌ ద్వారవతీం రాజన్ పాండవానుమతే తదా॥ 35

ప్రాణాయమానమహిళా నథ పాండుపుత్రాన్।
త్రోణా విమా ననుజిఘృక్షు రుదారభూమా।
వీణాజసేన ఘటితోద్గమనీయకృత్యో
వీణానినాదరసికో ముని రావిరాసీత్॥ 36

వివిక్తే పాండవా న్సర్వా నువాచ భగవా న్ఋషిః॥ 37

పాంచాలీ భవతా మేకా ధర్మపత్నీ యశస్వినీ।
యథా వో నాత్ర భేదస్స్యా త్తథా నీతి ర్విధీయతాం॥ 38

సుందోపసుందౌ సహజా వభీకౌ
సురేష్వివ క్వాపి సురాంగనాయాం।
అన్యోన్య మాహత్య పురా యమస్య
మనోభవేషోరివ లక్ష్య మాస్తాం॥ 39

సమయం చక్రిరే శ్రుత్వా తేఽన్యోన్యం పంచ పాండవాః।
ఏకైకస్య భవే ద్భార్యా ద్రౌపదీ వత్సరం క్రమాత్॥ 40

---

యుజ శుక్ల దశమ్యాం యుధిష్ఠిరో ఇంద్రప్రస్థే పట్టాభిషిక్త ఇతి సిధ్యతి। తదా యుధిష్ఠిరస్య వయ స్సం 40 –0 –7 ది। క్రీ పూ॥ 28–2–3059॥

35. అచట వారలను ప్రవేశపెట్టి విరుదగు శ్రీకృష్ణుడు పాండవుల యనుజ్ఞ పొంది బలరామునితో ద్వారకకు వెళ్ళెను.

36. తరువాత గొప్ప తపశ్శాలియు, కృష్ణాజినము ధరించిన వాడును వీణను మీటుటయందు ఆసక్తి గలవాడును, భూమియందలి జీవులను అనుగ్రహించు నభిప్రాయము గల నారదమునీంద్రుడు ప్రాణముతో సమానమైన ద్రౌపదిగల పాండవులను గూరి వచ్చెను.

37. ఏకాంతప్రదేశమున పాండవు లందరిని గూర్చి నారదు డిట్లు పలికెను.

38. మీ కందరికిని యశోవతియగు ద్రౌపది యొక్కతెయే ధర్మపత్ని; మీకు యీ విషయమున విరోధము రాకుండగ ఒక్క కట్టుబాటు చేసుకొనుడు.

39. పూర్వము సుందోపసుందులను రాక్షసులు కలరు. ఒక దేవతా స్త్రీ విషయమై పరస్పరము కలహించుకొని మన్మథబాణమునకు లక్ష్యమైన వారివలె యమసదనమును పొందిరి.

40. నారదుని వాక్యమును విని యీ ద్రౌపది ఒక్కొక్కనికి ఒక్కొక్క వత్సరము భార్యయగు గాక అని కట్టుబాటు చేసుకొనిరి.

---

యందు యింద్రప్రస్థమున పట్టాభిషిక్తు డయ్యెనని తెలియుచున్నది. అప్పుడు ధర్మరాజు వయస్సు 47 సం॥ముల 7 రో॥ క్రీ. పూ. 28 — 2 — 3050.

ద్రౌపద్యా సహ్హాసీనా నన్యోన్యం యోఽభిదర్శయేత్।
స నో ద్వాదశ వర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్॥ 41

కృతేతు సమయే తస్మిన్ పాండవైర్ధర్మచారిభిః।
నారదోప్యగమ త్ప్రీత ఇష్టం దేశం మహామునిః॥ 42

విప్రః కశ్చన తత్ర జాత్వథ భుజా వృష్ట్వాఽ చోరైర్హృతా।
గావో మే సకిలా హతోఽస్మి విభినా వత్సోఽపి నో శిష్యతే
రాజ న్రాజ్యమిదం విముంచ వసుధాం శాస్మీతి సర్వా న్నృపా।
న్నిందా హాసయతీతి రోషకలుషో గ్వారం యయౌ భూపతేః 43

దృష్ట్వా తం మధురస్మితోఽథ విజయః కృత్వా సనా దుత్థితో
నత్వాంఘ్రిసమ చేత్య భృత్యమివ మాం బ్రహ్మన్నహాస్వతః।
గావస్తే స్వయ మాప్తి జేయు రధునేత్యాశ్వాస్య దస్యూన్పురః
ప్రాపత్ న్మనసా తతస్తు నృపతే శ్శస్త్రాయగేహం స్వయం 44

కృష్ణయా సహ తత్రాస్తే ధర్మరాజో యుధిష్ఠిరః।
అనుప్రవిశ్య రాజాన మాపృచ్ఛ్య చ విశాంపతే।
ధనురాదాయ సంహృష్టో చోరా న్నిర్జిత్య చార్జునః॥ 45

41. ద్రౌపదితో ఒకడు కలిసి యుండగా యితరుడు యెవడు చూచునో వాడు పన్నెండు సంవత్సరములు బ్రహ్మచారియై వనమునందు నివసించుగాక, అని కట్టుబాటు చేసుకొనిరి.

42. ఈ విధముగా పాండవులచే కట్టుబాటు చేయబడగా నారదుడు గూడ సంతోషించి తనకు యిష్టమగు దేశమును గూర్చి వెడలిపోయెను.

43. ఒకానొకప్పుడు ఒక బ్రాహ్మణుడు చేతులు ఎత్తి విలపించుచు "నా గోవులన్నియు దొంగలచే అపహరింపబడినవి, పూర్వజన్మ పాపముచే నేను కొట్టబడితిని. ఒక లేగదూడ కూడ మిగులలేదు, ఓ రాజా! ఈ రాజ్యమును విడిచిపెట్టుము. భూమిని పరిపాలింతువని చెప్పుచు ఇతరరాజులను ఎందుకు నవ్వింప జేయుదువు." అని కఠినముగా రోషముతో పలుకుచు ధర్మరాజు యొక్క ద్వారదేశమునకు వచ్చెను.

44. అర్జునుడు చిరునవ్వు కనవాఱ్చి వానిని చూచి సింహాసనమునుండి లేచి ఆ బ్రాహ్మణుని పాదములకు నమస్కరించి ఇదిగో భృత్యుడనగు నేనిక్కడ నున్నాను. ఒక క్షణము సహించుడు. మీ గోవులు న్యాయముగా ఇప్పుడే ఇంటికి వచ్చును. అని ఓదార్చి ముందుగా మనస్సుతో దొంగలను ప్రవేశించి తరువాత ధనుర్బాణముల కొఱకు ధర్మరాజగృహమును ప్రవేశించెను.

45. ధర్మరాజు అప్పుడు ద్రౌపదితో నుండెను. అర్జునుడు లోపల ప్రవేశించి ధర్మరాజును పలకరించి ధనుర్బాణములను తీసుకొని చోరులను జయించి సంతోషించెను.

తత స్తద్గోధనం పార్థో దత్వా తస్మై ద్విజాతయే।
సోఽభ్యనుజ్ఞాప్య రాజానం వనచర్యాయ దీక్షితః।
వనే ద్వాదశవర్షాణి వాసాయానుజగామహ॥ 46

స గంగాద్వార మాశ్రిత్య నివేశ మకరోత్ప్రభుః।
అభిషేకాయ కౌంతేయో గంగా మవతతారహ॥ 47

పశ్చాదుత్తీర్య హాది తత్రైషా మనుష్యం షణీనాం రత్నైః॥
సంతర్పయితు మారేభే కందర్పసమమర్జునం॥ 48

*అపకృష్టో మహాబాహు ర్నాగరాజస్య కన్యయా।
అంతర్జలే మహారాజ ఉల్యూప్యా కామ్యమానయా॥ 49

అర్జున ఉవాచ॥

।బహ్మచర్య మిదం భద్రే మమ ద్వాదశవార్షికం।
ధర్మరాజేన చాదిష్టం నాహం మస్మి స్వయంవశః॥ 50

ఉలూప్యువాచ॥

యధా తే బ్రహ్మచర్య మిదమాదిష్టవాన్ గురుః॥ 51

---

*వ్యా॥ నీలకంఠీయ వ్యా॥ నాగాః కాద్రవేయాః, నాగకాద్రవేయశబ్దా మానుషాకారేషు ఫణలాంగూలాది యుక్తేషు దేవయోనిషు భోగిషు వర్తతే॥ నాగలోక ఇతి సృత్రగుప్తభూవివరేష్వోకః ఇత్యర్థః॥

46. తరువాత గోధనమును ఆ బ్రాహ్మణునకు సమర్పించి ధర్మరాజు నను జ్ఞ వడసి వనవాసమునకు దీక్ష పొంది 12 సం॥లు వనములో తిరుగుటకు వెళ్ళిపోయెను.

47. అతడు గంగాద్వారమును ప్రవేశించెను. స్నానము చేయుటకై గంగలో దిగెను.

48. ఉలూపియను నాగకన్యక వీనిని చూచి మన్మధునితో సమానమైన సౌందర్యము గల ఈ అర్జునుని సర్వముల తతులతో తృప్తి నొందించుటకు అభిలషించెను.

*49 జలము లోపలనున్న నాగరాజు యొక్క కన్యకయగు ఉలూపిచే అర్జునుడు లాగబడెను.

అర్జునుడు చెప్పుచున్నాడు.

50. ఓ మంగళప్రదురాలా ! నాకు ఇప్పుడు 12 సం॥లు బ్రహ్మచర్య వ్రతము గలదు. ఈ విధముగా ధర్మరాజుచే నే నాదేశింపబడితిని. నేను నా వశమునందు లేను.

ఉలూపి చెప్పుచున్నది.

51. ఏ విధముగా ఎందుకు ధర్మరాజు నీకీ బ్రహ్మచర్య వ్రతమును ఆదేశించెనో నే నెరుగుదును.

---

*వ్యా॥ నాగాః = కాద్రవేయులు, నాగ, కాద్రవేయ శబ్దములు మనుష్యాకారము కలిగి నట్టియు, పడిగ, తోకతో కూడుకొని యున్న దేవయోని సర్పముల యందు వర్తించును. నాగలోక మనునది పాతాళమునందు ఒకానొక సర్పములు నివసించు భూప్రదేశము, అని అర్థము.

*పరస్పరం వర్తమానానాం ద్రుపదస్యాత్మజాం ప్రతి।
యో నోఽను ప్రవిశేన్మోహా త్స వై ద్వాదశవార్షికం॥ 52

స నాగభవనే రాత్రిం తాముషిత్వా ప్రతాపవాన్।
కథయిత్వా చ తత్సర్వం బ్రాహ్మణేభ్యశ్చ భారత।
అనుపూర్వేణ తీర్థాని దృష్టవాన్ కురుసత్తమః॥ 53

మణలూరు పురే సంపద్గుణై ర్గుణాలకాముదే।
జనదృష్టి కృతానందో జగామ కురుకుంజరః॥ 54

అభిగమ్య మహాబాహు రభ్యగచ్ఛ న్మహీపతిం।
మణిపూరేశ్వరం రాజన్ ధర్మజ్ఞం చిత్రవాహనం॥ 55

తస్య చిత్రాంగదా నామ దుహితా చారుదర్శనా।
తాం దదర్శ పురే తస్మి న్విచరంతీం యదృచ్ఛయా॥ 56

రాజోవాచ॥
ఏకాచ మమ కన్యేయం కులస్యోత్పాదినీ భృశం।
తస్మా దేక స్సుతో యోఽస్యాం జాయతే భారత త్వయా।

---

*వ్యా॥ నీలకంఠీయ వ్యా॥ యథా చ తేత్యాదినా స్వస్యాతీంద్రియజ్ఞానం దర్శయంతీ ద్రౌపదీ నిమిత్తమేవ తద్బ్రహ్మచర్యం నాన్యత్తేత్యాహ। అత ఏవాగ్రేఽపి చిత్రాంగదసుభద్రయోః పాణిగ్రహణం సంగచ్ఛతే ఇతి వేద్యం।

4 52. మీ అందరియందు ప్రవర్తించుచున్న ద్రౌపదిని గూర్చియే. మీలో ఎవడు మోహముచే ద్రౌపదీగృహమును ప్రవేశించునో వాడు ద్రౌపది విషయమై 12 సం॥లు బ్రహ్మచర్యవ్రతము పూనవలెను. అది నియమము.

53. అర్జునుడు ఆ రాత్రి నాగభవనమున ఉండెను. ఈ వృత్తాంతము నంతను బ్రాహ్మణులకు చెప్పి క్రమముగా తీర్థములనన్నింటిని సేవించెను.

54. కురు శ్రేష్ఠుడగు అర్జునుడు మణిపూరు పురమున జనులను చూచి ఆనందించినవాడై వెళ్ళెను.

55. అర్జునుడు మణిపురాధీశ్వరుడును ధర్మజ్ఞుడగు చిత్రవాహనుని వద్దకు వచ్చెను.

56. అతని కుమార్తెయును మిక్కిలి సౌందర్యవతి యగు చిత్రాంగద యను పేరుగల కన్యను అర్జునుడు చూచెను.

చిత్రవాహనుడు చెప్పుచున్నాడు.

57, 58. "కులాభివృద్ధి కొరకై నా కీ కుమార్తె ఒక్కతెయే కలదు నీచే ఒక కుమారుడు ఈమె యందు పుట్టింపబడు గాక, అదియే

---

4 వ్యా॥ దీనిచే తనకున్న అతీంద్రియజ్ఞానమును తెలుపుచున్నదై ద్రౌపదిని గురించియే ఆ బ్రహ్మచర్యవ్రతము. ఇతరస్త్రీవిషయమున ఆ నియమము లేదు. అని చెప్పినది. కనుకనే ముందుగూడ చిత్రాంగద యొక్కయు, సుభద్ర యొక్కయు పాణిగ్రహణము సంగతమగునని తెలుసుకొన వలసినది.

ఏత చ్ఛుల్కం భవత్వస్యాః కులకృజ్జాయతా మిహ।
ఏతేన సమయేనేమాం ప్రతిగృహ్ణీష్వ పాండవ॥ 57-58

స తథేతి ప్రతిజ్ఞాయ తాం కన్యాం ప్రతి గృహ్య చ॥ 59

దివసే శుభంయుగుణకోరకితే దయితం హృదిస్థిత మివార్తిమతీ
అవతార్య సా భువి నుమాగమదావథ బభ్రువాహన ఇతి ప్రథితం॥ 60

తస్యాం సుతే సముత్పన్నే పరిష్వజ్య వరాంగనాం।
ఆమంత్ర్య నృపతిం తం తు జగామ పరివర్తితుం॥ 61

గోకర్ణ మేత్య స కులాద్రిసుతాప్రియస్య
పుష్పాణి మూర్ధ్ని నిదధే పురుహూతసూనుః।
ఆగామినాం నిజశరాసన తాడనానా
మత్రావకాశ ఇతి సూచయతేవ దోష్ణా॥ 62

సముద్రే పశ్చిమే యాని తీర్థాన్యాయతనాని చ।
తాని సర్వాణి గత్వా స ప్రభాస ముపజగ్మివాన్॥ 63

ఇతి శ్రీ మహాభరత సారోద్ధారే ఆది పర్వణి
పంచదశోఽధ్యాయః సమాప్తః

ఈమెకు కల్గుము, ఆ పుత్రుడు నాకు వంశకరుడగు గాక. ఈ నియమముతో నీ వీమెను స్వీకరించుము.

59. అర్జునుడు అలాగేనని ప్రతిజ్ఞ చేసి ఆ కన్యను గ్రహించెను.

60. ఆ చిత్రాంగద గర్భమును ధరించినదై శుభలక్షణములతో గూడిన దినమున మిక్కిలి బరువు గలదై హృదయమునందున్న భర్తను వలె బభ్రువాహనుడను పేరు గల కుమారుని భూమి మీదకు అవతరింప చేసెను.

61. ఆమె యందు కుమారుడు పుట్టిన తరువాత ఆమెను ఆలింగనము చేసుకొని రాజువద్ద శలవు తీసుకొని అర్జునుడు తీర్థయాత్రకై బయలుదేరెను.

62. ఇంద్రపుత్రుడగు అర్జునుడు గోకర్ణమును పొంది పార్వతీపతియగు ఈశ్వరుని శిరస్సున, రాబోవు నా ధనుస్సుచే కొట్టుటకు ఇచ్చట అవకాశము గలదు అని చేతితో చూపించుచున్నవాడువలె పుష్పములను ఉంచెను.

63. సముద్రము యొక్క పశ్చిమ తీరమున ఉన్న తీర్థములను దేవాలయములను అన్నింటిని చూచి క్రమముగా ప్రభాసతీర్థమును పొందెను.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వయందు
పదునైదవ అధ్యాయము సమాప్తము.

# షోడశోధ్యాయః

ప్రభాసతీర్థం సంప్రాప్తం శుశ్రావ మధుసూదనః।
తతోఽభ్యగచ్ఛ త్కౌంతేయం సఖాయం తత్ర మాధవః॥ 1

తౌ విహృత్య యథాకామం ప్రభాసే కృష్ణపాండవౌ।
మహీధరం రైవతకం వాసాయైవాభిజగ్మతుః॥ 2

అర్జున త్వం సమాగచ్ఛ సుభద్రాహరణాయవై
యతిర్భూత్వా రథస్థాం తాం సుభద్రాం నేతుమర్హసి।
ఇతి కృష్ణ మతిం జ్ఞాత్వా హ్యర్జునేన తథాకృతం॥ 3

విజయో మధురస్మితస్వభావం విదధ స్త్ర్యస్యమతేన భిక్షువేషః।
కుసుమాస్త్రభయాదివాతిగూఢః కుహరే రైవతకస్యతిష్ఠతిస్మ॥ 4

తదాత్వ ఏవాద్రితటాత్ప్రతిశ్రియః
పరిప్లవం తం ప్రకృతే శుభాగమే।
యదాశయే తే శయ ఏవ తత్ఛవే
దితిబ్రువన్ ద్వారవతీం పునర్యయౌ॥ 5

యేన కేనాప్యుపాయేన ద్వారకాంతఃపురం యతిః।
ప్రవిశ్య బలరామేణ పూజిత స్స సుభద్రయా॥ 6

ఆరామేతు వసద్ధీమాన్ చతురో వార్షమాసికాన్।
కన్యాపురే శుభద్రాయా భుక్త్వా భోజన మిష్టతః॥

# 16 వ అధ్యాయము

1. అర్జునుడు ప్రభాసతీర్థమునకు వచ్చెనని శ్రీకృష్ణుడు విని స్నేహితుడగు అర్జునుని చూచుటకు ప్రభాస తీర్థమునకు విచ్చేసెను.

2. ఆ ఇద్దరు ప్రేష్టార్జునులు అచ్చట స్వేచ్ఛగా విహరించి రైవతక పర్వతము నకు వెళ్ళిరి.

3. అర్జునా ! నీవు యతి వేషమును ధరించి సుభద్రను హరించుటకు తగియున్నావు అని కృష్ణుని అభిప్రాయమును తెలుసుకొని అర్జునుడు అట్లు చేసెను.

4. అర్జునుడు శ్రీకృష్ణుని మధురమగు చిరునవ్వు యొక్క భావమును గ్రహించి వాని అభిప్రాయము ననుసరించి మన్మధుని భయముచేతనో అన్నట్లు వలె ఎవ్వరికి తెలియబడకుండగ ఆ రైవతక పర్వత గుహాయందు ఉండెను.

5. ని విచ్చటనే ఈ కొండగుహాయందుండుము. రాబోవు పరిప్లవోత్సవమున నీ యాశయము ఈడేరగలదని అర్జునునితో చెప్పి మరల ద్వారకకు శ్రీకృష్ణుడు వెళ్ళెను.

6. ఏదో కారణముచే ఆ యతి ఉపాయముగా ద్వారకాంతఃపురమున ప్రవేశించి సుభద్రచేతను, బలరామునిచేతను పూజింపబడెను.

7. ఆ యతి సుభద్ర యొక్క కన్యాంతఃపురమున చక్కగా భుజించుచు వర్షాకాలపు నాలుగు నెలలు ఉద్యానవనమున నివశించెను.

భ్రాతరం రామ మాలోక్య శ్రీకృష్ణో వాక్య మబ్రవీత్॥ 8

కృష్ణ ఉవాచ॥

బలవాన్ దర్శనీయశ్చ వాగ్మీ శ్రీమాన్ బహుశ్రుతః।
నిస్సీమతర మాహోఽయం సుభద్రాపి తథావిధా।
బలవా నింద్రియగ్రామో నజానే కిం భవిష్యతి।
శుభాశుభస్య విజ్ఞాతా త్వత్తో నాన్యోస్తి కశ్చన॥ 9-10

బలరామ ఉవాచ।

యతిలింగధరో హ్యేష నాత్ర సందేహ కారణం॥ 11

కృష్ణ ఉవాచ।

భవతః పరవా నస్మి యావ దాచంద్రతారకం।
స తథేతి ప్రతిజ్ఞాయ యయౌ పార్థో మహాయతిః॥ 12

ప్రవిష్ట స్తం గృహం రమ్యం సర్వభోగసమన్వితం।
పార్థ మావేదయామాస రుక్మిణీభామయో ర్హరిః॥ 13

ఏవ మేతేన రూపేణ కంచిత్కాలం ధనంజయః।
ఉవాస భక్ష్యభోజ్యైశ్చ భద్రయా పరమార్చితః॥ 14

8. ఒకానొకప్పుడు సోదరుడగు బలరాముని చూచి శ్రీకృష్ణుడు ఈ విధముగా పలికెను

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

9. 10. ఈ యతి మిక్కిలి బలవంతుడు. చూడదగినవాడు ఎక్క పండితుడు. అంతులేని సౌందర్యము కలవాడు మన సుభద్ర గూడ అట్టిదియే. ఇందియములు బలవత్తరములైనవి. ఏమి జరుగునో నాకు తెలియకున్నది. శుభాశుభములను ఎరిగినవాడవు నీ కంటె ఎవరును మాకు లేరు

బలరాముడు చెప్పుచున్నాడు.

11. ఈతడు యతి వేషమును ధరించి యున్నాడు. పానిని గురించి సందేహించ వలసిన పనిలేదు.

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

12. నేను చంద్రసూర్యులున్నంతవరకు నీ అధీనుడనై యున్నానని చెప్పెను. యతివేషమునందున్న అర్జునుడును అట్లే యని అంగీకరించి ద్వారకకు వెళ్ళెను.

13. రమ్యమైనట్టియు, సర్వభోగములతో కూడిన గృహమును ప్రవేశించిన యతి పుంగవుని అర్జునుడేనని ఎరుగక సుభద్రకు శ్రీకృష్ణుడు చెప్పెను.

14. ఈ విధముగా సుభద్రచే భక్ష్యభోజ్యాది ఉపచారములతో సేవింపబడుచున్నవాడై కౌంతేయుడు సుఖముగా అక్కడ నుండెను.

కన్యాకరే మృద్నతిపాదపద్మం పుష్యంతి
గాత్రేపులకాంకురాణి హారే హారే మాధవ
మాధవేతి హరిస్స్మృతే రన్యథయాంచకార॥ 15

యథాయాపం హి శుశ్రావ సుభద్రా హ్యర్జునం ప్రతి।
తథాయాపం మవేక్ష్యైనం పరాం ప్రీతి మవాప సా॥ 16

సా కదాచి దుపాసీనం ప్రపచ్ఛ కురునందనం।
భగవన్నఖిలం విబుధ్యసే పరమార్థం వద భావి మే శుభం।
ప్రయతా యతయో భవద్విధాః
ప్రణిధానేన హి దివ్యచక్షుషః। 17

అర్జున ఉవాచ॥

ఆకర్ణ్య తదేష మీలితః క్షణమక్ష్ణోః
ప్రతివాచ మాదదే బహునా కిమయి
స్వకైర్గుణై ర్విజయం ప్రాప్స్యసి యోషితాం కులే॥ 18

అవిజ్ఞాతశ్చ మాత్రా చ సోదరైశ్చ ధనంజయః।
ద్వారకా మూవపద్యేకో యతిలింగధర శ్శిఖీ॥ 19

పశ్యన్ సుభద్రా మనిశం
నాభిజానాతి మాధవి।
యమేవ ముద్దిశ్య తవోక్తిభంగీ
స ఏష దాసోఽస్మ్యను కంపనీయః॥ 20

ఇతి ప్రకాశ్య క్షణ మర్జునత్వం
కరం గృహీం చోచ్ఛ్రయతి స్మ దాసీం।
తత స్సుభద్రా విశ్వస్యలజ్జాభావ సమన్వితా॥ 21

15. సుభద్రా కన్యక తన పాదమును వత్తుచుండగా తన శరీరమునందు కలిగిన పులకాంకురములను హరే ! మాధవా ! యనుచు హరి పారవశ్యముచే కలిగిన పులకాంకురములన్నట్లు ఆతడు నటించెను.

16. అర్జునుని రూపము యెట్లుండునని ఆమె వినినదో అట్టి రూపముగల వీనిని జూచి సుభద్ర మిక్కిలి సంతసించెను.

17. ఆమె యొకానొకప్పుడు యతివేషములో కూర్చుని ఉన్న అర్జునుని "మీరు అంతయు యెరుగుదురు. నాకు జరుగబోవు శుభమును గూర్చి చెప్పుడు. ఏలనన నియతచిత్తులగు మీబోటి యతులు మనః ప్రణిధానముచే దివ్యజ్ఞానము గలవారు గదా !" అని యడిగెను.

అర్జునుడు చెప్పుచున్నాడు.

18. ఆమె పలికిన వాక్యములను విని క్షణకాలము నేత్రములు మూసు కొని వేయి మాటలేల నీ సద్గుణములచే స్త్రీ లందరిలో నీవు విజ యమును (విజయుని) పొందగలవు. అని పలికెను.

19. ఆ విజయుడు తల్లి చేతను సోదరులచేతను తెలియబడకుండ యతి వేషమును ధరించి యెక్కడో ద్వారకయందున్నాడట.

20. ఓ సుభద్రా ! నీ వెరుగవా ? అని పలుకుచు ఆమె వంక జూచుచు యెవరి నుద్దేశించి నీ వడుగుచున్నావో వాడితడే నీ దాసుడు. నీచే అనుగ్రహింప దగినవాడు.

21. ఈ విధముగా క్షణకాలము తానర్జునుడగుటను తెలియజేసి ఆమె చేతిని పట్టుకొనెను. ఆమె యితడు. అర్జునుడని విశ్వసించి సిగ్గు గలదాయెను.

ముమోహ శయనే దివ్యే శయానా భావమోహితా॥ 22

కన్యాపురే సంప్రవృత్తాం జ్ఞాత్వా దివ్యేన చక్షుషా।
శశాస రుక్మిణీం కృష్ణో భోజనాని తదార్జునే॥ 23

తత స్సర్వదశార్హాణా మతద్ద్వీపం నరాధిప॥
చతుస్త్రింశదహో రాత్రం బభూవ పరిమోత్సవః॥ 24

కృష్ణ రామాహుకాక్రూర ప్రద్యుమ్నా శ్శిని సత్యకాః।
సముద్రం ప్రయయు ర్హృష్టాః పుష్కరం భక వృష్ణయః॥ 25

వైశాఖస్యైవ మాసానాం పక్షాణాం శుక్ల ఏవ చ।
నక్షత్రాణాం తథా హస్తా దశమ్యాం నిశి సద్గృహే।
చింతితం చ సుభద్రాయా శ్చార్జునేన చ మాధవః॥ 26

నిద్రయాపహృతజ్ఞానం రోహిణేయుం వినాతదా।
వసుదేవేన దేవక్యా బాహుకేన చ ధీమతా।
ఆజగామ హరి శ్శీఘ్రం ద్వారకాం స్వజనై స్సహ ॥ 27

చింతయానం తు కౌంతేయం జ్ఞాత్వా శచ్యా శచీపతిః।
సహితో నారదాద్యైస్తు మునిభిశ్చాప్సరోగణైః
అరుంధత్యా వసిష్ఠేన హ్యాజగామాథ ద్వారకాం॥ 28–29

తతో వివాహో వవృధే స్థిత స్సర్వగుణాన్వితే।

22. ఆమె మోహమును పొందినదై దివ్యమైన శయనమునందు శయనించి అర్జునుని యందు కామమోహితురాలాయెను.

23. కన్యాంతఃపురమున జరిగిన యీ వృత్తాంతమంతను దివ్యచక్షుస్సుతో శ్రీకృష్ణుడు జూచి అర్జునునకు భోజనములను యేర్పాటు చేయమని రుక్మిణిని ఆదేశించెను.

24. తరువాత ముప్పయి నాలుగు రోజులు ఆ ద్వారకానగరమందు యేదో యొక గొప్ప యుత్సవము సంభవించెను.

25 ఆ యుత్సవమును జూచుటకు కృష్ణుడు బలరాముడు ఆహుకుడు, అక్రూరుడు, ప్రద్యుమ్నుడు, శివి, సత్యకుడు కుకురాంధక వృష్ణులందరును సముద్రతీరమునకు వెళ్ళిరి.

26. మాసములలో వైశాఖమాసము, పక్షములలో శుక్లపక్షము నక్షత్రములలో హస్తనక్షత్రము, దశమి తిథియందు సుభద్రకు అర్జునునితో వివాహమైన బాగుండునని శ్రీకృష్ణుడు తలచెను.

27. నిద్రించుచున్న బలరాముడు లేవకుండగా వసుదేవునితోను, దేవకితోను, ఆహుకునితోను, స్వజనముతోను, కూడి శీఘ్రముగా శ్రీకృష్ణుడు ద్వారకకు వచ్చెను.

28. 29. అర్జునుడు యిట్లున్నాడని తెలుసుకొని దేవేంద్రుడు శచీదేవితోను నారదాది మునులతోను, అప్సరోగణములతోను, అరుంధతితోను గూడి ద్వారకకు వచ్చెను

30. ఆ పిమ్మట వివాహము చక్కగా జరిగెను. కాశ్యపమహర్షి వివా

మహర్షిః కాశ్యపో హోతా సదస్యా నారదాదయః।
పుణ్యాశిషం ప్రయోక్తార స్సర్వేహ్యాసం స్తదార్జునే॥ 30

అరుంధతీ శచీదేవీ రుక్మిణీ దేవకీ తథా।
దివ్యస్త్రీభిశ్చ సహితాః క్రియాః భద్రా స్తు చక్రిరే॥ 31

తస్యాః పాణిం గృహీత్వా చ మంత్రహోమపురస్సరం।
సుభద్రయా బభౌ జిష్ణు శ్శచ్యా చైవ శతక్రతుః॥ 32

ఆమంత్ర్య యాదవాన్ సర్వే విప్రజగ్ము ర్యథాగతం।
♦కృష్ణోపి యాదవై స్సార్ధ మంతర్ద్వీపం గతో నిశి॥ 33

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
షోడశోఽధ్యాయః సమాప్తః॥

---

♦వ్యా॥ అనేన ప్రమోదూత నామ సం॥ర వైశాఖ శు॥ ౧౦ హస్తా నక్షత్రే సుభద్రా వివాహ ఇతి సిధ్యతి॥ తదా యుధిష్ఠిరస్య వయ స్సం॥ 59 ల 7 మా॥ల 7 దినాని॥ క్రీ॥ పూ॥ 24-7-3046 ఇతిజ్ఞేయం॥

♦వ్యా॥ సుభద్రాప్రవర ఆంగీరస,గార్గ్య శైన్యత్రార్షేయ ప్రవరాన్విత గర్గ గోత్రం॥ హృదిక మహారాజవర్మణోనప్త్రీం దేవమీఢమహారాజ వర్మణః పౌత్రీం వసుదేవ వర్మణఃపుత్రీం సుభద్రానామికాం లక్ష్మీస్వరూపిణీం కన్యాం.

అత్ర యేషాం మాతులకన్యావివాహః అతా

హము చేయించువారుగను, నారదాదిమహర్షులు పుణ్యాశీర్వచనము చేయువారు కాగా అందరు సంతోషించిరి.

31. అరుంధతి, శచీదేవి, రుక్మిణీదేవి దేవతాస్త్రీలతో గూడి మంగళ క్రియలను చేసిరి.

32. అర్జునుడు మంత్రహోమపురస్సరముగా సుభద్ర యొక్క పాణిని గ్రహించి శచీదేవితో ఇంద్రుడు వలె ప్రకాశించెను.

*33. యాదవులతో జెప్పి యింద్రాదిదేవతలు వెళ్ళిపోయిరి. కృష్ణుడును యాదవులతో కూడి ఆ రాత్రియందే అంతర్ద్వీపమునకు పయన మయ్యెను.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున ఆదిపర్వమందు
పదునారవ అధ్యాయము సమాప్తము.

---

*వ్యా॥ ప్రమోదూత సం॥ర వైశాఖ శుద్ధ ౧౦ హస్తనక్షత్రమువందు సుభద్రావివాహమని సిద్ధించుచున్నది. అప్పుడు యుధిష్ఠిరుని యొక్క వయస్సు 59 సం॥ 7 నె॥ 7 ది. క్రీ॥ పూ॥ 21-7-3016.

సుభద్ర యొక్క ప్రవర ఆంగీరస, గార్గ్య, శైన్య త్ర్యార్షేయ ప్రవరాన్విత గర్గగోత్రము. హృదికమహారాజవర్మణో నప్త్రీం దేవ మీఢ మహారాజవర్మణో పౌత్రీం, వసుదేవవర్మణః పుత్రీం సుభద్రా నామికాం లక్ష్మీస్వరూపిణీం కన్యాం అని చెప్పవలెను.

ఇచ్చట మేనమామ కుమార్తెను వివాహమాడుట అశాస్త్రీయమని ఎవరికి అభిప్రాయము గలదో వారికి యిట్లు సమాధానము చెప్పబడు

# సప్తదశోऽధ్యాయః

అథ కన్యాపురద్వారా త్సఘోషాదభినిస్సృతం
శ్రీకృష్ణస్య రథం శ్రేష్ఠం దదృశు ర్ద్వారపాలకాః ॥ 1

భద్రా భద్రజనోపేతాన్ స్వయం మాళ్యాం నచోదయత్
సుభద్రయా సుసంపన్నే తిష్ఠన్ రథవరోత్తమే ॥
బభౌ విమలయోపేతః కైలాస ఇవ గంగయా ॥ 2-3

---

స్త్రీయు ఇత్యాగ్రహోऽస్తి శేషా మేకం సమాధీయతే॥ తథాహి॥ పరాశర సంహితాయాం వాక్యం శ్రు॥ మాతుల స్యైవ యోషా భాగస్తే పైతృష్వసేయీ వసామివ॥ ఇతి॥ తస్మాచ్ఛ్రుతా వనుగృహీతోऽయం। మాతులసుతా వివాహప్రాపకతయా ప్రవర్తితా॥ ఇతి॥ ధర్మసింధౌ॥ శ్రు॥ మాతు=మివ। అస్య వ్యాఖ్యానభూతం భాంతటీకాయాం వచనం॥ యోషాపత్యం మాతులేయం యథాభాగః పితృష్వసుః పుత్రస్యైవ వపాంతేశ్చ జుషస్వేంద్రేత్యృషిస్వగా। ఇత్యస్తి॥

అన్యచ్చ॥ ప్రద్యుమ్నస్య రుక్మిపుత్రికా రుక్మవతీ మాతులపుత్ర్యేవ॥ అపిచ సహదేవోऽపి మాద్రీమేవ స్వయంవరే విజయాం నామోపయేమే మద్రరాజస్య ద్యుతిమతో దుహితరం॥ ఇతి భారతే ఆది 95 అ ప్రతిపాదితం। అత్రత్య మద్రరాజః న శల్యః। తథైవ వసుంస్తు చైద్యాం కరేణు

# 17 వ అధ్యాయము

1. తరువాత కన్యాంతఃపుర ద్వారమునుండి బయటికి వచ్చుచున్న శ్రీకృష్ణుని శ్రేష్ఠమగు రథమును ద్వారపాలకులు చూచిరి.

2, 3. మంగళప్రదమైన రథము సుభద్రతో ఒప్పుచుండెను. సుభద్రతో కూడుకుని ఆ రథమునందు కూర్చుని ఉన్న అర్జునుడు స్వచ్ఛమైన గంగతో కూడుకొనియున్న కైలాసమువలె ప్రకాశించుచుండెను.

---

చున్నది, పరాశర సంహిత యందు శ్రుతి "మాతులస్యేవ యోషా భాగస్తే పైతృష్వసేయీ వపా మివ" అని శ్రుతి గలదు. ఆ శ్రుతి మేనమామ కుమార్తెను వివాహమాడుట సంబంధ ప్రమాణముగా చూపించబడినది. ధర్మసింధువునందు ఆ శ్రుతికి వ్యాఖ్యానభూతమైన భారతటీకయందలి వచనము యివ్వబడినది. యోషా = సంతానము, (మేనమామ సంబంధమైన) పితృష్వస్రః, పుత్రస్యైవ = మేనత్త కుమారునకువలె యథాభాగః — అర్హమైనది అట్లే ఓ యింద్రా : ఈ వపను అనుభవించుము అని, ఋషి గానము చేసెను అని కలదు.

మరియు ప్రద్యుమ్ననికి రుక్మియొక్క పుత్రిక రుక్మవతి మేనమామ కుమార్తెయే, సహదేవునకున్నూ మేనమామ కుమార్తెయగు విజయను స్వయంవరమున వివాహమాడెను. ఆమె మద్రరాజగు ద్యుతిమంతుని కుమార్తె యని భారతమునందు ఆదిపర్వ 95 వ అధ్యాయమున చెప్పబడినది, ఇచ్చటి మద్రరాజు శల్యుడు కాడు, అట్లే నకులుడును

సుభద్రాం ప్రేక్ష్య పార్థేన నీయమానాం యశస్వినీం
అమృష్యమాణా యుయుధు ర్వృష్ణ్యంధక మహారథాః ॥ 4

అథాపరే చ సంక్రుద్ధా గృహీత్వా ఘ్నంతమాచిరం
ఇతి సంధార్య శస్త్రాణి వవర్షు రభితో రథం ॥ 5

వవర్ష శరవర్షాణి పార్థ స్తా న్వారయన్ ముదా
ప్రేక్షన్ రైవతకద్వారం నిర్యయౌ పురుషర్షభః ॥ 6

ఆజగామ విశుద్ధాత్మా సహ రామేణ కేశవః
భ్రాతృభిశ్చ కుమారైశ్చ యోధైశ్చ బహుభి ర్వృతః ॥ 7

బలరామ ఉవాచ

కిం మహాగుహప్రవిష్టోఽసి ప్రేక్షమాణో జనార్దన
సత్కృత్య త్వత్కృతే పార్థం సర్వై రస్మాభి రచ్యుత ॥ 8
ప్రసహ్య హృతవా నద్య సుభద్రాం మృత్యుమాత్మనః

మర్షయిష్యామి గోవింద పాదస్పర్శ మివోరగః ॥ 9

అద్య నిష్కౌరవా మేకః కరిష్యామి వసుంధరాం ॥ 10

---

మతీం నామ భార్యా ముదవహతీతి భార. ఆది 95 అధ్యాయే ప్రతిపాదితం అత్రస్థ చేదిరాజో న శిశుపాల ఇతి జ్ఞేయం॥

4. ఈ విధముగా పార్థునిచే తీసుకొని పోబడుచున్న సుభద్రను చూచి సహించనివారై వృష్ణి, అంధక మహారథులందరును యుద్ధము చేసిరి.

5. తరువాత కొందరు మహారథులు కోపించినవారై పట్టుకొనుడు, చంపుడు, ఆలస్యము చేయవద్దు. అని యనుచు రథము మీద శరవర్షములను కురిపించిరి.

6. ఆ శరవర్షములను అర్జునుడు సులభముగా వారించుచు రైవతక ద్వారమునుండి వెలుపలకు వచ్చెను.

7. తరువాత శ్రీకృష్ణుడు బలరాముడితోను, సోదరులతోను, కుమారులతోను, అనేకమంది యోధులతోను కూడినవాడై వచ్చెను.

బలరాముడు చెప్పుచున్నాడు.

8. ఓ జనార్దనా! ఏమియు మాటలాడక కూర్చుని యున్నావేమి? నీ వలననే మేమందరము గౌరవించి పార్థుని తీసుకొని వచ్చితిమి. అతడు సుభద్రను తన మృత్యువును వలె తీసుకొని వెళ్ళెనుగదా.

9. సర్పము కాలితన్నును వలె నేను సహించజాలను.

10. ఇప్పుడు నేనొక్కడనే యీ భూమిని పాండవులు లేని దానినిగ చేయుదును.

---

చైద్యరాజు కుమార్తెయగు కరేణుమతి యను పేరుగల భార్యను వివాహమాడెనని భార॥ ఆ. ప॥ 95 వ అ॥ చెప్పబడినది. ఇచ్చట చెప్పబడిన చైద్యరాజు శిశుపాలుడు కాడు.

కృష్ణ ఉవాచ

ఉచితస్త్రైవ సంబంధః సుభద్రా చ యశస్వినీ
అతః ప్రసహ్య హృతవాన్ కన్యాం ధర్మేణ పాండవః ॥ 11

భరత స్యాన్వయే జాతః శంతనోశ్చ యశస్వినః ॥ 12

నచ పశ్యామి యః పార్థం విజయేత రణే బలాత్
వర్జయిత్వా విరూపాక్షం భగనేత్రహరం హరం ॥ 13

సచ నామ రథ స్తాదృఙ్ మదీయా స్తే చ వాజినః
యోద్ధా పార్థశ్చ శీఘ్రాస్త్రః కోను తేన సమో భవేత్ ॥ 14

అవజ్ఞాయ చ తద్వాక్యం సైనికా రామచోదితాః
నిర్జితా శ్చార్జునా త్సర్వే ద్వారకాం పునరాగతాః ॥ 15

సుభద్రాం గృహ్య పార్థస్తు స్థాపయామాస స్వనోత్తమే
పూర్ణేతు ద్వాదశే వర్షే ఖాండవప్రస్థ మాగతః ॥ 16

అభిగమ్యచ రాజానం నియమేన సమాహితః
అభ్యర్చ్య బ్రాహ్మణాన్ పార్థో ద్రౌపదీ మభిజగ్మివాన్ ॥ 17

వవందే పృథుతామ్రాక్షీ పృథాం భద్రా యశస్వినీ
ధర్మరాజం భీమసేనం చ వవందే భ్రాతరౌ సహ ॥ 18

కృష్ణుడు చెప్పుచున్నాడు.

11. ఈ సంబంధము యుచితమైనది. సుభద్రయు యశోవంతురాలు. అందువలన అర్జునుడు బలాత్కారముగ హరించెను. అది ధర్మమే.

12. అర్జునుడు శంతనుని యొక్క వంశమునందు పుట్టిన సద్వంశజుడు.

13. పార్థుని రణమునందు బలాత్కారముగ జయించగలవాడు ఈశ్వరుడు దప్ప అన్యులు లేరు.

14. వానికి యున్న రథమట్టిది. ఆ గుఱ్ఱములు నావియే. యుద్ధముచేయువాడు పార్థుడు. శీఘ్రముగ అస్త్రములను ప్రయోగించగలడు. వానితో ఎవడు సమానము కాగలడు.

15. ఈ వాక్యమును లక్ష్యపెట్టక బలరామునిచే ప్రేరేపింపబడిన యోధులు అందరును పార్థునిచే మోడింపబడినవారై తిరిగి ద్వారకకు వచ్చిరి.

16. పార్థుడు సుభద్రను తీసుకొని దేవతలచే స్తోత్రము చేయబడుచు పన్నెండవ సంవత్సరము పూర్తికాగా ఖాండవప్రస్థమునకు తిరిగివచ్చెను.

17. నియమముతో కూడుకొని యున్న ధర్మరాజును కూడుకొని బ్రాహ్మణులను బూజించి ద్రౌపదిని పొందెను.

18. సుభద్ర కుంతికి నమస్కారము చేసెను. పార్థుడు సుభద్రతో గూడి కుంతికి, ధర్మరాజునకు, భీమసేనునకు నమస్కరించెను.

ఆజగామ విశుద్ధాత్మా సహ రామేణ కేశవః
దదౌ శతసహస్రాఖ్యం కన్యాధన మనుత్తమం ॥ 19

ఏవ ముత్తమవీర్యాస్తే విహృత్య దివసాన్ బహూన్
పూజితాః కురుభిః జగ్ముః పున ర్ద్వారవతీం ప్రతి ॥ 20

వాసుదేవస్తు పార్థేన తత్రైవ స్థితవాన్ హరిః
కౌంతేయా త్ప్రతివింధ్యం చ శ్రుతసోమం వృకోదరాత్
అర్జునా చ్ఛ్రుతకర్మాణం శతానీకం చ నాకులిం
సహదేవా చ్ఛ్రుతసేనం ఏతాన్ పంచ మహారథాన్
పాంచాలీ సుషువే దేవీ ఆదిత్యా నదితి ర్యథా ॥ 21-22

ఏకవర్షాంతరా స్త్వేతే ద్రౌపదేయా యశస్వినః
అన్వజాయంత రాజేంద్ర పరస్పరహితైషిణః ॥ 23

తతో మహాత్మే సకలా భినంద్యే
కురూద్వహానాం కుశలోదయాయ
సుతం సుభద్రా సుషువేఽభిమన్యుం
ప్రవీరసూ స్తాతమివ ప్రవీరం ॥ 24

అభీశ్చ మన్యుమాంశ్చైవ తత స్త మరిమర్దనం
అభిమన్యు మితి ప్రాహు రార్జునిం పురుషర్షభం ॥ 25

జాతకర్మాద్యానుపూర్వ్యాత్ చూడోపనయనాని చ
చకార విధివ ద్ధౌమ్య స్తేషాం భరతసత్తమ

19. పరిశుద్ధమైన మనస్సు గల శ్రీకృష్ణుడు బలరామునితో గూడ వచ్చి గొప్ప విలువగల కానుకలను కన్యాధనముగా సమర్పించెను.

20. ఈ విధముగ యుత్తమవీరులగు వారు అనేకదినములు విహరించిరి. పాండవులచే పూజింపబడినవారై వారందరును తిరిగి ద్వారకకు వెళ్ళిరి.

21, 22. శ్రీకృష్ణుడు మాత్రము అర్జునునితో అచటనే యుండెను. ద్రౌపదీదేవి ధర్మరాజు వలన ప్రతివింధ్యుని, భీముని వలన శ్రుతసోముని, అర్జునుని వలన శ్రుతవర్మను, నకులుని వలన శతానీకుని, సహదేవుని వలన శ్రుతసేనుని మహారథులగు ఈ అయిదుగురు పుత్రులను అదితి ఆదిత్యులనువలె కనెను.

23. ఈ ద్రౌపదీ పుత్రులైదుగురును ఒక సంవత్సరము ఒక్కొక్కరికి వ్యవధానముతో బుట్టిరి మిక్కిలి స్నేహముగా నుండిరి.

24. తరువాత అందరు అభినందించదగిన శుభముహూర్తమున సుభద్రాదేవి కురువంశవర్ధనుడగు అభిమన్యుడను పేరుగల సుతుని, వీరులను కనిన కుంతీదేవి తన పుత్రులను కనినట్లు కనెను.

25. ఆ పుత్రుడు భయములేనివాడును, కోపము గలవాడును శత్రువులను సంహరించువాడును అగుటచే అభిమన్యుడని పలికిరి.

26. జాతకర్మ చౌలోపనయనములు మొదలుగాగల సంస్కారములను ధౌమ్యుడు వారికి విధ్యుక్తముగా చేసెను.

తతః కతిపయాహస్సు గతేషు హరి రర్జునౌ
యమునాతీర మాగత్య వివిక్తే స స్థితౌ సుఖం ॥ 27

ఆగచ్ఛ ద్విప్రవ ద్వహ్ని ర్వాసుదేవధనంజయౌ ॥ 28

బ్రాహ్మణ ఉవాచ

శ్వేతకి ర్నామ విఖ్యాతో బలవిక్రమసంయుతః
సత్రం ప్రావర్తయ ద్రాజా సంవత్సరశతం కిల ॥ 29

తత్ర మే సర్పిభక్షస్య వికార స్సముజాయత
తత్ఖాండవవనం సర్వం ప్రదాహేం మమ శామ్యతి ॥ 30

ఇద మింద్ర స్సదా దావం ఖాండవం పరిరక్షతి
వసత్యస్య సఖా తస్య తక్షకః పన్నగ స్సదా ॥ 31

తతో దగ్ధుం న శక్నోమి దిదక్షు ర్దావ మీప్సితం
స యువాభ్యాం సహాయాభ్యా మస్త్రవిద్భ్యాం సమాగతః॥ 32

ఇత్యుక్త్వా ప్రదదౌ చక్రం వాసుదేవాయ ధీమతే
అర్జునాయ చ గాండీవం రథం వానరకేతనం

---

వ్యా॥ ప్రమోదూత శ్రావణ శు౨ పర్యంతం కృష్ణార్జున యో ర్విలాసః ఇంద్రప్రస్థే యమునాకూలే చ తత్కాల ఏవ ఖాండవవన దాహః శ్రీకృష్ణస్య కాళిందీ వివాహో జాత ఇతిశం. తదా యుధిష్ఠిరవయ స్స౹ 59-10-15 క్రీ॥ పూ॥ 20-4-3046 ఇతి నిర్ణీయతే ఇతిశం.

27. తరువాత కొన్ని దినములు గడువగా కృష్ణార్జునులు యమునాతీరము నకు వచ్చి యేకాంతముగ విహరించుచుండిరి.

28. అప్పుడు అగ్నిదేవుడు బ్రాహ్మణరూపమును ధరించి కృష్ణార్జునుల వద్దకు వచ్చెను.

బ్రాహ్మణుడు చెప్పుచున్నాడు.

29. శ్వేతకి యను పేరువడసిన బలపరాక్రమములు గల రాజు నూరు సం॥లు సత్రయాగము నాచరించెను.

30. సర్వభక్షకుడనగు నాకు అచ్చట వ్యాధి వచ్చినది. ఆ ఖాండవవన మును అంతను దహించినచో నా వ్యాధి కుదురగలదు.

31. ఆ వనమును యింద్రుడు యెల్లప్పుడును రక్షించుచున్నాడు. అతని స్నేహితుడగు తక్షకుడు ఆ వనమున నివసించుచున్నాడు.

32. అందువలన యెంత ప్రయత్నించినను ఆ వనమును తగులబెట్ట లేకున్నాను. అందుచే అస్త్రవేత్తలగు మీ సహాయమును గోరి మీ వద్దకు వచ్చితిని.

33, 34. అని పలికి వాసుదేవునికి చక్రమును, అర్జునునకు గాండీవమును'

---

*వ్యా॥ తరువాత ప్రమోదూతనామ సం॥ర వైశాఖ శుద్ధ పదివు వరకు కృష్ణార్జునులు ఇంద్రప్రస్థమున యమునా తీరమున విలాసముగా విహరించుటయు ఆ కాలమునందే ఖాండవవనదహనము శ్రీకృష్ణునకు కాళిందీ కన్యతో వివాహము జరిగెనని తెలియుచున్నది. అప్పుడు యుధిష్ఠిరుని వయస్సు సం॥ 50-10-15 దినములు. క్రీ॥ పూ॥ 20-1-3016 అని నిర్ణయింపబడుచున్నది.

ఉపేతం రాజతై రశ్వై ర్గాంధర్వై ర్హేమమాలిభిః
తూణీరా వక్షయశరా వగ్నిః ప్రాదా త్కిరీటినే ॥ 33—34

వరుణస్తు గదాం తస్మై కృష్ణాయ ప్రాదదా వరాం ॥ 35

అనుజ్ఞాతస్తు భగవాన్ దాశార్హో ఽర్జునేన చ
తైజసం రూప మాస్థాయ దదాహ విగతామయః ॥ 36

సమేతానాం తు సర్వేషాం దేవతానాం చ సర్వశః
విజేతా నాభవ త్కశ్చిత్ కృష్ణపాండవయో ర్మృధే ॥ 37

నభసి కృతే శరకూటే చ పపాత తాశుగవినున్నమంబు ముచాం॥
తస్మిన్ ఖాండవవహ్నౌ తక్షకపత్న్యాః కబంధమేవ పరం॥ 38

శతక్రతుస్తు సంప్రేక్ష్య విముఖా నమరాం స్తదా
బభూవ ముదితో రాజన్ ప్రశంసన్ కేశవార్జునౌ ॥
దేవరాజే గతే రాజన్ ప్రహృష్టౌ కేశవార్జునౌ ॥ 39

దశముఖనగరే పురానుభూతం
దహనహాతాత్కారణం పున ర్దిదృక్షుః
ఉపగత ఇవ మారుతి స్స సాక్షా
దుపచలవస్య రథాగ్రకేతనాంకః ॥ 40

తం పార్థే నాథయే దత్తే నముచే ర్భ్రాతరం మయం

హనుమంతుడు ధ్వజముగాగలదియు, గంధర్వలోకమందలి తెల్లని గుఱ్ఱములతో కూడిన రథమును. అక్షయ బాణములు గల రెండు తూణీరములను అగ్నిహోత్రుడు బహూకరించెను.

35. వరుణదేవుడు శ్రేష్ఠమగు గదను. కృష్ణునకు ఇచ్చెను.

36. కృష్ణార్జునుల అనుజ్ఞను పొంది అగ్నిహోత్రుడు తేజోరూపమును ధరించి భయములేనివాడై ఖాండవవనమును దహింప మొదలిడెను.

37. దేవతలందరు కలసి వచ్చి యెంత ప్రయత్నించినను కృష్ణార్జును లను జయించువాడు యెవ్వడును లేకపోయిరి.

38. బాణసముదాయముచే ఆకాశము కప్పబడగా బాణములచే ఆవరింప బడిన మేఘముల నుండి జారిన యుదకము అగ్నిహోత్రునియందు ఒకచుక్కయైనను పడలేదు. తక్షకుని భార్యయొక్క కేశపాశము మాత్రమే అగ్ని కాహుతియాయెను.

39. దేవేంద్రుడు పారిపోయిన దేవతలను చూచి కృష్ణార్జునులను ప్రశం సించుచు మిక్కిలి సంతసించెను. దేవేంద్రుడు వెళ్ళిపోగా కృష్ణా ర్జునులు సంతోషించిరి.

40. ఆంజనేయుడు పూర్వము లంకానగరమున అనుభవించిన గొప్ప దహనకాండను మరల చూచుటకు వచ్చినవాడువలె ఆ అర్జునుని రథాగ్రమున చెక్కిన చిహ్నముగా నుండి రథమును అలంక రించెను.

41. పార్థుడు అభయమీయగా నముచి సోదరుడగు మయుని శ్రీకృష్ణుడు

న హంతు మ్లేచ్ఛ ద్దాశార్హః పావకో న దదాహ చ
అశ్వసేనం మయం చైవ చతుర్థః శార్ఙ్గకాంస్తదా ॥ 41

అథ స్మిత్వా తుందం పరిమృశతి మందాయిత గతౌ
సమాపృచ్ఛ్య ప్రీత్యా త్రిదిన ముపయాతే హుతవహే
రథాభ్యాం మానిభ్యాం ఘనసలిలసేకేన మహతా
విజిత్రౌ తౌ కృష్ణౌ విహితు రుపాంతం సరపతేః ॥ 42

అర్జునో వాసుదేవ శ్చ దానవశ్చ మయ స్తథా
పరిక్రమ్య తత స్సర్వే త్రయోఽపి భరతర్షభ
రమణీయే నదీకూలే సహితా స్సుఖమావిశన్ ॥ 43

ఇంద్రప్రస్థే స్థితః కృష్ణో వార్షికేతు గధార్జునః
సాకం కృష్ణేన సన్నద్ధో రథేన యమునాం యయౌ ॥ 44

వైవస్వతీం మహాభాగాం కాళిందీం నామ కన్యకాం
లీలాంశేన సముత్పన్నాం పూర్వదత్తవరానుగాం
స్వయంవృతాం రథే నీత్వా చేంద్రప్రస్థ మగా ద్ధరిః॥ 45,46

కంత్వా చ సమనుజ్ఞాతో బంధుభిః పాండవై ర్విభుః

చంపదలచలేదు. అగ్నియు వానిని తగులబెట్టలేదు. ఈ విధముగా అశ్వసేనుని, మయుని నల్గురగు శార్ఙకులు అగ్నిహోత్రము నుండి విడిచిపెట్టబడిరి.

42. ఖాండవదహనానంతరము చిరునవ్వు నవ్వి బలసిన ఉదరమును స్పృశించుచు ఆహారాధిక్యముచే మందగమనము గలిగిన అగ్ని దేవుడు సంతోషముతో వారివద్ద శలవు తీసుకొని స్వర్గమును గూర్చి వెళ్ళిపోగా గొప్పవగు మేఘముల వర్షముచే తడియుటచే విశ్శుద్ధముగానున్న రథముతో కృష్ణార్జునులు జయము పొంది ధర్మరాజసన్నిధికి విచ్చేసిరి.

43. అర్జునుడు శ్రీకృష్ణుడు దానవుడగు మయుడు ఖాండవవనము నుండి బయలుదేరి వచ్చి మనోహరమగు యమునానదీ తీరమున సుఖముగా నుండిరి.

44. వర్షాకాలమునందు శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ నగరమున నుండెను అప్పుడు ఒకానొక సమయమున అర్జునుడు కృష్ణునితో గూడి రథముతో యమునానదిని గూర్చి వెళ్ళెను.

45. 46. అప్పట సూర్యుని పుత్రికయు గొప్ప సౌందర్యవతియు పూర్వ మీయబడిన వరము ననుసరించి నీలాంశచే పుట్టిన కాళిందియను కన్యను చూచెను. స్వయముగా వరించిన ఆమెను రథమునందు తీసికొని వచ్చి శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థమును చేరెను.

47 కుంతిచేతను, పాండవులచేతను బంధువులతోను అనుజ్ఞ నొందిన

* అథోపయేమే కాళిందీం నీత్వా ద్వారవతీం హరిః ॥ 47

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే ఆదిపర్వణి
సప్తదశోధ్యాయః సమాప్తః ·

— ఆదిపర్వ సమాప్తం —

---

*వ్యా॥ ఖాండవ ప్రస్థ శబ్దార్థవిచారణే ప్రస్థోనామ ఉన్నత సమ విశాలప్రదేశ ఇత్యర్థః॥ అస్మిన్ ఖాండవవిషయే కాళికాపురాణే శ్లో॥ పురాతు విజయో రాజా ఖాండవం నామ తాం పురీం భంక్త్వా వనం తత శ్చక్రే తేన త త్ఖాండవం వన మితి ప్రతిపాదితం॥

తదిదానీం జీలం యమునానద్యో ర్మధ్యే శివాలిక్ పర్వతస్య దక్షిణే రాజపుత్రస్థాన సోనీపత్తరేఽస్తి, పూర్వం చంద్రవంశీయో సుదర్శనాఖ్యో రాజా తత్ర ఖాండవపురం నిర్మితవానితి తం కాశీరాజః విజయాఖ్యః పరాజిత్య ఇంద్ర ప్రార్థనయా వనం కారితవానితి. పురాణాంతరే శ్రూయతే॥

సాంప్రతం తత్ప్రదేశః ఇంద్రఫట్ ఇతి వ్యవహ్రియతే॥ మహాజానీబాదు దక్షిణే మథురాం గమ్యమానమార్గే క్రోశైకదూరేస్తి। ఇంద్రప్రస్థస్య హస్తినాపురస్య చ మధ్యే 50 అర్ధక్రోశ దూరప్రదేశ మస్తీతి శం ॥

• వాడై ప్రభువగు శ్రీకృష్ణుడు కాళింది కన్యను ద్వారకానగరము నకు తీసుకొని వెళ్ళి వివాహమాడెను.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, ఆదిపర్వయందు
పదునేడవ అధ్యాయము సమాప్తము.

—: ఆదిపర్వము సమాప్తము :—



---

•వ్యా॥ ఇచ్చట ఖాండవప్రస్థ శబ్దార్థము విచారించబడుచున్నది. ప్రస్థమనగా ఎత్తగు సమమైన విశాలప్రదేశమని అర్థము. ఖాండవప్రస్థ విషయమున కాశికాపురాణమున శ్లో॥ పూర్వము విజయుడను రాజు ఖాండవమను పేరుగల ఆ పట్టణమును ఛేదించి వనముగా చేసెను. అందుచే అది ఖాండవవనమని ప్రసిద్ధి చెందెనని చెప్పబడినది.

అది ఇప్పుడు జీలం, యమునా నదులమధ్య యందు శివాలిక్ పర్వతమునకు దక్షిణముగా రాజపుత్రస్థానమునకు ఉత్తరముగా నున్నది. పూర్వము చంద్రవంశీయుడగు సుదర్శనుడను పేరుగల రాజు అచ్చట ఖాండవమను పేరుగల పట్టణమును నిర్మించెననియు కాశీరాజగు విజయు డనువాడు వానిని జయించి ఇంద్రుని కోరికచే ఆ పట్టణమును భేదించి వనముగా చేసెననియు పురాణాంతరములందును చెప్పబడినది.

ఇప్పుడు ఆ ప్రదేశము ఇంద్రపట్ అను పేరుతో వ్యవహరించ బడుచున్నది. షహజానీబాదుకు దక్షిణముగా మధురకు వెళ్ళుమార్గమున ఒక క్రోసెడు దూరములో కలదు. ఇంద్రప్రస్థమునకును, హస్తినాపురము నకును మధ్యలోనున్న ఏబది అర్ధక్రోశముల విస్తారముగల ప్రదేశమే ఖాండవవనము.

### ద్రౌపది కైదుగురు భర్తలున్నను పతివ్రతయే అను

# ఉపన్యాసము

## పూర్వపక్షము

మహాభారతము కేవలం వేదోక్తధర్మశాస్త్ర సమ్మతమనుట తగదు. అందనేక ధర్మేతర సాంప్రదాయము లున్నవి. ముఖ్యముగా ద్రౌపదీ దేవికి ఐదుగురు భర్తలుండుట సర్వశాస్త్రవిరుద్ధము. గౌతమబ్రాహ్మణమునందును ఐతరేయ శ్రుతియందును ఈ విధముగ గలదు. శ్రు॥ తస్మాత్ ఏకస్య బహ్వ్యో జాయా వ భవంతి, నైకస్యా బహవః పతయః । అని కలదు. ఈ విధముగనే ధర్మశాస్త్రములందును కలదు. మరల నట్టి ద్రౌపదీదేవి కులటగాక సుప్రసిద్ధస్మరణీయ పంచకన్యలలో నొకతెయై సర్వులకును ప్రాతస్స్మరణీయురాలగు టెట్లు? దీనికి సమాధానము చెప్పుడు. అని పూర్వపక్షమురాగా సిద్ధాంతము చెప్పబడుచున్నది.

## సిద్ధాంతము

వేద నిరుక్త బ్రాహ్మణ పురాణేతిహాసములందు నిరూపింపబడిన కథలు హిస్టరీలవలె నిజమైనవి కావు. అర్థవాదములు గావు. కొంత నిజమై యుండుటకూడ కలదు. కాని అట్టి కథలందు ధర్మము బోధింపబడును. కావున వాటిని నిందింపకూడదు. ఈ కథలో ధర్మబోధ యేమందువా? వినుము.

ద్రౌపది సామాన్య మానవకన్య కాదు. అవతారస్వరూపురాలు. త్రేతాయుగమున రావణసంహారార్థము కల్పింపబడిన మాయాశక్తి. రావణసంహారానంతర మాశక్తి శ్రీరామునిచే విడువబడి శివుని గూర్చి తప మాచరించి శివుడు ప్రత్యక్షము కాగా ఆతురతచే నైదుమార్లు పతిం దేహి పతిం దేహి యని కోర శివుడామెతో నీవొక మునికన్యవై పుట్టుము. ఒక

దైన నీభర్త తన తపోబలముచేనైదురూపముల విన్ననుసరించునని యంత ర్ధానము కాగా నా శక్తి యొక మహాముని కి నాలాయని కన్యయై జనించి అషసిద్ధుల వడసిన మరొక మహర్షి ని పెండ్లాడెను. ఆ మహర్షి యామె పాతివ్రత్యమును పరీక్షింప నెంచి కుష్టువ్యాధి పీడితుని వలె. సిద్ధమై యామెచే నుపచరింప బడుచుండ నొకనాడాతని వ్రేలు ఊడి భోజనపదార్థ మందు పడెను. నాలాయనియు యాతని భుక్తశేషమును ఆ వ్రేలిని మాత్ర మవ్వలనుంచి ఏ మాత్ర మసహ్యపడక పాతివ్రత్యమును పాటించి భుజించెను. దాన నాముని సంతోషించి వరము వేడుమని కోరి నామె కోరికచే నైదురూపములు ధరించి యామెను సంతోషపరచుచుండ నాతని కిందర్శసాయుజ్య మేర్పడుకాలము రాగా నాతడు భార్యతో నాలా యనీ! నీవు ద్రుపదుని యజ్ఞగుండమున మరల నుద్భవించి యచ్చట నుండుము. నీ పాతివ్రత్యమున వశుడనైన నేనా ఇంద్రరూపము నైదు రూపములుగ కల్పించి నిన్ను పరిగ్రహింతునని చెప్పి దేవలోకమునకు చనెను.

అట్టి శ్రీరామచంద్రుని మాయాశక్తియగు నాలాయనియే ద్రుప దుని యజ్ఞగుండమున ద్రౌపదియై యుద్భవించి ఇంద్రుని స్వరూపము లగు పంచపాండవులకు భార్యయై దుష్టులగు దుర్యోధనాదుల నాశమొన రించెను.

ఇంద్రు డొకనాడు సయ్యాగృహమందుగల నాలుగువైపుల అద్దము లందు ప్రతిబింబించిన తన నాలుగు రూపములను తన యైదవ రూప మును తిలకించి భ్రాంతుడై ఇట్లు కొంతకాలము విజయుడై యుండ కొంత నాకాశవాణి తథాస్తన నాతడు అదివరకు విశ్వరూప బ్రహ్మహత్యాభయ ముచే తన శక్తిని 1) ధర్మదేవత 2) వాయువు 3-4) అశ్వనీదేవతలం దుంచిన యంశలు నాల్గింటితో తన యంశమును చేర్చి ఐదురూపములచే దుర్వాసుని వర ప్రభావ ముకతమున కుంతీదేవి యం దొకడే ఐదు రూపము

లతో పుట్టి ద్రౌపదిని పెండ్లాడెనని యా భారతమందే కలదు గదా! పూర్వపక్షీ నీకది కనుపింపక ఇది మాత్రము కనుపించుట నీ యదృష్ట మహిమా ప్రభావ మనుకొనెదను.

ఇక దీనియందు ధర్మమేమందువా? వినుము. పతివ్రతామాహాత్మ్య మా జన్మమందేకాక తదితరానేక జన్మలందును తన ఇష్టానుసార సుఖ దాయకమగునని ప్రధానధర్మము. అవాంతర ధర్మము లనేకము లింకను కలవు. అని సిద్ధాంతము.

అట్లయిన ద్రౌపదీవివాహము ఈ రహస్య మెరుగని లోకసమ్మత మెట్లయిన దందువా? వినుము. దుర్యోధనుని కుతంత్రముచే సంభవించి లాక్షాగృహదహనబాధనుండి తప్పించుకొని బ్రాహ్మణవేషముతో పాండవులు ఏకచక్రపురమున నుండిరి, లోకుల కది తెలియక పాండవు లగ్నిపాలైరని తలచిరి, క్షత్రియులు బ్రాహ్మణు లెట్లగుదురు? అది అధర్మము కాదా? యని యందువా వినుము, ధృతరాష్ట్ర పాండురాజ విదురులు కేవల క్షత్రియ శూద్రులు కారు. వ్యాసాంశజులు, దేవాంశమున పుట్టిన పాండవు లంతకంటెను క్షత్రియులు కారు తెలిసినదా! కుంతీదేవితో పాండవులుండుట తెలియక ద్రుపదు డదివర కర్జునునిచే నోడి విడువబడిన వాడగుటచే నాతని శౌర్యమునకు మెచ్చి అర్జునేతరులకు సాధ్యము కాని మత్స్యయంత్రమొకదానిని కల్పించి అది ఛేదించిన వానికి ద్రౌపది నిచ్చెదనని స్వయంవరము చాటించెను. కాని అర్జునుడు లెక్కడైనా జీవించియుండునని పెద్దలచే నాతడు విని యట్లు చేసెను. అది విని కుంతీసహితులైన పాండవులు బకాసుర సంహారముచే తెలియబడుదురు కాన నిచ్చట నుండరాదని ద్రుపదుని పురి చేరి కుంభకార గృహమున వసించియుండి స్వయంవరసమయమున కర్ణాదుల కలవికాని మత్స్యయంత్రము నర్జునుడు ఛేదించి భీముని సహాయమున కౌరవుల నోడించి ద్రౌపదిని తెచ్చి వంటచేయుచు లోపలనున్న కుంతీదేవితో

నమ్మా! భిక్షను తెచ్చితిమన నామె చూడకనే మీరైదుగురు దాని ననుభ వింపుడనెను. ఆ వాక్యము మహాభారతమం దిట్లున్నది. శ్లో॥ కుటీగతా సా త్వనవేక్ష్య పుత్రాన్ ప్రోవాచ భుంక్ష్వేతి సమేత్య సర్వే ॥ భార॥ ఆది॥ప॥ 2 అ॥ 210 శ్లోకము ఇది.

పిమ్మట భీమసేనవాక్యముచే కుంతి వెలుపలకు వచ్చి చూచి పశ్చాత్తాపయుక్తయై ద్రౌపదితో ధర్మనిర్ణయార్థమై యుధిష్ఠిరుని వద్దకు వచ్చి శ్లో॥ ఇయం తు కన్యా ద్రుపదస్య రాజ్ఞః తవానుజాభ్యాం మయి సన్నిషిష్టా। యథోచితం పుత్ర మయాపి చోక్తం సమేత్య భుంక్తేతి నృప ప్రమాదాత్ ॥ మయా కథం నానృత ముక్తమద్య భవేత్కురూణా మృషభ బ్రవీహి ॥ పాంచాలరాజస్య సుతా స ధర్మే న చోపపవర్తేత న విభ్రమేచ్చ ॥ అన నవి ధర్మజుడు మేమైదుగురము స్వీకరించుటే న్యాయమని ఆ ద్రౌపదిని పూర్వోక్తకారణవిశేషమున నాతని నోట వెలువడెను.

పాండవులను ద్రుపదు డాహ్వానించి వారిని తెలుసుకొని యడిగిన నప్పుడు ధర్మజు డిట్లనెను. శ్లో॥ సర్వేషాం మహిషీ రాజన్ ద్రౌపదీ నో భవిష్యతి। ఏవం ప్రత్యాహృతం పూర్వం మమ మాత్రా విశాంపతే॥ అన నాతడు వెరగుపడెను. ఏలనందువా అతడు తన పుత్రికన్నర్జునునకు నంకల్పించెను. అప్పుట భారతమందిట్లున్నది. శ్లో॥ యాజ్ఞసేనస్య కామస్తు పాండవాయ కిరీటినే। కృష్ణాం దద్యామితి సదా నచైతద్వివృణోతి సః ॥ అని. ఇది ధర్మము కాదని ద్రుపదు డన ధర్మరాజిట్లనియె, శ్లో॥ సూక్ష్మో ధర్మో మహారాజ నాఽస్య విద్మో వయం గతిం। గురోర్హి వచనం ప్రాహు ర్ధర్మం ధర్మజ్ఞసత్తమ ॥ గురూణాం చైవ సర్వేషాం మాతా పరమకో గురుః ॥ అనెను. కావుననే రఘువంశమందు కాళిదాసు శ్లో॥ ఆజ్ఞా గురూణా మవిచారణీయా ॥ అని చెప్పెను.

పూర్వపక్షము

తల్లి వాక్యమును సరిచేయుటకు పాండవ జ్యేష్ఠునకు "జాయామేకస్మిన్ బహువన్యతా స్యాత్" అను వ్యాకరణసూత్రప్రకారము పతి శబ్దము జాత్యభిప్రాయమున బహువచన మగును కాని అది వ్యక్తి పరము కాదని తెలియదా ? లేక కుంతీవాక్యమున గల భుజశబ్దమునకు ధాత్వర్థముచేత భోజనమంచు తాత్పర్యమై అత్మనేపదమైనను శ్లో॥ వృద్ధో జనో దుఃఖశతాని భుంక్తే ॥ అనియును, రాజానో మహీం భునక్తి ॥ యను ప్రదేశములందు వశుడగుటయు పాలించుటయు, నను మధ్యమ పురుషగా చేసి ఈమెకు మీరైదుగురు వశులై యుండుడు, లేక పాలించుడు, అని ఏల సమన్వయము పాండవులు చేయకూడదు. ద్రుపదుడు అర్జునునితో శ్లో॥ త్వయా జితా ఫల్గున యాజ్ఞసేనీ గృహాణ పాణిం విధివత్త్వమస్యాః ॥ అని ప్రతిమాటెను గదా ।

అదియును గాక మహాభారతమందిట్టి పాణినీయ వ్యాకరణ దోషములు కలవు. దానికి దృష్టాంతముగ శాంతిపర్వమున 318 అ॥ 7 శ్లో॥ తతో మామాహ భగవా నస్యాం త్వం వివృతం కురు ॥ వివృతం చ తతో మేస్యం ప్రవిష్టా చ సరస్వతీ ॥ అని మే ఆస్యం అనుటకు బదులు మేస్యం అని చెప్పెను గదా యని పూర్వపక్షి యడుగ సిద్ధాంతి వరుసగా సమాధానము చెప్పుచున్నాడు,

సిద్ధాంతము

నీ ప్రశ్న కచ్చట యవకాశము లేదు. ఏల యందువా ద్రుపదు డట్లు పలికిన వెంటనే వ్యాసుడు ద్రుపదునితో రహస్యముగ మొదట నేను చెప్పిన ద్రౌపదీపూర్వవృత్తాంతము చెప్ప ద్రుపదుడు సంతసించి దానికి సమ్మతించి ఐదుగురికి తాను వరుసగా ద్రౌపదికి పాణిగ్రహణము చేయించెనని భారతమున ఆదిప॥ 2అ॥ 77శ్లో॥ మహాప్రాజ్ఞః సౌమకి

ర్యాజ్ఞసేనః । స్వయం కన్యాం పాండవేభ్యః ప్రదాయ ॥ అని కలదు. పాండవులైదుగురును శ్లో॥ క్రమేణ చానేన జగ్రహు స్తదా కరం ఇదం చ తత్రాద్భుతరూప ముత్తమం ॥ అనియును కలదు. అంత మాత్రమే కాక సభాపర్వమున ఇంద్రప్రస్థపురమున ద్రౌపది వారైదుగురకును భార్యయై పరిచరింపుచుండ నారదు డచ్చటికి వచ్చి శ్లో॥ పాంచాలీ భవతా మేకా ధర్మపత్నీ యశస్వినీ । యథా వో నాత్ర భేదస్స్యా త్తథా నీతి ర్విధీయతాం ॥ అని చెప్పి వారలకు నియమ మేర్పరుచుటను న పూర్వపక్షికున్నంత బుద్ధిబలము వారికి లేక ధర్మమార్గ మాత మనుస రించిరి. తుదకు భారతమున పాణినీయ వ్యాకరణ దోషము లనేకములున్న వని కదా పూర్వపక్షి ఆక్షేపించెను అట్లనరాదు. అది కేవలమౌఢ్యము మాంద్యమగును. శ్రీ రామాయణభారతాది పురాణగ్రంథములు ఐంద్ర వ్యాకరణానుసారముగ లిఖింపబడినవి. పాణినీయవ్యాకరణ మిటీవలిది. కావుననే శ్లో॥ యానుజ్జహార మాహేంద్రా ద్వ్యాసో వ్యాకరణార్ణవాన్ । తాన్యేవ పదరత్నాని సంతి పాణిని గోష్పదే అని భాష్యప్రమాణ వచన ముండుటవలన నని సిద్ధాంతము.

## పూర్వపక్షము

అటులైన ద్రుపదుని ప్రతిజ్ఞాప్రకారము మత్స్యయంత్రముపార్థు డొకడే భేదించి ద్రౌపదిని గెల్చెను గాదా. భారతమందే భీముడు నాభి దోభాగమున కొట్టకూడదను ధర్మమును పాటింపక దుర్యోధనుని తొడలు విరుగగొట్టు విషయమున శ్రీకృష్ణుడు యుద్ధధర్మముకంటె ప్రతిజ్ఞాపాలనము గొప్పదనియును అనాడు ద్రౌపదీవస్త్రాపహరణ కాల మందు ఆవిధానమున భీముడు ప్రతిజ్ఞచేసెను, గావున తప్పుకాదని సమ ర్థించెను గదా. నేడేల ద్రుపదుని ప్రతిజ్ఞాపాలన మాకృష్ణుడు చేయలేదు. ద్రౌపదియందు భాగార్హత మత్స్యయంత్రమందేమాత్రము సాహాయ్యము

చేయని పాండవులకెక్కడిదని.

### సిద్ధాంతము

మత్స్యయంత్రభేదనకార్యమునకు ధర్మజుడు నకులసహదేవులతో గృహమునకేగుటవలన భీముడు యుద్ధసహాయ మొనరించుట మొదలగు కార్యములచే కొనసాగెను. వారిందరికిను అవిషయమున భాగస్వామిత్వము లేకపోలేదు. అంతమాత్రమేకాక కుంతీప్రతిజ్ఞాపాలనము పాండవులకు ముఖ్యము. ద్రుపదుని ప్రతిజ్ఞ ధర్మ్యమవగుటచే పాలింపనక్కరలేదు. ఇట్టిప్రశ్నలింకను కలిగినచో నడుగుమన పూర్వపక్షి సిద్ధాంతితో నిట్లుప్రశ్నించుచున్నాడు.

### పూర్వపక్షము

అట్లైన ద్యూతమున నైదుగురి సొత్తైన ద్రౌపదిని ధర్మరాజొకడే పందెమెట్లు పెట్టెను, ఓడిపోవుటెట్లు. వస్త్రాపహరణకాలమున ద్రౌపదిని చూచి కర్ణుడు ఐదుగురికి భార్యయైన నీవు శాస్త్రవిధిచే కులటవు గాక పతివ్రత వెట్లగుదువని యడుగగా దానికి సమాధానము చెప్పలేక పాండవులూరకుండుటచే నది నిజమేకదా। అట్టిద్రౌపదీదేవి పంచకన్యలలో నొకతెయై ప్రాతఃస్మరణీయ రాలెట్లు అయినదని ॥

### సిద్ధాంతము

భారతభావ మతిగంభీరము కావుననే శ్లో॥ భక్త్యా భాగవతం జ్ఞేయం భక్త్యా యుక్త్యా చ భారతం। భక్త్యా యుక్త్యా చ బుద్ధ్యా చ జ్ఞేయం రామాయణార్ణవ మని వచనము కలదు ఒకమారు తెలిసిన వారిచే భారతమును వినుము. నీసందేహము లన్నియును తీరును ఈ తెలిసీతెలియని ప్రశ్నలడుగుట దానితో చాలింపగల్గెదవు. ఐనను చెప్పెదను వినుము. పాండవులును ద్రౌపదియును ద్యూతమునకు పూర్వమే ఇంద్రప్రస్థపురమున ధర్మజునికి మేమందరము స్వాధీనులమని ప్రమాణము

చేసుకొనిరి. కాని ధర్మజుడు ధృతరాష్ట్రుని యాజ్ఞనుపాలింతునని యుమ ప్రతిజ్ఞ గావించుకొనిరని భారతమందే కలదు. ధృతరాష్ట్రుని ప్రాణములు దుర్యోధనునిలోను దుర్యోధనుని ప్రాణములు కర్ణునిలోను కౌరవుల ప్రాణములన్నియును శకునిలోను ఉండుటచే నిట్టిగందరగోళము భారతము కల్గినదని గ్రహింపుము.

దానిచే దుర్యోధనుడు శకుని సహాయమున గెల్తునని తలచి తండ్రిచే పాండవులను రావించెను. ధృతరాష్ట్రుని యాజ్ఞచే ధర్మజుడు ద్యూతమాడి ఓడిపోయెను. గెల్చినవానికి ఓడినవాడు దాసుడగుటచే బదులు చెప్పగూడదు కావున కర్ణుడు దుర్యోధనుని ప్రీతికై ప్రేలినంతమాత్ర మున ద్రౌపదీదేవి పాతివ్రత్యమునకేమాత్రము హానిలేదు. ప్రీతికై అట్లంటినని కర్ణుడు కృష్ణునితో ననెనని భారతమందే కలదు. రావణుని తలలకు వేర్వేరు శక్తులున్నను అతడొకడే యైనట్లు పాండవులు ఐదుగురును వేర్వేరుగానున్నను ఒకడైన ఇంద్రుని యంశలే యగుటచే ద్రౌపది ప్రతివ్రతయు హోమకుండ మున ప్రభవించుటచే పంచకన్యలలో నొకతెయై ప్రాతఃస్మరణీయురాలు కాకపోదు వినుము వేదములనంతములు, వాటి భాష్యములే పురాణేతిహాసములు. కావున వాటిని సామాన్యులాక్షేపింపరాదు. వాటిరహస్యమువదరికిని తెలియదు ఒకడైన ఇంద్రుడు ఐదు రూపములు వేర్వేరుగా నెట్లయ్యెనందువా వినుము. వేదమందు దేవతలు 33 మాత్రమే శ్రు॥ మహిమాన మేవైషాం య త్రయస్త్రింశత్త్వే దేవాః అను శ్రుతివలన ఒక్కొక్క దేవతకు కోటికోటి రూపములు కలవు. కావుననే వారు 33 కోట్లని ప్రతీతి కలిగెనని కలదు.

అంత దూరమేల. యోగులను భారతమందే భీష్మ ప॥ 3అ, 27 శ్లో॥ ఆత్మనోవై సహస్రాణి బహూని భరతర్షభ కుర్యాద్యోగీ బలం ప్రాప్య తైశ్చ సర్వాం మహీంచరేత్: ప్రాప్నుయా ద్విషయా

నైరృత్ కైశ్చి ద్గుగం తప శ్చరేత్॥ అనియును మార్కండేయ పురాణమున॥ శ్లో॥ యోగీశ్వరా శ్శరీరాణి కుర్వంతి బహూనాన్యపి॥ అనియును కలదు, కావుననే॥ శ్రు॥ ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే అని యును శతపథబ్రాహ్మణమందు శ్రు॥ ఇంద్రస్సర్వా దేవతాః॥ శ్రు॥ ఇంద్రో వై సర్వే దేవాః అని కలదు ఈ చెప్పిన సిద్ధాంత మంతయును మార్కండేయ పురాణమున ప్రశ్న ప్రతి వచన రూపమున ఇట్లు చెప్పబడె. శ్లో॥ శౌనక ఉవాచ॥ కస్మాచ్చ పాండుపుత్రాణా మేకా సా ద్రుపదాత్మజా। పంచానాం మహిషీ కృష్ణా సుమహా నత్ర సంశయః॥ సూతః॥ తేజోభాగై స్తథా దేవా ఆపతేరు ర్దివా న్మహీం। ప్రజానాముపకారార్థం భూభారహరణాయ చ। య దింద్రదేహజం తేజ స్తన్ముమోచ స్వయం వృషః॥ కుంత్యాం జాతో మహాతేజా తతో రాజా యుధిష్ఠిరః॥ బలం ముమోచ పవనః తతో భీమో వ్యజాయత. శక్రవీర్యార్ధత శ్చైవ జజ్ఞే పార్థో ధనంజయః॥ ఉత్పన్నో యమజౌ మాద్ర్యాం శక్రతేజో మహాద్యుతీ। పంచధా భగవా నిత్థ మవతీర్ణ శ్శతక్రతుః తస్యోత్పన్నా మహాభాగా పత్నీ కృష్ణా హుతాశనాత్। శక్రస్యైకస్య సాపత్నీ కృష్ణా నాన్యస్య కస్యచిత్। యోగీశ్వరా శ్శరీరాణి కుర్వంతి బహూనాన్యపి అని విస్పష్టముగ నున్నది.

బ్రహ్మవైవర్తమున శ్రీకృష్ణ జన్మఖండమున 151 అ. శ్లో॥ పంచేంద్రాశ్చ హరేరంశా భవిష్యంతి ప్రియా స్తవ॥ అనియును 115 అ. 7 శ్లో॥ స్వర్గలక్ష్మీ మహేంద్రాణాం సాచ పశ్చా ద్భవిష్యతి। అర్జునాయ దదౌ రాజా కన్యా మాశ్చ స్వయంవరే। ప్రపచ్ఛ మాతరం వీరో వస్తు ప్రాప్తం మయాధునా। త మువాచ స్వయం మాతా గృహాణ భ్రాతృభి స్సహ। శంభో ర్వరేణ పూర్వంచ వరత్ర మాతు రాజ్ఞయా। ద్రౌపద్యా స్స్వామిన స్తే చ హేతునా పంచపాండవాః॥ అని కలదు.

కావున ద్రౌపదీ దేవికి బాహ్యదృష్ట్యా భర్త భర్తలైదుగురుగా తోచినను ఇంద్రుడే వారైదుగురుగావున నొకడే భర్తయనియును ఆమె హోమగుండమందు జనించుటచే పరిశుద్ధకన్య యనియును కావుననే సర్వులకును, ప్రాతస్మరణీయురాలైనదనియును, నిస్సందేహ శాస్త్రసిద్ధాంతము.

మరలనొక పూర్వపక్షము

అటులైన పాండవ ప్రతిజ్ఞా గ్రంథమున పంచపాండవులును ప్రమాణము చేసిన తరువాత ద్రౌపదీదేవి నాకైదుగురు భర్తలున్నను గర్ణునిపై మనసు కలదని చెప్పెను గదా, మరి ఆమె పతివ్రత యగుటెట్లు,

సిద్ధాంతము

ఆ చిన్ని పుస్తకము సర్వప్రతి స్మృతి పురాణేతిహాస విరుద్ధము. దాని నెవ్వరు వ్రాసినది తెలియదు. అచ్చువేయించిన వారు మాత్రము తన కాపుస్తకము లభించినట్లును, అచ్చువేయించినట్లు మాత్రమే కలదు. ఆతడైనను అనామకుడే కాని పండితుడును ప్రామాణికుడును కాడు. దానికి సమాధాన మూతనివంటివాడే, చెప్పవలయును గాని ప్రామాణికుడదుగ సమాధాన మెవ్వడును చెప్పడు. ప్రమాణగ్రంథము లందున్న సంశయవాక్యములకు సమాధానమెవ్వరైనను చెప్పుదురు,

కాన ఇట్టి ఆకాశరామన్న కుంటి ప్రశ్నలకు శాస్త్రప్రామాణికులు బదులు చెప్పరు,

ఇక నటులైన ప్రమాణవాక్యము లేమందువా వినుము, శ్లో॥ వేదాః ప్రమాణం స్మృతయః ప్రమాణం ధర్మార్థ యుక్తం వచనం ప్రమాణం యస్య ప్రమాణం న భవేత్ప్రమాణం కిం తస్య వాక్యస్య భవేత్ప్రమాణం ॥ అను శాస్త్రీయ శిష్టాచారనిర్ణయము గాన నీవు చేసిన పూర్వపక్షమంతయును పూర్వపక్షమే యైనదనుకొని తృప్తి చెందుట మంచిది, ఇక చాలును.

# శ్రీ మహాభారతసారోద్ధారే
# సభాపర్వారంభః
## ప్రథమోధ్యాయః

తతోఽబ్రవీ న్మయః పార్థం వాసుదేవస్య సన్నిధౌ
త్వయా త్రాతోఽస్మి కౌంతేయ బ్రూహి కింకరవాణి తే॥ 1

అర్జున ఉవాచ

కృష్ణస్య క్రియతాం కించి త్తథా ప్రతికృతం మయి
చోదయామాస తం కృష్ణ స్సభా వై క్రియతామితి 2

ధర్మరాజస్య దైతేయ యాదృశీ మిహ మన్యసే
మనుష్యలోకే సకలే తాదృశీం కురు వై సభాం॥ 3

తతః కృష్ణశ్చ పార్థశ్చ ధర్మరాజాయ ధీమతే
సర్వ మేత త్సమావేద్య దర్శయామాసతు ర్మయం॥ 4

తిథావథ చ నక్షత్రే ముహూర్తే చ గుణాన్వితే
ప్రయయౌ పుండరీకాక్ష శ్శైబ్యసుగ్రీవవాహనః 5

# శ్రీ మహాభారతసారోద్ధారమున
# సభాపర్వము
## 1 వ అధ్యాయము

1. తరువాత శ్రీకృష్ణుని సన్నిధానమందు మయుడను రాక్షసుడు అర్జునునితో ఓ కౌంతేయా! నీచే నేను రక్షింపబడితిని. నీకు ప్రత్యుపకారము ఏమి చేయగోరుదువో చెప్పుము. అని పలికెను.

అర్జునుడు చెప్పుచున్నాడు.

2. శ్రీకృష్ణునకు ఏదైన ప్రియమును చేయుము. అదియే నాకు ప్రత్యుపకారమగును. అంతట శ్రీకృష్ణుడు సభను నిర్మించుము, అని వానిని ప్రేరేపించెను

3. ఓ మయుడా! ధర్మరాజునకు తగినట్టియు సమస్త మనుష్యలోకమున ఎచ్చటను లేనట్టి ఒకానొక సభాభవనమును ధర్మరాజునకు నిర్మించుము.

4. తరువాత ఆ కృష్ణార్జునులు ధర్మరాజునకు ఈ వృత్తాంతమునంతను నివేదించి మయుని చూపించిరి.

5 సకల గుణాన్వితమగు తిథినక్షత్రములతో కూడిన ముహూర్తమున శ్రీకృష్ణుడు శైబ్య సుగ్రీవములు వాహనముగా గల వాహనమెక్కి ద్వారకకు బయలుదేరెను.

అన్వారురోహ చాప్యేనం ప్రేమ్ణా రాజా యుధిష్ఠిరః ॥ 6

అపాస్య చాస్య యంతారం దారుకం యమసత్తమః
అభీషూన్ ప్రతిజగ్రాహ స్వయం యదుపతి స్తదా ॥ 7

యోజనార్ధ మథో గత్వా కృష్ణః పరపురంజయః
ధర్మరాజ మథామంత్ర్య కృష్ణోఽపి ద్వారకాం యయౌ ॥ 8

పురం ప్రత్యాగతాః పార్థా శ్శార్ఙ్గధరం చ మయోఽబ్రవీత్ ॥9

మయ ఉవాచ

ఆపృచ్ఛే త్వాం గమిష్యామి పున రేష్యామి చాప్యహం
చిత్రం మణిమయం భాండం రమ్యం బిందుసరః ప్రతి
నిక్షిప్తం పూర్వ మేవేహ గదా చ కురునందన॥ 10-11

అనురూపా చ భీమస్య భవతో గాండీవం యథా
వారుణశ్చ మహాశంఖో దేవదత్త స్సుఘోషవాన్
సర్వ మేతత్ప్రదాస్యామి భవతే నాత్ర సంశయః ॥ 12

ఇత్యుక్త్వా సోఽసురః పార్థం ప్రాగుదీచీం దిశం గతః
నరనారాయణౌ బ్రహ్మా యమః స్థాణుశ్చ పంచమః
తత్ర గత్వా స జగ్రాహ గదాం శంఖం చ భారత
స్ఫాటికం చ సభాద్రవ్యం యదాసీ ద్వృషపర్వణః ॥ 13-14

తదాహృత్య స తాం చక్రే సోఽసురోఽప్రతిమాం సభాం॥15

6. ప్రేమతో యుధిష్ఠిరమహారాజు కూడ వాని ననుసరించి వెళ్ళను.

7. అంతట శ్రీకృష్ణుడు తన సారధియగు దారుకుని తప్పుకొనమని చెప్పి తానే స్వయముగా రథమును తోలెను.

8. ఈ విధముగా అర్ధయోజనము వెళ్ళిన తరువాత ధర్మరాజువద్ద శలవు తీసుకొని ద్వారకకు వెళ్ళను.

9. పాండవులందరు ఇంద్రప్రస్థమునకు తిరిగి వచ్చిరి. అపుడు అర్జునునితో మయు డీవిధముగా పలికెను.

మయుడు చెప్పుచున్నాడు.

10. 11. నీ వద్ద శలవు తీసుకొని బిందుసరోవరమునకు వెళ్ళుచున్నాను. అచ్చటనున్న చిత్రమగు మణులు గల భాండమును అచ్చట నాచే నుంచబడిన గదను తీసుకొని తిరిగి వచ్చెదను.

12. నీకు గాండీవమువలె ఆ గద భీమునకు తగినది. దేవదత్తమను పేరుగల మంచి ధ్వనిగల వరుణసంబంధమైన శంఖమును గూడ తెత్తును. ఇదంతయు నీకివ్వగలను. ఇందు సందేహము లేదు.

13. 14. ఈ విధముగా ఆ రాక్షసుడు పార్థునితో బల్కి ఈశాన్యదిక్కును గూర్చి వెళ్ళిపోయెను ఎచ్చట నరనారాయణులు, బ్రహ్మా యముడు, ఈశ్వరుడు నివసించుచుండిరో అచ్చటకు వెళ్ళి అతడు గదను శంఖమును స్ఫటికవికారమగు పూర్వము వృషపర్వునికి సంబంధించిన సభాద్రవ్యమును అంతను స్వీకరించెను.

15. ఆ ద్రవ్యమునంతను తీసుకొని వచ్చి సాటిలేని సభను నిర్మించెను.

సభా చ సా మహారాజ శాతకుంభమయద్రుమా
దశకిష్కుసహస్రాణి సమంతాదాయతం భవత్ ॥ 16

న దాశార్హీ సుధర్మా వా బ్రహ్మణో వాఽథ తాదృశీ ॥ 17

సభా మష్టౌ సహస్రాణి కింకరా నామ రాక్షసాః
తాం స్మ తత్ర మయేనోక్తాః రక్షంతి చ వహంతి చ ॥ 18

* ఈదృశం తాం సభాం కృత్వా మాసైః పరిచతుర్దశైః
విశ్రుతాం త్రిషు లోకేషు దివ్యాం మణిమయీం మయః ॥ 19

తాం తు కృత్వా సభాం శ్రేష్ఠాం విసృష్టః ప్రయయౌ పునః
నిష్ఠితాం ధర్మరాజాయ మయో రాజ న్న్యవేదయత్

గదాం చ భీమసేనాయ ప్రదదౌ ప్రవరం తదా
దేవదత్తం చార్జునాయ శంఖప్రవర ముత్తమం ॥ 20-21

తతః ప్రవేశనం చక్రే తస్యాం రాజా యుధిష్ఠిరః
తస్యాం సభాయాం రమ్యాయాం రేమే శక్రో యథానృపః॥22

---

* వ్యా॥ ప్రజోత్పత్తి ఆశ్వయుజ శు॥ ౨ యా దినే అర్జునాగమనాత్ సం 1-2-0 కాలేమయసభాప్రాప్తిః ఆశ్వయుజ శు॥ ౧౦ యుధిష్ఠిరాదీనాం మయసభా ప్రవేశనం॥ తదా యుధిష్ఠిరవయః సం 61-0-23 క్రీ॥ పూ॥ 28-6 3045

16. బంగారు వికారమగు వృక్షములతో ఒప్పుచున్న ఆ సభ 10000 మూరల పొడుగు వెడల్పు గలిగి విరాజిల్లు చుండెను.

17. శ్రీకృష్ణుని సుధర్మయను పేరుగల సభకాని, బ్రహ్మయొక్క సభ కాని దీనితో సరితూగకపోయెను.

18. 8000 మంది కింకరులను పేరుగల రాక్షసులు మయుని ఆజ్ఞచే ఆ సభను రక్షించుచుండిరి, మరియు నడుపుచుండిరి.

*19. సుమారు 14 మాసములలో మూడు లోకములయందు ప్రసిద్ధి చెందినట్టియు, మణివికారమై దివ్యమగు ఆ సభను మయుడు నిర్మించెను.

20. ఆ శ్రేష్ఠమగు సభను నిర్మించి పాండవుల ననుజ్ఞ వడసి మయుడు వెళ్ళిపోయెను.

21. మయుడు ధర్మరాజునకు ఈ సభను, భీమసేనునకు శ్రేష్ఠమగు గదను, అర్జునునకు శంఖరాజమును సమర్పించి వెళ్ళెను.

22. తరువాత ధర్మరాజు సభాప్రవేశము చేసెను. రమ్యమగు ఆ సభ యందు దేవేంద్రుడు వలె క్రీడించెను.

---

*వ్యా॥ ప్రజోత్పత్తి సం॥ర ఆశ్వయుజ శు॥ విదియ అర్జునుడు వచ్చిన రోజు. అప్పటినుండి 1 సం॥ 2 మా॥ల కాలమున మయసభ నిర్మింపబడినది. ఆశ్వయుజ శు॥ దశమి యందు ధర్మరాజాదులు మయ సభను ప్రవేశించిరి. అప్పుడు యుధిష్ఠిరుని వయస్సు సం॥ 6'-0-23 క్రీ॥ పూ॥ 28-6-3045.

అర్జునం మే చ సంప్రాప్తా రాజపుత్రా మహాబలాః
అశిక్షిత ధనుర్వేదం కౌరవాజినవాససః
రౌక్మిణేయశ్చ సాంబశ్చ యుయుధానశ్చ సాత్యకిః ॥ 23

♦ సభాయాం షోడశాబ్దాంతే ఇంద్రప్రస్థేతు ధర్మజః
భ్రాతృభి స్సహ పుత్రైశ్చ స్వాగతే మహాలయత్ ॥ 24

అథ తత్రోపవిష్టేషు పాండవేషు మహాత్మసు
వేదోపనిషదాం వేత్తా షడంగవి దనుత్తమః
ఇతిహాసపురాణజ్ఞః పురాకల్ప విశేషవిత్
ప్రత్యక్షదర్శీ లోకస్య తిర్యగూర్ధ్వ మధ స్తథా
నారదస్తు మహాతేజాః పప్రచ్ఛేదం యుధిష్ఠిరం ॥ 25-26

నారద ఉవాచ॥

కచ్చి ద్ధర్మాశ్చ కల్పంతే ధర్మే చ రమతే మనః।

♦ వ్యా॥ అనేన శ్లోకార్థ పర్యాలోచనాయాం ఇంద్రప్రస్థే మయసభాయాం యుధిష్ఠిరః పుత్రభ్రాతృ సమేతో సం 16-0 0 పరిమితం రాజ్యం చకారేతి తదాచ ప్రజోత్పత్తి, ఆశ్వయుజ శు॥ ౧౦ ఆరభ్య సర్వజిత్ ఆశ్వయుజ శు॥ ౧౦ పర్యంతం ఇతి సిద్ధ్యతి। తదా యుధిష్ఠిర వయస్సం 77-0-23 క్రీ॥ పూ॥ 28-6- 3019 తతో నారదాగమనం రాజసూయ యాగ సంకల్పః దిగ్విజయం చాభవత్ ॥

23. అర్జునుని ఆశ్రయించి ధనుర్వేదము నభ్యసించిన మహాబలులగు రాజపుత్రులు అనేకమంది గలరు. అందులో రుక్మిణి పుత్రుడగు అనిరుద్ధుడును, సాంబుడు, యుయుధానుడు, సాత్యకి, మొదలగు వారు ప్రధానులు.

*24. ఆ సభ యందుండి ఇంద్రప్రస్థమున సోదరులతోను, పుత్రులతో కూడి స్వర్గతుల్యముగ 16 సం॥లు ధర్మరాజు రాజ్యమును పరి పాలించెను.

25, 26. తరువాత మహాత్ములగు పాండవులు ఆ మయసభయందుండగా ఉపనిషద్వేత్తయు షడంగవేత్తలలో శ్రేష్ఠుడును ఇతిహాస పురాణము లెరిగిన వాడును పూర్వకల్ప వృత్తాంతములను విశేషముగా ఎరిగినట్టియు, జనుల తిర్యగూర్ధ్వగమనములను ప్రత్యక్షముగ చూడగలిగిన గొప్ప తేజశ్శాలియగు నారదుడు అచ్చటకు విచ్చేసి ఈ విధముగా ధర్మరాజుతో పలికెను.

నారదుడు అడుగుచున్నాడు.

27. ఓ వీరుడవగు ధర్మరాజా ! నీ అర్థములు పుష్కలముగా సిద్ధించు చున్నవా ! నీ మనస్సు ధర్మమునందు ఉత్సాహపడుచున్నదా !

---

*వ్యా॥ ఈ శ్లోకార్థమును విచారించగా ఇంద్రప్రస్థమున ధర్మ రాజు సోదరులతో పుత్రులతో గూడి 16 సం॥లు రాజ్యమును పాలించెను. ప్రజోత్పత్తి సం॥ర ఆశ్వయుజ శుద్ధ దశమినుండి సర్వజిత్తు సం॥ర ఆశ్వయుజ శుద్ధ దశమి వరకు అని తేలుచున్నది. అప్పుడు ధర్మరాజు వయస్సు 77 సం॥ 23 రో॥ కీ౹॥ పూ॥ 28 —6 —3023 తరువాత నారదుని రాకయు రాజసూయయాగ సంకల్పము దిగ్విజయ యాత్రయు చేయబడినవి.

కులీనా శ్చానురక్తాశ్చ కృతాస్తే వీర మంత్రిణః॥ 27

కచ్చిద్దుర్గాణి సర్వాణి ధనధాన్యాయుధోదకైః।
యంత్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పిధనుర్ధరైః॥ 28

కచ్చిద్వినయసంపన్నః సత్కృత స్తే పురోహితః।
సంప్రాప్తకాలే దాతవ్యం దదాసి న వికత్థసే॥ 29

కచ్చిద్దారా మనుష్యాణాం తవార్థే మృత్యుమీయుషాం।
వ్యసనం చాభ్యుపేతానాం బిభర్షి భరతర్షభ॥ 30

కచ్చి దాయస్య చార్ధేన చతుర్భాగేన వా పునః।
పాదభాగై స్త్రిభిర్వాఽపి వ్యయ స్సంశుధ్యతే తవ॥ 31

కచ్చిద్ జ్ఞాతీన్ గురూ న్వృద్ధా న్వణిజో శిల్పిన స్తథా।
కచ్చిదర్థేషు సంప్రౌఢాన్ హితకామా ననుప్రియాన్।
నాపకర్షతి కర్మభ్యః సర్వ మప్రాప్య కిల్బిషం॥ 32-33

కచ్చిద్రాష్ట్రే తటాకాని పూర్ణాని చ బృహంతి చ।
భాగశో వినివిష్టాని న కృషి ర్దేవమాతృకా॥ 34

కులీనులును, నీ యందనురాగము గల మంత్రులను నియమించు కొంటివా ।

28. నీ దుర్గములన్నియు ధనధాన్యములతోను, ఉదకములతోను, యంత్రములతోను, శిల్పకారులతోను, ధనుర్ధారులతోను నిండి యున్నవి గదా ।

29. వినయసంపన్నుడగు నీ పురోహితుడు నీచే గౌరవింపబడుచున్నాడు గదా । యోగ్యమగు కాలమున దానము చేయదగినది ఇచ్చు చున్నావు గదా । దానము చేయదగిన దానిని లోభముచే వెనుకకు లాగుట లేదు కదా ।

30. నీ కొరకు మృత్యువునకును వెనుదీయనట్టి భార్యలను పోషించు చుంటివా । దుఃఖమును పొందిన వారిని అన్నవస్త్రాదులచే పోషించుచుంటివి కదా ।

31. ఆదాయములో సగముతో గాని లేక నాలుగవ వంతుతో గాని లేక 3/4 వంతుతోగాని ఖర్చును సరిపెట్టుచుంటివి కదా ।

32, 33 జ్ఞాతులను, గురువులను, వృద్ధులను, వర్తకులను, శిల్పులను, పనులందు నేర్పరులను నీ హితము కోరు వారలను నేరములేకయే పనులనుండి తొలగించుట లేదు కదా ।

34. తటాకములను వంతుల ప్రకారము వ్యవసాయదారులకు వినియోగించు చుంటివా । నీ కృషి యంతయు కేవలము వర్షాధారమైనదై లేదుకదా ।

కచ్చిత్స్వనుష్ఠితా తాత వార్తా తే సాధుభిర్జనైః।
వార్తాయాం సంశ్రిత స్తాత లోకోఽయం సుఖమేధతే। 35

కచ్చిత్కృతం విజానీషే కర్తారం చ ప్రశంససి।
సతాం మధ్యే మహారాజ సత్కరోషి చ పూజయన్॥ 36

కచ్చి దగ్నిభయాచ్చైవ సర్వం వ్యాలభయాత్తథా।
రోగరక్షోభయాచ్చైవ రాష్ట్రం స్వం పరిరక్షసి॥ 37

కచ్చిదంధాంశ్చ మూకాంశ్చ పంగూన్వ్యంగానబాంధవాన్।
పితేవ పాసి ధర్మజ్ఞ తథా ప్రవ్రజితానపి॥ 38

షడనర్థా మహారాజ కచ్చిత్తే పృష్ఠతః కృతాః।
నిద్రాలస్యం భయం క్రోధో మార్దవం దీర్ఘసూత్రతా॥ 39

* పితా చ త్వాహ కౌంతేయ పాండుః కౌరవనందన
సమర్థోఽసి మహీం జేతుం భ్రాతరస్తే స్థితా వశే
రాజసూయం క్రతుశ్రేష్ఠ మాహరస్వేతి భారత ॥ 40-41

* వ్యా॥ లోకాంతరస్థ పితృదేవతావిషయే ధర్మశాస్త్రేషు వేదేష్వేవమేవ విన్యాసః। తథాహి బ్రాహ్మణానాం పితృదేవాః భృగుపుత్రాః సోమపాః ౨ క్షత్రియాణాం తు అంగిరసపుత్రాః హవిర్భుజః ౩ వైశ్యానాం పులస్త్యపుత్రాః

35. సాధువులతో చక్కగా సంప్రదింపులు జరుపుచుంటివి గదా। పెద్దల సంప్రదింపును, ఆశ్రయించినవాడు. ఈలోకమున చక్కగా వృద్ధి పొంద గలడు.

36. నీకు మేలొనర్చిన వారిని తెలుసుకొని, అట్టివానిని ప్రశంసించుచు సత్పురుషుల మధ్యయందు పూజించుచూ, సత్కరించు చుంటివి కదా।

37. నీవు ఈ రాజ్యమును అగ్ని భయమునుండియు, సర్పభయము నుండియు, రోగ, రాక్షస, భయములనుండియు. సంరక్షించుచుంటివి కదా।

38. అంధులను, మూగవారిని, కుంటివారిని. వికలాంగులను. దిక్కు లేని వారిని, యతీశ్వరులను తండ్రివలే రక్షించు చుంటివి కదా?

39. నిద్ర, బద్ధకము. భయము, కోపము మార్దవము. ఇప్పుడు ఏమి తొందరలే తరువాత చూత మనెడి ఉపేక్షా భావము, ఈ ఆరును, గొప్ప అనర్థములు, వీటిని విడిచి ఉంటివికదా?

*40 41 ఓ ధర్మరాజా। నీతండ్రియగు పాండురాజు నీతో చెప్పుమనిచెప్పెను నీవు యీ భూమండలమును జయించగల సమర్థుడవు నీ సోదరులు నీ వశమునందున్నారు. రాజసూయమను పేరుగల గొప్ప క్రతువును చేయుమా। అని నారదుడు ఉపదేశించి వెడలిపోయెను.

---

*వ్యా॥ లోకాంతరమునందున్న పితృదేవతల విషయమున వేదములయందును ధర్మశాస్త్రముల యందును. ఈ విధముగా వివరింపబడినది. అదేదన 1) బ్రాహ్మణు కు పితృదేవతలు సోమపానముచేయు భృగుపుత్రులు. 2. క్షత్రి ములకు పితృదేవతలు హవిస్సును భుజించునట్టి

ఆజ్యపాః 4 శూద్రాణాం తు వసిష్ఠస్యపుత్రాః సనకాదయః పితృదేవతా భూత్వా పిత్రాదిలోకేషు స్థితాః। ఊర్ధ్వ మధ్యాధోలోకేష్వపి సంస్థితాః॥

అపిచ 1) అగ్నిదగ్ధాః 2) అనగ్నిదగ్ధాః 3) సోమపాః 4) బర్హిషదః 5) అగ్నిష్వాత్తాః 6) సౌమ్యాః ఇత్యభిధా స్సర్వేపి బ్రాహ్మణానామేవపితృదేవతాః। తేషాం తృప్తివిషయే శ్లో॥ అగ్నౌకృతేన దేవస్థాః స్వర్గస్థావిప్రభోజనే యమస్థాః పిండదానేన వికరా న్నారకే స్థితాః॥ దక్షిణా మర్త్యలోకస్థాః అసురా భూరిభోజనాత్ పితర స్తృప్తి మాయాంతి షడంగం పైతృకం తతః ఇతి కారికాస్మృతౌ ఆచారకాండే ప్రతిపాదితం॥

నచ లోకాంతరస్థితస్య జీవస్య ఏతత్ శ్రాద్ధఫలలాభః। వస్వాదిదేవతాః సర్వజ్ఞత్వాది సామర్థ్య విశిష్టాః। శ్రాద్ధకర్మణి కర్తృభిః పుత్రాదిభిః పిత్రాదిఅధిష్ఠాతృ రూపేణ ఆరాధితా స్సంతః అవాప్తవ్యాని సురక్షణి కృతానీ ఇత్యాది శ్రుత్యుక్తరీత్యా స్వాశ్రితాన్ పిత్రాదీన్ తాత్ర పుత్రాదిపి ఫలేన ఘటయంతి। యథా మాతా గర్భపోషణాయ అన్య దత్తం దోహదాన్నపానాదీన్ స్వయముపభుంక్తే। తృప్తా సతీ జఠరగత మపత్యం తర్పయతి తద్వత్ పితృ్రా న్తర్పయంతి వస్వాద్యాః పితరః॥ తస్మాత్ నైమిత్తికాన్య ప్యవశ్యం కర్తవ్యాని నిఃశ్రేయసకామిభిః॥ ప్రత్యాబ్దికం పరిత్యజ్య కారణం

ఆంగిరస పుత్రులు. 3. వైశ్యులకు పితృదేవతలు నేయిని పానము చేయు పులస్త్యపుత్రులు 4. శూద్రులకు పితృదేవతలు వసిష్ఠపుత్రు లగు సనకాదులు.

వీరు పితృదేవతలు పితాదిరూపములందు ఉండిరి. ఊర్ధ్వ లోకమునందును, మర్త్య లోకమునందును, అధోలోకమునందునూ ను న్నారు.

మరియు 1) అగ్నిదగ్ధులు 2) అనగ్నిదగ్ధులు 3) సోమపులు 4) బర్హిషదులు 5) అగ్నిష్వాత్తులు 6) సౌమ్యులు అను పేరుగల వీరందరును బ్రాహ్మణులకే పితృదేవతలు. వీరికి తృప్తి కలుగువిషయములో శ్లో॥అగ్నౌకరణముచే దేవలోకమునందున్న వారును. బ్రాహ్మణ భోజనముచే స్వర్గమునందున్నవారును పిండప్రదానముచే యమలోకము నందున్నవారును, వికిరపిండముచే నరకమునందున్నవారును, దక్షిణచే మర్త్యలోకమునందున్నవారును. విస్తారబ్రాహ్మణ భోజనముచే రాక్షసు లుగా నున్నవారలగు పితృదేవతలు తృప్తిని పొందుచున్నారు. అందు వలన శ్రాద్ధము పైచెప్పిన ఆరు అంగములు గలదై ఉండవలయును. అని కారికావృత్తి ఆచారకాండ యందు చెప్పబడియున్నది.

లోకాంతరమందున్న జీవులు ఈ లోకమున చేయబడిన శ్రాద్ధము యొక్క ఫలము ఎట్లు పొందెదరు ? అను శంకకు సమాధానము చెప్పు చున్నాడు. వస్వాది దేవతలు సర్వజ్ఞత్వాది సామర్థ్యము కలవారు. శ్రాద్ధ కర్మయందు కర్తలగు పుత్రాదులచే పిత్రాదులను ఆవాహనముచేసి బ్రాహ్మణులను ఆ రూపముగ భావించి పూజింపబడినవారై శ్రు॥ " అవాద్ధవ్యాణి కృత్వా " ఇత్యాది శ్రుతులచే చెప్పబడిన విధముగా తమ్మాశ్రయించిన పిత్రాది దేవతలను గూర్చి వారెచ్చట నున్నను ఈ వస్వాదిదేవతలే శ్రాద్ధఫలమైన తృప్తిని వారలకు గలిగించెదరు. అతే

ఋషే స్త్వద్వచనం శ్రుత్వా జగామ మనసా హరిం 42

గతేతు నారదే పార్థో భ్రాతృభి స్సహ కౌరవ
రాజసూయం క్రతుశ్రేష్ఠం చింతయామాస పార్థివః॥ 43

హరిశ్చంద్రం చ రాజర్షిం రోచమానం విశేషతః।
యజ్వానం యజ్ఞకర్తారం చ రాజసూయ మియేష సః॥ 44

పాండవో భూత గురవే ప్రాహిణో ద్దూత మంజసా।
ఇంద్రసేనేన సహిత ఇంద్రప్రస్థ మగాద్ధరిః॥ 45

పూజితో పాండవేనాథ హరిః కౌంతేయ మబ్రవీత్॥ 46

కృష్ణ ఉవాచ॥

---

నరకం వ్రజేత్ కిముత చేంద్రాంశేన జాతస్య స్వర్గలోకస్థ
పాండురాజవిషయే ఇతి శం॥

42. నారదుని ఆవాక్యమును విని ధర్మరాజు మనస్సుచే శ్రీకృష్ణుని పొందెను.

43. నారదుడు వెళ్ళగా ధర్మరాజు సోదరులతోగూడి క్రతుశ్రేష్ఠమగు రాజసూయమును గూర్చియే ఆలోచించెను.

44. రాజర్షియగు హరిశ్చంద్రుడు ఈ క్రతువు నాచరించి విశేషముగ ప్రకాశించుటగాంచి ధర్మరాజు రాజసూయముచేయ నిశ్చయించెను.

45. ధర్మరాజు భూతములకు గురువగు కృష్ణునివద్దకు వేగముగా నొక దూత నంపెను. ఇంద్రసేనునితో గూడి శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ మునకు వచ్చెను.

46. పాండవులచే పూజింపబడి శ్రీకృష్ణుడు ధర్మరాజుతో నిట్లు పలికెను.

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

---

ట్లన తల్లి తన గర్భమునందున్న శిశువునకు పోషణ కలుగుటకై ఇతరులు ఇచ్చిన రసాయనములను అన్నపానాదులను తాను స్వయముగా ననుభ వించి తృప్తి నొందినదై తన గర్భమునందున్న శిశువునకు గూడ తృప్తిని గలిగించుచున్నదిగదా। అట్లే ఇచ్చట గూడ వస్వాది పితృ దేవతలు మన పితృదేవతలను తృప్తిపరచుచున్నారు. కావున శ్రాద్ధాదులు తప్పక నిశ్శేయసకాములచే చేయదగినవి ప్రత్యాబ్దికమును వొదిలిపెట్టి నచో రౌరవనరకమును పొందెదరు. ఇంద్రాంశచే పుట్టి స్వర్గలోకమునం దున్న పాండురాజు విషయమున ఏమి చెప్పవలయును.

ఇదానీమేవ వై రాజన్ జరాసంధో మహీపతిః।
రాజన్ సేనాపతిర్జాత శ్శిశుపాలః ప్రతాపవాన్॥ 47

దంతవక్త్రః కరూశశ్చ కరభో మేఘవాహనః।
పౌండ్రకో వాసుదేవేతి యోఽసౌ లోకేఽభివిశ్రుతః
భగదత్తో మహాబాహు ర్జరాసంధ ముపాశ్రితాః॥ 48

హంసం చ డిచకం చైవ నరకాసుర మేవచ।
కంసం చ హతవా నస్మి తస్మాన్మయి రుషా స్థితః॥ 49

తేన క్రుద్ధా హి రాజానః సర్వే జిత్వా గిరివ్రజే।
వయం చైవ మహారాజ జరాసంధభయా త్తదా।
మధురాం సంపరిత్యజ్య గతాః ద్వారవతీం పురీం॥ 50–51

యది మే హృదయం వేత్సి యది తే ప్రత్యయో మయి।
భీమసేనార్జునౌ శీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛ మే॥ 52

తథేతి ప్రతిజగ్రాహ ధర్మరాజ స్తతః త్రయః।
వార్ష్ణేయో పాండవేయా చ ప్రతస్థు ర్మాగధం ప్రతి॥ 53

భంక్త్వా భేరీత్రయం తేఽపి చైత్య ప్రాకార మాద్రవన్।
నివేశన మథాజగ్ము ర్జరాసంధస్య ధీమతః ॥ 54

వేషం కృత్వా స్నాతకానాం యాదిశా యుద్ధకాంక్షిణాం
స తథేతి కరిహాపి స్వసృజన్ రంగ మాగతః ॥ 55

47. ఇప్పుడే ఓ ధర్మరాజా ! జరాసంధుడు ప్రభువైనాడు. పరాక్రమ శాలియగు శిశుపాలుడు సేనాపతి అయినాడు

48. దంతవక్త్రుడు, కరూషుడు, మేఘవాహనుడు లోకమునందు ప్రసిద్ధి చెందిన పౌండ్రకవాసుదేవుడు, భగదత్తుడు వీరందరను జరాసంధుని ఆశ్రయించి ఉన్నారు.

49. నేను పూర్వమే హంసుని, డిచకుని, నరకాసురుని, కంసుని సంహరించితిని. అందుచే వీరందరు నా యందు శత్రువులై ఉన్నారు.

50, 51. వీరందరూ కలసి గిరివ్రజమున మహాస్త్ర చుట్టుముట్టిరి. అప్పుడు మేము జరాసంధునివలన భయముచే మథురానగరమును వదలి ద్వారకా నగరమునకు వెళ్ళితిమి.

52. కావున నీవు నా హృదయమును గుర్తించినచో ఓ ధర్మరాజా ! నీకు నాయందు నమ్మకమున్నచో భీమార్జునులను నాకు అధీన మొనర్చుము.

53. అలాగేనని ధర్మరాజు శ్రీకృష్ణుని వాక్యము నంగీకరించెను. అంతట శ్రీకృష్ణుడు భీమార్జునులు ముగ్గురును జరాసంధునిగూర్చి బయలుదేరిరి.

54. వారు ఆ జరాసంధుని మూడు భేరులను బద్దలుగొట్టి ఉద్యానవన ప్రాకారమును లంఘించి జరాసంధుని గృహములో ప్రవేశించిరి.

55. వారు ముగ్గురును బ్రహ్మచారివేషములను ధరించి స్నాతకులవలె వచ్చి యుద్ధదక్షిణను కోరిరి. ఆ జరాసంధుడు అలాగేనని కిరీటాదులను విడిచి పెట్టి యుద్ధరంగమునకు వచ్చెను.

తతస్త్రయోఽపి తే రాజన్ స్వస్వరూపేణ సంస్థితాః ॥ 56

కృష్ణ ఉవాచ

త్రయాణాం కేన తే రాజన్ యోద్ధు ముత్సహతే మనః
జరాసంధః తతో వవ్రే భీమసేనేన మాగధః ॥ 57

కార్తికస్య చ మాసస్య ప్రవృత్తః ప్రథమేఽహని
అనాహార మవిశ్రాంతం దివారాత్ర మవర్తత ॥ 58

తత శ్శబ్దేన మహతా భర్త్సయంతౌ పరస్పరం
పాషాణసంఘాతనిభైః ప్రహారై రభిజఘ్నతుః ॥ 59

తద్వృత్తం తు త్రయోదశ్యాం సమవేతం మహాత్మనోః
చతుర్దశ్యాం నిశాయాం తు నివృత్తో మాగధః క్లమాత్ ॥60

కృష్ణేన ప్రేరితో భీమో జరాసంధం విదారయత్
మిళితోఽగా త్పునస్తద్వ ద్వ్యత్యస్తేన ద్విధా కరోత్ ॥ 61

హత స్తతో జరాసంధః తం విసృజ్య పురా ద్బహిః
దివ్యం తస్య రథం కృష్ణో యోజయ త్స్వపతాకినం ॥ 62

56. అప్పుడు వారు ముగ్వురను బ్రాహ్మణవేషములను విడిచిపెట్ట నిజ రూపములతో నుండిరి.

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

57 మా ముగ్వురిలో ఎవరితో పోరాడుటకు ఉత్సహించుచున్నావు. అన జరాసంధుడు భీమసేనునితో యుద్ధమును కోరెను.

58. వారిద్దరకు కార్తీకశుద్ధ పాడ్యమినుండి ఆహారము, విశ్రాంతియు లేనట్టి యుద్ధము రాత్రింబవళ్ళు జరిగెను.

59. గొప్ప శబ్దముతో ఇద్దరును మల్ల చరచుచు పరస్పరము రాతి దెబ్బతో సమానములగు ముష్టి ప్రహారములచే ఒకరినొకరు కొట్టు కొనిరి.

60 ఈ విధముగా 13 రోజులు మహాబలులగు వారుభయులకు యుద్ధము జరిగెను. చతుర్దశి రాత్రి యందు జరాసంధుడు అలసటచే పడి పోయెను.

61. శ్రీకృష్ణునిచే ప్రేరేపింపబడి భీముడు జరాసంధుని చీల్చి వేసెను. ఆ రెండు ముక్కలు మరల కలుసుకొని వాడు సజీవుడాయెను. భీముడు మరల చీల్చి ఆ రెండు ముక్కలను వ్యత్యస్తముగా పడ వేసెను.

62. అంతట జరాసంధుడు చనిపోయెను. చనిపోయినవానిని నగరము వెలుపల విడిచి పెట్టి శ్రీకృష్ణుడు దివ్యమగు అతని రథమును తమ పతాకముచే నలంకరించి పూన్చిరి.

అగోప్య భ్రాతరౌ చైవ మోచయామాస క్షత్రియాన్ । 63

జరాసంధాత్మజశ్చైవ సహదేవో మహామనాః
నిర్యయౌ సజనామాత్యః పురస్కృత్య పురోహితం । 64

అభ్యషించత తత్రైవ జరాసంధాత్మజం ముదా
రత్నాన్యాదాయ భూరీణి ప్రయయుః పురుషర్షభాః ॥ 65

అజాతశత్రుస్తాన్ దృష్ట్వా ముముదే భ్రాతృభిః సహ ॥ 66

తతో గతే భగవతి కృష్ణే దేవకీనందనే
తద్రాజా ధర్మతశ్చక్రే ప్రజాపాలన కీర్తనః॥ 67

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే సభాపర్వణి
ప్రథమోఽధ్యాయః సమాప్తః॥

## ద్వితీయోధ్యాయః

దిశం ధనపతేరిష్టా మజయత్పాకశాసనిః
అర్జునశ్చోత్తరే రాజన్ కులిందాన్సర్వశాస్తథా ॥ 1

కాలకూటాంశ్చ జిత్వా తచ్ఛాకలం ద్వీపమేవ చ
ప్రతిషిద్ధ్యం విజిత్యాఽథ ప్రాగ్జ్యోతిషపతిం తథా ॥ 2

63. భీమార్జునులిద్దరును ఆ రథము నెక్కించి క్షత్రియుల నందరను విడిపించెను.

64. జరాసంధుని కుమారుడును, మహాబుద్ధిశాలియగు సహదేవుడు జను లతోను, మంత్రులతోను, పురోహితుని ముందిడుకొని వచ్చి వీర లకు పాదాక్రాంతుడాయెను.

65. వానిని అచ్చట సంతోషముతో నభిషేకించి వాని నుండి రత్నరాసు లను గొని వెళ్ళిపోయిరి.

66. ధర్మరాజు వారిని చూచి సోదరులతో మిక్కిలి సంతోషించెను.

67. తరువాత దేవకీపుత్రుడును, భగవంతుడగు శ్రీకృష్ణుడు వెళ్ళగా ధర్మరాజు ధర్మయుక్తముగా ప్రజలను పరిపాలించెను.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున సభాపర్వమందు
ఒకటవ అధ్యాయము సమాప్తము.

# 2 వ అ ధ్యా య ము

1. కుబేరునకు ఇష్టమైన ఉత్తరదిక్కును అర్జునుడు జయించెను. అతడు కుళిందులను, సర్తకులను ఓడించెను.

2. తరువాత కాలకూటులను, శాకలద్వీపమును, ప్రతివింధ్యుని ప్రాగ్జ్యో తిషపట్టణమును జయించెను.

స కిరాతైశ్చ దీనైశ్చ సాగరానూపసంస్థితైః
యుద్ధ్వా ధన ముపాదాయ యయౌ ధనదపాలితం ॥ 3

అంతర్గిరిం చ కౌంతేయో జిత్వా తచ్చ బహిర్గిరిం
తథైవోపగిరిం తద్వ దులూకం చోత్తరం తతః ॥ 4

సేనాబిందుం వామదేవం సుదామానం సుసంకులం
పౌరవం తం విజిత్యాఽసౌ పార్వతీయాన్ మహారథాన్ ॥ 5

కాశ్మీరకాన్ త్రిగర్తాంశ్చ తత్ర కోకనదాం స్తదా
బాహ్లీకాన్ దరదాంశ్చైవ కాంభోజా నృషికానపి ॥ 6

స వినిర్జిత్య సంగ్రామే హిమవంతం సనిష్కుటం
శ్వేతపర్వత మాక్రమ్య దేశా న్కింపురుషా నథ ॥ 7

హాటకం గుహ్యకాక్రాంతం మానసం సర ఉత్తమం
గంధర్వరక్షితం దేశ మజయ త్పాండవ స్తతః ॥ 8

ఉత్తరం కురువర్షం తు గతే తద్వాసినో ఽబ్రువన్ ॥ 9

కురవ ఊచుః

నహి మానుష దేహేన శక్య మత్రాభివీక్షితుం
రత్నౌఘా న్ధనరాశీంశ్చ గృహ్ణీష్వేతి దదు స్తతః ॥ 10

3. ఆతడు కిరాతులతోను సముద్రప్రాంతమునందున్న చీమలతోను, యుద్ధము చేసి ధనమును స్వీకరించి కుబేరునిచే పరిపాలింపబడు ఉత్తరదిక్కును గూర్చి వెళ్ళను.

4. ఆతడు అంతర్గిరిని, బహిర్గిరిని, ఉపగిరిని, దానికి ఉత్తరమందున్న ఉలూక దేశమును జయించెను.

5. సేనాబిందువును వామదేవుని, సుదాముని, పురువంశజుడైన పౌరవుని జయించి మనోరధులగు పర్వతదేశవాసులను గూర్చి దండెత్తి వెళ్ళను.

6. కాశ్మీరీయులను, త్రిగర్తులను, కోకనదులను, బాహ్లీకులను, దరదులను, ఋషికులను, గూర్చి దండెత్తెను.

7. అర్జునుడు యుద్ధమున వారి నందరిని జయించి హిమవత్పర్వతము నంతను శత్రువులు లేనిదానినిగ చేసెను,

8. గుహ్యకులచే ఆక్రమింపబడిన హాటకదేశమును మానససరోవరమును, గంధర్వులచే రక్షించబడు దేశమును అర్జునుడు జయించెను,

9. తరువాత ఉత్తరకురువర్షమును గూర్చి దండెత్తి వెళ్ళగా అచ్చట నున్న వారిట్లు పలికిరి,

కురువర్షీయులు చెప్పుచున్నారు,

10. మనుష్యదేహముతో ఇచ్చటికి వచ్చుటకు శక్యము కాదు. కావున రత్నములను, ధనరాసులను స్వీకరించుమని విశేషముగ నొసంగిరి.

తేనాజగామ పార్థస్తు శక్రప్రస్థం పురోత్తమం ॥ 11

భీమసేనోఽపి తద్వత్స యయౌ ప్రాచీదిశం ప్రతి
పాంచాలాన్ దండకాన్ జిగ్యే విదేహా నశ్వమేధకాన్ ॥ 12

♦ దాశార్ణా న్సపుళిందాంశ్చ చైద్యా న్ద్వో కోసలానపి
తతో గోపాలకక్షం చ మల్లానా మాధిపం ప్రభుం ॥ 13

తతో హిమవతః పార్శ్వం భల్లాటం శుక్తి మంతకం।
కాశీరాజం చ మాత్స్యాంశ్చ మలదాస కయాశకాన్ ॥ 14

అనఘా నభయాంశ్చైవ పశుభూమిం చ సర్వశః।
మదధారం సోమధేయం నిషాదా న్వత్సకానపి॥ 15

భోగవంతం శర్మకాంశ్చ వర్మకా న్స విదేహకాన్।
శకాంశ్చ బర్బరాంశ్చైవ కిరాతా న్సప్తకానపి ॥ 16

---

♦ వ్యా॥ అత్ర ప్రాక్పశ్చిమవిభాగజ్ఞానావసరే శరావత్యాస్తు యోఽవధేః దేశః ప్రాగ్దక్షిణఃప్రాచ్యః ఉదీచ్యః పశ్చిమోత్తరః ఇతి ॥

ఏతచ్ఛరావతీ నదీ ఈశాన్య దిశ స్సకాశాత్ పశ్చిమ సముద్రగామినీ వహతి। తస్యా అవధేః యః ప్రాగ్దక్షిణో దేశః సః ప్రాచ్య ఇత్యుచ్యతే। తస్యాః శరావత్యాః అవధేః యః పశ్చిమోత్తరః స ఉదీచ్యః ఇత్యుచ్యతే। ఇదానీం

11. ఆ ధనరాసుల నన్నిటిని తీసుకొని పుర శ్రేష్ఠమగు ఇంద్ర ప్రస్థము ను గూర్చి అర్జునుడు తిరిగి వచ్చెను.

12. భీమసేనుడు ను అట్లే తూర్పు దిక్కును గూర్చి వెళ్ళెను. పాంచా లులను. దండకులను విదేహులను అశ్వమేధకులను జయించెను.

*13. దాశార్హులను, పుళిందులను. చైద్యులను. ఉత్తర దక్షిణ కోసల దేశములను మల్లులకు అధిపతియగు గోపాలకుని జయించెను.

14. తరువాత హిమవత్పార్శ్వమునందున్న భల్లాటకమను. శుక్తిమంత మను జయించెను. మత్స్య దేశములను. మలద దేశములను. కరూశ దేశములను జయించెను.

15. అనఘదేశములను. అభయదేశములను. పశుభూమిని మదధార మును, గోమధేయుని. విషాదులను. వత్సకులను జయించెను.

16. భోగవంతమును. శర్మకులను. వర్మకులను. విదేహకులను, శకు లను. బర్బరులను, కిరాతులను. ఈ 7 గురిని జయించెను.

---

*వ్యా॥ ఇచ్చట ప్రాగ్దేశ. పశ్చిమదేశ విభాగజ్ఞానము విషయములో శ్లో॥ శరావతీనదిని హద్దుగా చేసుకొని ఆ నదికి ఆగ్నేయదిక్కుగానున్న దేశము ప్రాగ్దేశము. వాయువ్యముగా నున్న దేశము ఉత్తర దేశము అని విర్ణయము. ఈ శరావతీనది ఈశాన్యదిక్కు నుండి పశ్చిమముగా ప్రవహిం చుచూ పశ్చిమ సముద్రములో కలియుచున్నది. ఆ నదికి ఆగ్నేయముగా నున్న దేశము ప్రాగ్దేశమని చెప్పబడుచున్నది. ఆ నదినిహద్దుగా చేసుకొని ఆనదికి వాయవ్యముగానున్న దేశము ఉత్తరదేశమని చెప్పబడుచున్నది.

తత స్సుహ్మాన్ ప్రసుహ్మాంశ్చ స్వపక్షా న్మాగధానపి।
తద్వత్పుండ్రాన్ కౌశికీకాన్ తామ్రలిప్తా న్సఖర్వటాన్॥ 17

సర్వాన్ మ్లేచ్ఛగణాంశ్చైవ విజిజ్ఞే భరతర్షభః।
కరమాహారయ త్సర్వం యుధిష్ఠిర మదా త్ప్రభుః॥ 18

తథైవ సహదేవోఽపి ప్రయయౌ దక్షిణాం దిశం।
శూరసేనాన్ సమత్స్యాంశ్చ దంతవక్త్రం సచాధిపం॥ 19

పటచ్చరా న్నిషాదాంశ్చ గోశృంగం శ్రేణిమాతకం।
నవరాష్ట్రాణి నిర్జిత్య కుంతిభోజ ముపాగ్రవత్॥ 20

తతశ్చర్మణ్వతీతీరం సేకాన్ పరసేకకాన్।
విందానువిందా వావంత్యౌ భోజాన్ప్రాచ్యాంశ్చ కోసలాన్॥ 21

నాటకేయా న్ముంజకాంశ్చ నాచీనా నర్వకాన్ వనాన్।
వాతాధిపం పులిందం చ పౌండ్రం కిష్కింధకా న్నృపాన్॥ 22

తత్ర వానరరాజాభ్యాం మైందేన ద్వివిదేన చ।
యుద్ధ్వా రత్నా న్యుపాదాయ పురీంమాహిష్మతీంయయౌ॥ 23

---

తచ్చరావతీం నదీం కోసీ ఇతి వదంతి॥ సురాష్ట్రే సైదాసీం సూరత్ ఇతి బ్రువంతి॥

17. తరువాత సుహ్మాలను. ప్రసుహ్మాలను. వ్రవషులను, మాగధులను పుండ్రులను, కౌశికులను తామ్రలిప్తులను. ఖళ్వటులను జయించెను.

18. మ్లేచ్ఛరాజులనందరిని జయించి వారినుండి గొప్ప ధనాదులను పన్నుగా తీసుకొని వచ్చి ధర్మరాజునకు ఒసంగెను.

19. అట్లే సహదేవుడు కూడ దక్షిణదిక్కును గూర్చి దండెత్తి వెళ్ళెను. అతడు శూరదేశములను. మత్స్యదేశములను. ప్రభువగు దంతవక్త్రుని జయించెను.

20. నిషాదదేశములను. గోశృంగమును. అంతకశ్రేణిని. మొ॥లగు 8 దేశములను జయించి కుంతిభోజునిపై దండెత్తెను.

21. తరువాత చర్మణ్వతీ నదీతీరమును. సేకనదేశమును, పరసేకకులను విందానువిందులను, అవంతిదేశములను, భోజదేశములను. ప్రాచ్య దేశములను. కోసలదేశములను జయించెను.

22. నాటకేయులను. అర్వుకులను. వనదేశములను, వాతాధిపుని, పులిందుని, పౌండ్రుని. కిష్కింధకులను. గుహలను జయించెను.

23. అచ్చట వానరరాజులగు మైందద్వివిదులతో యుద్ధము చేసి వారి నుండి రత్నములను స్వీకరించి మాహిష్మతీ పట్టణమును గూర్చి వెళ్ళెను.

---

అ నదిని ఇప్పుడు కోసి (Cosi) నది యని చెప్పుచున్నారు. సురాష్ట్రమునకు ఇప్పుడు సూరత్ (Surat) అని వ్యవహారము.

తత్ర నీలం హావ్యవాహప్రధానా న్మిత్ర మాప్యచ।
త్రైపురం పౌరవం చైవ సురాష్ట్రిం భోజకీటకం॥ 24

శూర్పాకరం చ తత్రైవ లాలాకట మథాపి చ।
దండకా న్సాగర ద్వీపవాసా న్మ్లేచ్ఛాం స్తథైవ చ॥ 25

నిషాదా న్పురుషాదాంశ్చ కర్ణ ప్రావరణానపి।
ఏక కాలముఖా నామ నరరాక్షసయోనయః। 26

పౌండ్రాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః।
ఆంధ్రాం స్తాలవనాంశ్చైవ కళింగా నుష్ట్రకర్ణికాన్ ॥ 27

జిత్వా లంకాం స్వకం దూతం ప్రేషయామాస రాక్షసం।
విభీషణాయ ధర్మాత్మా౽ప్రీతిపూర్వమరిందమః॥ 28

తచ్చకాల కృతం ధీమా నభ్యమన్యత స ప్రభుః।
తత స్సంప్రేష యామాస రత్నాని స బహూని చ।
వాసాంసి చ మహార్హాణి మణీంశ్చైవ మహాధనాన్।
కరదాన్ పార్థివాన్ కృత్వా ప్రత్యాగచ్ఛదరిందమః॥ 29-30

సహదేవో౽పి తత్సర్వం అగ్రజాయ దదౌ తతః॥ 31

నకుల స్సతు నిర్యాయా ప్రతీచీ మభితో దిశం।
కార్తికేయస్య దయితం రోహీతకమనంతరం॥ 32

మరుభూమిం ధాన్యకం చ శైరీషక దశార్ణవాన్।

24. ఆ మాహిష్మతీపట్టణమున నీలుని. అగ్నిహోత్రుడు మొ॥వారిని మిత్రులుగా పొంది త్రైపురదేశమును. పౌరవమును, సురాష్ట్రమును. భోజకీటకమును, జయించెను.

25. అచ్యుత శూర్పాకారుని అలాకటుని, దండకుని, సముద్రద్వీపములందుండు మ్లేచ్ఛులను జయించెను.

26 నిషాదులను, పురుషాదులను కర్ణప్రావరణులను, ఏకకాలముఖులను, మొ॥ నరరాక్షసులను జయించెను,

27. పౌండ్రులను. ద్రావిడులను. ఓడ్రులను, కేరళలను, ఆంధ్రులను కళింగులు, ఉష్ట్రకర్ణికులను జయించెను,

28. వారిని జయించి తన దూతయగు నొక రాక్షసుని ధర్మాత్ముడగు సహదేవుడు విభీషణుని వద్దకు పంపెను.

29, 30, ఇదంతయు కాలకృతమని విభీషణుడు తలచి అనేకరత్నములను వస్త్రములను, గొప్పవిలువగల మణులను పంపెను, ఈ విధముగా రాజుల నందరును పన్ను చెల్లించు సామంతులుగా చేసి సహదేవుడు తిరిగి వచ్చెను,

31, తరువాత సహదేవుడు ఈ ధనమునంతను అన్నగారగు ధర్మరాజునకొసంగెను.

32. నకులుడు వచ్చుమతిక్కను గూర్చి విజయయాత్రకు బయలుదేరి కార్తికేయుని వాని స్నేహితుడగు కౌషితకుని జయించెను,

33. మరుభూమిని, శావ్యకమును, శైశీషకము దశార్ణదేశములను, శిబి

శిబీం త్రిగర్తా నంబష్ఠా న్మాళవాన్ పంచ సర్పటాన్॥ 33

తథా మధ్యమకేయాంశ్చ వాటధానాన్ ద్విజానథ।
పుష్కరా నుత్సవాంశ్చైవ సింధుకూలాశ్రితాన్ తథా॥ 34

శూద్రాభీరగణాంశ్చైవ యే చాశ్రిత్య సరస్వతీం।
మాత్స్యాన్ పంచనదం చైవ తథై వామరపర్వతం॥ 35

ఉత్తర జ్యోతిషం దివ్యకటం తద్ద్వార పాలకం।
రామఠాన్ హారహూణాంశ్చ ప్రతీచ్యాంశ్చైవ యే నృపాః॥ 36

తతస్సః ప్రేషయామాస వాసుదేవాయ కింకరం।
సచాస్య యాదవై స్సార్థం ప్రతిజగ్రాహ శాసనం ॥ 37

శాకలాన్ మద్రకాన్ సింధుకుక్షిస్థా న్మ్లేచ్ఛకాన్ శకాన్
పహ్లవాన్బర్బరాంశ్చైవ కిరాతా న్యవనా న్శకాన్ ॥
త్వా రత్నానుపాదాయ వశే కృత్వా చ పార్థివాన్
న్యవర్తత కురుశ్రేష్ఠో నకుల శ్చిత్రమార్గవిత్ ॥ 38-39

ఉచ్చావచ ముపాదాయ ధర్మరాజాయ మాధవః।
ధనౌఘం పురుషవ్యాఘ్రః ప్రవివేశ పురోత్తమం॥ 40

లను, త్రిగర్తులను, అంబష్ఠలను, మాళవదేశములను. 5 సర్వట దేశములను జయించెను.

34. తరువాత మధ్యమకేయదేశములను వాటధానదేశములను, ద్విజులను, పుష్కరులను, సింధునదీతీరమునగల ఉత్సవులను జయించెను.

35. శూద్రులను, ఆభీరులసముదాయములను, సరస్వతీనదీతీరవాసులగు వారిని జయించి, మత్స్యదేశములను, పంచనదములను, అమర పర్వతమును జయించెను.

36. ఉత్తరజ్యోతిషమును, తద్వారపాలకుడగు దివ్యకటుని, రామఠులను హారహూణులను మొ॥ పశ్చిమదిక్కు యందలి నృపులను జయించెను.

37. అచ్చట నుండియే శ్రీకృష్ణునివద్దకు సేవకుని కబురంపెను. ఆ శ్రీకృష్ణుడు యాదవులతో గూడి నకులుని ఆజ్ఞను శిరసా వహించెను.

38. 39. శాకలదేశములను, మద్రకములను, సింధునదీగర్భమునందున్న మ్లేచ్ఛదేశములను, శరులను. పహ్లవులను బర్బరులను, కిరాతులను యవనులను, శకులను. జయించి ఆ రాజుల నందరను తన వశమందుంచుకొని కురుశ్రేష్ఠుడగు నకులుడు ఇంద్రప్రస్థమునకు తిరిగివచ్చెను.

40. గొప్ప ధనమును తీసుకొనివచ్చి ధర్మరాజునకు సమర్పించెను. అట్లే శ్రీకృష్ణుడును ధనసమూహమును తీసుకొని ఇంద్రప్రస్థమునకు వచ్చెను.

కృష్ణద్వైపాయనో వ్యాసః తత్ర సాక్షాత్కృత స్తదా ।
యుధిష్ఠిరస్తు తం పూజ్య హ్యువాచ పృథివీపతిః॥ 41

యుధిష్ఠిర ఉవాచ॥

కో విధి స్తత్ర కర్తవ్యో రాజసూయే మహామునే॥ 42

వ్యాస ఉవాచ॥

అష్టాశీతిసహస్రాణి హ్యనేతవ్యా ద్విజోత్తమాః।
సుందరం మంటపం రాజన్ విద్యతే చ రసాతలే।
యోజనా ద్వాదశం యావత్తావన్మంటప విస్తరం। 43-44

రసాతలం గమిష్యామి హ్యానయిష్యామి మంటపం।
ఇత్యుక్త్వా తు గతే మౌనౌ శ్రీకృష్ణస్తు సమాగతః॥ 45

కృష్ణార్జునౌ గతౌ చాబ్ధిం యజ్ఞాయే ధనసాధనే॥
బద్ధసేతు స్తదా తాభ్యాం హనుమా న్నిర్జితస్తదా॥ 46

సాగరోఽపి దదౌ ప్రీత్యా రత్నౌఘాన్ పార్థకృష్ణయోః। 47

యుధిష్ఠిర ఉవాచ

త్వత్కృతే పృథివీ సర్వా మద్వశే కృష్ణ వర్తతే।
ధనంచ బహువార్ష్ణేయ త్వత్ప్రసాదా దుపార్జితం।

41. అపుడు కృష్ణద్వైపాయనుడగు వ్యాసుడు అచట సాక్షాత్కరించెను. ధర్మరాజు వానిని పూజించి ఇట్లు ప్రశ్నించెను.

యుధిష్ఠిరుడు అడుగుచున్నాడు.

42. ఓ మహాముని! రాజసూయయాగము ఎట్లు చేయదగియున్నది? ఆ విధాన మెయ్యది?

వ్యాసుడు చెప్పుచున్నాడు.

43, 44. 80 వేల బ్రాహ్మణోత్తములు తీసుకురాదగినవారు సుందరమగు మంటపమొకటి 12 యోజనముల వెడల్పుగలది పాతాళలోకమున గలదు. అది కావలసియున్నది.

45. నేను పాతాళమునకు వెళ్ళి దానిని తీసుకు రాగలను. అని పలికి వ్యాసుడు వెళ్ళగా శ్రీకృష్ణుడచ్చటికి విచ్చేసెను.

46. కృష్ణార్జునులిరువురు యాగసంబంధమగు ద్రవ్యములను సంపాదించుటకు సముద్రమును గూర్చి వెళ్ళిరి. అచ్చట బాణములచే సేతువు నిర్మింపబడుటయు, హనుమంతుడు జయింపబడుటయు సంభవించినది.

47. సముద్రుడును సంతోషించి కృష్ణార్జునులకు రత్నసమూహములను యాగద్రవ్యములను సమర్పించెను.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

48, 49. ఓ కృష్ణా! నీ యనుగ్రహమువలన ఈ భూమంతయు నా అధీనమున నున్నది. నీ అనుగ్రహము చేతనే విశేషమగు ధనము సంపా

అనుజ్ఞాతస్త్వయా కృష్ణ ప్రాప్నుయాం క్రతుముత్తమం॥ 48-49

శ్రీకృష్ణ ఉవాచ॥

యజస్వాభీప్సితం యజ్ఞం మయి శ్రేయ స్త్వవస్థితే।
నియుంక్ష్వ త్వం చ మాం కృత్యే సర్వం కర్తాస్మి తే వచః॥ 50

అనుజ్ఞాతస్తు కృష్ణేన పాండవో ఽరినిబర్హణః।
ప్రేషయామాస నకులం భీష్మాయ భరతర్షభ।
ద్రోణాయ ధృతరాష్ట్రాయ విదురాయ కృపాయ చ।
భ్రాతౄణాం చైవ సర్వేషాం యేఽనురక్తా యుధిష్ఠిరే॥ 51-52

సత్కృత్యా మంత్రిత స్తేన హ్యాచార్య ప్రముఖాస్తతః
ధృతరాష్ట్రం పురస్కృత్య ప్రయయుః ఖాండవం పురం॥ 53

ద్రష్టుకామాః సభాం చైవ ధర్మరాజం చ పాండవం।
దిగ్భ్యః సర్వే సమాపేతుః క్షత్రియాః స్తత్ర భారత॥ 54

భక్ష్యభోజ్యాధికారేషు దుశ్శాసన మయోజయత్।
పరిగ్రహే బ్రాహ్మణానా మశ్వత్థామాన ముత్తమం॥ 55

రాజ్ఞాం తు ప్రతిపూజార్థం సంజయం స న్యయోజయత్।
కృతాకృతపరిజ్ఞానే భీష్మద్రోణౌ మహామతీ॥ 56

దింపబడినది. కావుననీయనుజ్ఞ నడసి ఉత్తమోత్తమమగు ఈ రాజ సూయ యాగమును ఆచరింతును,

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

50 నీ కిష్టమగు యజ్ఞము నాచరించుము, నేను నీకు శ్రేయస్సును సమకూర్తును. నన్ను నీ కిష్టమగు పనియందు నియోగింపుము. నీ వాక్యము నంతను నేను నెరవేర్తును.

51, 52. ధర్మరాజు ఇట్లు శ్రీకృష్ణుని అనుజ్ఞ పొంది భీష్ముని, ద్రోణుని విదురుని కృపుని, దుర్యోధనాది సోదరులు మొదలగు బంధువుల నందరను తీసుకొని వచ్చుటకు నకులుని పంపెను.

53. ఇట్లు వానిచే సత్కారపూర్వకముగ ఆహ్వానింపబడిన ద్రోణాచార్యుడు మొదలగువారు ధృతరాష్ట్రుని వెంటబెట్టుకొని ఖాండవ పురమునకు విచ్చేసిరి,

54. ధర్మరాజును, మయసభను, రాజసూయమును చూచుటకై అందరు రాజులు అచ్చటకు విచ్చేసిరి,

55. భక్ష్యభోజ్యములను ఏర్పాటు చేయుటయందు దుశ్శాసనుని నియోగించెను. వచ్చిన బ్రాహ్మణులను సత్కరించి స్వీకరించుటకు అశ్వత్థామను నియోగించెను,

56. వచ్చిన రాజులను పూజించుటకై సంజయుని ఏర్పాటు చేసెను. గొప్ప బుద్ధిశాలులగు భీష్మ, ద్రోణులను కృతాకృతమును పర్యవేక్షించి లోటుపాటులను తెలియ జెప్పుటకు నియోగించెను.

దక్షిణానాం చ వై దానే కృపం రాజా న్యయోజయత్।
దుర్యోధన స్త్వర్హణాని ప్రతి జగ్రాహ సర్వశః॥ 76

భుక్తా వ్యయకర స్త్వాసీ ద్విదుర స్సర్వధర్మవిత్।
చరణక్షాళనే కృష్ణో బ్రాహ్మణానాం స్వయం హ్యభూత్॥ 58

ధౌమ్యాద్యైపాయనముఖై ఋత్విగ్భిః పురుషర్షభః।
సురభిం ప్రార్థయామాస ధర్మరాజో యుధిష్ఠిరః।
కామధేను స్సమ యాతా ధర్మపుత్రస్య సత్కృతః।
యం యం కామయతే కామం తంతం దుగ్ధవతీ చ సా॥59-60

అష్టాశీతి సహస్రాణి ఋషయస్తత్ర సంస్థితాః।
తత స్తాన్ యాజ్ఞికే కాలే విప్రయుక్తాః స ఋత్విజః।
తత స్తే దేవయజనం కుర్యు స్తే స్వర్ణలాంగలైః॥ 61-62

దీక్షిత స్సతు ధర్మాత్మా ధర్మరాజో యుధిష్ఠిరః॥ 63

జగామ యజ్ఞాయతనం వృతో విప్రై స్సహస్రశః।
భ్రాతృభి ర్జ్ఞాతిభిశ్చైవ ధర్మో విగ్రహవానివ॥ 64

నారదస్తు తదా పశ్యన్ సర్వక్షత్రసమాగమం।
సస్మార చ పురావృత్తాం కథాం తాం పురుషర్షభః।
అంశావతరణే యాసౌ బ్రహ్మణో భవనేఽభవత్॥ 65

నారదః పుండరీకాక్షం సస్మార మనసా హరిం॥ 66

57. దక్షిణలను ఇచ్చుట యందు కృపాచార్యుని ఏర్పాటు చేసెను. వచ్చిన కానుకలను గ్రహించుటకు దుర్యోధనుని ఏర్పాటు చేసెను.

58. సర్వధర్మవేత్తయగు విదురుడు ఖర్చు పెట్టువాడుగా నుండెను. శ్రీకృష్ణుడు వచ్చిన బ్రాహ్మణుల పాదప్రక్షాళనము స్వయముగా చేయుచుండెను.

59. 60. ధర్మరాజు కామధేనువును ప్రార్థించగా ధర్మరాజు యొక్క సత్యముచే కామధేనువు వచ్చి అతడు కోరిన కోరికలన్నిటిని ఇచ్చుచుండెను.

61. 62. 80 వేలమంది ఋషులు విచ్చేసిరి. యజ్ఞమునకు యోగ్యమగు కాలమున వారలను ఋత్విక్కులుగా ధర్మరాజు వరించెను. వారు యజ్ఞీయ ప్రదేశమును బంగారు నాగళ్ళతో దున్ని ఏర్పాటు చేసిరి.

63. ధౌమ్యుడు, వ్యాసుడు మొదలగు ఋత్విక్కులతో కూడినవాడై ధర్మాత్ముడగు ధర్మరాజు దీక్షితు డాయెను.

64. వేలమంది బ్రాహ్మణులతోను, సోదరులతోను, జ్ఞాతులతోను కూడి శరీరమును ధరించిన ధర్మమువలె నున్న ధర్మరాజు యజ్ఞప్రదేశమునకు వచ్చెను.

65. అపుడు నారదుడు అచ్చట సర్వక్షత్రియుల సమావేశమును చూచి పూర్వము బ్రహ్మ భవనమున శ్రీకృష్ణావతార ప్రస్తావముగ జరిగిన వృత్తాంతమును స్మరించెను.

66. నారదుడు పుండరీకాక్షుడగు శ్రీహరిని మనసార స్మరించెను.

తతో భీష్మ శ్శాంతనవో బుద్ధ్యా నిశ్చిత్య వీర్యవాన్।
వార్ష్ణేయం మన్యతే కృష్ణ మర్హణీయ తమం భువి॥ 67

భీష్మ ఉవాచ॥

ఏష హ్యేషాం సమస్తానాం తేజో బలపరాక్రమైః।
మధ్యే తపన్నివాభాతి జ్యోతిషామివ భాస్కరః॥ 68

తస్మై భీష్మాభ్యనుజ్ఞాతః సహదేవః ప్రతాపవాన్।
ఉపజహ్రేఽథ విధివ ద్వార్ష్ణేయాయార్ఘ్య ముత్తమం॥ 69

శిశుపాలస్తు తాం పూజాం వాసుదేవే న చక్షమే॥ 70

శిశుపాల ఉవాచ॥

అపి పశ్యసి వా సర్వా న్నవా పశ్యసి పాండవ।
తిష్ఠ త్స్వన్యేషు పూజ్యేషు గోప మర్చితవానసి॥ 71

ఇత్యుక్త్వా భీష్మ మప్యార్యం ప్రదూష్య హరి మబ్రవీత్॥ 72

నను త్వయాఽపి బోద్ధవ్యం యాం పూజాం మాధవార్హసి।
అయుక్త మాత్మనః పూజాం త్వం పున ర్బహుమన్యసే॥ 73

ఇత్యాది దూషణం చైద్య శ్శతసంఖ్యాక ముక్తవాన్॥ 74

సహదేవః।

కేశవం కేశిహంతార మప్రమేయపరాక్రమం।

67. తరువాత భీష్ముడు తన బుద్ధితో విచారించి అందరిలో శ్రీకృష్ణుడే పూజ్యతముడని తలచెను.

భీష్ముడు చెప్పుచున్నాడు.

68. ఈ రాజులందరిలో తేజో, బల, పరాక్రమములచే ఈ శ్రీకృష్ణుడే జ్యోతిష్పులలో సూర్యుడువలె ప్రకాశించుచున్నాడు.

69. అంతట భీష్ముని అనుజ్ఞ పొంది ప్రతాపశాలియగు సహదేవుడు శ్రీకృష్ణునికి ఉత్తమమైన అర్ఘ్యమును (పూజాద్రవ్యమును) మొదట సమర్పించెను.

70. శిశుపాలుడు మాత్రము శ్రీకృష్ణునకు అర్పించుటను సహించక పోయెను.

శిశుపాలుడు చెప్పుచున్నాడు.

71. ఓ సహదేవా! నీవందరిని చూచుచున్నావా? లేక చూచుటలేదా? పూజ్యులగు ఇతరులు అనేకులుండగా గోపాలకుని పూజించితివేమి?

72. ఇట్లు పలికి పూజ్యులగు భీష్మునిగూడదూషించి శ్రీహరితోపలికెను.

73. ఓ మానవా! నీవెట్టి పూజకు తగియుంటివో దానిని నీవు గూడ గుర్తెరుగవలయును. నీకు తగని పూజను నీవు గొప్పదిగా భావించుచున్నావు.

74. ఇట్టి నిందల నూటిని దాటి శిశుపాలుడు పలికెను.

సహదేవుడు పలుకుచున్నాడు.

75. కేశిని సంహరించి నట్టియు అప్రమేయ పరాక్రముడగు శ్రీహరిని

పూజ్యమానం మయా యో వః కృష్ణం న సహతే నృపః।
సర్వేషాం బలినాం మూర్ధ్ని మయేదం నిహితం పదం॥ 75

తతోఽపత త్పుష్పవృష్టి స్సహదేవస్య మూర్ధని।
అదృశ్యరూపా వాచశ్చాప్యబ్రువన్ సాధు సాధ్వితి॥ 76

ఇతి శ్రీ మహాభారత సారోద్ధారే సభా పర్వణి
ద్వితీయోఽధ్యాయః సమాప్తః

## తృతీయోఽధ్యాయః

చుకోప బలినాం శ్రేష్ఠో భీమసేనః ప్రతాపవాన్
త్రిశిఖాం భృకుటీం చాస్య దదృశు స్సర్వపార్థివాః
లలాటస్థం త్రికూటస్థం గంగాం త్రిపథగామివ ॥ 1

దంతా న్సందశత స్తస్య కోపా ద్దదృశు రాననం ॥ 2

తస్య భీమస్య భీష్మేణ వార్యమాణశ్చ భారత
గురుణా వివిధై ర్వాక్యైః క్రోధః ప్రశమ మాగతః॥ 3

---

వ్యా॥ సర్వధారి వత్సర చైత్రశుక్ల పూర్ణిమాయాం రాజసూయాధ్వరారంభః। తదా యుధిష్ఠిరస్య వయ స్సం॥ 77-6-2 క్రీ॥ పూ॥ 9-12-3027 ద్రౌపద్యాస్సం 58-6-2 ధర్మజాత్ 24 న్యూనం.

నేను పూజించుటను మీలో ఎవరు సహించరో అట్టి బలవంతు లగు వారి యందరి శిరస్సునను నేను పాదమును ఉంచుచున్నాను.

478 అంతట సహదేవుని శిరస్సుపై పుష్పవృష్టి పడెను. బాగు బాగని అశరీరవాక్కు పలికినది.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, సభాపర్వయందు
రెండవ అధ్యాయము సమాప్తము.

# 3 వ అధ్యాయము

1. బలవంతుడగు భీమసేనుడు మిక్కిలి కోపగించెను. రాజులందరును అతని లలాటమునందున్న 3 శిఖలు గల బొమముడిని త్రికూట పర్వతమునందున్న త్రిపథగామినియగు గంగానదివి వలె చూచిరి.

2. దంతములను కోపముచే పటపట కొరుకుచున్న అతని ముఖమును అందరును చూచిరి.

3 ద్రోణాచార్యుని చేతను, భీష్ముని చేతను అనేక వాక్యములచే వారింపబడినవాడై అతని క్రోధము చల్లారెను.

---

వ్యా॥ సర్వధారి నామ సంవత్సర చైత్ర శుక్ల పూర్ణిమ యందు రాజసూయ యాగారంభము. అప్పుడు యుధిష్ఠిరుని వయస్సు సం॥ 73 నె॥ 6 రో॥ 2. క్రీ॥ పూ॥ 9 — 12 3027. ద్రౌపది వయస్సు 53 సం॥ 6 నె॥ 2 రో॥. ధర్మరాజు కంటె ద్రౌపది 24 సంవత్సరములు చిన్నది.

శిశుపాలస్తు సంక్రుద్ధే భీమసేనే జనాధిప
నాకంపత తదా వీరః పౌరుషే స్వే వ్యవస్థితః
చేదీశజన్మవృత్తాంతం భీష్మేణోక్తం తదా నృపాః ॥ 4

కేచిజ్జహృషిరే తత్ర కేచిద్భీష్మం జగర్హిరే
హన్యతాం దహ్యతాం భీష్మః పశువ త్సాధ్వయం నృపాః ॥ 5

ఇతి తేషాం వచ శ్శ్రుత్వా తతః కురుపితామహః
క్రియతాం మూర్ధ్ని వో న్యస్తం మయేదం సకలం పదం । 6

యస్య వా త్వరతే బుద్ధి ర్మరణాయ సమాధవం
కృష్ణ మాహ్వయతా మద్య యుద్ధే చక్రగదాధరం ॥ 7

శిశుపాల ఉవాచ

ఆహ్వయే త్వాం రణం గచ్ఛ మయా సార్ధం జనార్దన
యావదద్య నిహన్మి త్వాం సహితం సర్వపాండవైః ॥ 8

తావ త్పలాయనం త్యక్త్వా తిష్ఠ త్వం రణమూర్ధని
ఇత్యుక్త్వా ప్రయయౌ శీఘ్రం పార్థయజ్ఞజిఘాంసయా ॥ 9

తత శ్చక్రగదాపాణిః కేశవః కేశిహా హరిః
మనసాఽచింతయ చ్చక్రం దైత్యవరనిషూదనం ॥ 10

కృష్ణ ఉవాచ

శృణ్వంతు మే మహీపాల యేనైతత్ క్షమితం మయా

4. భీముడిట్లు క్రుద్ధుడైనను వీరుడగు శిశుపాలుడు తన పౌరుషము నందున్నవాడై ఏమియు భయపడలేదు. అప్పుడు భీష్మునిచే శిశుపాలుని జన్మవృత్తాంతము చెప్పబడెను.

5. అంతట కొందరు సంతోషించిరి. కొందరు రాజులు భీష్ముని నిందించిరి.. దుర్మార్గుడగు ఈ భీష్ముడు పశువువలె చంపబడుగాక యని కొందరు రాజులు పలికిరి.

6. వారి వాక్యములను విని కురుపితామహుండగు భీష్ముడు " ఓ రాజులారా ! మీ అందరి శిరస్సులయందు నేను పాదముంచితిని. మీరు చేయదగినది చేయుడు. " అని పలికెను.

7. ఎవని బుద్ధి మరణమునకు త్వరపడుచున్నదో వారు చక్ర, గదా ధరుడగు శ్రీకృష్ణుని యుద్ధమున కాహ్వానింపుడు.

శిశుపాలుడు చెప్పుచున్నాడు.

8. ఓ కృష్ణా ! నాతో యుద్ధమునకు రమ్ము. నేను నిన్ను ఆహ్వానించుచున్నాను. ఇప్పుడే నిన్ను పాండవులతో గూడ సంహరింతును.

9. నీవు పలాయనమును వదలి పెట్టి రణాంగమున నిలబడుము. అని పలికి వెంటనే యజ్ఞధ్వంసము కొరకు బయలు వెడలెను.

10. అంతట కేశిని సంహరించిన శ్రీహరి రాక్షససమూహమును సంహరించు చక్రమును మనసార స్మరించెను.

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

11. ఓ రాజులారా ! నేనేల శిశుపాలుని ఇంతవరకు క్షమించితినో

అపరాధశతం క్షామ్యం మాతు ర్యస్యైన యాచనే ॥ 11

దత్తం మయా యాచితం చ తాని పూర్ణాని పార్థివాః
అధునా వధయిష్యామి పశ్యతాం వో మహీక్షితాం ॥ 12

ఏవ ముక్త్వా యదు శ్రేష్ఠ శ్చేదిరాజస్య తత్ క్షణాత్
వ్యపాహర చ్ఛిరః క్రుద్ధః చక్రేణా మిత్రకర్శనః ॥ 13

తత శ్చేదిపతే ర్దేహా త్తేజో గ్ర్యం దదృశుర్నృపాః
యద్వివేశ మహాబాహుం తత్తేజో పురుషోత్తమం ॥ 14

తతః ప్రవవృతే యజ్ఞః కేశవేన సురక్షితః 15

విప్రభోజన వేళాయాం భీమో వాచ మహీసురాన్ 15
యథేష్టం భుజ్యతాం భో విప్రా మాపరిత్యజ్య భోజనం ॥ 16

తచ్ఛ్రుత్వా భీతభీతాస్తు బ్రాహ్మణా భోజనం కృతాః
తదా కృష్ణో ధర్మరాజ మవోచద్భీమసన్నిధౌ ॥ .7

కృష్ణ ఉవాచ

ఏకం న్యూనతమం రాజ న్నస్మిన్యజ్ఞే న సంశయః
ఉచ్ఛిష్టమానాని ర్నోయాతి తేన యజ్ఞఫలం వృథా ॥ 18

అత్రైవాస్తే వనే మాని రానేతవ్యః త్వయాధునా

వినుడు ఈతని తల్లి యొక్క కోరికననుసరించి ఈతని నూరపరాధములు నేను క్షమించవలసియున్నది.

12. నేనట్టి వరము నామె కిచ్చితిని ఆ నూరును పూర్తియైనవి. రాజులు మీరందరూ చూచుచుండగా వీని నిప్పుడు వధింతును.

13. ఇట్లు పలికి శ్రీకృష్ణుడు క్రుద్ధుడై చేదిరాజగు శిశుపాలుని శిరస్సును క్షణకాలములో చక్రముచే ఛేదించెను.

14 అంతట శిశుపాలుని దేహమునుండి గొప్ప తేజస్సు పురుషోత్తముని లో రాజులందరు చూచుచుండ ప్రవేశించెను.

15. అంతట శ్రీహరిచే సంరక్షింపబడినదై యజ్ఞము జరిగెను.

16. బ్రాహ్మణులు భుజించువేళయందు భీముడు ఓ బ్రాహ్మణులారా! యథేష్టముగ భుజించుడు. పదార్థములను పారవేయవద్దు అని వారితో పలికెను.

17. అది విని భీమునినుండి భయపడినవారై మిక్కిలి భయపడుచు భుజించుచుండిరి. అప్పుడు కృష్ణుడు భీముడు వినుచుండగా ధర్మరాజుతో ఇట్లు పలికెను

కృష్ణుడు చెప్పుచున్నాడు.

18. ఓ రాజా! ఈ యజ్ఞమున ఒక్కటి లోటు జరిగినది. అందు సందేహము లేదు. ఆదేవన ఉచ్ఛిష్టమును ఇచ్చుటకి వచ్చుటలేదు. అందుచే యజ్ఞము వ్యర్థమైనది.

19. అతడు ఇచ్చటనే వనమందున్నాడు. నీవు పిలిపించుము. అని పలు

ఇత్యుక్తే భీమసేనస్తు గత్వా తేన ప్రబోధితః ॥ 19

పున రాగత్య యజ్ఞం హి తూష్ణీమాస్తే మఖావధి ॥ 20

తత స్త్వవభృథస్నాతం ధర్మాత్మానం యుధిష్ఠిరం
సమస్తం పార్థివం క్షత్ర ముపాగమ్యేద మబ్రవీత్ ॥ 21

దిష్ట్యా వర్ధసి ధర్మజ్ఞ సామ్రాజ్యం ప్రాప్తవానసి
కర్మణైతేన రాజేంద్ర ధర్మశ్చ సుమహాన్ కృతః ॥ 22

స్వరాష్ట్రాణి గమిష్యామ స్తథాఽనుజ్ఞాతు మర్హసి
పాండవా నృపతీ న్సర్వా న్నైకైకం సమనువ్రజన్ ॥ 23

ప్రయయౌ పుండరీకాక్ష స్తతో ద్వారవతీం పురీం ॥ 24

సమాప్తే రాజసూయే తు క్రతుశ్రేష్ఠే సుదుర్లభే
కృష్ణద్వైపాయనో వ్యాస ఇదం వచన మబ్రవీత్ ॥ 25

త్రయోదశ సమా రాజ న్నుత్పాతానాం ఫలం మహత్
సర్వక్షత్రవినాశాయ భవిష్యతి విశాంపతే ॥ 26
త్వామేవ కారణం కృత్వా కాలేన భరతర్షభ
దుర్యోధనాపరాధేన భీమద్రోణబలేన చ

కగా భీమసేనుడు వెళ్ళి వానినిపిలుచుకొని వచ్చెను.

20. భీముడు వానితో తిరిగి వచ్చి యజ్ఞమగునంతవరకు మాట్లాడక ఊరకుండెను,

21. తరువాత యజ్ఞసమాప్తియై అవభృధస్నానము చేసిన ధర్మరాజు వద్దకు రాజసమూహమంతయు వచ్చి ఇట్లు పలికెను.

22. ధర్మరాజా ! నీవు సామ్రాజ్యమును పొందితివి. నీ అదృష్టముచే వృద్ధి పొందుచున్నావు. ఈ రాజసూయముచే గొప్ప ధర్మము నీచే ఆచరింపబడినది.

23. మేము మా రాష్ట్రములకు వెళ్ళెదము అట్లు అనుజ్ఞ నీయవేడు చున్నాము. పాండవులు అందరు రాజులను ఒక్కొక్కని సగౌరవ ముగా పంపించిరి.

24. అంతట శ్రీకృష్ణుడు గూడ ద్వారకానగరమునకు సపరివారముగ వెడలిపోయెను.

25. ఇతరులకు సాధ్యము కాని క్రతుశ్రేష్ఠమగు రాజసూయము సమాప్తము కాగా వ్యాసుడు ధర్మరాజుతో నిట్లు పలికెను.

26. ఓ ధర్మరాజా! 13 సంవత్సరములు ఉత్పాతములవలన గొప్ప అనర్థము రాగలదు. సర్వక్షత్రియుల వినాశము సంభవింపగలదు.

27, 28. నిన్నే కారణముగా చేసుకొని దుర్యోధనుని అపరాధముచేతను, భీష్మ, ద్రోణుల బలముచేతను, కాలము చేతను ఇట్టి వినాశము సంభవించగలదు. దానినిగురించి విచారించకుము, కాలము అను

మాతత్కృతే హ్యనుధ్యాహి కాలోహి దురతిక్రమః
ఏవముక్త్వా స భగవాన్ కైలాసం పర్వతం యయౌ ॥ 27-28

తతోఽబ్రవీ త్సత్యధృతి ర్భ్రాతౄ న్సర్వా న్యుధిష్ఠిరః
అద్యప్రభృతి భద్రం వః ప్రతిజ్ఞాం మే నిబోధత
త్రయోదశ సమా స్తాత కో మమార్థోఽస్తి జీవతః
న ప్రవక్ష్యామి పరుషం భ్రాతౄనన్యాంశ్చ పార్థివాన్ ॥ 29-30

స్థితో నిదేశే జ్ఞాతీనాం యోక్ష్యే తత్సముదాహరన్
తమేవ మనువర్తంత భీమసేనాదయ స్తదా ॥ 31

వసన్ దుర్యోధన స్తస్యాం సభాయాం పురుషర్షభః
శనై ర్దదర్శ తాం సర్వాం సభాం శకునినా సహ ॥ 32

స కదాచి త్సభామధ్యే ధార్తరాష్ట్రో మహీపతిః
స్ఫాటికం స్థల మాసాద్య జల మిత్యభిశంకయా
స్వవస్త్రోత్కర్షణం రాజా కృతవాన్ బుద్ధిమోహితః॥ 33-34

వాపీం మత్వా స్థలమివ సవాసాః ప్రాపతజ్జలే।
జలే నిపతితం దృష్ట్వా భీమసేనో మహాబలః।
జహాస జహసుశ్చైవ కింకరాశ్చ సుయోధనం।
వాసాంసి చ శుభాన్యస్మై ప్రదదూ రాజశాసనాత్ ॥ 35-36

ద్వారం తు పిహితాకారం స్ఫాటికం ప్రేక్ష్య భూమిపః
ప్రవిశ న్నాహతో మూర్ధ్ని వ్యాఘూర్ణిత ఇవ స్థితః ॥ 37

ల్లంఘనీయము కదా! ఇట్లు పలికి భగవంతుడగు వ్యాసుడు కైలాస పర్వతమును గూర్చి వెళ్ళెను.

9, 30. అంతట సత్యమునందు భినివేశము కల ధర్మరాజు ఇప్పటినుండి సదా మీకు క్షేమమగుగాక. నా ప్రతిజ్ఞను వినుడు 13 సంవత్సరములు బ్రతికియున్న నా వలన ప్రయోజనమేమి? సోదరులతో గాని, ఇతరరాజులను గూర్చి గాని పరుషముగా పలుకను. అని సోదరులతో చెప్పెను.

31. నేను జ్ఞాతులవశవర్తినై ప్రవర్తింతును. వారు చెప్పినది చేయుదును. భీమసేనాది సోదరులును అట్లే వానిననుసరింతుమని పలికిరి.

32. దుర్యోధనుడు ఆ మయసభయందు నివసించుచూ ఆ సభా విశేషముల నన్నింటిని శకునితో గూడి చూచెను,

33. 34. ఆతడు మయసభామధ్యమున నొకచోట స్ఫటికవికారమగు స్థలమును పొంది అది జలమను అభిప్రాయముతో భ్రాంతి నొందినవాడై తన వస్త్రములను ఎత్తిపట్టుకొనెను.

5, 36. మరియొక చోట ఒగుడు బావిని స్థలమని భ్రాంతి పొంది జలములో పడెను, వానిని చూచి భీమసేనుడు నవ్వెను. సేవకులును నవ్విరి. ధర్మరాజు నాజ్ఞననుసరించి వానికి మంచి వస్త్రములను కట్టుకొనుటకు ఇచ్చిరి.

37. స్ఫటికవికారమగు మూసబడి ఉన్న ద్వారమును దుర్యోధనుడు చూచి తెరచి ఉన్నదను భ్రాంతిచే ప్రవేశించుచు తలకొట్టుకొని రెల్లపోయినవాడువలె నుండెను.

తాదృశం చాపరం ద్వారం స్ఫాటికోరుకవాటకం
విఘట్టయన్ కరాభ్యాంతు నిష్క్రమ్యాగ్రే పపాత హ ॥ 38

ఏవం ప్రలంభాన్వివిధాన్ ప్రాప్య తత్ర విశాంపతే
పాండవేయాభ్యనుజ్ఞాతః తతో దుర్యోధనో నృపః
అప్రహృష్టేన మనసా జగామ గజసాహ్వయం ॥ 39-40

అనేకాగ్రంతు తం దృష్ట్వా శకునిః ప్రత్యభాషత।
దుర్యోధన కుతో మూలం నిశ్వసన్నివ పశ్యసి॥ 41

దుర్యోధన ఉవాచ॥

దృష్ట్వేమాం పృథివీం కృత్స్నాం యుధిష్ఠిరవశానుగాం।
తం చ యజ్ఞం మహాభూతం దృష్ట్వా పార్థస్య మాతుల।
అమర్షేణ తు సంపూర్ణో దహ్యమానో దివానిశం।
పశ్య సాత్వత ముఖ్యేన శిశుపాలో నిపాతితః॥ 42,43

నచ తత్ర పుమానాసీత్కశ్చిత్తస్య పదానుగః।
వహ్నిమేవ ప్రవేక్ష్యామి భక్షయిష్యామి వా విషం।
అపో వాపి ప్రవేక్ష్యామి నహి శక్ష్యామి జీవితుం॥ 44-45

కోహి నామ పుమాన్ లోకే మర్షయిష్యతి సత్త్వవాన్।
సపత్నాన్ ఋధ్యతో దృష్ట్వా హీనమాత్మాన మేవచ॥ 46

శకుని రువాచ॥

దుర్యోధన నతేఽమర్షః కార్యః ప్రతి యుధిష్ఠిరం।
లబ్ధవాన్ అభిమానార్హాః పిత్ర్యంశః పృథివీతలే॥ 47

38. అట్టియే స్ఫటికవికారమైన వాకిళ్ళుగల ద్వారమును కొట్టుకొనుచు ముందుకు పడిపోయెను.

39, 40. ఇట్టి వనేకములైన అవమానములను ఆ మయ సభ యందు పొంది పాండవుల ననుజ్ఞ పొంది రాజగు దుర్యోధనుడు మన స్సులో దుఃఖించుచున్నవాడై హస్తినాపురమునకు వెళ్ళెను.

41. పరధ్యానముగాను. ఏదో ఆలోచించుచున్నవానివలె ఉన్న వానిని చూచి శకుని " ఓ దుర్యోధనా ! నీవేల చింతాక్రాంతుడ వలె నిట్టూర్పు పుచ్చుచున్నవాడవై యున్నావు. " అని పలికెను.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు,

42. 43. ఈ భూమండలమంతయు ఆ ధర్మరాజు వశవర్తియై యున్నది. ఓ మామా ! అసాధారణమైన ఆ మహా యజ్ఞమును చూచి క్రోధ ముతో నిండినవాడనై రాత్రింబవళ్ళు దహింపబడుచుంటిని. శ్రీ కృష్ణునిచే శిశుపాలుడు చంపబడినాడు. చూడుము.

44. 45. ఆ శిశుపాలునకు మద్దతుగా ఒక్కడును లేకపోయెను కదా ! నేను అగ్నినైనను ప్రవేశింతును, విషమునైనను భక్షింతును. లేక నీటిలోనైన బడుదును. కాని బ్రతుకలేను.

46. అభిమానముగల పురుషు డెవడు ఈ లోకమున వృద్ధి పొందుచున్న శత్రువులను, క్షీణించుచున్న తన్నును చూచి సహించగలడు ?

శకుని చెప్పుచున్నాడు.

47. ఓ దుర్యోధనా ! ధర్మరాజును గూర్చి నీ వసూయపడవద్దు. ఈ భూమండలమును అతడు తన తండ్రి భాగమును పొంది వృద్ధిని పొందినాడు

ప్రవృద్ధ స్తేజసా తేషాం తత్ర కా పరిదేవనా॥ 48

దుర్యోధన ఉవాచ॥

యది శక్యా విజేతుం తే తన్మమాచక్ష్వ మాతుల॥ 49

శకుని రువాచ॥

ద్యూతప్రియశ్చ కౌంతేయో సచ జానాతి దేవితుం।
నియతంతు విజేష్యామి కృత్వాతు కపటం విభో।
అనుజ్ఞాతస్తు తే భ్రాతా విజేష్యే తాన్న సంశయః॥ 50-51

దుర్యోధన స్స్వపితరం దుఃఖార్తశ్చాహ సమాతులః॥ 52

ధృతరాష్ట్ర ఉవాచ॥

క్షత్తా మంత్రీ మహాప్రాజ్ఞ స్థితో యస్యాస్మి శాసనే।
తేన సంగమ్య వేత్స్యామి కార్యస్యాస్య వినిశ్చయం॥ 53

యత్రాహ శాస్త్రం భగవాన్ బృహస్పతి రుదారధీః
తద్వేద విదుర స్సర్వం సరహస్యం మహాకవిః॥ 54

విదురోవాపి మేధావీ కురూణాం ప్రవరో మతః
తదలం పుత్ర ద్యూతేన ద్యూతే భేదో హి దృశ్యతే॥ 55

అధీతవాన్ కృతీ శాస్త్రే లాలిత స్సతతం గృహే

48. అతడు తన యొక్కయు, సోదరుల యొక్కయు, పరాక్రమముచే వృద్ధిని పొందెను. అట్టి విషయమున దుఃఖించ పని ఏమి కలదు?

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

49. ఓ మామా! వారిని జయించు ఉపాయ ముండినచో దానిని నాకు చెప్పుము.

శకుని చెప్పుచున్నాడు.

50, 51. ధర్మరాజు ద్యూతప్రియుడు. కాని జూదమాడుట ఎరుగడు. నేను మాయచేసి వారిని తప్పక జయించగలను. నీ తండ్రిచే అనుజ్ఞ పొందినచో వారలను తప్పక జయించగలను. సందేహములేదు.

52. అంతట మేనమామతో కూడి దుర్యోధనుడు మిక్కిలి దుఃఖించుచు తండ్రితో పలికెను.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

53. మంత్రియు, మహావిద్వాంసుడును అగు విదురుని ఆజ్ఞలో నేనున్నాను. వానితో విచారించి ఇచ్చట కార్యనిశ్చయము చేయుదును.

54. బృహస్పతి చెప్పిన రాజనీతి శాస్త్రమునంతను విదురుడు బాగుగా నెరిగినవాడు. దాని రహస్యము లన్నియు ఎరిగిన విద్వాంసుడు

55. విదురుడు కురువృందరిలో గొప్ప తెలివిగలవాడు, మన కిష్టుడు, కావున పుత్రా! ద్యూతమును చాలింపుము. ద్యూతముచే గొప్ప విరోధము సంభవించును.

56. ఆ ధర్మరాజు నేర్పరి. శాస్త్రములను జదివినవాడు. మన ఇంట నెరిగినవాడు. నీ సోదరులలో పెద్దవాడు. కావ రాజ్యమునం

భ్రాతా జ్యేష్ఠః స్థితో రాజ్యే విందసీ కిం న శోభనం॥ 56

దుర్యోధన ఉవాచ

న మాం ప్రీణాతి మద్భుక్తం శ్రియం దృష్ట్వా యుధిష్ఠిరే
శాంతిం న పరిగచ్ఛామి దహ్యమానేన చేతసా ॥ 57

అపశ్య న్నళినీం పూర్ణా ముదకస్యేవ తద్గృహే
వస్త్ర ముత్కర్షతి మయి ప్రాహాస త్స వృకోదరః ॥ 58

యది కుర్యాం సమారంభం భీమం హంతుం నరాధిప
శిశుపాల ఇవాస్మాకం గతిః స్యా న్నాత్ర సంశయః ॥ 59

తం వీక్షితుం జగతి శక్నుయు రత్ర కే వా
భీమం ప్రకోపధృత భీమగదాంక బాహుం,
ఏకైకముష్టిహతయే స్మ భవంతి నాలం
యస్యాహవే బకబృహద్రథ భూమిండిబాః ॥ 60

మత్వా శిలాసమం తోయే పతితోఽస్మి నరాధిప
తత్ర మాం ప్రహస త్కృష్ణః పార్థేన సహ సుస్వరం ॥ 61

ఇదం ద్వార మితో గచ్ఛ రాజన్నితి పునః పునః
ఉవాచ సహదేవస్తు తత్ర మాం విస్మయన్నివ ॥ 62

ద్రౌపదీ చ సహ స్త్రీభి ర్వ్యథయంతీ మనో మమ ॥ 63

దున్నాడు, ఇది బాగుండలేదా ? నీవే ఆలోచించుము.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

57. ధర్మరాజు యొక్క ఐశ్వర్యమును చూచి నాకు భోజనము రుచించుట లేదు. అసూయచే మనస్సు దహించుకు పోవు చుండుటచే శాంతిని పొందలేకున్నాను.

58. వాని గృహమందు నీటితో నిండియున్న సరస్సువలెనున్న స్థలమును చూచి నేను వస్త్రమును పైకెగకట్టగా భీముడు నన్ను పరిహసించెను.

59. ఓ రాజా ! నేను భీముని చంపుటకు ప్రయత్నము చేయనిచో శిలు పాలునివలె నాకును మరణము సంభవించును, సందేహము లేదు

60. కోపముచే ధరించిన భయంకరమగు గదగల చేతులు గల భీముని చూచుటకు ఈ ప్రపంచములో ఎవడు సమర్థుడు కాగలడు ? ఏలనన వానికి యుద్ధమున బకుడు, జరాసంధుడు, హిడింబాసురుడు ఒక్కొక్క పిడికిలి దెబ్బకే చాలకపోయిరి కదా !

61. సరస్సును శిలలతో కూడిన ప్రదేశముగా తలచి నీటిలో పడితిని. అర్జునునితో గూడిన శ్రీకృష్ణుడు బిగ్గరగా నన్ను గూర్చి నవ్వెను.

62. సహదేవుడు ఓ రాజా ! " ఇది ద్వారము, ఇటు వెళ్ళుము, అని మాటిమాటికి నన్ను పరిహసించుచున్నవాడువలె పలికెను.

63. ద్రౌపది యు స్త్రీలతో కూడినదై నా మనస్సునకు బాధ కలిగించుచూ నవ్వినది.

అష్టాశీతి సహస్రాణి స్నాతకా గృహమేధినః
దశాన్యాని సహస్రాణి యతీనా మూర్ధ్వరేతసాం
భుంజంతే రుక్మపాత్రీభి ర్యుధిష్ఠిర నివేశనే ॥ 64

అభుక్తం భుక్తవద్వాపి సర్వ మాకుబ్జవామనం
అభుంజానా యాజ్ఞసేనీ ప్రత్యవైక్షత్ విశాంపతే ॥ 66

అభ్యషించ త్తతో ధౌమ్యో వ్యాసశ్చ సుమహాతపాః
నారదం చ పురస్కృత్య దేవలం చాపి తం మునిం ॥ 66

అధారయ చ్ఛత్ర మస్య సాత్యకి స్సత్యవిక్రమః
ధనంజయశ్చ వ్యజనే భీమసేనశ్చ పాండవః॥ 67

యమౌ చ తత్ర పార్శ్వస్థౌ రత్న దండే వహన్ స్థితౌ ॥ 68

ఉపాగృహ్ణా ద్యమింద్రాయ పురాకల్పే ప్రజాపతిః ।
తమస్మై శంఖమాహర్త్రే ర్వారుణం కలశోదధిః॥ 69

తేనాభిషిక్తః కృష్ణేన తత్ర మే కశ్మలోఽభవత్ ॥ 70

న రంతిదేవో నాభాగో యౌవనాశ్వో మను ర్నచ।
నచ రాజా పృథు ర్వైన్యో న చాప్యాసీ ద్భగీరథః।
యయాతి ర్నహుషో వాఽపి యథా రాజా యుధిష్ఠిరః॥71–72

64 88000 మంది స్నాతకులు, గృహస్థులు మరియు 10000 మంది ఊర్ధ్వరేతస్కులగు యతీశ్వరులు ధర్మరాజు గృహమున బంగారు పాత్రలతో నిత్యము భుజించుచున్నారు.

65. ఓ రాజా ! భుజించినవానిని, భుజించనివానిని పిల్లవానినుండి పెద్ద వానివరకు అందరిని పర్యవేక్షణ చేయుచు ద్రౌపది ప్రత్యేక ప్రత్యేకముగా కనుగొనుచున్నది.

66. తరువాత ధౌమ్యుడును, మహాతపశ్శాలియగు వ్యాసుడును, నారదుని దేవలమహర్షిని ముందుంచుకొని ధర్మరాజు నభిషేకించిరి.

67. సత్యపరాక్రమఁడగు సాత్యకి వానికి ఛత్రమును బట్టెను. భీమసేను డును, అర్జునుడును వింజామరములను వీచిరి.

68. నకుల సహదేవులు రత్నదండములను మోయుచు ప్రక్కన ఉండిరి.

69 పూర్వకల్పమున బ్రహ్మదేవుడు ఇంద్రుని కొరకు తీసుకొనివచ్చిన వారుణకలశమును తీసుకొని వచ్చి వాని నభిషేకించిరి.

70. దానిచే శ్రీకృష్ణునిచే నభిషేకింపబడిన ధర్మరాజును చూచి నా మనస్సు కలుషమైనది.

71, 72. రంతిదేవుడు కాని, నాభాగుడుకాని, యవనాశ్వుడు కాని, మను చక్రవర్తికాని, వేనుని కుమారుడగు పృథుచక్రవర్తికాని, భగీర థుడుకాని, యయాతికాని, నహుషుడుకాని, యుధిష్ఠిరునితో సరి తూగరు.

ఏతాం దృష్ట్వా శ్రియం పార్థే హారిశ్చంద్రే యథా విభో।
కథం తు జీవితం శ్రేయో మమ పశ్యసి భారత॥ 73

నివర్తయిష్యతి త్వాఽసౌ యది జిత్వా సమేష్యతి।
నివృత్తే త్వయి రాజేంద్ర మరిష్యామి న సంశయః॥ 74

స త్వం మయి మృతే రాజన్ విదురేణ సుఖీ భవ॥ 75

ఆర్తవాక్యం తు తచ్ఛ్రుత్వా ప్రణయో దుఃఖమోహితః।
కారయిత్వా సభాం దివ్యాం విదురం చానినాయ సః॥ 76

తతో విద్వాన్విదురం మంత్రిముఖ్యం
ఉవాచేదం ధృతరాష్ట్రో నరేంద్రః ।
యుధిష్ఠిరం రాజపుత్రం చ గత్వా
మద్వాక్యేన క్షిప్ర మిహానయస్వ॥ 77

సభేయం మే బహురత్నా విచిత్రా
శయ్యాసనై రుపపన్నా మహార్హైః।
సా దృశ్యతాం భ్రాతృభి స్సార్ధ మేత్య
సుహృద్ద్యూతం వర్తతా మత్ర చేతి॥ 78

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే సభాపర్వణి
తృతీయోఽధ్యాయః సమాప్తః

73. ఓ తండ్రీ! ఇట్టి ఐశ్వర్యమును హరిశ్చంద్రుని వలె ఈ ధర్మరాజు యందు గాంచి ఏల నేను జీవించుట శ్రేయస్కరమని తలచు చున్నావు.

74. విదురుడు వచ్చుచో నిన్ను జూడను నుండి మళ్ళింపగలడు. నీవు జూడమనుండి మరలిన నేను తప్పక చనిపోగలను, సందేహము లేదు.

75. నేను చనిపోగా నీవు విదురునితో సుఖముగా నుండుము,

76, ధృతరాష్ట్రుడు అప్రియమగు ఆ వాక్యమును విని వాని యందలి ప్రేమచేతను, దుఃఖముచేతను, వ్యామోహితుడై దివ్యమగు సభను కట్టించి విదురుని పిలిపించెను.

77. తరువాత విద్వాంసుడగు ధృతరాష్ట్రుడు మంత్రి ముఖ్యుడగు విదురునితో " ఓ విదురా ! నీవు వెళ్ళి వెంటనే ధర్మరాజును నావాక్యముగా చెప్పి ఇచ్చటికి వెంటనేతీసుకొనిరమ్ము. " అని పలికెను.

78. నా ఈ సభ అనేకరత్నములతో విచిత్రమై గొప్ప విలువగల శయ్యాసనములతో కూడుకొని యున్నది. సోదరులతో నాతడిచ్చటకు వచ్చి ఈ సభను చూచు గాక. ఇచ్చట వినోదార్థము ద్యూతము జరుగుగాక. అని పలికెను.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున సభాపర్వమందు
మూడవ అధ్యాయము సమాప్తము.

## చతుర్థోధ్యాయః

విదుర ఉవాచ

నాభినందే నృపతే ప్రైష మేతం
మైవం కృథాః కులనాశా ద్బిభేమి
పుత్రై ర్భిన్నైః కలహ స్తే ధ్రువ స్యా
దేతచ్ఛంకే ద్యూతకృత్యే నరేంద్ర । 1

ధృతరాష్ట్ర ఉవాచ

నేహ క్షత్తః కలహ స్తప్స్యతే మాం
నచే ద్దైవం ప్రతిలోమం భవిష్యతి
ధాత్రానుశిష్టస్య వశే కిలేదం
సర్వం జగ త్తిష్ఠతి న స్వతంత్రం ॥ 2

తతః ప్రాయా ద్విదురోఽశ్వై రుదారై
ర్మహాజవై ర్బలిభి స్సాధు దాంతైః
బలాన్నియుక్తో ధృతరాష్ట్రేణ రాజ్ఞా
మనీషిణాం పాండవానాం సకాశే ॥ 3

విదుర ఉవాచ

రాజా మహాత్మా కుశలీ సపుత్ర
ఆస్తే వృతో జ్ఞాతిభి రింద్రకల్పః
ఇదంతు త్వాం కురురాజోఽభ్యువాచ
సుహృద్ద్యూతం క్రియతాం రమ్యతాంచ ॥ 4

# 4 వ అధ్యాయము

విదురుడు చెప్పుచున్నాడు.

1. ఓ రాజా ! ఈ నీ యభిప్రాయమును నేను మెచ్చుట లేదు. అట్లు చేయువద్దు, కులనాశము కలుగునని భయపడు చున్నాను. నీ పుత్రు లలో భేదము కలిగి తప్పక యుద్ధము సంభవింప గలదు. అని శంకించుచున్నాను. కాన జూదము తగదు.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

2. విదురా ! యిచ్చట కలహమున కవకాశము లేదు. దైవము వ్యతి రేకముగా లేనిచో యిబ్బంది లేదు గదా ! ఈ జగత్తంతయు బ్రహ్మశాసనమునకు వశమై యున్నది గదా ! స్వతంత్రమైన దేదియు లేదు.

3. అంతట మంచి వేగముగల చక్కగా శిక్షింపబడిన బలిష్ఠములగు అశ్వములతోకూడిన రథము నెక్కి విదురుడు ధృతరాష్ట్రునిచేబలా త్కారముగ ఆజ్ఞాపింపబడినవాడై విద్వాంసులగు పాండవులవద్దకు వచ్చెను,

4. విదురుడు చెప్పుచున్నాడు.

రాజగుధృతరాష్ట్రుడు పుత్రులతోను బంధువులతోను, గూడి దేవేం ద్రునివలె కుశలముగనున్నవాడు. కాని ధృతరాష్ట్రుడు నీచే సుహృద్ద్యూతము ఆడబడు గాక, అని నీతో చెప్పుమని చెప్పెను.

జానామ్యహం ద్యూత మనర్థమూలం
కృతశ్చ యత్నోఽస్య మయా నివారణే
రాజా చ మాం ప్రాహిణోత్ త్వత్సకాశం
శ్రుత్వా విద్వన్ శ్రేయ ఇహాచరస్వ ॥ 5

యుధిష్ఠిర ఉవాచ

నాహం రాజ్ఞో ధృతరాష్ట్రస్య శాసనా
న్న గంతు మిచ్ఛామి కవే దురోదరం
ఇష్టో హి పుత్రస్య పితా సదైవ
తదస్మి కర్తా విదురాత్థ మాం యథా ॥ 6
ఆహూతోఽహం న నివర్తే కదాచిత్ ॥ 7
ఏవముక్త్వా విదురం ధర్మరాజః
ప్రాయాచ్ఛ్వోభూతే సానుయాత్రః
సహ స్త్రీభిః ద్రౌపదీ మాదికృత్వా ॥

స హాస్తినపురం గత్వా ధృతరాష్ట్రేణ పాండవః
సమీయాయ యథాన్యాయం కురుభిశ్చాఽపి సర్వశః॥ 8—9
సుఖోషితాస్తే రజనీం ప్రాతస్సర్వే కృతాహ్నికాః
సభాం రమ్యాం ప్రవివిశుః కితవై రభినందితాః ॥ 10
భీష్మః ద్రోణః కృపశ్చైవ విదురశ్చ మహామతిః
నాతిప్రీతేన మనసా ధృతరాష్ట్ర మనువ్రతాః ॥ 11
శకుని స్సౌబలశ్చాత్ర యుధిష్ఠిర మభాషత ॥
ఉపస్తీర్ణా సభా రాజన్ సర్వే త్వయి కృతక్షణాః।
అక్షానుప్త్వా దేవనస్య సమయోఽస్తు యుధిష్ఠిర॥ 12

5. జూదము అనర్థములకు హేతువులని నేనెరుగుదును. దానిని వారించుటకు నేను ప్రయత్నించితిని. కాని ధృతరాష్ట్రుడు నీవద్దకు నన్నుపంపినాడు. ఓవిద్వాంసుడా! ఇదివిని ఇచ్చట శ్రేయస్కరమైనది ఆచరింపుము.

6. ధర్మరాజు చెప్పుచున్నాడు.
విదురా! ధృతరాష్ట్రుని ఆజ్ఞను అతిక్రమించలేను జూదమునకు మనంబొప్పుటలేదు. అయినను పుత్రునకు తండ్రి ఎల్లప్పుడు హితము కోరువాడు గదా! కావున అతని ఆజ్ఞను నేను ఆచరింతును.

7. జూదమున కాహ్వానింపబడిన వాడనై నేనెన్నడును మరలిపోను

8,9. ఈవిధముగా ధర్మరాజు విదురునితో పలికి తెల్లవారిన తరువాత ప్రయాణసన్నాహముచేసి స్త్రీలతోను ద్రౌపదితోకూడి హస్తినకు వెళ్ళి ధృతరాష్ట్రునితోను యథాన్యాయముగ కౌరవులందరితోను కూడుకొనెను.

10. పాండవులు ఆరాత్రి సుఖముగ గడిపినవారై ప్రాతఃకాలమున సంధ్యావందనాది కృత్యములనాచరించి రమ్యమగు సభాభవనమున ప్రవేశించి అచ్చటగల మోసగాండ్రచే అభినందింపబడిరి.

11. భీష్ముడు, ద్రోణుడు, గొప్పబుద్ధిశాలియగు విదురుడు మిక్కిలి సంతోషించని మనస్సుతో ధృతరాష్ట్రుననుసరించిరి.

12. శకుని యుధిష్ఠిరునితో పల్కెను. ఓరాజా! సభఏర్పాటు చేయబడినది. మేమందరము నీకొరకై నిరీక్షించుచున్నాము పాచికలతో జూదమాడుటకు సమయమైనది.

యుధిష్ఠిర ఉవాచ॥

నికృతి ర్దేవనం పాపం న క్షాత్రేఽత్ర పరాక్రమః।
శకునే నైవ నో జైషీ రమార్గేణ నృశంసవత్॥ 13

ఆహూతో న నివర్తేయ మితి మే వ్రత మాహితం।
విధిశ్చ బలవాన్ కేన దేవనం మే భవిష్యతి॥ 14

దుర్యోధన ఉవాచ॥

అహం దాతాఽస్మి రత్నానాం ధనానాం చ విశాంపతే॥
మదర్థే దేవితా చాయ శకుని ర్మాతులో మమ॥ 15

యుధిష్ఠిర ఉవాచ॥

అన్యో నాన్యస్య వై ద్యూతవిషయం ప్రతిభాతి మే।
ఏతద్విద్వన్నుపాధత్స్వ కామమేవం ప్రవర్తతాం॥ 16

సన్తి నిష్కసహస్రస్య భాండిన్యో భరితా శ్శుభాః।
కోశో హిరణ్యమక్షయ్యం సవర్ణ్వా రాష్ట్రసమ్మతాః॥
శతం దాసీసహస్రాణి కుశలా నృత్తసామసు।
సహస్రసంఖ్యా నాగా మే సర్వశబ్దసహా యుధి।
గజాశ్వం బహుధేనూక మసంఖ్యేయ మజావికం।
ఏత దాజాన్ మమ ధనం తేనదీవ్యామ్యహంత్వయా ॥ 17-19

13. యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

జూదము మోసముతో కూడినది. పాపిష్ఠమైనది. క్షాత్రపరాక్రమ మందులేదు. ఓశకునీ! అన్యాయముగ మమ్ము దుర్మార్గునివలె జూదమున జయింపకుము.

14. జూదమునకు ఆహ్వానింపబడిన వాడనై నేను నిరాకరించను. యిది నా నియమము. విధిబలవత్తరమైనది కదా! ఎవనితో నేను జూదమాడవలయును?

15. దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

ఓరాజా! రత్నములను ధనములను యిచ్చువాడను నేను. నాకొరకు నా మేనమామయగు శకుని జూదమాడగలడు.

16. ధర్మరాజు చెప్పుచున్నాడు.

ఒకడు మరియొకనికొరకై జూదమాడుట యుక్తముగా నాకు తోచుటలేదు. అట్లేకానిందు. మీకోరెక్కప్రకారమే జూదము జరుగు గాక.

17-19 నావద్దబంగారునాణెములతోనిండిన అనేకభాండములు గలవు. నాబంగారుకోశమక్షయమైనది. జాత్యశ్వములు అనేకము గలవు. నృత్తగానములందు నేర్పరులగు దాసీలు నూరువేలు గలరు. వేల సంఖ్యలో మంచి గజములు గలవు గోవులు, అశ్వములు, వృష భములు చాల గలవు. మేషములకు గొర్రెలకు లెక్కయే లేదు. ఇదంతయు వాధనము. దీనినంతయు పందెమొడ్డి నీతో నాడుచు న్నాను.

ఏతచ్ఛ్రుత్వా వ్యవసితో నికృతిం సముపాశ్రితః।
జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత। 20

విదురఉవాచ॥

ముమూర్షో రౌషధమివ న రోచేతాపి తే శ్రుతం ॥ 21
ధృతరాష్ట్ర విజానీహి యత్త్వాం వక్ష్యామి భారత।

యద్వై పురా జాతమాత్రో రురావ।
గోమాయువ ద్విస్వరం పాపచేతాః॥ 22

దుర్యోధనో భారతానాం కులఘ్న స్సోయం
వ్యక్తం భవతాం కాలహేతుః॥ 23

విదితం తే మహాప్రాజ్ఞ భోజేష్వే వాసమంజసః।
పుత్రం సంత్యక్తవాన్ పూర్వంపౌరాణాంహితకామ్యయా॥ 24

త్వన్నియుక్త స్సవ్యసాచీ నిగృహ్ణాతు సుయోధనం
నిగ్రహాదస్య పాపస్య మోదంతాం కురవ స్సుఖం ॥ 25

త్యజేత్కులార్థే పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్ ॥ 26
మాగమ స్ససుతామాత్య స్సబలశ్చ యమక్షయం
ఉక్తోక్తం ధృతరాష్ట్రోఽపి శ్రుత్వాఽశ్రుత ఇవ స్థితః ॥ 27

20. యిది విని కపటము నాశ్రయించి సిద్ధముగానున్న శకుని (సౌబలుడు) అంతయు జయింపబడినది. అని ధర్మరాజుతో పల్కెను.

21. విదురుడు చెప్పుచున్నాడు,
ఓ ధృతరాష్ట్రా! నేను నీతో చెప్పుచున్నది గ్రహించుము. చావనున్న వానికి ఔషధమువలె గాక నావాక్యములు నీకు రుచించుగాక.

22. పూర్వము దుర్యోధనుడు పుట్టినతోడనే దుర్మార్గుడగునాతడు నక్కవలె అపస్వరముగా నేడ్చెను గదా!

23. ఈ దుర్యోధనుడు భరతకులమును, మిమ్మును నశింపచేయు కారణమునకు హేతువగువాడు.

24. ఓ విద్వాంసుడా! పూర్వము భోజదేశములందు ప్రభువు తనపుత్రుడగు అసమంజసుని ప్రజలహితము కొరకు విడిచి పెట్టెను గదా! అది నీకు తెలిసినదే

25. కావున నీచే ఆజ్ఞాపింపబడినవాడై అర్జునుడు సుయోధనుని విగ్రహించుగాక. పాపుడగు అతనిని విగ్రహించుటచే కౌరవులందరు సుఖముగ నుందురు గాక.

26. కులము కొరకు ఒకనిని గ్రామము కొరకు కులమును, దేశము కొరకు గ్రామమును ఆత్మార్థమై భూమిని విడిచి పెట్టవలయును.

27. నీవు సుత అమాత్యబలములతో కూడి నాశనమును పొందవద్దు, అని విదురుడు చెప్పినవాక్యమును విని యు వినని వానివలెనుండెను

శకునిరువాచ

సంఖ్యాం విధేహి విత్తస్య తవ రాజ్యస్య పాండవ ॥ 28

యుధిష్ఠిర ఉవాచ

మమ విత్త మసంఖ్యేయం యదహం వేద సౌబల
అయుతం ప్రయుతం చైవ పద్మం ఖర్వ మథార్బుదం
శంఖం చైవ మహాపద్మం నిఖర్వం కోటి రేవచ
మధ్యం చైవ పరార్ధం చ సపరం చాత్ర పణ్యతాం
పురం జనపదో భూమి ర బ్రాహ్మణధనై స్సహ
అబ్రాహ్మణాశ్చ పురుషా రాజ శ్శిష్టధనం మమ
ఏత ద్రాజ మమ ధనం తేన దీవ్యా మ్యహం త్వయా॥2932

జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత ॥

యుధిష్ఠిర ఉవాచ

రాజపుత్ర ఇమే రాజ శ్శోభంతే యే విభూషితాః
కుండలాని చ నిష్కాశ్చ సర్వం రాజవిభూషణం
ఏతన్మమ ధనం రాజం స్తేన దీవ్యా మ్యహం త్వయా ॥ 34

జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత ॥ 35

యుధిష్ఠిర ఉవాచ

అయం ధర్మ స్సహదేవోఽనుశాస్తి
లోకే హ్యస్మి న్పండితాఖ్యాం గతశ్చ
అనర్హతా రాజపుత్రేణ తేన
దీవ్యా మ్యహం చాప్రియవ త్ప్రియేణ ॥

శకుని పల్కుచున్నాడు.

28. ఓధర్మరాజా! నీధనముయొక్కయు, రాజ్యముయొక్కయుసంఖ్యను చెప్పుము.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు

29-32. నాధనము లెక్కింప శక్యముగానిది, అసంఖ్యను నేనే ఎరుగను. అయుతము, ప్రయుతము, పద్మము, ఖర్వము, అర్బుదము, శంఖము, మహాపద్మము, నిఖర్వము, కోటి మధ్యము, పరార్ధము, సపరము ఇచ్చట వడ్డబడుచున్నది. దేశమందలి పట్టణములు బ్రాహ్మణధనములను వదలిపెట్టి మిగతభూమియు బ్రాహ్మణులను విడిచి మిగతప్రజలు ఇదంతయు నాధనము, ఈ నాధనమునంతను పందెముగా నొడ్డి నీతో జూదమాడుచున్నాను.

33. నీధనము జయింపబడినది, అని శకుని ధర్మరాజుతో ననెను.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

34. ఈరాజపుత్రులు ఏఅలంకారములతో విరాజిల్లు చున్నారో ఆకుండలములు, బంగారు పతకములు మొ॥ రాజ విభూషణములన్నియు నాధనము. దానిని పందెమొడ్డి నీతో జూదమాడుచున్నాను.

35. ఓధర్మరాజా! నీధనము జయింపబడినది. అని శకుని పలికెను.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

36. ఈధర్మస్వరూపుడగు సహదేవుడు లోకమును పరిపాలించుచున్నాడు అందరిరాజులచే బూజింపబడినవాడు. పందెముగా నొడ్డుటకు అర్హుడుకాని ప్రియమగు ఈరాజపుత్రుని అప్రియునివలె పందెమొడ్డి ద్యూతమాడు చున్నాను.

జితమిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత॥ 37

యుధిష్ఠిర ఉవాచ

శ్యామో యువా లోహితాక్ష స్సింహస్కంధో మహాభుజః
నకులో గ్లహ ఏవైకో విద్ధ్యేత న్మమ తద్ధనం॥ 38

జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత॥ 39

యుధిష్ఠిర ఉవాచ.

యో న స్సంఖ్యే నౌరివ పారనేతా
జేతా రిపూణాం రాజపుత్ర స్తరస్వీ
అనర్హతా ఽలోకవీరేణ తేన
దీవ్యామ్యహం శకునే ఫాల్గునేన॥ 40

జిత మిత్యేవ శకునిః యుధిష్ఠిర మభాషత॥ 41

యుధిష్ఠిర ఉవాచ

బలేన తుల్యో యస్య పుమా న్న విద్యతే
గదాభృతా మగ్ర్య ఇహారి మర్దనః
అనర్హతా రాజపుత్రేణ తేన
దీవ్యా మ్యహం భీమసేనేన రాజన్॥ 42

జిత మిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత॥ 43

శకుని రువాచ

బహువిత్తం పరాజైషీ ర్భ్రాతౄం శ్చ సహ యుధిష్ఠిర
ఆచక్ష్వ విత్తం కౌంతేయ యది తేఽస్త్యపరాజితం॥ 44

37, అతడు జయింపబడెనని శకుని ధర్మరాజుతో పలికెను.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

38, యువకుడు ఎఱ్ఱని నేత్రములుకలవాడును, సింహమువంటి పిఱుకల వాడును, ఆజానుబాహుండునగు నకులుడు పందెముగా నొడ్డబడు చున్నాడు. ఇదియే నాధనము.

39. నీధనము జయింపబడినది. అని ధర్మజునితో శకుని పలికెను.

యుధిష్ఠిరుడు పలుకుచున్నాడు.

40. మాకుయుద్ధమున నావవలె దరిచేర్చువాడును, శత్రువులనుజయించు వాడును, వేగముకలవాడును, అలోకసాధారణ వీరుడును నగు అర్జునుని పందెమొడ్డి ద్యూత మాడుచున్నాను.

41, అర్జునుడు జయింపబడెనని సౌబలుడు (శకుని) ధర్మజునితోపలి కెను.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

42, ఎవనికి సమానబలుడు లేడో యెవడు శత్రువులను మర్దించునో పందెమునకు తగనట్టి రాజపుత్రుడగు భీమసేనునితో జూదమాడు చున్నాను,

43. భీముడుజయింపబడెనని శకుని కుంతీసుతునితో పలికెను.

శకునిపల్కు చున్నాడు,

44, ఓధర్మరాజా! సోదరులతోకూడ చాలధనమును వోడిపోతివి, జయింపబడని ధనమేదైన యున్నచో దానిని చెప్పుము,

యుధిష్ఠిర ఉవాచ

అహం విశిష్ట స్సర్వేషాం భ్రాతౄణాం యది తత్త్వథా
కుర్యా మహం జితః కర్మ స్వయ మాత్మ న్యుపప్లవే ॥ 45

♦జిత మిత్యేవ శకునిః యుధిష్ఠిర మభాషత ॥ 46

శకుని రువాచ

ఏత త్పాపిష్ఠ మకరోః యదాత్మానం పరాజయైః
శిష్టే సతి ధనే రాజన్ గ్లహా ఏకోఽ పరాజితః ॥ 47

పణస్వ కృష్ణాం పాంచాలీం తయాఽత్మానం పున ర్జయ ॥ 48

యుధిష్ఠిర ఉవాచ

యాదృశం ధర్మకామార్థసిద్ధి మిచ్ఛేన్నర స్త్రియం
తయైవం విధయా రాజన్ పాంచాల్యాహం సుమధ్యయా
గ్లహం దీవ్యామి చార్వంగ్యా ద్రౌపద్యా హంత సౌబల ॥ 49

---

♦ వ్యా॥ జితమిత్యత్ర, శకునే ర్జయకారణం పురాణాంతరేష్వేవంవిధయా ప్రతిపాదితం। తథాహి శకునేః పిత్రాద్యాః పంచ సోదరా సువీరాదయో గంధర్వాంశజాః॥ తేషా మంతిమ స్సుబలో గాంధార నాయకః॥ తాన్ చిత్రాంగదో గుహాయాంనిర్బంధ్యవినాశితవాన్। తాసాంజ్యేష్ఠస్యశల్యాన్యేవ గ్లహాఖ్యా ద్యూతసాధనాని। సుబలో జీవిత్వా స్వపుత్రాయ తాన్ దత్వా ప్రేషయామాస కౌరవరాజధానీం తేషాం నాశ నాయేతి ॥

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

45. నేను సోదరులందరిలో మిగిలియున్నవాడను. ఆపత్సంభవింపగా నేనువారితోపాటు ఓడిపోవుదును. నేను స్వతంత్రముగా నుండుట యుక్తము కాదు గదా !

46. నీవును యోడిపోతివని శకుని పలికెను.

శకుని చెప్పుచున్నాడు.

47. ఓ ధర్మజా ! నిన్నోడిపోవుట అను పాపకార్యమును జేసితివి. ఓడని మరియొక ధనము నీకుండగా ముందుగా నీవోడుట అయుక్తమైనది.

48. కాన ద్రౌపదిని పణముగా నొడ్డుము ఆమెచే నిన్ను మరల జయించుకొనుము.

49. నరుడు ధర్మార్థకామసిద్ధికై యెటువంటి స్త్రీని భార్యగా గోరునో అటువంటి సౌందర్యవతియగు పాంచాలితో పందెమిడి ఆయ్యో ! నేను జూదమాడుచున్నాను.

---

"వ్యా" శకుని జయించుటకు కారణము ఉత్తర పురాణములందు ఈ విధముగా చెప్పబడినది. శకుని యొక్క తండ్రియగు సుబలాది అయిదుగురు సోదరులును గంధర్వుల అంశచే జన్మించినవారు. వారిలో చివరివాడగు సుబలుడు గాంధారదేశమునకు రాజాయెను. ఆ సోదరులను చిత్రాంగదుడు గుహయందు నిర్బంధించి నశింపజేసెను. వారిలో పెద్దవాని యొక్క శల్యములే జూద సాధనములగు పాచికలు. సుబలుడు బ్రతికి తన పుత్రుడగు శకునికి వాటి నొసంగి కౌరవవంశనాశనమునకై హస్తినాపురమునకు శకునిని పంపెను.

* ఏవ ముక్తేతు వచనే ధర్మరాజేన ధీమతా
ధిగ్ధిగిత్యేవ వృద్ధానాం సభ్యానాం నిస్సృతా గిరః ॥ 50

---

* వ్యా॥ అథాత్ర ధర్మసూత్రత్వం దుయూహ్యత్వేన విద్యతే। తథాహి - సభాయాం ద్రౌపదీం పణస్వేతి శకునే ర్వాక్యం శ్రుత్వాఽపి దుర్యోధనాదయ ఇవ ధృతరాష్ట్రోఽపి తూష్ణీమేవ స్థితవాన్॥ న తావన్మాత్రం కిం తు శ్లో॥ ధృతరాష్ట్రోఽపి సంహృష్టో పర్యపృచ్ఛ త్పునః పునః కిం జితం కిం జితమితి హ్యాకారం నాభ్యరక్షత ఇత్యుక్త వక్ష్యమాణ వచన బలాత్ ధృతరాష్ట్ర స్యాప్యభిమతమే వైతత్కార్య మితి జ్ఞాయతే ॥

తద్జ్ఞాత్వా యుధిష్ఠిరోఽపి శ్లో॥ నాహం రాజ్ఞో ధృతరాష్ట్రస్య శాసనా న్న గంతు మిచ్ఛామితి॥ భా॥ 72అ రాజన్ కిం కరవామ స్తే ప్రశాధ్యస్మాం స్త్వమీశ్వరః। నిత్యం హి స్థాతు మిచ్ఛామః తవ భారత శాసనే ॥ ఇత్యా ద్యుక్తవక్ష్య మాణవచనబలాత్ ధృతరాష్ట్రస్యాభిమతమే వాస్మాకం ప్రమాణం సర్వస్వహానిమపి న గణయామి పితు ర్వాక్యగౌరవాత్। జ్ఞాతీనామపి నిష్ఠురోక్తిం న వక్ష్యామి త్రయోదశాబ్దపర్యంత మితి స్వకీయమతత్వాచ్చ ॥

ధర్మాధర్మపరిజ్ఞానే॥ యదా యుధిష్ఠిర స్స్వయం ధార్తరాష్ట్రాణాం దాసోఽభవత్ తేషా మాజ్ఞప్తేన విధనా ధర్మాధర్మనియమంవిహాయ ప్రవర్తితవ్య మేవ। అన్యచ్చ దాసస్య

*50 ఈవిధముగా బుద్ధిశాలియగు ధర్మరాజు పలుకగా వృద్ధులగు సభ్యు
తెల్లరు ఛీ ! ఛీ ! యని ఆక్రోశించిరి

---

*వ్యా॥ ఇచ్చట ధర్మసూక్ష్మము చాల దురూహ్యముగా నున్నది. అది యేదన సభయందు ద్రౌపదిని పందెముగా నొడ్డుము. అను శకుని వాక్యములను వినియు దుర్యోధనాదులవలె ధృతరాష్ట్రుడును యేమియు మాట్లాడక యుండెను. మరియు శ్లో॥ ధృతరాష్ట్రుడు సంతోషించుచు యేది జయింపబడినది యేది జయింపబడినదని మాటిమాటికి అడుగు చుండెను. సంతోషాతిశయముచే హృద్గతాభిప్రాయమును దాచుకొనలేక పోయెను. అనెడి యీ వాక్యబలముచే యీ ద్యూతమున్నూ అందు ధర్మ రాజోడుట తనవారు జయించుట అనునది ధృతరాష్ట్రునికిని అభిమత మైనదేనని తెలియబడుచున్నది.

అది తెలుసుకొని ధర్మరాజు గూడ భా॥ స. ప 72 అ॥ శ్లో॥ ధృతరాష్ట్రుని ఆజ్ఞవలన నేను వెళ్ళకుండుటకు కోరుటలేదు. శ్లో॥ రాజా! యేమేమి చేయవలయును. నీవు మాకు ప్రభువవు గాన మమ్మాజ్ఞాపించుము. ఓ రాజా ! నీ ఆజ్ఞయందు మేమెల్లప్పుడు బద్ధులము. ఇట్లాగి పూర్వమందు చెప్పిన ముందు చెప్పబోవు వాక్యముల బలముచే ధృత రాష్ట్రునకు అభిమతమైనదే మాకాచరింపదగినది. తండ్రియందలి గౌర వముచే సర్వస్వము నశించినను నేను లెక్కింపను, వనమునుండి వచ్చు ముల వరకు దుర్యోధనాదులతోను కఠినమైన వాక్యములు పలుకను. అనెడి ధర్మరాజు యొక్క నియమమై యున్నది.

ద్రౌపదిని పందె మొడ్డుట ధర్మమా ? అధర్మమా ? అను విషయములో ధర్మరాజు స్వయముగ కౌరవుల కెప్పుడు దాసుడాయెనో వారిచే ఆజ్ఞాపింపబడినవాడై ధర్మాధర్మనియమమును విడిచి ఆ ఆజ్ఞను చేయదగియున్నది. మరియు దాసుడగు వానికి స్వకీయమైన ధనము

చతుర్థే చ సభా రాజ్ఞా రాజ్ఞాం సంజజ్ఞిరే శుచః।
భీష్మద్రోణకృపాదీనాం స్వేదశ్చ సమజాయత॥ 51

శిరోగృహీత్వా విదురో గతసత్త్వ ఇవాభవత్।
ఆస్తే ధ్యాయన్నధోవక్త్రో నిశ్వసన్నివ పన్నగః॥ 52

ధృతరాష్ట్రస్తు సంహృష్టః పర్యపృచ్ఛత్పునః పునః।
కిం జితం కిం జితమితి హ్యాకారం నాభ్యరక్షత। 53

జహర్ష కర్ణోఽతిభృశం సహ దుశ్శాసనాదిభిః।
ఇతరేషాం తు సభ్యానాం నేత్రేభ్యః ప్రాపతజ్జలం॥ 54

---

స్త్రీయం ధనం కించిదపి న స్థాతవ్యం విద్యమానధనస్యాప్యధి
కారతా తత్స్వామిన ఏవేతి విజ్ఞాయ ధర్మరాజః ద్రౌపదీం
పణితవాన్॥ తథా హి మనుః। శ్లో॥ రథాశ్వం హస్తినం
ఛత్రం ధనం ధాన్యం పశూన్ స్త్రియః। సర్వద్రవ్యాణి
పాత్రాణి యో యజ్జయతి తస్య తత్॥ కేవలకష్టసుఖదృష్ట్యా
సర్వేషాం దుఃఖతరదృశ్యత్వాత్। పేతురా సర్వే పాపక్రో
శితాః తదపి యుక్తమేవేతి ద్యోత్యతే॥

౫౧. సభయంతయు అట్టుడికినట్లుడికి పోయెను. రాజులందరికిని దుఃఖాశ్రువులు బయలుదేరినవి. భీష్మ ద్రోణ కృపాదులకు చెమట బట్టెను.

52. విదురుడు శిరస్సు పట్టుకొని ధ్యానించుచు ముఖము వంచుకొని బుస కొట్టుచున్న సర్పము వలెనుండి ప్రాణము బోయినవాడువలె నుండెను.

53. ధృతరాష్ట్రుడు మాత్రము సంతోషించుచు మాటిమాటికి మావారేమి జయించిరి? మావారేమి జయించిరి? అని అడుగుచుండెను. సంతోషాతిశయముచే హృద్గతాభిప్రాయమును దాచుకొన లేక పోయెను.

౫4. కర్ణుడు దుశ్శాసనాదులతో గూడి మిక్కిలి సంతోషించెను. యితర సభ్యులకు నేత్రములనుండి దుఃఖాశ్రువులు జారినవి.

---

యేమియు నుండగూడదు. ఒకవేళ యేదైన ధనమున్నచో దాని యందధికారము తన ప్రభువునకే కలదు. కాని తన కేదియు లేదని తెలుసుకొని ధర్మరాజు ద్రౌపదిని పందెముగా నొడ్డెను.

ఈ విషయమున మనువు ఇట్లు చెప్పుచున్నాడు. యెవడు యెవనిని జయించునో వాని యొక్క రథములు, గుఱ్ఱములు, యేనుగులు, ఛత్రము, ధనము, ధాన్యము, పశువులు, స్త్రీలు, పాత్రలు, మొదలుగాగల సర్వద్రవ్యములు వానిని జయించినవానికే చెందును. అట్లయిన ద్రౌపదిని ఒడ్డగా అందరు యేల హాహాకారములు చేసిరన మిక్కిలి దుఃఖకరమైన ఈ దృశ్యమును జూచి అందరు విలపించిరి. అది తగినదే యని తోచుచున్నది.

సాబలో ఽసి మిత్యేవ తా నతా నన్వపాద్యత। 55

దుర్యోధన ఉవాచ॥

ఏహి క్షత్తః ద్రౌపదీ మానయస్వ
ప్రియాం భార్యాం సమ్మతాం పాండవానాం।
సంమార్జతాం వేశ్మ పరైతు శీఘ్రం
తత్రాస్తు దాసీభి రపుణ్య శీలా॥ 56-57

విదుర ఉవాచ॥

దుర్విభాష్యం భాషితం త్వాదృశేన
న మంద సంబుధ్యసి పాశబద్ధః।
ప్రపాతే త్వం లంబమానో న వేత్సి
వ్యాఘ్రాన్ మృగః కోపయసీతి కేవలం॥ 58

న హి దాసీత్వ మాపన్నా కృష్ణా భవితు మర్హతి।
అనీశేన హి రాజ్ఞైషా పణే న్యస్తేతి మే మతిః॥ 59

---

వ్యా॥ నహీత్యత్ర విదురస్యాభిప్రాయ మేతత్॥ తథాహి ద్రౌపదీ త్వద్దాసీ న భవతి॥ కుతః తవ రాజ్యే భాగస్వామ్యమపి నాస్తి॥ తవ పితాపి యావత్కాలం యుధిష్ఠిరో పితృవాక్య పరిపాలనం కుర్వన్నాస్తే తావత్కాల మేవ రాజా॥ తథాపి యుధిష్ఠిరః స్వీయవ్రతం న త్యక్ష్యతి। తదాపి తవ పితు ర్దాసీ భవితు మర్హతి॥ న తవ॥ తవ ఈషన్మాత్రమపి అధికారో నాస్తి॥ కుత ఇతి చేత్ ఉపరిష్టా ద్వ్యాయే ధృతరాష్ట్రోక్త శ్లోకః॥

55. శకుని యిదియు జయింపబడినదని పలుకుచు ఆ పాచికలను అవతల ఉంచెను.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

56. 57. ఓ విదురా ! పాండవులకు ఇష్టురాలును ప్రియురాలు నగు ద్రౌపదిని యిచ్చటికి తీసుకొని రమ్ము. యీ గృహమును ఊడ్చుగాక. యిచ్చటకు శీఘ్రముగ వచ్చి దాసీ స్త్రీలతోబాటు వుండుగాక.

విదురుడు చెప్పుచున్నాడు.

58. ఓ దుర్యోధనా ! నీవు మాటాడకూడని దానిని మాటాడుచున్నావు. ఓ మందుడా ! నీవు యమపాశబద్ధుడవై తెలుసుకొనలేకున్నావు. నీకు రానున్న హానిని గుర్తెరుగకున్నావు. నీవు పెద్దపులులను లేడివలె పాండవులను రెచ్చగొట్టుచున్నావు.

59. అధికారములేని ధర్మరాజుచే ఈమె పణముగా నొడ్డబడినది గాన ద్రౌపది దాసి కానేరదు అని నా యభిప్రాయము

---

వ్యా॥ ఇచ్చట విదురుని యభిప్రాయమిది ద్రౌపది నీకు దాసి కాదు. ఏలనన నీకు రాజ్యమునందు హక్కులేదు. నీ తండ్రియు ధర్మజుడు యెంతవరకు పితృవాక్యపరిపాలనము చేయుచుండునో అంతకాలమే రాజు. అయినను ధర్మరాజు తన వ్రతమును వదలి పెట్టుటలేదు. రాజగు నీ తండ్రికి ద్రౌపది ఒకవేళ దాసియగుచో దాసి కావచ్చును కాని నీకు కొంచెమైనను అధికారము లేదు, ఏలనన ముందు అధ్యాయమున ధృతరాష్ట్రుడు చెప్పిన శ్లోకమున యిట్లు గలదు.

శ్లో॥ ఓ ధర్మరాజా ! నీకు క్షేమమగుగాక ! సుఖముగా వెళ్ళి రమ్ము. నా అనుజ్ఞ పొంది ధనముతోగూడి నీ రాజ్యమును నీవు శాసింపుము. అని ధర్మరాజుతో అనినంతమాత్రమున అంతయు ధర్మరాజునకు

వైశంపాయన ఉవాచ॥
ధిగస్తు క్షత్తార మితి బ్రువాణో
దర్పేణ మత్తో ధృతరాష్ట్ర పుత్రః।
అవైక్షత ప్రాతిగామీం సభాయా
మువాచ చైనం పర ఆర్యమధ్యే॥ 60
త్వం ప్రాతిగామిన్ ద్రౌపదీ మానయస్వ
న తే భయం విద్యతే పాండవేభ్యః।
క్షత్తా హ్యయం వివదత్యేవ భీతో
నచాస్మాకం వృద్ధికామ స్సదైవ॥ 61
ఏవముక్తః ప్రాతిగామీ స సూతః।
సమాసద న్మహిషీం పాండవానాం॥ 62

ప్రాతిగామ్యువాచ॥
యుధిష్ఠిరో ద్యూతమదేన మత్తో
దుర్యోధనో ద్రౌపది త్వా మజైషీత్।
సా త్వం ప్రపద్యస్వ ధృతరాష్ట్రస్య వేశ్మ
నయామి త్వాం కర్మణే యాజ్ఞసేని॥ 63

---

అజాతశత్రో భద్రం తే అరిష్టం స్వస్తి గచ్ఛతు అనుజ్ఞాతస్సహ ధనైః స్వారాజ్య మనుశాసతు ఇతి ధర్మరాజం ప్రత్యుక్తమాత్రేణ పున స్సర్వం యుధిష్ఠిర స్యాగమనాత్ న తదధీనం కించిదపీత్యర్థః॥

ఏతావతా స్వస్వత్వం విహాయ ద్రౌపదీ త్వద్దాసీ న భవతి అనధికారయుధిష్ఠిరేణ పణితత్వాదితి సంగ్రహేణోక్తవాన్ ఇతి శం.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

60. దుర్యోధనుడు మదముతో గూడినవాడై విదురునకు నిందయగు గాక యుని పలుకుచు సభయందున్న ప్రాతిగామివంక చూచి పూజ్యులందరి మధ్యలో వానితో నిట్లు పలికెను.

61. ఓ ప్రాతిగామీ ! ద్రౌపది నిచ్చటకు తీసుకొని రమ్ము. పాండవుల వలన నీకు భయము లేదు. ఈ విదురుడు భయపడి వెళ్ళుట కంగీకరించుట లేదు. మరియు విదురుడు మా అభివృద్ధిని గోరువాడు కాడు.

62. ఈ విధముగా పలుకబడి సూతుడగు ఆ ప్రాతిగామి పాండవపట్ట మహిషి యగు ద్రౌపదిని సమీపించెను.

ప్రాతిగామి చెప్పుచున్నాడు.

63. ఓ ద్రౌపదీదేవీ ! ధర్మరాజు జూదమదముచే మత్తుడై యున్నాడు. దుర్యోధనుడు నిన్ను గెలుచుకొనెను. కాన నీవు ధృతరాష్ట్రుని గృహమును పొందుము. అచ్చట పనిపాటలు చేయుటకై నిన్ను నేను తీసుకొని వెళ్ళగలను.

---

సంక్రమించినది గదా ! కావున దుర్యోధనునకు దేనియందును యేమాత్రమును హక్కులేదు.

ఈ సూక్ష్మమైన అర్థమును విడిచి పెట్టి ద్రౌపది నీకు దాసి కాదు. ఏలయన అధికారి కాని యుధిష్ఠిరునిచే పందెము యొడ్డబడుటచేనని సంగ్రహముగా విదురుడు చెప్పెను.

ద్రౌపద్యువాచ॥
కథం త్వేవం వదసి ప్రాతిగామిన్
కోఽహి దీవ్యే ద్భార్యయా రాజపుత్రః।
మూఢో రాజా ద్యూతమదేన మత్తో
హ్యభూ న్నాన్య త్కైతవ మస్య సించత్ ॥ 64

ప్రాతిగామ్యువాచ॥
యదా నాభూ త్కైతవ మసదస్య
తదాఽదేవీ త్పాండవోఽజాతశత్రుః।
న్యస్తాః పూర్వం భ్రాతర స్తేన రాజ్ఞా
స్వయం చాత్మా త్వ మథో రాజపుత్రి॥ 65

ద్రౌపద్యువాచ॥
గచ్ఛ త్వం కితవం గత్వా సభాయాం పృచ్ఛ సూతజ।
కింతు పూర్వం పరాజైషీ రాత్మాన మథవా ను మాం॥ 66

సభాం గత్వా స చోవాచ యుధిష్ఠిర మిదం వచః।
న తం సూతం ప్రత్యువాచ వచనం సాధ్వసాధు వా॥ 67

యుధిష్ఠిరస్తు నిశ్చేతా గతసత్వ ఇవాభవత్॥ 68

దుర్యోధన ఉవాచ॥
ఇహైవాగత్య పాంచాలీ ప్రశ్న మేనం ప్రభాషతాం।
ఇహైవ సర్వే శృణ్వంతు తస్యా శ్చేతసి యద్వచః॥ 69

ద్రౌపది చెప్పుచున్నది.

64. ఓ ప్రాతిగామీ ! ఇట్లు నీవేల పలుకుచున్నావు ? ఏ రాజపుత్రుడు భార్యతో జూదమాడును ? ధర్మరాజు జూదమత్తుడై వారి మోసమును గుర్తెరుంగక ఇట్లాడెను అడుగాక.

ప్రాతిగామి పల్కుచున్నాడు.

65. ఓ ద్రౌపదీ ! ధర్మరాజు కపటము లేని సమయమున జూదమాడెను. వానిచే మొదట సోదరులు పందెమొడ్డబడిరి. తరువాత తనను, ఆ తరువాత నిన్ను పందెమొడ్డి వోడిపోయినాడు.

ద్రౌపది చెప్పుచున్నది.

66. నీవు వెంటనే వెళ్ళుము. అచ్చట సభయందున్న జూదరియగు ధర్మరాజును ముందు తానోడెనో, నన్నోడెనో అడుగుము.

67. ఆ ప్రాతిగామి సభకు వచ్చి ధర్మరాజును ఆ వాక్యమడిగెను. ధర్మరాజు వానికి ఏమియు సమాధానము చెప్పలేదు.

68. ధర్మరాజు నిశ్చేతస్కుడై ప్రాణము పోయినవానివలె ఏమియు మాటాడక ఉండిపోయెను.

దుర్యోధనుడు చెప్పుచున్నాడు.

69. ద్రౌపది ఇచ్చటకే వచ్చి ఈ ప్రశ్న నడుగుగాక. ఇచ్చట నున్న వారందరు ఆమె అభిప్రాయము నెరింగి ఆమె వాక్యమును విందురుగాక.

దుశ్శాసనశ్చైవ మమ సూతపుత్రో
వృకోదరా దుద్విజతేఽల్పచేతాః।
స్వయం ప్రగృహ్యానయ యాజ్ఞసేనీం
కిం తే కరిష్యం త్యవశా స్సపత్నాః॥ 70

యుధిష్ఠిర స్తతః శ్రుత్వా దుర్యోధనచికీర్షితం।
ద్రౌపద్యా స్సమ్మతం దూతం ప్రాహిణో ద్భరతర్షభ॥ 71

ఏకవస్త్రా ప్యధోనీవీ రోదమానా రజస్వలా।
సభా మాగత్య పాంచాలి శ్వశురస్యాగ్రతో భవ॥ 72

తత స్సముద్ధాయ స ధార్తరాష్ట్ర
శ్రుత్వా భ్రాతు శ్శాసనం రక్తదృష్టిః।
ప్రవిశ్య త ద్వేశ్మ మహారథానా
మిత్యబ్రవీ ద్ద్రౌపదీం రాజపుత్రీం॥ 73

ఏహ్యేహి పాంచాలి జితాసి కృష్ణే
దుర్యోధనం పశ్య విముక్తలజ్జా।
కురూన్భజస్వాయతపత్రనేత్రి
ధర్మేణ లబ్ధాఽసి సభాం పరైహి॥ 74

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే సభాపర్వణి
చతుర్థోఽధ్యాయః సమాప్తః॥

70. ఓ దుశ్శాసనా ! అల్ప బలము గల సూతపుత్రుడగు ఈ ప్రాతిగామి భీముని వలన భయపడుచున్నాడు, స్వయముగా నీవు వెళ్ళి ఆమె నీడ్చుకొని రమ్ము. దాసులగు శత్రువులు నిన్నేమి చేయగలరు ?

71. తరువాత దుర్యోధనుని వాక్యమును ధర్మరాజు విని ద్రౌపదికి ఇష్టమగు ఒక దూతను ఆమె వద్దకు పంపెను.

72. నీవు రజస్వలవై యుండి ఏకవస్త్రమును ధరించినదానవై వస్త్రాంతమున మొలత్రాటిని ధరించి యుండియు సభకు వచ్చి మామగారి ఎదుట నుండుము.

73. దుశ్శాసనుడు అన్నగారి ఆజ్ఞను విని ఎఱ్ఱటి నేత్రములు గలవాడై ద్రౌపద్యంతఃపురమును ప్రవేశించి ఆమెతో నిట్లు పలికెను.

74. ఓ పాంచాలీ ! రమ్ము. రమ్ము. నీవు ఓడింపబడితివి. లజ్జను విడిచిపెట్టి దుర్యోధనుని చూడుము, నీవు ధర్మముగా జయింపబడితివి, గాన కౌరవులను సేవింపుము, సభకు వెంటనే రమ్ము.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, సభాపర్వమందు
నాలుగవ అధ్యాయము సమాప్తము.

# పంచమోధ్యాయః

తత స్సముత్థాయ సుదుర్మనా సా
వివర్ణ మామృజ్య ముఖం కరేణ।
ఆర్తా ప్రదుద్రావ యతః స్త్రియ స్తా
వృద్ధస్య రాజ్ఞః కురుపుంగవస్య॥ 1

తతో జవేనాభిససార రోషా
ద్దుశ్శాసన స్తా మభిగర్జమానః।
దీర్ఘేషు నీలేష్వథ చోర్మిమత్సు
జగ్రాహ కేశేషు నరేంద్రపత్నీం॥ 2

యే రాజసూయావభృథే జలేన
మహాక్రతౌ మంత్రజలేన సిక్తాః
తే పాండవానాం పరిభూయ వీర్యం
బలాత్ప్రమృష్టా ధృతరాష్ట్రజేన ॥ 3

6 దుశ్శాసన స్తా మభిగర్జమానో

---

6 వ్యా॥ రజస్వలాధర్మే ష్వేవం ప్రతిపాదితం త్రిరాత్రం మలవద్వాసః మలవస్త్రధారణం స స్నాయాత్ ఇతి। అపి చ నీవీ ఇత్యత్ర రజస్వలాయాః కౌపీనధారణార్థం సంఘటిత కటిసూత్ర ఇత్యర్థః వస్త్రగ్రంథోఽపీత్యర్థః ॥

అపిచ కాంచీవిషయే శ్లో॥ ఏకయష్టిర్భవే త్కాంచీ మేఖలా త్వష్టయష్టికా రశనా షోడశ సరా కలాపః పంచవింశకః ఇతి జ్ఞాయతే ॥

# 5 వ అధ్యాయము

1. ద్రౌపది కలవరపాటు నొందినదై వెంటనే లేచి వెలవెలబారిన ముఖమును చేతితో తుడుచుకొని విలపించుచున్నదై వృద్ధుడగు ధృతరాష్ట్రుని స్త్రీల అంతఃపురమునకు పరుగెత్తెను.

2. తరువాత దుశ్శాసనుడు గర్జించుచున్నవాడై కోపముతో అతివేగముగ ఆమెను వెన్నంటి పరుగెత్తెను. పట్టమహిషియగు ఆమెను, మిక్కిలి పొడుగైన, నల్లటి, వొంకులు తిరిగిన కేశములయందు పట్టుకొనెను.

3. ఏ కేశములు రాజసూయావభృధమునందు మంత్రపూతమైన జలముచే తడుపబడినవో ఆ కేశములు పాండవుల పౌరుషమును లెక్క సేయక దుశ్శాసనునిచే తాకబడినవి.

*4. అట్లు ఆ విధముగా కేశములయందు పట్టుకొని గుంజబడినదై

---

*వ్యా॥ రజస్వలా ధర్మములయందు ఈ విధముగా చెప్పబడినది, మూడు రోజులు మలిన వస్త్రమును ధరించవలెను, స్నానము చేయకూడదు మరియు నీవీ గునగా రజస్వలాస్త్రీ కౌపీనమును ధరించుటకు కట్టుకొనిన మొలత్రాడని అర్థము. అది వస్త్రమునకు లోపల ఉండునదని భావము. మరియు గోచీ విషయమున శ్లో॥ ఒక మూరగలిగినది కాంచీ యనబడును. 8 మూరలు గలిగినది మేఖలయనియు 16 మూరలుగలది రశనయనియు 25 మూరలు గలది కలాపమనియు పిలవబడునన్నది.

జగ్రాహ కేశేషు నరేంద్రపత్నీం
సా కృష్యమాణా నమితాంగయష్టి
శ్శనై రువాచాథ రజస్వలాస్మి॥ 4

ఏకం చ వాసో మమ మందబుద్ధే
సభాం నేతుం నార్హసి మా మనార్య ॥ 5

కేశేషు కృష్టేషు తదా స కృష్ణా
కృష్ణం చ జిష్ణుం చ హరిం నరం చ
త్రాణాయ విక్రోశతి యాజ్ఞసేనీ
దుశ్శాస స్తా మవదన్నిదం బలః॥ 6

రజస్వలా వా భవ యాజ్ఞసేని
ఏకాంబరా వాఽప్యథవా వివస్త్రా
ద్యూతే జితా చాసి కృతాసి దాసీ
దాసీషు వాసశ్చ యథోపజోషం ॥ 7

వైశంపాయన ఉవాచ

ప్రకీర్ణకేశీ పతితార్ధవస్త్రా
దుశ్శాసనేన వ్యవధూయమానా
హ్రీమత్యమర్షేణ చ దహ్యమానా
శనై రిదం వాక్య మువాచ కృష్ణా ॥ 8

ఇమం త్వకార్యం కురువీరమధ్యే
రజస్వలాం యత్పరికర్ష సే మాం।

కంపించుచున్న శరీరముగల ద్రౌపది నెమ్మదిగా " నేను రజస్వల నయి యుంటిని. " అని దుశ్శాసనునితో పలికెను.

5. ఓ మందబుద్ధీ ! నాకొకటే వస్త్రము కలదు. కాన నీవు నన్ను సభకు తీసుకొని వెళ్ళుట తగినది కాదు.

6. ద్రౌపది అప్పుడు రక్షణ కొరకు కృష్ణుని అర్జునుని కేకలిడు చున్నదై విలపించెను. దుశ్శాసనుడు ఆమెతో నిట్లనెను.

7. ఓ ద్రౌపదీ ! నీవు రజస్వలవై యుండుగాక ! ఏకవస్త్రవు గాని, వివస్త్రవుగాని, అయి యుండుగాక ! జూదమున జయింపబడి దాసి వైతివి. దాసీలయందు వస్త్రము యజమాని ఇష్టము ననుసరించి యుండునుగదా !

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

8. దుశ్శాసనునిచే లాగబడుచున్నదియై లజ్జావతియగు ఆ ద్రౌపది కోపముచే దహింప బడుచున్నదియై మెల్లగా ఈ వాక్యమును పలికెను.

9. రజస్వలయగు నన్ను ఈడ్చుకొని పోవుట కురువీరులమధ్యలో

నచాపి కశ్చిత్కురుతేఽత్ర కుత్సాం
ధ్రువం తవేదం మత మభ్యుపేతః॥ 9

పరిత్రాయస్వ మాం భీష్మ ద్రోణ ద్రౌణే తథా కృప।
పరిత్రాయస్వ విదుర ధర్మిష్ఠో ధర్మవత్సల॥ 10

ధృతరాష్ట్ర మహారాజ పరిత్రాయస్వ వై స్నుషాం।
గాంధారి క్లిశ్యమానాం మాం న త్రాయసి వధూం స్వకాం
హా హతాఽస్మి సుమందాత్మా సుయోధనవశం గతా॥ 11

శశాప తత్ర భీమస్తు రాజమధ్యే బృహత్స్వనః।
అస్య పాపస్య దుర్బుద్ధే ర్భారతాపశదస్య చ।
నాపిబేయం బలాత్వక్షో భిత్వా చేద్రుధిరం యుధి।
పితామహానాంపూర్వేషాంనాహంగతిమవాప్నుయాం॥ 12-13

తస్య తే వచనం శ్రుత్వా రౌద్రం తత్రస్థితా జనాః।
ప్రచక్రు ర్బహులాం పూజాం కుత్సంతో ధృతరాష్ట్రజం॥ 14

ద్రౌపద్యువాచ॥
ద్రోణస్య భీష్మస్య చ నాస్తి సత్వం
క్షత్తు స్తథైవాస్య మహాత్మనోఽపి।
రాజ్ఞ స్తథా హ్యేవ మధర్మముగ్రం
న లక్షయంతే కురువృద్ధముఖ్యాః॥ 15

చాల నింద్యమైనది చేయకూడనిది. అచ్చట నిందించు వారెవ్వ రును లేరా ! నీవు నీ ఇచ్ఛవచ్చినట్లు చేయుచున్నావు.

10. ఓ భీష్మా ! ఓ ద్రోణా ! ఓ అశ్వత్థామ ! ఓ కృపాచార్యా ! ధర్మి ష్ఠుఁడవగు ఓ విదురా ! నన్ను రక్షించుఁడు ! రక్షించుఁడు !

11. ఓ ధృతరాష్ట్ర మహారాజా ! కోడలనగు నన్ను రక్షించుఁడు. ఓ గాంధారీ దేవీ ! దుర్యోధనుని వశమైనదానినై మందభాగ్యురాల నగు నేను కొట్టబడితిని. కోడలనగు నన్ను రక్షించవా !

12, 13. సభామధ్యమున పెద్ద కంఠస్వరముతో భీముఁడు శపథము చేసెను. పాపాత్ముఁడును, దుర్బుద్ధియు, కౌరవాపశదుఁడగు ఈ దుశ్శాసనుని రొమ్ము చీల్చి యుద్ధమున నేను ఈతని రక్తమును త్రాగకుండినచో పూర్వులైన పితామహుల యొక్క సద్గతులను పొందకుందును గాక.

14. అతని భయంకరమగు ఆ వాక్యమును విని సభయందున్న జనులం దరును దుశ్శాసనుని నిందించుచు భీముని మిక్కిలి పొగడిరి.

ద్రౌపది చెప్పుచున్నది.

15. భీష్మునకును, ద్రోణునకును పరాక్రమము లేదు. గొప్పవాడైనను విదురునకును ధైర్యము లేదు. అట్లే ధృతరాష్ట్రునకును ధైర్యము లేదు. కాన కురువృద్ధ ముఖ్యులందరును భయంకరమైన ఈ అధ ర్మమును నివారింపకున్నారు.

దుశ్శాసన స్సోఽపి సమీక్ష్య కృష్ణా
మువాచ దాసీతి హస న్సశబ్దం।
కర్ణస్తు తద్వాక్య మతీవ హృష్ట
స్సంపూజయామాస హస న్సశబ్దం॥ 16

గాంధారరాజ స్సుబలస్య పుత్ర
స్తథైవ దుశ్శాసన మభ్యనందత్।
సర్వే ష్వభూ ద్దుఃఖ మతీవ కృష్ణాం
దృష్ట్వా సభాయాం పరికృష్యమాణాం॥ 17

భీష్మ ఉవాచ।

న ధర్మసూక్ష్మా త్సుభగే వివేక్తుం
శక్నోమి తే ప్రశ్న మిమం యథావత్।
అస్వామ్యశక్తః పణితుం పరస్వం
స్త్రియశ్చ భర్తు ర్వశతాం సమీక్ష్య॥ 18

త్యజేత సర్వాం పృథివీం సమృద్ధాం
యుధిష్ఠిరో ధర్మ మథో న జహ్యాత్।
ఉక్తం జితోఽస్మీతి చ పాండవేన
తస్మా న్న శక్నోమి వివేక్తు మేతత్॥ 19

బలవాంశ్చ యథా ధర్మం లోకే పశ్యతి పూరుషః।
స ధర్మో ధర్మ వేలాయాం భవ త్యభిహితః పరః॥ 20

16. దుశ్శాసనుడును, ద్రౌపదిని చూచి నవ్వుచూ పెద్ద ధ్వనితో ఓ దాసీ! యని గర్జించెను. కర్ణుడును ఆ వాక్యమును విని సంతోషించి బిగ్గరగా నవ్వుచూ దుశ్శాసనుని కొనియాడెను.

17. అట్లే గాంధారరాజపుత్రుడగు శకునియు దుశ్శాసనుని కొనియాడెను. సభయందు వానిచే లాగబడుచున్న ద్రౌపదిని చూచి అందరికిని మిక్కిలి దుఃఖము కలిగెను.

భీష్ముడు చెప్పుచున్నాడు,

18. ఓ అమ్మాయీ ! ధర్మము మిక్కిలి సూక్ష్మమైన దగుటచే ఈ నీ ప్రశ్నను విమర్శించి చెప్పుటకు యథార్థముగా నాకు సామర్థ్యము లేదు, ఏలనన ప్రభువు కానివాడును, దాసుడును. అగు ధర్మరాజు నిన్ను పందె మొడ్డుట చెల్లదు. ఇంకొక విధమున చూచిన స్త్రీ భర్తకు వశురాలగుటచే పందెమొడ్డుటకు భర్తకు హక్కు కలదు.

19, ధర్మరాజు ఈ భూమండలమునంతను వొదిలిన వాడులు గాక. కాని ధర్మమును మాత్రము ఎన్నటికిని విడిచి పెట్టడు, ధర్మరాజుచే నేను జయింపబడితినని పలుకబడినది, కాన నేను నీ ప్రశ్నను విమర్శించుటకు సమర్థుడను గాను,

20, ఈ లోకమున బలవంతుడగు పురుషుడు ఏది ధర్మమని తలచుచున్నాడో అదియే కొట్టబడనిదియై గొప్ప ధర్మమగును కదా !

ఏతే ద్రోణాదయ శ్చైవ వృద్ధా ధర్మవిదో జనాః।
శూన్యై శ్శరీరై స్తిష్ఠంతి గతాసవ ఇవానతాః॥ 21

భీమ ఉవాచ॥

ఏషా హ్యనర్హతీ బాలా పాండవాన్ ప్రాప్య కౌరవైః।
బాహూ తే సంప్రధక్ష్యామి సహదేవాగ్ని మానయ॥ 22

అర్జున ఉవాచ॥

ఆహూతో హి పరై రాజా క్షాత్రం వ్రత మనుస్మరన్।
దీవ్యేత పరకామేన తన్నః కీర్తికరం మహత్॥ 23

భీమ ఉవాచ॥

ఏవ మస్మిన్ కృతం విద్యాం యది నాహం ధనంజయ।
దీప్తాగ్నౌ సహితే బాహూ నిర్దహేయం బలాదివ॥ 24

దృష్ట్వాతు తత్ర పాంచాలీం వికర్ణో ధార్తరాష్ట్రజః।
పాణౌ పాణిం వినిష్పిష్య నిశ్వసన్నిద మబ్రవీత్॥ 25

వికర్ణ ఉవాచ॥

*మన్యే న్యాయం యదత్రాహం విద్ధి వక్ష్యామి కౌరవాః।

*వ్యా॥ అత్రత్య వికర్ణ వచనే పాండవానాం సాధా

---

రణీం ద్రౌపదీం ధర్మరాజో పణితు మనర్హ ఇత్యుక్తిః రర్థ సంగచ్ఛతే కుతః సోదరా అపి నిర్జిత త్వాత్ ధర్మజస్య స్వాధీనత్వాచ్చ॥

21. ఈ ద్రోణాదులును, ధర్మవేత్తలును వృద్ధులగు జనులును ప్రాణములు పోయినవారివలె తలలు వంచుకొని శూన్యమైన శరీరములతో నున్నారు.

భీముడు చెప్పుచున్నాడు.

22. ఈ విధమగు పరాభవమునకు తగని ఈ ద్రౌపది నీ వలన ఇట్టి పరాభవమును కౌరవులచే పొందింపబడినది. ఓ ధర్మజా! నీచేతులను తగుల బెట్టుదును, సహదేవా! అగ్నిని తీసుకొని రమ్ము.

అర్జునుడు చెప్పుచున్నాడు.

23. ఇతరులచే ధర్మరాజు ఆహ్వానింపబడినవాడై క్షత్రియ ధర్మమును పరిపాలించుచు ఇతరుల కోరిక ననుసరించి జూదమాడుచున్నాడు. అది మనకు గొప్ప కీర్తికరమైనది.

భీముడు చెప్పుచున్నాడు.

24. అట్లగుచో ఇచ్చట విషయమును తెలుసుకొనని నేను బలాత్కారముగా నా రెండు బాహువులను తగుల పెట్టుకొందును.

25. ఆ సభయందు ద్రౌపదిని చూచి ధృతరాష్ట్రపుత్రుడగు వికర్ణుడు తన చేతిని పిండుకొనుచు బుసకొట్టుచూ ఇట్లు పలికెను.

వికర్ణుడు చెప్పుచున్నాడు.

*26. ఈ విషయమున నేనెరిగిన న్యాయమును చెప్పుచున్నాను. ఈ

---

*వ్యా॥ ఇచ్చటి వికర్ణుని వాక్యములో పాండవులందరికి సొత్తగు పాంచాలిని ధర్మరాజు పందె మొడ్డుట అధర్మము, అనుమాట కుదురదు. ఏలయన: సోదరులు కూడ ఓడింపబడినారు కదా! మరియు ధర్మరాజునకు వారు స్వాధీనమై యుండిరి కదా!

సాధారణీ చ సర్వేషాం పాండవానా మనిందితా॥ 26

జితేన పూర్వం చానేన పాండవేన కృతః పణః।
ఇయంచ కీర్తితా కృష్ణా సౌబలేన పణార్థినా॥ 27

ఏతత్సర్వం విచార్యాహం మన్యే న విజితా మిమాం॥ 28

ఏతచ్ఛ్రుత్వా మహాన్నాద స్సభ్యానా ముదతిష్ఠత।
వికర్ణం శంసమానానాం సౌబలం చాపి నిందతాం॥ 29

తస్మి న్నుపరతే శబ్దే రాధేయ ఇద మబ్రవీత్॥ 30

రాధేయ ఉవాచ॥

♦ త్రయః కిలేమే సధనా స్సభాయాం
భీష్మః క్షత్తా కౌరవాణాం గురుశ్చ।
యే స్వామినం దుష్టతమం వదంతి
వాంఛంతి వృద్ధిం న చ విక్షిపంతి॥ 31

---

♦ వ్యా॥ కర్ణస్య వచనేఽపి భీష్మాదీనాం దాసత్వేన స్వీకరణ మపి న సంగచ్ఛతే। తేషాంస్వానుగ్రహావశాత్పూర్వ దత్తవరా త్స్వాధీనే స్థితత్వాత్ ఇతి శం॥

నను ఆగామి ఉద్యోగపర్వణి శ్రీకృష్ణస్యాపి తే కిమర్థం తే పృథక్పృథక్ ధర్మోపదేశాన్ కుర్వంతీ త్యుక్తే తదా ధృతరాష్ట్రస్యాఽపి తదేవోద్దేశః। తస్మా త్తే ప్యుక్త వంత ఇత్యలం॥

ద్రౌపది అందరికిని సాధారణమగు సొత్తు గాని ఒక ధర్మరాజు సొత్తు మాత్రమే గాదు.

27. మొదట జయింపబడిన ధర్మరాజుచే ఈమె పందెము పెట్టబడినది. పందెము కోరు శకునిచే ఈ పాంచాలిని పందె మొడ్డమని చెప్ప బడినది.

28. ఇదంతయు నేను బాగుగా విచారించి ఈమె జయింపబడలేదని తలచుచున్నాను.

29. ఇది విని వికర్ణుని పొగడుచు సౌబలుని నిందించుచున్న సభ్యులలో గొప్ప ధ్వని బయలుదేరెను.

30. ఆ శబ్దము ఉపశమింపగా రాధేయు డిట్లు పలికెను.

రాధేయుడు చెప్పుచున్నాడు.

31. ఈ సభయందు భీష్ముడు, విదురుడు, ధృతరాష్ట్రుడు ఈ మగ్గురే దబ్బు గలవారు. ఎవరు ప్రభువును దుష్టుడని పలికి తావభివృద్ధిని కోరుచున్నారో వారు వృద్ధి నొందరు.

---

వ్యా॥ కర్ణుని వాక్యమునందును. భీష్మాదులను దాసులనుగా చెప్పుట సంగతము కాదు. వారియొక్క పూర్వమిచ్చిన వరమువలన వారంతట వారు కౌరవుల స్వాధీనమై యుండిరి. అలా అగుచో రాబోవు ఉద్యోగపర్వమున శ్రీకృష్ణ రాయబారమునందు ఏల వారు వేరువేరుగా ధర్మోపదేశములు చేసితన అప్పుడు ధృతరాష్ట్రునకును. అదియే అభి ప్రాయము కావున వారు అట్లు పలికిరి.

త్రయః కిలేమే హ్యధనా భవంతి
దాసః పుత్ర శ్చాఽస్వతంత్రా చ నారీ।
దాసస్య పత్నీ త్వధనస్య రాజన్
తదీశ్వరో దాసధనం చ సర్వం॥ 32

కీర్తితా ద్రౌపదీ వాచా అనుజ్ఞాతా చ పాండవైః।
భవత్యవిజితా కేన హేతు నైషా మతా తవ॥ 33

మన్యసే వా సభా మేతా మానీతా మేకవాససాం।
అధర్మేణేతి తత్రాపి శృణు మే వాక్య ముత్తమం॥ 34

*ఏకో భర్తా స్త్రియా దేవై ర్విహితః కురునందన।
ఇయం త్వనేక వశగా బంధకీతి వినిశ్చితా॥ 35

---

*వ్యా॥ ద్రౌపదీ బంధకీ న భవతి॥ కథమితి చేత్ - బధ్నాతి ఉదాసీనమపి పురుషం స్వవశం కరోతీతి బంధకీ ఇతి వ్యుత్పత్త్యా ఏకభర్తృ స్త్రీ విషయం॥ భర్తృ పంచక ద్రౌపదీ విషయే ప్రయోక్తృ కర్ణ వచన మనుచితం। అన్యత్ర నియోగ వ్యభిచారవిషయే బంధకీతి వక్తు ముచితం। బంధకీత్వ మపి ద్రౌపద్యాః న సంగచ్ఛతే కేవలభర్తృహీనత్వాత్॥

లోకాభాణకవచనం చాత్ర ఉదాహ్రియతే॥ శ్లో॥
కాకే కార్ష్ణ్య మలౌకికం ధవళతా హంసే నిసర్గస్థితా।

32. దాసుడు, పుత్రుడు, అస్వతంత్రమైన స్త్రీ ఈ ముగ్గురును ధనము లేని వారగుదురు. దాసుని యొక్క భార్యయు, వాని ధనము అంతయు ఆ యజమానికే చెందినదగును.

33. ధర్మరాజుచే ఈ పాంచాలి వాక్కుచే పందెముగా చెప్పబడినది. పాండవులందరిచే అంగీకరింపబడినది. ఏ కారణముచే ఈమె జయింపబడనిదని మీ అభిప్రాయము.

34. దాసి యగు ఈమెను రజస్వలయై యుండగా బలాత్కారముగ సభకు తీసుకొని వచ్చుట అధర్మము, అనుచో అచ్చట నా సమాధానమును వినుడు.

35. స్త్రీకి ఒకే భర్త దేవతలచే విధింపబడినాడు. అనేకులకు భార్య యగు ఈమె బంధకి యని నిశ్చయింపబడినది.

---

వ్యా॥ పాంచాలి బంధకి కాదు ఏలనన ఉదాసీనముగా నున్న పురుషుని గూడ బధ్నాతి- తన వశము చేసుకొను స్త్రీ బంధకీ అనెడి వ్యుత్పత్తి ననుసరించి ఒకడు భర్తగా గలిగిన స్త్రీయందు ప్రవర్తించు ఆ శబ్దము అయిదుగురు భర్తలు గల పాంచాలి విషయమున కర్ణుడు ప్రయోగించుట అనుచితము. మరియు నియోగవిధి నెపముగా చేసుకొని వ్యభిచరించు స్త్రీ విషయమున బంధకి యని వాడుట ఉచితమగును. కేవలము భర్తలకు మాత్రము అధీనురాలై మహాపతివ్రత యగు పాంచాలిని బంధకి యనుట అనుచితము.

లోకమునందలి ఒక సామెతను ఉదహరించుచున్నాను శ్లో॥ కాకుల యందు నలుపు స్వభావసిద్ధమైనది. హంసలయందు తెలుపు అట్లే

అస్యాం సభా మానయనం న చిత్రమితి మే మతిః।
దుశ్శాసన సుబాలోఽయం వికర్ణః ప్రాజ్ఞవాదికః।
పాండవానాం చ వాసాంసి ద్రౌపద్యా శ్చాప్యుపాహర॥ 36

తచ్ఛ్రుత్వా పాండవా స్సర్వే స్వాని వాసాంసి భారత।
అవకీర్యోత్తరీయాణి సభాయాం సముపావిశన్॥ 37

తతో దుశ్శాసనో రాజన్ ద్రౌపద్యా వసనం బలాత్।
సభామధ్యే సమాక్షిప్య వ్యపాక్రష్టుం ప్రచక్రమే॥ 38

పాతివ్రత్యం పురస్కృత్య న శశాప సతీ తదా।
కౌరవా న్భస్మసా త్కర్తుం సమర్థా అపి ద్రౌపదీ॥ 39

మహాత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః।
ఇతి నిశ్చిత్య మనసా శరణాగతవత్సలం।
ఆకృష్యమాణే వసనే ద్రౌపదీ కృష్ణ మస్మరత్॥ 40

---

గాంభీర్యే మహదంతరం వచసి యో భేద స్స కిం కథ్యతే।
ఏతావత్సు విశేషణేష్వపి సఖే యత్రేద మాలోక్యతే। కే
కాకాఃఖలు కేచహంసశిశవో దేశాయ తస్మై నమః ఇత్యుక్త్వా
తేజస్తిమిరవద్భేదధర్మేష్వపి భేదో నాస్తీతి యస్మిన్ దేశే
ప్రభేదో నాస్తీతి ప్రతిపాదన మస్తి తస్మై నమః ఇత్యర్థవ
దాభాతి॥

36. బంధకి యగు ఈమెను సభకు తీసుకొని వచ్చుట చిత్రము గాదు. ఇది నా నిశ్చయము. ఓ దుశ్శాసనా ! ఈ వికర్ణుడు మిక్కిలి బాలుడు. పెద్ద మాటలు మాటాడువాడు పాండవుల యొక్కయు, పాంచాలి యొక్కయు వస్త్రములను లాగివేయుము.

37. ఆ మాట విని పాండవులందరు వారి ఉత్తరీయములను తీసి అవ తల ఉంచి సభయందు కూర్చొనిరి.

38. అంతట దుశ్శాసనుడు సభామధ్యమున పాంచాలియొక్క వస్త్రమును బలాత్కారముగ పట్టుకొని చేతికి మెలిక వైచి లాగుటకు ప్రారంభించెను.

39. మహాపతివ్రతయగు ఆ పాంచాలి అప్పుడు కౌరవులను భస్మము చేయుటకు సమర్థురాలయ్యు పాతివ్రత్యమును పురస్కరించుకొని వారిని శపించలేదు.

40. గొప్ప ఆపత్తు సంభవించినపుడు శ్రీహరి స్మరించదగినవాడని మనస్సుచే నిశ్చయించి వస్త్రము లాగబడుచుండగా శరణాగతవత్స లుడగు శ్రీకృష్ణుని స్మరించెను.

---

సహజమైనది. వాటి కూతల గాంభీర్యములో గొప్ప భేదా గలదు. ఆ భేదము చెప్ప వనిలేదు. అయినను ఇట్టి భేదములు ఉన్నను ఏవి కాకులు ఏవి హంసలు. రెండూ పక్షులే గదా ! వాటికి భేదా ఏమి కలదు ? అను వారికి ఒక నమస్కారము. ఈ విధముగా తమః ప్రకాశముల వలె విరుద్ధధర్మముల గలవారియందును భేదము లేదని ఏ స్థలమున వాదించుట కలదో వానికి నమస్కారము. అనెడి వాక్యము యుక్తమని తోచు చున్నది.

హా కృష్ణ ద్వారకావాస! క్వాసి యాదవ నందన!
ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కి ముపేక్షసే!
శంఖచక్రగదాపాణే ద్వారకా నిలయాచ్యుత!
గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతాం॥ 41-42

కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మ న్విశ్వభావన!
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యే ఽవసీదతీం॥ 43

ఇత్యనుస్మృత్య కృష్ణం సా హరిం త్రిభువనేశ్వరం!
ప్రారుద ద్దుఃఖితా రాజన్ ముఖ మాచ్ఛాద్య భామినీ॥ 44

హేకృష్ణ విష్ణో మధుకైటభారే భక్తానుకంపి న్భగవ
న్మురారే! త్రాయస్వ మాం కేశవ లోకనాథ గోవింద
దామోదర కేశవేతి॥ 45

ఏవం వదంతీ యావత్సా తావత్కృష్ణ స్సమాగతః!
వస్త్రరూపీ చ సంజాతః పాండవానాం చ పాలకః॥ 46

తస్య ప్రసాదా ద్ద్రౌపద్యాః కృష్యమాణేంబరే తదా!
తద్రూప మపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః॥ 47

నానారాగ విరాగాణి వసనాన్యథ వై ప్రభో!
ప్రాదుర్భవంతి శతశో ధర్మస్య పరిపాలనాత్॥ 48

తతో హలహలా శబ్ద స్తత్రాసీద్ఘోరనిస్వనః!
త దద్భుతతమం లోకే వీక్ష్య సర్వే మహీభృతః॥
శశంసు ద్రౌపదీం తత్ర కుత్సంతో నృప రాష్ట్రజం! 49-50

41, 42. హే కృష్ణా! యాదవనందనా! ద్వారకావాసా! నీ వెచ్చట నున్నావు? ఈ అవస్థను పొంది దిక్కులేని నన్ను ఏల ఉపేక్షించు చున్నావు శంఖ, చక్ర, గదాపాణీ! ద్వారకానిలయా! అచ్యుత! గోవింద! పుండరీకాక్ష! శరణాగతురాలగు నన్ను రక్షించుము.

43. కృష్ణా! కృష్ణా! మహాయోగి! విశ్వాత్మకుడా! ఆపత్తు నొంది కౌరవుల మధ్యయందు బాధపడుచున్న నా వద్దకు రమ్ము.

44. ఈ విధముగా కృష్ణుని స్మరించి ముఖమును కప్పుకొని దుఃఖించు చున్నదియై బిగ్గరగా విలపించెను.

45. హే కృష్ణా! ఓ విష్ణో! భక్తానుగ్రహకారీ! హే కేశవా! మురారీ! గోవిందా! దామోదర! నన్ను రక్షించుము.

46. ఈ విధముగా పలుకుచున్నదియై ఆమె విలపించగా అంతలో పాండవులకు సంరక్షకుడగు శ్రీకృష్ణుడు వచ్చెను

47. తరువాత వాని యనుగ్రహమువలన పాంచాలి యొక్క వస్త్రము లాగబడగా అటువంటి మరియొక వస్త్రము ఆవిర్భవించెను, ఇట్లు అక్షయవస్త్రములు ఆవిర్భవించినవి.

48. అనేక చిత్రవిచిత్రములగు వస్త్రములు అసంఖ్యాకములుగ, ఆమె ధర్మమును పరిపాలించుటచే పుట్టినవి.

49, 50. అంతట ఈ అద్భుతమును చూచి అందరు రాజులు హాహాకార ధ్వనులు చేసిరి పాంచాలిని ప్రశంసించిరి. దుర్మార్గుడగు దుశ్శాసనుని నిందించిరి.

యదాతు వాససాం రాశి స్సభామధ్యే సమాచితః।
తదా దుశ్శాసన శ్శ్రాంతో వ్రీడిత స్సముపావిశత్॥ 51

ధిక్ఛబ్దస్తు తత స్తత్ర సమభూ ల్లోమహర్షణః॥ 52

ద్రౌపద్యువాచ॥
తావ త్ప్రతీక్ష దుర్బుద్ధే దుశ్శాసన నరాధమ।
పురస్తా త్కర్షణీయం మే న కృతం కార్య ముత్తరం॥ 53

తతో దుర్యోధన స్తత్ర దైవమోహబలాత్కృతః।
స్మయ న్నివైక్ష్య పాంచాలీ మైశ్వర్యమదమోహితః।
ఊరూ దర్శయతే పాపో ద్రౌపద్యా వై ర్ముహుర్ముహుః॥ 54

భీమసేన స్త మాలోక్య నేత్రే ఉత్ఫాల్య లోహితే।
ప్రోవాచ రాజమధ్యే తం సభాం విశ్రావయన్నివ॥ 55

యద్యేవ మూరుం గదయా న భింద్యాం తే మహాహవే।
పితృభి స్సహ సాలోక్యం మాస్మ గచ్ఛే ద్వృకోదరః॥ 56

క్రుద్ధస్య తస్య సర్వేభ్య స్స్రోతోభ్యః పావకార్చిషః।
వృక్షస్యేవ వినిశ్చేరుః కోటరేభ్యః ప్రదహ్యతః॥ 58

విదుర ఉవాచ॥
యద్యేవం త్వం మహారాజ సంక్లేశయసి ద్రౌపదీం।

51. ఎప్పుడు సభామధ్యమున వస్త్రముల రాశి ఏర్పడినదో అప్పుడు దుశ్శాసనుడు అలసట చెంది సిగ్గుపడి చతికిల పడెను.

52. అంతట ఆ సభయందు ఛీ ! ఛీ ! అను శబ్దము మిన్నంటునట్లు బయలుదేరెను.

పాంచాలి చెప్పుచున్నది.

53. దుర్మార్గుడవగు దుశ్శాసనా ! కొద్దిసేపు నిరీక్షించుము. నీవు చేయ దల్చుకున్న పని వెలవేరవలయును గదా !

54. అంతట దుర్యోధనుడు దైవమోహముచే బలాత్కరింపబడినవాడై ఐశ్వర్యమదమోహితుడై చిరునవ్వు నవ్వుచు పాంచాలివంక చూచి తన తొడలను పాంచాలికి మాటిమాటికిని చూపుచుండెను.

55. భీముడు వానిని చూచి యెఱ్ఱనగు నేత్రములను వురిమి సభ యంతయు వినునట్లుగ రాజుల మధ్యలో దుర్యోధనుని గూర్చి పలికెను.

56. మహాయుద్ధమున నీ తొడను, నేను గదతో విరుగగొట్టనిచో యీ భీముడు పితృదేవతలతో సాలోక్యమును పొందకుండుగాక.

57. కృద్ధుడగు ఆ భీముని రంధ్రములనుండి తగులబెట్టబడుచున్న వృక్షము యొక్క తొఱ్ఱలనుండి వలె అగ్నిజ్వాలలు యెగ జిమ్మినవి.

విదురుడు పలుకుచున్నాడు.

58. ఓ ధృతరాష్ట్ర మహారాజా ! నీ వీవిధముగా పాంచాలిని బాధపెట్టు

అచిరేణైవ కాలేన పుత్రస్తే సహ మంత్రిభిః।
గమిష్యతి క్షయం పాపః పాండవక్రోధకారణాత్॥ 58

తస్మాన్నివారయ సుతం మా వినాశం విచింతయ
ఏతచ్ఛ్రుత్వా మందబుద్ధి ర్నోత్తరం కించిదబ్రవీత్ ॥ 59

తతో రాజ్ఞో ధృతరాష్ట్రస్య గేహే గోమాయు రుచ్చై
ర్వ్యాహార దగ్నిహోత్రే। తం రాసభాః ప్రత్యభాషంత
రాజన్ సమంతతః పక్షిణశ్చైవ రౌద్రాః ॥ 60

తం వై శబ్దం విదుర స్తత్త్వవేదీ శుశ్రావ ఘోరం
సుబలాత్మజా చ। భీష్మో ద్రోణో గౌతమశ్చాపి విద్వాన్
స్వస్తి స్వస్తీత్యపి చైవాహు రుచ్చైః॥ 61

తతో గాంధారీ విదురశ్చ విద్వాన్ సముత్పాతం ఘోర
మాలక్ష్య రాజ్ఞే। నివేదయామాసతు రార్తవత్తదా
తతో రాజా వాక్యమిదం బభాషే॥ 62

హతోఽసి దుర్యోధన మందబుద్ధే। యస్త్వం సభాయాం
కురుపుంగవానాం స్త్రియం సమాభాషసి దుర్వినీత। విశే
షతో ద్రౌపదీం ధర్మపత్నీం॥ 63

ఏవముక్త్వా ధృతరాష్ట్రో మనీషీ। హితాన్వేషీ బాంధ
వానా మపాయాత్। కృష్ణాం పాంచాలీ మబ్రవీ త్సాంత్వ
పూర్వం విమృశ్యైతత్ప్రజ్ఞయా తత్త్వబుద్ధిః॥ 64

చుంటివి గాన అచిరకాలములో నీ పుత్రుడు మంత్రులతో గూడ పాండవుల క్రోధకారణము చే నాశము బొందగలడు.

59. కాన నీ కుమారుని నివారించుము. నశింపజేసుకొనకుము. ఈ మాట విని మందబుద్ధియగు ధృతరాష్ట్రుడు యేమియు సమాధానము చెప్పలేదు.

60. అంతట ధృతరాష్ట్రుని గృహమునందును, అగ్నిహోత్రశాల యందును, నక్కలు బిగ్గరగ కూసినవి. ఆ ధ్వనిని గాడిదలు, పక్షులును అనుకరించినవి.

61. ఘోరమగు ఆ శకునములను ఆ శబ్దమును, తత్వవేత్తయగు విదురుడును, గాంధారియు, భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడును విని కౌరవులకు క్షేమమగుగాక అని బిగ్గరగా అఱచిరి.

62. అంతట గాంధారియు, విదురుడును ఘోరమగు ఆ యుత్పాతమును జూచి బాధపడినవారై ధృతరాష్ట్రునికి నివేదించిరి. అంతట ధృతరాష్ట్రుడు ఈ విధముగా పలికెను.

63. ఓ మందబుద్ధియగు దుర్యోధనా! నీవు పాండవుల ధర్మపత్నియు మహాపతివ్రతయగు పాంచాలిని విశేషముగా దుర్భాషలాడుటచే నశించితివి.

64. విద్వాంసుడగు ధృతరాష్ట్రుడు తన పుత్రులను అపాయమునుండి రక్షింపగోరి వచ్చిన ఆపత్తును క్షమింపించుకొని పాంచాలిని యోదార్చుచు నిట్లు పలికెను.

వరం వృణీష్వ పాంచాలి మత్తో యదభివాంఛసే।
వధూనాం హి విశిష్టా మే త్వం ధర్మపరమా సతీ॥ 65

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే సభాపర్వణి
పంచమోఽధ్యాయః సమాప్తః॥

## షష్ఠోఽధ్యాయః

ద్రౌపద్యువాచ।
దదాసి చే ద్వరం మహ్యం వృణోమి భరతర్షభ।
సర్వధర్మానుగః శ్రీమా న్నదాసోఽస్తు యుధిష్ఠిరః॥ 1

ధృతరాష్ట్ర ఉవాచ॥
ఏవం భవతు కళ్యాణి యథా త్వ మభిభాషసే।
ద్వితీయం తే వరం భద్రే దదామి వరయస్వ హ॥ 2

ద్రౌపద్యువాచ।
సరథౌ సధనుష్కౌ చ భీమసేన ధనంజయౌ।
యమౌ చ వరయే రాజన్ అదాసా న్స్వవశా నహం॥ 3

ధృతరాష్ట్ర ఉవాచ॥
తథాఽస్తు తే మహాభాగే యథా త్వం నందినీచ్ఛసి॥
తృతీయం వరయాస్మత్తో నాసి ద్వాభ్యాం సుసత్కృతా।
త్వం హి సర్వస్నుషాణాం మే శ్రేయసీ ధర్మచారిణీ॥ 4

65. ఓ పాంచాలీ ! నానుండి నీవు యేది కోరుచున్నావో అది వరముగా కోరుము. నా కోడండ్రలో పాతివ్రత్యము చేతను ధర్మము చేతను నీవు యెన్నదగిన దానవై యున్నావు.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున సభాపర్వమందు
అయిదవ అధ్యాయము సమాప్తము.

# 6 వ అధ్యాయము

ద్రౌపది చెప్పుచున్నది.

1. ఓ భరతర్షభా ! నీవు నాకు వరము నిచ్చుచో ధర్మానువర్తియు, శ్రీమంతుడునగు ధర్మరాజు దాసుడు గాకుండు గాక.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

2. ఓ ద్రౌపదీ ! నీవు కోరినట్లు అగుగాక. రెండవవరము నిచ్చుచున్నాను. కోరుకొనుము.

ద్రౌపది చెప్పుచున్నది.

3. భీమార్జునులు, నకులసహదేవులు రథములతోను ధనస్సులతో కూడినవారై స్వతంత్రులై దాసులు కాకుందురు గాక యని కోరుచున్నాను

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

4. ఓ పుణ్యవతీ ! నీవు కోరినట్లు యగుగాక. మాచే సత్కరింపబడిన దానవై మూడవ వరమును కోరుకొమ్ము. నీవు నా అందరి కోడండ్రలో శ్రేయస్కరురాలవు. ధర్మచరురాలవు.

ద్రౌపద్యువాచ॥
లోభో ధర్మస్య నాశాయ భగవన్నాహ ముత్సహే।
అనర్హా వరమాదాతుం తృతీయం రాజసత్తమ॥ 5

ఏక మాహు ర్వైశ్యవరం ద్వౌతు క్షత్రస్త్రియో వరౌ॥
త్రయస్తు రాజ్ఞో రాజేంద్ర బ్రాహ్మణస్య శతం వరాః॥ 6-7

కర్ణ ఉవాచ॥
యా న శ్రుతా మనుష్యేషు స్త్రియో రూపేణ సమ్మతా।
తాసాం మేతాదృశం కర్మ న కస్యాశ్చ న శుశ్రుమః॥ 8

అప్లవేంభసి మగ్నానా మప్రతిష్ఠే నిమజ్జతాం।
పాంచాలీ పాండుపుత్రాణాం నౌరేషా పారగాఽభవత్॥ 9

భీమ ఉవాచ॥
స్త్రీ గతిః పాండుపుత్రాణా మిత్యువాచ స సూతజః।
ఇహైవైతాంస్తు వాసర్వా నిహన్మిశత్రూన్ సమాగతాన్॥ 10

ధనంజయ కథం స్విత్స్యా దపత్య మభిమృష్టజం।
ఇత్యుక్త్వా భీమసేనస్తు కనిష్ఠై భ్రాతృభి స్సహ।
మృగమధ్యే యథా సింహో ముహుర్ముహు రుదైక్షత॥ 11

తద్భ్రాతృవచనం శ్రుత్వా ధను రాదాయ వీర్యవాన్।
సవ్యసాచీ సముత్పత్య తాం చ్ఛత్రూ న్సముదైక్షత॥ 12

ద్రౌపది చెప్పుచున్నది.

5. ఓ మహారాజా ! లోభము ధర్మమును నశింపజేయును, మూడవ వరమును పొందుటకు నేను తగను. కాన నేను గోరదలచుట లేదు.

6,7. వైశ్యునకు ఒకవరము, క్షత్రియకాంతకు రెండువరములు, రాజునకు మూడువరములు, బ్రాహ్మణునకు నూరువరములు అనిచెప్ప బడినది.

కర్ణుడు చెప్పుచున్నాడు

8. ఈపాండవులు స్త్రీచే యుద్ధరింపబడిరి. వారియొక్క యిట్టిస్థితి మనుష్యులలో నెచ్చటను వినబడలేదు, ఇకముందెన్నడునూ విన బోము.

9. అపత్సముద్రమున మునిగి అప్రతిష్ఠయందు మునకలిడుచున్న పాండుపుత్రులను ఈద్రౌపది నావవలె యొడ్డున చేర్చినదాయెను.

భీముడు పల్కుచున్నాడు.

10. ఈసూతుడు పాండవులకు ఆడుది గతియాయెనని పల్కెను, ఇక్కడేవున్న శత్రువులనందరను వధించగలను.

11. ఓఅర్జునా! ఎట్లుగాఈశత్రువును సహించుచున్నావు. అని తనసోదరులతోగూడ లేళ్లమధ్యయందున్న సింహమువలె కౌరవులవంక మాటిమాటికి చూచెను.

12. సోదరుని ఆవాక్యమును విని పరాక్రమశాలియగు సవ్యసాచి తనర్పాణములను గ్రహించి శత్రువులనందరిని కలయ జూచెను.

ఉత్పతంతం తు వేగేన తతో దృష్ట్వా ధనంజయం।
వాయుజం చాహ పై జ్యేష్ఠో ధర్మరాజో యుధిష్ఠిరః॥ 13

మాపార్థ సాహసం కార్షీ ర్మావినాశం వృకోదర।
అహ మేత త్పాపకృతో ద్యూతజ్ఞాన్ దగ్ధు ముత్సహే।
కిం త్వ సత్యగతిం దృష్ట్వా క్రోధో నాశ ముపైతి మే॥ 14

తతో యుధిష్ఠిర శ్శాంతో భ్రాతౄ న్న్యాన్నివార్యచ।
పితరం సముపాతిష్ఠత్ ధృతరాష్ట్రం కృతాంజలిః॥ 15

యుధిష్ఠిర ఉవాచ॥
రాజన్ కిం కరవామ స్తే ప్రశాధ్యస్మాంస్త్వమీశ్వరః।
నిత్యం హి స్థాతు మిచ్ఛామ స్తవ భారత శాసనే॥ 16

ధృతరాష్ట్ర ఉవాచ।
అజాతశత్రో భద్రం తే అరిష్టం స్వస్తి గచ్ఛతు।
అనుజ్ఞాత స్సహ ధనా స్స్వరాజ్య మనుశాసత।
ఇదంచై వావబోద్ధవ్యం వృద్ధస్య మమ శాసనం॥ 17

విదితోఽసి మహాప్రాజ్ఞ వృద్ధానాం పర్యుపాసితా।
స్మరంతి సుకృతా న్యేవ న వైరాణ్యాపి సాధవః। 18

తథా చరిత మార్యేణ త్వయాస్మిన్నసత్సమాగమే।
దుర్యోధనస్య పారుష్యం తత్తాత హృది మాకృథాః॥ 19

13. వేగముగాదుముకుచున్న అర్జునుని, భీమసేనుని చూచి ధర్మరాజు ఇట్లనెను.

14. ఓఅర్జునా! సాహసముచేయవలదు. ఓవృకోదరా! శత్రువులను నశింపచేయ వలదు. నేనే పాపాత్ములగు ఈజూదరులను దగ్ధము చేయ నుత్సహించుచున్నాను. కానిఅసత్యము యొక్క గతిని తెలుసుకొని నాక్రోధము నశించిపోవుచున్నది.

15. అంతట శాంతుడగు ధర్మరాజు సోదరులను నివారించి దోసిలొగ్గి తండ్రియగు ధృతరాష్ట్రుని సమీపించెను.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

16. ఓరాజా! నీవేమిచేయమందువు! నీవు మాకుప్రభువవు,మమ్ము శాసించుము. నీఆజ్ఞకు బద్ధులమై ఎల్లప్పుడుండ గోరుచున్నాము.

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

17. ఓధర్మరాజా! నీకు క్షేమము కలుగుకాక, అరిష్టము తొలగుగాక, నాఅనుజ్ఞవడసి ధనముతో గూడిన వారై మీరాజ్యమును పరిపాలించుడు. వృద్ధుడనగు నాఆజ్ఞ యిదియేనని తెలిసి కొనుడు.

18. నీవు వృద్ధులను సేవించువాడవని నేనెరుగుదును. సాధువులగువారు యితరుల మంచిపనులనే స్మరించెదరు. ఇతరుల అపకారములను స్మరింపరు.

19. పూజ్యుడవగునీచే ఈసభయందు అట్లాచరింప బడినది. ఓనాయనా దుర్యోధనుని కాఠిన్యమును హృదయమున పెట్టుకొనకుము.

మాతరం చైవ గాంధారీం మాం చ త్వం గుణకామ్యయా।
ఉపస్థితం వృద్ధ మంధం పితరం పశ్య భారత। 20

ప్రీతిపూర్వం మయాద్యైత మిద మాసీ దుపేక్షితం।
మిత్రాణి ద్రష్టుకామేన పుత్రాణాం చ బలాబలం॥ 21

అశోచ్యాః కురవో రాజన్ యేషాం త్వ మనుశాసితా।
త్వయి ధర్మోర్జునే ధైర్యం భీమసేనే పరాక్రమః।
శ్రద్ధా చ గురుశుశ్రూషా యమయోః పురుషాగ్ర్యయోః।
అజాతశత్రో భద్రం తే ఖాండవప్రస్థ మావిశ॥ 22-23

భ్రాతృభి స్తేఽస్తు సౌభ్రాత్రం ధర్మే తే ధీయతాం మనః।
ఇత్యుక్తో భరతశ్రేష్ఠో ధర్మరాజో యుధిష్ఠిరః॥
కృత్వార్యసమయం సర్వం ప్రతస్థే భ్రాతృభి స్సహ॥ 24

తే రథాన్ మేఘసంకాశా నారుహ్య సహ కృష్ణయా
ప్రయయు ర్హృష్టమనస ఇంద్రప్రస్థం పురోత్తమం
అథ దుర్యోధనః కర్ణ శ్శకునిశ్చాపి సౌబలః ॥
ధృతరాష్ట్రం త్వరయుక్తం శ్లక్ష్ణం వచనమబ్రువన్ ॥ 25-26

సర్వోపాయై ర్నిహంతవ్యాః శత్రవ శ్శత్రుసూదన
కుపితాః పాండవా స్సర్వే సేనాయోగాయ నిర్యయుః॥ 27

21 తల్లియగు గాంధారిని, గుణములయందు మమకారముతోనున్న వృద్ధుడను, అంధుడను, తండ్రియునైన నన్ను కనిపెట్టుకొని యుండుము.

21. బుద్ధిపూర్వకముగా నాచే ఈద్యూతము ఉపేక్షింపబడినది మిత్రులను, పుత్రులలో బలాబలములు చూడగోరి నేనిట్లొనరించితిని.

22-23 నీసోదరులగు పాండవులు నీవశవర్తులగుటచే విచారింపదగినవారు కారు. నీయందుధర్మము అర్జునునియందు ధైర్యము భీమునియందు పరాక్రమము నకుల సహదేవులయందు గురు శుశ్రూషయు నియతమై యున్నవి. ఓధర్మరాజా! ఇంద్రప్రస్థమును ప్రవేశించుము.

24. కౌరవులయందు నీకెల్లప్పుడును భాతృప్రేమ యుండుగాక. నీమనస్సు ధర్మమునందే యుండుగాక. అని పలుకబడి ధర్మరాజు పెద్దల ఎదుట అట్లేనని ప్రతిజ్ఞయొనరించి సోదరులతోగూడి బయలుదేరెను.

25-26 వారు మేఘములతో సమానమగు రథములందు భార్యయగు పాంచాలితోకూడి ఇంద్రప్రస్థ పురము గూర్చి బయలుదేరిరి, అంతట దుశ్శాసన కర్ణ శకునులతో గూడిన దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో అర్థయుక్తమై తీవ్రమగు వాక్యమును పలికెను.

27. ఓతండ్రీ! సర్వోపాయములతోను శత్రువులు సంహరించదగినవారు. కుపితులగు పాండవులందరును సేనవాయత్తపరచుకొనుటకు వెళ్ళిరి.

నక్షంస్యంతే తథాఽస్మాభి ర్జాతు విప్రకృతా హి తే
ద్రౌపద్యాశ్చ పరిక్లేశం కో హ్యేషాం క్షంతు మర్హతి ॥ 28

అర్జునేన సమో లోకే నాస్తి వీరోఽన్య ధనుర్ధరః
అకారాదీని నామాని అర్జునత్రస్తచేతసః
అశ్వాక్షరాంబుజాశ్చైవ త్రాసం సంజనయంతి మే॥ 29

ద్యూతే పార్థస్య కౌరవ్య మాయయా నికృతిః కృతా
తస్మాద్ధి నో జయ స్తాత అన్యోపాయేన నో భవేత్ ॥ 30

పున ర్దీవ్యామ భద్రం తే వనవాసాయ పాండవైః
ఏవ మేతా న్వశే కర్తుం శక్ష్యామః పురుషర్షభ ॥ 31

అయం హి శకుని ర్వేద సవిద్యా మక్షసంపదం
దృఢమూలా వయం రాజ్యే మిత్రాణి పరిగృహ్యాచ
జేష్యామస్తా న్వయం రాజన్ రోచతాం తే పరంతప ॥ 32

ధృతరాష్ట్ర ఉవాచ

తూర్ణం ప్రత్యానయ త్వేతాన్ కామం వ్యధ్వగతానపి।
ఆగచ్ఛంతు పున ర్ద్యూత మిదం కుర్వంతు పాండవాః ॥ 33

తతో ద్రోణ స్సోమదత్తో బాహ్లీకశ్చైవ గౌతమః
విదురో ద్రోణపుత్రశ్చ వైశ్యాపుత్రశ్చ వీర్యవాన్
భూరిశ్రవా శ్శాంతనవో వికర్ణశ్చ మహారథః
మాద్యూత మిత్యభాషంత శమోఽస్త్వితి చ సర్వశః ॥ 34-35

28. మాచే అపకారముచేయబడిన వారు సహించరు పాంచాలికి మేమొనరించిన పరాభవమును వారిలో నెవరు సహించగలరు.

29. లోకమున అర్జునునితో సమానుడగు ధనుర్ధారి లేడు. అర్జునుని ఆ ఉన్న భయముగ్రస్తమగు నాకు అశ్వ అంబుజ అక్షరమొ॥ గలపేర్లు గూడ భయమును కలిగించుచున్నవి.

30 ఓ ధృతరాష్ట్రా! జ్యూతమునందు మాయచే పాండవులకు అపకారము చేయబడినది. దానివలననే మనకు జయము కలుగును గాని మరియొక ఉపాయముతో ఎన్నటికిని జయము సంభవింపదు.

31. కావున వారితో వనవాసపు ఏర్పాటుతో మరల జూదమాడుదము, అట్లగుచో వారిని మనవశము చేసుకొనుటకు సమర్థులమగుదుము.

32. ఈ శకుని అక్షవిద్యనంతను చక్కగా ఎరుగును. కాన మనకు జయము నిశ్చయము. వారి వనవాసకాలమున ఈ 13 సం॥లో మనము మిత్రసంగ్రహముచేసి ధృఢమూలులమై వారిని తరువాత యుద్ధమున జయించగలము. ఈమార్గము నీకును రుచించుగాక,

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

33. వేంటనే పాండవులు నగముదూరము వెళ్ళినవారైనను తిరిగి వత్తురుగాక, నీతో మరల జూదమాడుదురుగాక.

34,35 అంతట ద్రోణుడు, సోమదత్తుడు, బాహ్లికుడు, కృపాచార్యుడు, విదురుడు, అశ్వత్థామ, యుయుత్సువు, భూరిశ్రవుడు భీష్ముడు, వికర్ణుడు వీరందరును పాండవులతో జూదము వద్దు. వారితోసంధి చేసుకొనుడని చెప్పిరి.

అకామానాం చ సర్వేషాం సుహృదా మర్థదర్శినాం
అకరో త్పాండవాహ్వానం ధృతరాష్ట్ర స్సుతప్రియః ॥ 36

అథాఽబ్రవీ ద్ధర్మయుక్తా గాంధారీ శోకకర్శితా
జాతే దుర్యోధనే క్షత్తా మహామతి రభాషత
నీయతాం పరలోకాయ సాధ్వయం కులపాంసనః ॥ 37-38

మానిమజ్జస్వ దోషేణ మహాప్సు త్వంహి భారత
మా బాలానా మశిష్టానా మభిమంస్థా మతిం ప్రభో ॥ 39

మాకులస్య క్షయే ఘోరే కారణం త్వం భవిష్యసి ॥
బద్ధం సేతుం కోను భింద్యా ద్ధమేచ్ఛాంతం చ పావకం 40

శమే స్థితాన్ కోను పార్థాన్ కోపయే ద్భరతర్షభ
శాస్త్రం న శాస్తి దుర్బుద్ధిః శ్రేయసే చేతరాయ చ ॥ 41

తస్మాదయం మద్వచనా త్త్యజ్యతాం కులపాంసనః
అంతో నూనం కులస్యాస్య తన్నిబోధత భారత ॥ 42

తథా తేన కృతం రాజన్ పుత్రస్నేహా న్నరాధిప
తస్య ప్రాప్తం ఫలం విద్ధి కులాంతకరణాయ తత్ ॥ 43

36. సుతప్రియుఁడగు ధృతరాష్ట్రుఁడు దీర్ఘదర్శులు, స్నేహితులగు వారం దరి అభిప్రాయమును మన్నింపక పాండవులను మరల ఆహ్వానిం చెను.

37,38 అంతట ధర్మయుక్తురాలగు గాంధారి శోకముచే పీడింప బడినదై ఇట్లు పలికెను. దుర్యోధనుఁడు పుట్టినపుడు మహామతియగు విదు రుఁడు చెప్పెను కదా! కులపాంసనుఁడగు ఈదుర్యోధనుఁడు చంప బడుగాక.

39. నీదోషముచే నీవు అపత్సముద్రమున మునుగకుము. బాలులను, దుర్మార్గులగు దుర్యోధనాదుల మతము ననుసరింపకుము.

40. అటులగుచో ఘోరమగు కులక్షయమునందు నీవేకారణమైన వాఁడ వగుదువు. కట్టినసేతువును ఎవఁడు భేదించును. చల్లారిన అగ్నిని ఎవఁడు ప్రజ్వలింప చేయును.

41. అట్లే శాంతించిన పాండవులను ఎవరు కోపింప చేయుదురు. ఈ దుర్మార్గుఁడగు దుర్యోధనుఁడు శాస్త్రప్రమాణ బద్ధుఁడుకాఁడు. తప్పక నశించును.

42. అందుచే నామాటవిని కులపాంసనుఁడగు ఈతఁడు విడిచిపెట్టబడు గాక. లేనిచో ఈతఁడు తప్పక కులాంతకుఁడు కాగలఁడు. నామాట వినుఁడు.

43. ఓజనమేజయా! ధృతరాష్ట్రుఁడు పుత్రస్నేహముచే ఆమెవాక్యము ననుసరించకపోయెను. అందుకనే దానికిఫలముగా కులక్షయము సంభవించినది కదా!

ధృతరాష్ట్ర ఉవాచ

అంతః కామం కులస్యాస్తు న శక్నోమి నివారితుం।
యథేచ్ఛంతి తథైవాస్తు ప్రత్యాగచ్ఛంతు పాండవాః।
పునర్ద్యూతం చ కుర్వంతు మామకాః పాండవైస్సహ॥ 44

తతో వ్యాధ్వగతం పార్థం ప్రాతిగామీ యుధిష్ఠిరం।
ఉవాచ వచనా ద్రాజ్ఞో ధృతరాష్ట్రస్య ధీమతః॥ 45

ఉపస్తీర్ణా సభా రాజ న్నక్షా నుప్త్వా యుధిష్ఠిర।
ఏహి పాండవ దీవ్యేతి పితా త్వాహ నరాధిప॥ 46

యుధిష్ఠిర ఉవాచ॥

ధాతు ర్నియోగా ద్భూతాని ప్రాప్నువంతి శుభాశుభం।
న నివృత్తి స్తయో రస్తి దేవితవ్యం పునర్యది। 47

*అక్షద్యూతే సమాహ్వానం నియోగాత్ స్థవిరస్య చ।
జానన్నపి క్షయకరం నాతి క్రమితు ముత్సహే।
మృగం సువర్ణం నాస్తీతి రామస్యావిదితం కిము।
ఇతి బ్రువన్నివవృతే భ్రాతృభి స్సహ పాండవః।.
జానంశ్చ శకునేర్మాయాం పార్థోద్యూతమియాత్పునః॥ 48-49

---

*వ్యా॥ నహి భిక్షుకా స్సంతీతి స్థాల్యో నాధిశ్రయంతే। నహి మృగా స్సంతీతి యవా నోప్యంతే। ప్రతి విధేయం చ దోషేషు ఇత్యాభాణకవచనం॥

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

44. కులక్షయము అయిన అగుగాక. ఈ దుర్యోధనుని నివారింపశక్తుడను గాకున్నాను. వారు కోరినట్లు పాండవులు తిరిగి వత్తురుగాక. మన దుర్యోధనాదులు పాండవులతో మరల జూదమాడుదురుగాక.

45. అంతట మార్గమధ్యమున నున్న ధర్మరాజుతో ప్రాతిగామి ధృతరాష్ట్రుని వాక్యముగా ఇట్లు పలికెను.

46. ఓ ధర్మరాజా । సభ ఏర్పాటు చేయఁబడినది. పాచికలు సిద్ధముగా నున్నవి. వెంటనే వచ్చి జూదమాడుమని నీ తండ్రిగారు నీతో చెప్పమనిరి.

ధర్మరాజు చెప్పుచున్నాడు.

47. జీవుడు దైవాజ్ఞచే శుభాశుభములను పొందుచున్నాడు. వాటికి ప్రతిక్రియలేదు.

*48, 49. పెద్దవాడగు తండ్రి యొక్క ఆజ్ఞ ఇట్లున్నదా । జూదము నాశహేతువని తెలిసియు తండ్రి ఆజ్ఞను నేను అతిక్రమించలేకున్నాను బంగారు లేడి ఉండదని రామునకు తెలియదా ఏమి ? విధి అనుల్లంఘనీయము. అని పలుకుచు సోదరులతో గూడి హస్తినాపురమునకు తిరిగి వచ్చెను. శకుని యొక్క మాయను ఎరిగియు జూదమునకు మరల ధర్మరాజు వచ్చెను.

---

*వ్యా॥ విప్రుగాండ్రు వచ్చి యాచింతురని అన్నమే వండకుందుమా । లేళ్ళు వచ్చి పైరుమేయునని విత్తుటయే మానుదుమా । కాన దోషముల గూర్చి ప్రతిక్రియ చేయవలయును. కాని అసలు పని మానగూడదు.

శకుని రువాచ॥

అముం చ స్థవిరో యద్వో ధనం పూజితమేవ తత్।
వయం వా ద్వాదశాబ్దాంస్తు యుష్మాభి ర్ద్యూతనిర్జితాః।
ప్రవిశేమ మహారణ్యం రౌరవాజినవాససః॥ 50-51

త్రయోదశం చ సజనే అజ్ఞాతాః పరివత్సరం।
జ్ఞాతాశ్చ పునరన్యాని వనే వర్షాణి ద్వాదశ।
అస్మాభి ర్నిర్జితా యూయం వనే ద్వాదశ వత్సరాన్।
వసధ్వం కృష్ణయా సార్ధ మజినైః ప్రతివాసితాః॥ 52-53

*త్రయోదశేచ నిర్వృత్తే పునరేవ యథోచితం।
స్వరాజ్యం ప్రతిపత్తవ్యం ఇతరై రథ వేతరైః॥ 54

---

*వ్యా॥ ద్వాదశాబ్దే గతే వారసత్వం నాస్తీతి యదుక్తం తత్తుచ్ఛం॥ తథాహి యాజ్ఞవల్క్యస్మృతౌ వ్యవహారకాండే। అపశ్యతోఽబ్రువతో హాని ర్భూమే ర్వింశతి వార్షికీ పరేణ భుంజమానాయా ధనస్య దశవార్షికీ। ఇతి ॥ తస్య మితాక్షరా వ్యాఖ్యా–పరేణాసంబద్ధేన భుజ్యమానాం భువం ధనం వా ఽపశ్యతః అబ్రువతః- మదీయేయం భూ స్త్వయా న భోక్తవ్యే త్యప్రతిషేధత స్తస్యా భూమేః వింశతివార్షికీ-అప్రతిరవ వింశతివర్ష భోగనిమత్తహాని ర్భవతి। ధనస్య తు హాస్త్యశ్వాదే ర్దశవార్షికీహానిః భవతి ॥

రకువి చెప్పుచున్నారు.

50. 51. ఈ విస్తారమగు నీకు గల రాజ్యాది ధనములు వదలి మీరు జూదములో జయింపబడుచో జటావల్కలములను ధరించి 12సం॥ అరణ్యవాసము చేయవలెను. మేమోడినను అట్లే చేయవలెను.

52. 53. 13 వ సంవత్సరము నగరమున అజ్ఞాతులమై సంచరింపవలెను. అందు తెలియబడుచో మరల 12 సం॥లు అరణ్యవాసము 1 సం॥ అజ్ఞాతవాసము చేయవలసియుండును. మాచే మీరు జయింపబడుచో మీరైదుగురు ద్రౌపదితో గూడి జటావల్కలములను ధరించి 12 సం॥లు అరణ్యవాసమును, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము చేయవలసియుండును,

54. 13 సంవత్సరములు పూర్తియైన పిమ్మట మేము గాని, మీరుగాని వారి వారి రాజ్యములను మరల పొందగలము.

---

వ్యా॥ 12 సం॥లు భుక్తము లేనిచో వారసత్వము పోవును. అను వాక్యము కూడదు. యాజ్ఞవల్క్య స్మృతియందు వ్యవహారకాండలో ఇట్లు కలదు. శ్లో॥ తన భూమిని, ఇతరుడు తనకు తెలియకుండగ తను అభ్యంతర పెట్టకుండగ 20సం॥లు అనుభవించుచో హాని సంభవించును. అట్లే ధనమునకు 10 సం॥లు, దీనికి మితాక్షర వ్యాఖ్యానము ఇట్లు కలదు, తనకు సంబంధించని ఇతరునిచే అనుభవింపబడుచున్న భూమిని గాని, ధనమును గాని గమనించకయు ఈ భూమి నాది. నీచే ననుభవించ తగదు అని విశేషము చేయని వానియొక్క భూమికి ఎదురుమాటలేని 20 సం॥ భోగముచే హాని సంభవించును. అట్లే గుఱ్ఱము, ఏనుగు మొ॥ గం ధనములకు 10 సం॥లచే హాని సంభవించును,

అనేన వ్యవసాయేన కథంస్మాభి ర్యుధిష్ఠిర।
అహో నుప్త్వా పున ర్ద్యూత మేహి దీవ్యస్వ భారత॥ 55

జనప్రవాదా న్సుబహూన్ శృణ్వన్నపి నరాధిపః।
హ్రియాచ ధర్మ సంయోగా త్పార్థో ద్యూత మియా త్పునః।
అప్యాసన్నో వినాశస్స్యా త్కురూణామితి చింతయన్। 56

యుధిష్ఠిర ఉవాచ॥
కథంవై మద్విధో రాజా స్వధర్మ మనుపాలయన్।
ఆహూతో వినివర్తేత దీవ్యామి శకునే త్వయా॥ 57

ఏవం దైవ బలావిష్టో ధర్మరాజో యుధిష్ఠిరః।
భీష్మద్రోణా వార్యమాణో విదురేణ చ ధీమతా।
గాంధార్యా పృథయా చైవ ద్రౌపద్యా ద్రౌణినా తదా।
ప్రతి జగ్రాహ తం పార్థో గ్లహం జగ్రాహ సౌబలః।
జితమిత్యేవ శకుని ర్యుధిష్ఠిర మభాషత॥ 58-59-60

---

భూమే ధనస్య సంపూర్ణహాని రిహాఽవివక్షితా। న వస్తుహాని ర్నాపి వ్యవహారహానిః। తథాహి॥ నిరాక్రోశం వింశతివర్ష భోగాదూర్ధ్వం యద్యపి స్వామీ న్యాయాత్తం తత్ క్షేత్రం లభతే। తథాపి ఫలానుసరణం న లభతే। వింశతే ప్రాక్ప్రత్యక్షో నవాక్రోశేఽచ లభతే, వింశతి గ్రహణాత్॥

55. ఓ ధర్మరాజా ! ఈ శకునితో మాతో జూదమాడుము. తమ్మా. అని పలికెను.

56. ధర్మరాజు జనులు చెప్పుకొనుచున్న ప్రవాదములను వినుచుండియు సిగ్గుపడుచు పిత్రాజ్ఞా పరిపాలనమనెడి ధర్మమును పురస్కరించు కొని పురువంశీయులకు వాశము సంప్రాప్తమైనదని చింతించుచూ మరల జూదమున ప్రవేశించెను.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

57. స్వధర్మమును పరిపాలించు నా వంటి రాజు జూదమున కాహ్వానింపబడి ఎట్లు రాకుందును ? కాన ఓ శకునీ ! నీతో జూద మాడుదును.

58-60. ఈ విధముగా దైవబలముచే ప్రేరేపింపబడిన ధర్మరాజు భీష్మ ద్రోణుల చేతను, బుద్ధిమంతుడగు విదురుని చేతను, కుంతి చేతను గాంధారిచేతను, ద్రౌపదిచేతను, అశ్వత్థామ మొ॥ వారిచే వారింప బడియు పాచికలను గ్రహించెను. శకునియు పాచికలను గ్రహించి జయింపబడితివని యుధిష్ఠిరునితో పలికెను.

---

ఇచ్చట భూమికిని ధనమునకును హాని సంభవించునని ఆ హాని సంపూర్ణ హాని కాదు. వ్యవహార హాని కాదు. అజ్ఞాతవాసము చెప్పక 20 సం॥లు ఊరకుండి తరువాత అజ్ఞాతవాసము చెప్పుచో స్వామియగు వాడు న్యాయముగా తన భూమిని మరల పొందుచున్నాడు. కాని ఆ 20 సం॥ల పంటను మాత్రము పొందజాలడు. 20 సం॥లలోపల అజ్ఞాత వాసము చెప్పి యున్నచో భూమితో పాటు పంటను కూడ పొందగలడు.

తతః పరాజితాః పార్థా వనవాసాయ దీక్షితాః।
అజినా న్యుత్తరీయాణి జగృహుశ్చ యథాక్రమం॥ 61

పాండవానాం కుటుంబాని పుత్రపౌత్రకళత్రకం।
తాసాం వై బాంధవాస్సర్వే నీత్వా దేశాన్యయుస్స్వకాన్॥ 62

అజినై స్సంవృతాన్ దృష్ట్వా హృతరాజ్యా నరిందమాన్।
ప్రస్థితాన్ వనవాసాయ తతో దుశ్శాసనోఽబ్రవీత్। 63

న సంతి లోకేషు పుమాంస ఈదృశా। ఇత్యేవ యే భావితబుద్ధయ స్సదా। జ్ఞాస్యంతి తేఽత్మాన మహాద్య పాండవా విపర్యయే షండతిలా ఇవాఫలాః॥ 64

మహాప్రాజ్ఞ స్సోమకి ర్యజ్ఞసేనః। కన్యాం పాంచాలీం పాండవేభ్యః ప్రదాయ। అకార్షీద్వై సుకృతం నేహ కించిత్ క్లీబాః పార్థాః పతయో యాజ్ఞసేన్యాః॥ 65

సూక్ష్మప్రవారా నజినోత్తరీయాన్। దృష్ట్వాఽరణ్యే నిర్ధనా నప్రతిష్ఠాన్। కాం త్వం ప్రీతిం లప్స్యసే యాజ్ఞసేని పతిం వృణీష్వేహ యమన్యమిచ్ఛసి। 66

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే సభాపర్వణి
షష్ఠోఽధ్యాయః సమాప్తః॥

61. తరువాత ఓడింపబడిన పాండవులు వనవాస దీక్ష గొని కృష్ణాజిన ములను క్రమముగా ఉత్తరీయములుగా ధరించిరి.

62. పాండవుల కుటుంబములను, భార్యలను, పుత్ర పౌత్రులను వారి బంధువులందరు తీసికొని వారి వారి దేశములకు వెళ్ళిరి.

63. జూదమునందోడిపోయి కృష్ణాజినములను ధరించి వనవాసమునకు బయలుదేరిన పాండవులను చూచి దుశ్శాసనుడు ఇట్లు పలికెను.

64. లోకమున ఇటువంటి మనుష్యులు ఎచ్చటను లేరు. ఇటువంటి మంద బుద్ధులు లేరు. వీరు పాండవులు కానివారైరి. ఆపత్తు సంభవించుటచే షండతిలలువలె వ్యర్థులైరి.

65. గొప్ప ప్రజ్ఞాశాలియగు ద్రుపదుడు ఇట్టి పాండవులకు ద్రౌపదినిచ్చి గొప్ప ఘనకార్యమును చేసెను. ద్రౌపదికి నపుంసకులగు పాండవులు భర్తలైరి.

66. ఓ ద్రౌపదీ ! కృష్ణాజినములను ధరించి అరణ్యమున నిర్ధనులును, ఉనికియు లేని పాండవులను పొంది నీవేమి తృప్తి నొందెదవు ? కావున ఇచ్చట నీవు కోరిన మరియొకనిని పతిగా వరించుము.

ఇది శ్రీమహాభారత సారోద్ధారమున, సభాపర్వమందు

ఆఱవ అధ్యాయము సమాప్తము.

# సప్తమోధ్యాయః

భీమ ఉవాచ॥

క్రూర పాపజనై ర్జుష్ట మకృతార్థం ప్రభాషసే।
గాంధార విద్యయా హి త్వం రాజమధ్యే వికత్థసే।

యథా తుదసి మర్మాణి వాక్ఛరై రిహా నో భృశం।
తథా స్మారయితా తేఽహం కృంతం మర్మాణి సంయుగే॥ 2

యేచ త్వా మనువర్తంతే క్రోధలోభవశానుగాః।
గోప్తార స్సానుబంధాం స్తా న్నేతాఽస్మి యమసాదనం॥ 3

వైశంపాయన ఉవాచ॥

ఏవం బ్రువాణ మజినై ర్వివాసితం। దుశ్శాసన స్తం
పరినృత్యతి స్మ। మధ్యే కురూణాం ధర్మనిబద్ధమార్గం।
గౌర్గౌరితి స్మాహ్వయ న్ముక్తలజ్జః॥ 4

తస్య రాజా సింహగతే స్సఖేలం దుర్యోధనో భీమసేనస్య।
హర్షాత్ గతిం స్వగత్యానుచకార మందో
నిర్గచ్ఛతాం పాండవానాం సభాయాః । 5

ఏవం సమీక్ష్యాత్మని చావమానం నియమ్య మన్యుం
బలవాన్ స మానీ। రాజానుగ స్సంసది కౌరవాణాం।
వినిష్క్రమ న్వాక్య మువాచ భీమః॥ 6

# 7 వ అధ్యాయము

భీముడు చెప్పుచున్నాడు.

1. ఓ దుర్మార్గుడా! పాపులతో గూడి నీవు వ్యర్థముగా ప్రేలుచున్నావు. శకుని యొక్క మాయా విద్యచే నీవు రాజుల మధ్యలో బడాయిలు పలుకుచున్నావు.

2. ఎట్లు నీవు ఇప్పుడు నీ వాగ్బాణములచే మా మర్మస్థానములను పీడించుచుంటివో అట్లు యుద్ధమున నీకు స్మరింపచేయుచు మర్మ స్థానములను ఛేదించగలను.

3. క్రోధ, లోభములకు వశులై ఎవ్వరు నిన్ను అనువర్తించుచూ రక్షించుచున్నారో వారందరిని గూడ చంపగలను.

వైశంపాయనుడు చెప్పుచున్నాడు.

4. ఈ విధముగా పల్కుచు వల్కలములను ధరించిన పాండవులకు వెనుక పరిహసించుచు దుశ్శాసనుడు నృత్యము చేసెను. కురువుల సమక్షమున ధర్మబద్ధమగు మార్గము గల ద్రౌపదిని " గౌః " అని నిర్లజ్జుడై కేకలు వేసెను.

5. సభనుండి బయటకు వచ్చు పాండవులను పరిహసించుచు సంతోషాతిశయముచే మందుడగు దుర్యోధనుడు సింహగమనమువంటి వారి నడకను తన గమనముచే అనుకరించెను.

6. ఈ విధముగా తమను అనుకరించుచు వెక్కిరించుచు అవమాన పరచుచున్న దుర్యోధనుని చూచి బలశాలియు, అభిమానవంతుడు నగు భీముడు కోపము నణచుకొని సభనుండి బయటికి వచ్చుచు కౌరవుల నుద్దేశించి ఈ విధముగా పలికెను.

ధార్తరాష్ట్రాన్ రణే హత్వా మిషతాం సర్వధన్వినాం
శమం గంతాస్మి న చిరాత్ సత్యమేతద్ బ్రవీమి తే ॥ 7

అహం దుర్యోధనం హంతా కర్ణం హంతా ధనంజయః
శకునిం చాక్షకితవం సహదేవో హనిష్యతి ॥ 8

సుయోధన మిమం పాపం హంతాస్మి గదయా యుధి
శిరః పాదేన చాస్యాహ మధిష్ఠాస్యామి భూతలే ॥ 9

వాక్యశూరస్య చైవాస్య పరుషస్య దురాత్మనః
దుశ్శాసనస్య రుధిరం పాతాస్మి మృగరాడివ ॥ 10

అర్జున ఉవాచ

కర్ణం కర్ణానుగాంశ్చైవ రణే హంతాస్మి పత్రిభిః
అర్జునః ప్రతిజానీతే భీమస్య ప్రియకామ్యయా ॥ 11

సహదేవ ఉవాచ

యది స్థాస్యసి సంగ్రామే క్షత్రధర్మేణ సౌబల
హంతాస్మి తరసా యుద్ధే త్వామేవ సహబాంధవం॥ 12

నకుల ఉవాచ

ధార్తరాష్ట్రాన్ సుదుర్వృత్తాన్ తత్ప్రియాన్ కాలచోదితాన్
గమయిష్యామి భూయిష్ఠా నహం వైవస్వతక్షయం ॥ 13

నిర్ధార్తరాష్ట్రాం పృథివీం కర్తాస్మి నచిరాదివ

7 నేను సర్వ ధనుర్ధారులు చూచుచుండగా కౌరవులను రణమునందు చంపి అచిరకాలములో శాంతిని పొందగలను, యధార్ధముగ పలుకుచున్నాను.

8. నేను దుర్యోధనుని చంపగలను. అర్జునుడు కర్ణుని చంపగలడు. మోసపు జూదరియగు శకునిని సహదేవుడు చంపగలడు.

9. ఈ పాపాత్ముడగు దుర్యోధనుని యుద్ధమున గదచే చంపుదును. భూమిమీద పడిన ఈతని శిరస్సును పాదముతో తన్నెదను.

10. వాక్పారుడుష, దుర్మార్గుడునగు ఈ దుశ్శాసనుని రొమ్ము చీల్చి సింహమువలె రక్తమును పానము చేతును.

అర్జునుడు చెప్పుచున్నాడు.

11. ఈ కర్ణుని వీని అనుయాయులను యుద్ధమున బాణములచే చంప గలను, అని భీముని ప్రియము కొరకు అర్జునుడు ప్రతిజ్ఞ చేయు చున్నాడు.

సహదేవుడు చెప్పుచున్నాడు.

12 క్షత్రియ ధర్మము ననుసరించి ఈ శకుని పరుగెత్తక యుద్ధమున నిలచుచో వీనిని బంధువులతో గూడ నేను వెంటనే చంపగలను.

నకులుడు చెప్పుచున్నాడు.

13. దుర్మార్గులగు కౌరవులను వారి ప్రియులను పెక్కుమందిని నేను యమలోకమును పొందించగలను.

14. 15. అచిరకాలములో ఈ భూమిని కౌరవులు లేనిదానినిగ చేయ గలను, ఈ విధముగా పురుషశ్రేష్ఠులగు పాండవులు విస్ఫారిన

ఏవం తే పురుషవ్యాఘ్రా స్సర్వే వ్యాయత బాహవః
ప్రతిజ్ఞా బహులాః కృత్వా ధృతరాష్ట్ర ముపాగమన్ ॥14-15

యుధిష్ఠిర ఉవాచ

సర్వా నామంత్ర్య గచ్ఛామి ద్రష్టాస్మి పునరేత్య వః
న తే కించి దథోచు స్తం హ్రియా సన్నా యుధిష్ఠిరం
మనోభి రేవ కల్యాణం దద్యుస్తే తస్య ధీమతః । 16-17

విదుర ఉవాచ

ఆపద్ధర్మార్థకృచ్ఛ్రేషు సర్వకార్యేషు వా పునః
యథావ త్ప్రతిపద్యేథాః కాలే కాలే యుధిష్ఠిర ॥ 18

కుంతీ చ భృశసంతప్తా ద్రౌపదీం ప్రేక్ష్య గచ్ఛతీం
స్త్రీధర్మాణా మభిజ్ఞాసి శీలాచారవతీ తథా
సహదేవశ్చ మే పుత్ర స్సదాఽవేక్ష్యః వనే వసన్ ॥ 19

తథేత్యుక్త్వా తు సా దేవీ ముక్తకేశీ వినిర్యయౌ ।
ధార్తరాష్ట్ర స్త్రియ స్తాశ్చాఖిలే నోపలభ్య తత్ ।
రురుదు స్సుస్వరం సర్వాః వినింవంత్యః కురరీ భృశం ॥ 20

రాజాచ ధృతరాష్ట్రస్తు న శాంతి మభిజగ్మివాన్
నాహం జనం నిర్దహేయం దృష్ట్వా ఘోరేణ చక్షుషా
స పిధాయ ముఖం రాజా తస్మా ద్గచ్ఛతి పాండవః ॥ 21-22

బాహాంవులు కలవారై అనేక భీకర ప్రతిజ్ఞలను చేసి ధృతరాష్ట్రుని వద్దకు వచ్చిరి.

యుధిష్ఠిరుడు చెప్పుచున్నాడు.

16. 17. అందరివద్ద శలవు తీసుకొని అరణ్యమునకు వెళ్ళుచున్నాను. మరల తిరిగి వచ్చి మిమ్ము చూచెదను. అంతట వారు సిగ్గుతో తలలు వంచినవారై ధర్మరాజుతో ఏమియు పలుకకుండిరి. బుద్ధిమంతులగు వారవికి మనస్సులచేతనే ఆశీర్వాదము నొసంగిరి.

విదురుడు పలుకుచున్నాడు.

18. ఓ ధర్మరాజా ! ఆపద్ధర్మములయందును, ఇక్కట్టులందును, సర్వ కార్యముల యందును యుక్తముగా ప్రవర్తించుము.

19. అరణ్యమునకు వెళ్ళుచున్న ద్రౌపదిని చూచి కుంతి మిక్కిలి పీడింపబడినదై ఓ ద్రౌపదీ ! నీవు స్త్రీ ధర్మములను ఎరిగినదానవు. సత్స్వభావము ఆచారము గలదానవు. నా పుత్రులగు సహదేవుని వనవాసమున ఎల్లప్పుడు కనిపెట్టియుండుము.

20. అలాగేనని ద్రౌపది పలికి విరియబోసిన జుట్టు కలదై బయటకు వచ్చెను. కౌరవుల స్త్రీలు అదంతయు చూచి అందరు బిగ్గరగా కౌరవులను నిందించుచు విలపించిరి.

21. 22. రాజుగు ధృతరాష్ట్రుడు మనశ్శాంతిని పొందకపోయెను నేను నా ఘోరమగు దృష్టిచే ఈ జనమును దహింపచేయకుందునుగాక యని ధర్మరాజు ముఖమును వస్త్రముతో కప్పి అచ్యుత మంతి బయలు వెడలెను.

బాహూ విశాలౌ కృత్వా౽సౌ తేన భీమోపి గచ్ఛతి ॥
చికీర్షన్ కర్మ శత్రుభ్యో బాహుద్రవ్యానురూపతః ॥ 23

ప్రదిశన్ శరసంపాతాన్ కున్తీపుత్రోర్జునస్తదా
సికతా వపన్ సవ్యసాచీ రాజానమనుగచ్ఛతి । 24

పాంసూపలిప్తసర్వాంగో నకుల స్తేన గచ్ఛతి
నాహం మనాం స్యాదదేయం మార్గే స్త్రీణామితి ప్రభో । 25

ముఖమాలిప్య తేనాసౌ సహదేవో౽పి గచ్ఛతి
న మే కశ్చిద్విజానీయాన్ముఖమద్యేతి భారత॥ 26

ఏకవస్త్రా ప్రరుదతీ ముక్తకేశీ రజస్వలా
శోణితార్ద్రాక్తవసనా ద్రౌపదీ వాక్యమబ్రవీత్ । 27

యత్కృతే౽హమిదం ప్రాప్తా తేషాం వర్షే చతుర్దశే
హతపత్యో హతసుతా హతబంధుజనప్రియాః
బహుశోణితదిగ్ధాంగ్యో ముక్తకేశ్యో రజస్వలాః।
ఏవం కృతోదకా భార్యాః ప్రవేక్ష్యంతి గజాహ్వయం । 28

కృత్వాతు నైఋతాన్ దర్భాన్ ధీరో ధౌమ్యః పురోహితః
సామాని గాయన్ యామ్యాని పురతో యాతి భారత । 29

23. భీముడు విశాలములగు తన బాహువులను తన బాహుబలమున కను
గుణముగ తాను శత్రువులకు చేయబోవు ప్రతిక్రియను తెలుపుచు
బాహువులను విప్పార్చి వెళ్ళుచుండెను.

24. అర్జునుడు ఇసుకను విరజిమ్ముచు తానొనరించబోవు శరపాతములను
సూచించుచు ధర్మరాజును అనుసరించి వెళ్ళుచుండెను,

25. నకులుడు మార్గమున వెళ్ళుచూ స్త్రీల మనస్సులను తన సౌందర్య
ముచే ఆకర్షించకుండునట్లు శరీరము నంతను దుమ్ము కొట్టుకొని
దానితో వెళ్ళుచుండెను.

26. సహదేవుడు నా ముఖము నెవ్వరును గుర్తించకుందురు గాక యని
తన ముఖమునకు మసి పూసుకొని ధర్మరాజు ననుసరించి వెళ్ళు
చుండెను.

27. ఏక వస్త్రమును ధరించి విలపించుచు వెంట్రుకలు విరబోసుకొని
రజస్వలయై రక్తముచే తడపిన వస్త్రముగల ద్రౌపది ఇట్లు
పలికెను,

28. ఏ కౌరవులవలన ఇట్టి అవస్థను పొందింపబడితినో 14 వ సంవ
త్సరమున వారి భార్యలు, భర్తలు పోయినవారై సుతులు పోయి,
బంధువులు పోయి విశేషముగ రక్తముతో తడుపబడిన శరీరము
కలవారై వెంట్రుకలు విరబోసుకొని రజస్వలలై ఉదకక్రియలాచ
రించి హస్తినాపురమున ప్రవేశించగలరు.

29. పురోహితుడగు ధౌమ్యుడు దర్భలను పరచి ప్రమాణమునందుచిత
ములగు సామసూక్తములు గానము చేయుచూ ముందు వెళ్ళుచుండెను

హా తేషు భరతేష్వాజౌ కురూణాం గురవ స్తదా
ఏవం సామాని గాస్యం తీత్యుక్త్వా ధౌమ్యోపి గచ్ఛతి ॥ 30

పౌరా ఊచుః

హాహా గచ్ఛంతి నో నాథా స్సమవేక్ష్యధ్వ మీదృశాః
అహో ధిక్ కురువృద్ధానాం బాలానామివ చేష్టితం ॥ 31

మర్త్యోని తేషు లుబ్ధేషు కా ప్రీతిః కౌరవేషు నః ।
ఇతి పౌరా స్సుదుఃఖార్తాః క్రోశంతిస్మ పునః పునః ॥ 32

ఏవం తేషు నరాగ్ర్యేషు నిర్యాత్సు గజసాహ్వయాత్ ।
అగ్నిహోత్రాణి సాయాహ్నే నచాహూయంత సర్వశః॥ 33

అనభ్రే విద్యుత శ్చాసన్ భూమిశ్చ సమకంపత।
ఏవ మేతే మహోత్పాతాః ప్రాదురాసన్ దురాసదః॥ 34

నారదశ్చ సభామధ్యే కురూణా మగ్రతః స్థితః।
మహర్షిభిః పరివృతో రౌద్రం వాక్య మువాచ హ। 35

ఇత శ్చతుర్దశే వర్షే వినంక్ష్యంతీహ కౌరవాః।
దుర్యోధనాపరాధేన భీమార్జున బలేన చ।
ఇత్యుక్త్వా దివ మాక్రమ్య క్షిప్ర మంతరధీయత। 36

30. ఈ కౌరవులు యుద్ధమునందు చనిపోగా వారి గురువులు కూడ అప్పుడు ఈ విధముగా సామములను గానము చేయుదురు అని పలుకుచు వెళ్ళుచుండెను.

పురజనము ఇట్లు పలుకుచున్నారు.

31. అయ్యో! మా ప్రభువులు వెళ్ళుచున్నారు. మమ్ము చూడుడు. కురువృద్ధులందరు బాలులవలె ఇట్టి పని చేసిరే. ఎంత కష్టము సంప్రాప్తించినది.

32. దుర్మార్గులు, లుబ్ధులు అగు కౌరవులయందు మాకేల ప్రీతిగల్గును? ఈ విధముగా మిక్కిలి దుఃఖించుచున్నవారై పౌరులందరును మాటిమాటికి విలపించుచుండిరి.

33. ఈ విధముగా నరశ్రేష్ఠులగు పాండవులు హస్తినాపురము నుండి వెళ్ళుచుండగా సాయంకాలమున ఎవరును అగ్నిహోత్రములను వేల్చకపోయిరి.

34. మేఘము లేకయే మెరుపులు మెరిసెను. భూమి కంపించెను. ఇట్లే అనేక ఉత్పాతములు బయలుదేరినవి.

35. నారదుడు ఆకాశమున మహర్షులతో గూడి పాండవుల కెదురుగా నున్నవాడై భయంకరమగు వాక్యమును పలికెను.

36. ఇప్పటినుండి 14 వ సంవత్సరమున దుర్యోధనుని అపరాధము చేతను, భీమార్జునుల బలము చేతను, ఈ కౌరవులందరు నశించగలరు. అని పలికి వెంటనే అంతర్ధానమాయెను.

తతో దుర్యోధనః కర్ణ శ్శకునిశ్చాపి సౌబలః।
ద్రోణం ద్విజ మమన్యంత రాజ్యం చాస్మై న్యవేదయన్॥ 37

అథాఽబ్రవీ త్తతో ద్రోణో దుర్యోధన మమర్షణం।
అవధ్యాన్ పాండవా నాహు ర్దేవపుత్రాన్ మహర్షయః॥ 38

అహం వై శరణం ప్రాప్తాన్ వర్తమానో యథాబలం।
నోత్సహేయం పరిత్యక్తుం దైవం హి బలవత్తరం॥ 39

ధర్మతః పాండుపుత్రా వై వనం గచ్ఛంతి నిర్జితాః।
చరితబ్రహ్మచర్యాశ్చ క్రోధామర్షవశానుగాః॥ 40
వైరం నిర్యాతయిష్యంతి మహద్దుఃఖాయ పాండవాః

ధృష్టద్యుమ్నా ద్ద్రోణమృత్యు రితి విప్రథితం వచః।
పాండవానాం ప్రియరత స్తస్మా న్మాం భయ మావిశత్। 41

సోఽయం నూన మనుప్రాప్త స్త్వత్కృతే కాల ఉత్తమః
ముహూర్తసుఖ మేవైత త్కాల శ్ఛాయేవ హైమనీ॥ 42

యజధ్వం చ మహాయజ్ఞై ర్భోగానశ్నీత దత్త చ
ఇత శ్చతుర్దశే వర్షే మహత్ ప్రాప్స్యథ వైశసం॥ 43

37. అంతట దుర్యోధనుడు, కర్ణుడు, శకుని ద్రోణాచార్యునికి నమస్కరించి రాజ్యమునంతను వానికి సమర్పించిరి.

38. ద్రోణుడు కోపశీలియగు దుర్యోధనునితో ఇట్లు పలికెను. దేవపుత్రులగు పాండవులు అవధ్యులని మహర్షులు పలికిరి.

39. శరణు వేడిన మిమ్ములను విడిచిపెట్టుటకు నేను ఉత్సహించుట లేదు. నా బలలోపము లేకుండగ మిమ్ము కాపాడ యత్నింతును. దైవము బలవత్తరము కదా !

40. పాండుపుత్రులు ఓడింపబడినవారై ధర్మముగా వనమునకు వెళ్ళుచున్నారు. వారు బ్రహ్మచర్యవ్రతము నాచరించినవారును, కామక్రోధములను జయించినవారును అయి ఉన్నారు. వారు మీకు మిక్కిలి దుఃఖము కలుగునట్లు కసి తీర్చుకొందురు.

41. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని చంపువాడు అనునది ప్రసిద్ధమైనది. అతడు పాండవుల ప్రియము కోరువాడు. అందుచే నాకు భయము కలుగుచున్నది.

42. నీకు ఉత్తమమైన కాలము సంప్రాప్తించినది. కాలము మెరుపుతీగ వంటిది. ఈ 13 సం॥లు సుఖముననుభవింపుము.

43. కావున మహాయజ్ఞము లాచరించి దేవతలను సంతృప్తిపరచుము. భోగముల ననుభవించుము. విరివిగా దానము చేయుము. 14 వ సంవత్సరమున మీరు గొప్ప ఆపత్తును పొందగలరు.

ధృతరాష్ట్ర ఉవాచ॥

సమ్యగాహ గురుః క్షత్త రుపావర్తయ పాండవాన్।
యది తే న నివర్తంతే సత్కృత్యా యాంతు పాండవాః।
సశస్త్రరథ పాదాతాః భోగైః సంతోష్య పుత్రకాః॥ 44

స రథాన్ సధనుష్కాంశ్చ స్వైర్న్యాస్యేదరిసదా।
పాండవాన్ ప్రాపయామాసుర్నగరమార్గానుయాయినాం॥ 45

ఇతి శ్రీమహాభారతసారోద్ధారే సభాపర్వణి
సప్తమోఽధ్యాయః సమాప్తః

సభాపర్వ సమాప్తం॥
ఓం తత్సత్ శ్రీరామచంద్రార్పణమస్తు॥



ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు.

44. ఓ విదురుడా! ద్రోణాచార్యుడు చక్కగా చెప్పినాడు. పాండవులను వనవాసము నుండి మరలింపుము. వారు మరలవిచో సత్కరింపబడినవారై పాండవులు శస్త్ర, పదాదులతో గూడినవారై భోగములు గలవారై వనమునకు వెళ్ళుదురు గాక

45. అంతట విదురుడు రథములను, సైన్యములను, ధనుర్ధారులను వనమార్గము ననుసరించి వెళ్ళి పాండవుల వద్దకు పంపెను.

ఇది శ్రీమహాభారతసారోద్ధారమున సభాపర్వమందు
ఏడవ అధ్యాయము సమాప్తము.

: సభాపర్వము సమాప్తము :
శ్రీరామచంద్రార్పణమస్తు



# శుద్ధాశుద్ధపత్రిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| [illegible] | 16 | హేంషా్య | హ్యేషా |
| | 13 | సం్ప్రదాయకం | ప్రదాయకం |
| [illegible] | 31 | అలింగేన | ఉలింగేన |
| 2[illegible] | 13 | చం్క్రే | చక్రే |
| 22 | 16 | సూ్నాత్యాం | స్నాత్యాం |
| [illegible] | 9 | జాత్యా | జ్యాత్యా |
| 2[illegible] | 10 | ఖాద్ధముర్మా | ముఖాద్ధర్మా |
| [illegible]6 | 21 | మునశ్చైవ | మునయశ్చైవ |
| [illegible]8 | 6 | తరుముద్యోక్తుం | తత్తముద్యోగం |
| [illegible]9 | 19 | దృష్టియే | దృష్టికలవాడే |
| [illegible]0 | 10 | తువ్యతే | మధ్యాహ్నతువ్యతే |
| [illegible] | 24 | ఆ్షమైన | ఆర్షమైన |
| [illegible]2 | 8 | సహారస్యై | సరహాస్యై |
| [illegible] | 15 | భవత | భవతి |
| [illegible] | 4 | చేయము | చేయుము |
| [illegible] | 3 | శశ్రూ | శుశ్రూ |
| [illegible]6 | 6 | బ్రహ్మర్షి | బ్రహ్మర్షి |
| [illegible]0 | 3 | ప్రధావం | ప్రధానం |

| | | | |
|---|---|---|---|
| 85 | 18 | యుండెను | యుండెను |
| 87 | 12 | శుక్రగోణిత | శుక్రశోణిత |
| 95 | 21 | యూవనాశ్వునికి | యువనాశ్వునికి |
| 105 | 2 | విమోసనమై | విమోచనులై |
| 114 | 2 | కృతనిత | కృత |
| 123 | '6 | ఉదకమును | ఉదకము |
| 137 | 9 | న్మించగలడు | జన్మించగలడు |
| 144 | 5 | వల్లయున్ | పల్లవయున్ |
| 146 | 18 | ష్యంవేద్రియే | ష్యవేంద్రియే |
| 148 | 2 | యథ | యదు |
| 152 | 4 | ర్తాథాభరా | రాథాభర్తా |
| 158 | 5 | పారసవీం | పారశవీం |
| 168 | 6 | కిమ్మదుడు | కిందముడు |
| 176 | 2 | భరతవర్షభ | భరతర్షభ |
| 182 | 8 | మేనాజువాోవబా | మేబాజువాోవసా |
| 186 | 13 | జ్ఞాతన్యథా | జ్ఞాత్వాన్యథా |
| 194 | 18 | దుశ్శాలాం | దుశ్శలాం |
| 199 | 10 | మొదలగుగాల | మొదలుగాగల |
| 220 | 8 | స్పర్శం సర్శ | స్పర్శం స్పర్శ |
| 344 | 11 | ఫాల్గునః | ఫల్గునః |
| 255 | 5 | అభిక్తుడు | అభిషిక్తుడు |
| 258 | 8 | నానాస్త్రాః | నానాస్త్రా |

| | | | |
|---|---|---|---|
| 264 | 2 | ధ్వనినాం | ధన్వినాం |
| 266 | 7 | భుయా | భూయా |
| 269 | 17 | సంతాము | సంతాపము |
| 278 | 15 | స్వస్త్యయన | స్వస్త్యయనో |
| 286 | 8 | ధర్మభూ | ధర్మజో |
| 292 | 18 | తస్మిదిన | తస్మిన్ దినే |
| 294 | 10 | అదిధీషుత్వం | అగ్రదిధీషుత్వం |
| 311 | 17 | ఏకా | ఏకాదశి |
| 312 | 13 | ప్పరిభవం | త్పరిభవం |
| 330 | 12 | ప్రార్థివ | పార్థివ |
| 336 | 8 | నిపపాప | నిపపాత |
| 342 | 9 | పితృష్వపాం | పితృష్వసాం |
| 350 | 13 | కధిం | కధితం |
| 364 | 9 | జ్యేషం | జ్యేష్ఠం |
| 378 | 22 | అందతయు | అదంతయు |
| 384 | 7 | పహ్వాపృష్వహాది | ప్రహ్వాపృష్వహ్వాది |
| 391 | 12 | త్సముస | త్సవముస |
| 496 | 7 | శని | శిని |
| 414 | 8 | కాశికాపురాణే | కాళికాపురాణే |
| 416 | 16 | ధర్మము | కేవలధర్మము |
| 421 | 5 | సభాపర్వమున | ఆదిపర్వమున |
| 432 | 6 | భాతృభిః | భ్రాతృభిః |

| | | | |
|---|---|---|---|
| 446 | 14 | స్వర్త్రకా | ఉగర్త్రకాన్ |
| 448 | 16 | ప్రతిబిద్యం | ప్రతిబింభత్వం |
| 466 | 5 | స్వాధితి | సాధ్వీతి |
| 477 | 8 | అట్టిహా | అట్టి నే |
| 479 | 8 | ఝూద | కపటద్యూతి |
| 481 | 16 | శిలలతో | స్ఫటిక శిలలతో |
| 491 | 16 | అనే కేల | అనేక వేల |
| 497 | 16 | భీమసేనునితో | భీమసేనుని వద్ద |
| 511 | 7 | యుండి | యుంటివిగాన |
| 517 | 8 | కొట్టబడితిని | పంచి పబడితిని |
| 539 | 6 | అసత్యమునొక్క | అసత్యమునొక్క |